శ్రీ ర స్తు.

# అప్పకవీయము.

శ్రీమాన్

ఆసూరి - రంగనాథసరస్వతిగారిచే

బరిష్కరింపఁబడి



బ్రహ్మశ్రీ

మద్దనపూడి - చెంచురామయ్యగారి చేతను

పమ్మి - త్యాగరాయసెట్టిగారి చేతను

ప్రకటింపఁబడినది.

ప్రాతచాకలపేట—చెన్నపట్టణము.

1910.

శ్రీ ర స్తు

# అ ప్ప క వీ య ము.

## విషయ సూచిక.





శ్రీ ర స్తు.

శ్రీహయగ్రీవాయనమః.

# అ ప్ప క వీ య ము.

పీ ఠి క.

## ఆ యు ధ ప రి జ నా దీ స హి త

## శ్రీమహావిష్ణుస్తుతి.



శ్రీయు స్స్వామియు నాఁగఁ బ్రాఁ జని బ్రతీతిఁ జెందె రుక్మిణీదేవి స
త్యాయోషామణియు న్మహోత్సుకత సేయన్సంగలక్ష్మీద్యుఁగే
ల్లోయిం దార్క్ష్యతురుష్కతు ల్గొలువ శ్రీమం జేలునాప్రోలిమో
మై యాకా మెపలి న్వసించు హరి నిత్యంబు న్మముం బ్రోవుతన్.

తే. కమలయంకను దనరూపు గాంచి యలిగి
యాత్మతరళాంతరమున నిజాధినాథు
తను వతఁడు చూపఁ గని చిత్తమునఁ జెలంగు
నట్టికౌస్తుభమణి హృదయమునఁ దలఁతు. ౨

క. వననిధినందన కుయ్యాల, యనువునఁ దనరారి వారిజాక్షునివక్షం
బున నొప్పపై జయంతీ, వనమాలిక నా కొసంగు వాగ్విభవంబున్. ౩

తే. కౌస్తుభంబును వనమాలికయును దనకు, దిగువగా లచ్చినాసలిపై దిద్దినట్టి
తిలకమునకు సమంబుగా వెలయునట్టి, చక్రిశ్రీవత్సచిహ్నంబు సంస్మరింతు. ౪

మ. ధరఁ గాళిందితటంబునం గలుగుబృందాకాననాంతంబునం
బరితోషాతిశయాళు మోహమున గోపస్త్రీజనుల్ గుంపులై
హరిఁ జేరం జనుదెంచు టెంకఁ బను నం చానాద మాలించి స
ల్వరయానంబులతోడ నట్టిమురళిన్ వర్ణింతు నిష్టాప్తికిన్. ౫

సీ. పాంచజన్యం బనఁ బరగి దైత్యారాతియెడమను బయి కేల నెసఁగు నెద్ది
మొగి సుదర్శననామమునను మాధవుదక్షిణాగ్రహస్తంబున నమరు నెద్ది
కౌమోదకీసంజ్ఞ గని కృష్ణుడాపలిరెండవకరమున నుండు నెద్ది
నందకం బనుపేర నారాయణుఁ కుడిక్రిందటిచే వెలుఁ గొందు నెద్ది
తే. శార్ఙ్గ మనఁ దనరారి కేశవుని వామ, బాహుయుగమూలమునఁ గనుపట్టు నెద్ది
యట్టి హరిసైదువకైదువు లబ్జచక్ర, ఘనగదాఖడ్గచాపముల్ మనుచు మమ్ము. ౭
తే. కాలమేఘమునందుఁ బ్రకాశ మొందు, కాలుమెఱుఁగు కెఱంగునఁ గైటభారి
యంసమునఁ బైఁ బెలుఁగు పీతాంబరంబు, బంగరుచెఱంగు మాకు శుభంబు లొసఁగు.
క. పాలతిమాలాగ్రమునం, గ్రాలు శచీనథుకార్ముకం బో యనఁగా
నీలఘనదేహుఁ డగు గో, పాలుతిలక మెఱయుబర్హిబర్హము నెంతున్. ౮
క. భువనంబు కన్పపకిటిమా, నవసింహాదిత్యభృగుజనసరాఘవయా
దవబుద్ధకల్కు లను గే, శవుపదిరూపములు మది నజస్రముఁ దలఁతున్. ౯
శా. శ్రీమన్మందకటాక్షవీక్షణమునం బైఁ జిల్కం బయోజేక్షణుం
డామోదంబున నర్మగర్భసరసేష్టాలాపముల్ వల్కఁగా
వేమాఱుం దరహాసమానసమునం బెం పొంపఁగాఁ గొల్చు శ్రీ
భామల్ నిచ్చలు మాకొసంగుదురు సంపూర్ణంబుగా నిష్టముల్. ౧౦
క. దాంతు హరిచరణభక్తి, స్వాంతు రసాతలనిశాంతు నత్యంతదయా
వంతు సమతీతవిధిక, ల్పాంతుఁ బరమశాంతు నయ్యనంతుఁ దలంతున్. ౧౧
తే. నామదిం దలంచెద సుపర్ణనామధేయు, మురహరవిధేయు సమరసమూహగేయుఁ
గనకనిభకాయు భక్షితకాద్రవేయు, వక్త్రకాంతిజితాత్రేయు వైనతేయు. ౧౨
క. తిన్ననివేత్రము కలుముల, కన్నియ వన్నియను హస్తకమలతలమునం
జెన్నొందు జగము మనిపెడు, వెన్నునిదళవాయిఁ దలఁతు విష్వక్సేనున్. ౧౩
ఉ. పాదుక గొల్చి రామజనపాలుఁడు జానకిఁ జూడ నంపుచోఁ
బాథోధి గోష్పదంబుక్రియఁ దోఁపఁ జవాలున దాఁటి లంక క
త్యాయతలీలఁ బోయి దివిజారుల దోమలఁ బోలెఁ బట్టి సా
హాయతశక్తిఁ గొట్టి సరినారసి తద్విభుఁ గన్న మారుతిన్. ౧౪
క. శుక భీష్మ విభీషణ శౌ, నక రుక్మాంగద వసిష్ఠ నారద బలి దా
ల్భ్య కిరీటి పుండరీకులఁ, బ్రకటితహరిపాదపద్మభక్తులఁ దలఁతున్. ౧౫
వ. అని యివ్విధంబున. ౧౬

క. ఆతతసేవాపరిజన, వ్రాతంబుగ శేషశయను వనరుహనయనున్
ఖ్యాతిగ "నహరేస్తుపర, స్త్రావి" యనుట దెలిసి కృతిమొదలఁ దలఁచితి నెన్.

## బ్రహ్మాదిస్తుతి.

చ. తనజనికారణం బయినతామరకఱ్ఱ హితుఁ డౌటచే విక
ర్తనునకు వేయిఘృష్టు లిడి దానికి శత్రుఁడు గాన నేణచి
హ్నునకుఁ బదేను జేసి యవియున్ శిఖిభానుసుధాంశుగాళిచే
దిన మొక టొప్ప నైకొనను దిద్దను జేయువిధాతఁ గొల్చెదన్. ౧౮

క. శారద విద్యాజాలవి, శారద ననుఁ బ్రోచుటకును సారె భజింతున్
శారదనీరదనారద, పారదహారదరహీరపాండుశరీరన్. ౧౯

చ. కటుకతినంబు లద్రులు జగంబున నందున సంభవించి పెం
పడరునినుం గరంప వశమా యని నన్ని పు డంటివే కదా
వడిఁ గనకాద్రి చాపముగ వంచిననీకు హిమాద్రిజాత యా
పడఁతిఁ గరంచు టెంత యను పార్వతి మెచ్చు శివుం దలంచెదన్. ౨౦

చ. పరిణయవేళయందుఁ దనపాదముఁ బట్టియు సన్నికంటిపైఁ
దిరముగ మోపి కంతునకుఁ దీరెఁ గదా పగ యంచు నీలకం
ధరుఁడు దరస్మితం బొసఁగఁ దద్భుజగాధిపఫణాగ్రరత్నసుం
దరముకురంబునం గని మొద స్మద మందుభవానిఁ గొల్చెదన్. ౨౧

చ. తనుఁ గని మ్రొక్క రెత్తనసె దక్షజయున్నిటలాక్షుఁడు స్మిత
మ్మున నిరుచెక్కులుం గదిసి ముద్దుగొనంగ నాకింత నెమ్మొగం
బనువుగ వెన్కకుం దిగిచి యమ్మహిమ పరస్పరాస్యచుం
బనములు దల్లిదండ్రులకుఁ బన్నగఁ గూర్చు గజాస్యు నెన్నెదన్. ౨౨

చ. జనకునిఁ గొల్వ వచ్చుచలచామరకర్ణునిలేజి న. దివా
హనుముకుటాహిఁ గాంచి భయ మంది శిఖిందికిఁ బోవఁ జూచినం
దనశిఖిమావు నీ కాలిపి దానిభయంబు హరించి పూర్వయా
ఘనకు నుతం బొనర్చు గుహు మద్ధరశక్తిపహు స్మరించెదన్. ౨౩

క. హరిశిఖియను దైత్యాంబుప, వరుద్ధనపతిప్రలిఖాజమహిషనరాంభ
శ్వరహరిణపుష్పకవృష, ప్రరుచిరవాహనులు మమ్ము రక్షించు దొరల్. ౨౪

క. రవిశశికుజబుధసురగురు, కవిభానుజరాహుకేతుగణములు నాకుం
దవిలి శుభంబులనొసఁగుచు, నవగ్రహులు గాత సకలసంపద లెప్పుడున్. ౨౫

## కవిస్తుతి.

సీ. వల్మీకభవుపాదవనరుహంబులు గొల్చి సాత్యవతేయుపూజనము సల్పి
భట్టబాణునివచఃప్రాభవంబు గణించి కాళిదాసుని కిరుగేలు మోడ్చి
పండితాగ్రేసరు దండి వక్కాణించి భవభూతివాక్యజృంభణము మెచ్చి
జయదేవునకు నమస్కారంబు గావించి మల్హణు హృదయసద్మమున నుంచి
తే. చోరుఁగడుఁబ్రస్తుతించిమయూరుఁ గాంచి, మాఘుభూషించిభారవి మదిఁదలంచి
హీనునకుమ్రొక్కి కవితావిహారమతుల, నితరవిద్వత్ప్రకాండులనతులుచేసి. ౨౮
సీ. శబ్దశాసనుపాదజలజంబులు భజించి యుభయసత్కవిమిత్రు నభినుతించి
శంభుదాసునకు నంజలి పెద్ద నాదరించి సహజపాండిత్యుని సంస్మరించి
సకలవిద్యాసనాథకవీంద్రుఁ గొనియాడి సౌజన్యజేయువాక్సరణిఁ బొగడి
తగ నాంధ్రకవితాపితామహు వర్ణించి సుజనపిధేయు హెచ్చుగ నుతించి
తే. రామరాజవిభూషణరత్నఖచిత, చారుమస్తకలాపాదిహారివాక్య
గౌరవము పెక్కుభంగుల గణనచేసి, పిదపనితరాంధ్రకవులకుఁ బ్రియమువలికి.
తే. కాళిదాసమయూరాదికవుల కైనఁ, గలవు తప్పు లనంగ నన్యులకు లేవె
దిద్దఁ దగుపట్ల దిద్దుఁడు దిద్ద రాని, యెడల నాసేరములు క్షమియించు టొప్పు.
వ. అని వర్తమానకవులం బ్రార్థించి. ౨౯
క. వినఁదగు నెండియుఁబోత్రముఁ, గనఁదగు బుధజనులనడుగఁ గాఁదగుఁ గాకెం
దును దెలియనిపట్టునఁద, ప్పనవలదని భానుజనుల కంజలిమోడ్తున్. ౩౦

## గురుస్తుతి.

సీ. ఆదిని రెండవవేదంబు చెప్పినమూర్తిసర్వజ్ఞుఁ గ్రమస్వరాదిఁ
దరువాత శబ్దశాస్త్రముఁ జదివించిన కాండూరిగిరిదేశికప్రకాండు
నామీఁద సకలసిద్ధాంతము దెలిపినధీరవర్యుఁ బ్రధానిసూరభట్టు
పెస నన్ను లక్షణవేత్తఁ గావించినఘను వంచికంటియోబనకవీంద్రు
తే. స్మార్తకర్మంబు లెఱిఁగించి సభలఁబూజ్యుఁ, జేయునలకాలచలపల్లి సింగనార్యు
నాగమము లుపదేశించినట్టిరాజ, యోగివర్యునిఁ దలఁతు విద్యాగురులను. ౩౧
క. అనియిష్టదేవతాస్తుతి, యును సకలకవీంద్రులనుతియును గురునుతియున్
వినయమున సలిపి తెలుఁగున, ఘనకావ్యంబొకటి సేయఁగాఁ దలఁచుతఱిన్.

## స్వప్నప్రకారము.

సీ. ధాత రెండవపరార్ధమున నాదిదినంబుపగటి వరాహకల్పంబునందు
మహిత వైవస్వతమనువేళ దేశంబు లర్థింప నైనమహాయుగమునఁ

గలిసమయంబునఁ దొలిచరణంబున మానితంబగుచాంద్రమాసమునను
శాలివాహననామశకమున గజశైలశరసుధాకిరణులసంఖ్య నడవ
తే. నంగజాబ్దంబునను దక్షిణాయనమున, జలధరర్తువు మొదటిమాసంబునందు
బహుళమున దేవకికిఁ జక్రపాణి పుట్టి, నట్టియష్టమినసుబేర నధికభక్తి. 33
సీ. చక్రవాళాంతరక్ష్మామధ్యసుస్థిత దైవతగోత్రంబు దక్షిణమున
లవణాబ్ధివేష్టితలక్షయోజనసువిస్తారజంబూద్వీపతలమునందు
భరతవర్షంబున భరతఖండంబున మంగళోర్విని గర్మమహితభూమి
మలయవింధ్యాచలమధ్యంబునను గృష్ణయామ్యతీరమున బ్రహ్మాశ్రమమున
తే. దండకాటవి నాంధ్రాభిధానపుణ్య, దేశమున శ్రీగిరీశాన్యదిశను గొండ
వీటిపడమటఁ దంగెడవిషయమునను, గామెపల్లిని గోవులధామమునను. 34
క. కల్పోక్తమార్గమున సం, కల్పము గావించి గోపికావిభుపూజల్
సల్పి మది నతనిపదములు, నిల్పి పురాణార్థగోష్ఠి సేసె గడపుసెడఁగా. 35
సీ. మిగులఁ జేతులకెంట మేటిశంఖంబును జుట్టుఁగైదువయును బట్టువాఁడు
ముష్టులగుమ్మ కౌముద్ధియ లిద్దలు కైదండ లిడ నీటు గలుగువాఁడు
బంగారుచేలఁగులసచ్చని సోఁబట్టుదుప్పటి వల్లెవాటొసవ్వవాఁడు
హారకేయూరమంజీరకోటీరాదిభూషణంబులు చాలఁ బూనువాఁడు
తే. నుదుటఁగస్తూరితిలకంబు వాదలువాఁడు, తలఁచిచూచిన నాకులదైవ మగుచుఁ
బాలుచునాకులదైవంబుఁబోలువాఁడు, నిలిచెనొకరుఁడునాదుముంగలను గలను
వ. ఇట్లు గలిచిన. 36
క. కరములకెంటను దాల్చిన, పరికరములు చూచి యతనిఁ బరమేశుఁ గాఁ
బరికించి లేచి వలగొని, మరియుచు సాష్టాంగదండము లొనర్చి వెసన్. 37

## భగవద్వాక్యము.

ఆ. మోడ్పుఁగేలుఫాలమునఁజేర్చుకొని యున్నఁ, గరుణ నతఁడునన్ను గాంచి పలికె
న న్నెతింగి వందనం బొనర్చితి వాత్స, మెచ్చు పుట్టె నీదుమెలఁకువకును. 38
ఉ. ఈయువతుల్ రమాధరణు లేను బయోరుహపత్రనేత్రుఁడన్
నీయెడఁ గూర్మి గల్గి ధరణీదివిజోత్తమ వచ్చినాఁడ స్వ
శ్రేయస మబ్బు నీకు నిఁక సిద్ధము నన్నయభక్తిఁ యాంధ్రమం
జేయుము మాయనుగ్రహముచేఁ గవు లచ్చెరు వంది మెచ్చఁగన్. 40
క. వినియఁనుగనియును సెలుఁగని, ఘనభక్తిం దెనుఁగుఁ జేయఁగా నెట్లగు నా
కన వలదు దానిలక్షణ, మును నీ కది గలుగునందమును విను మింకన్. 41

## గ్రంథప్రభావము.

తే. ఆంధ్రశబ్దచింతామణివ్యాకరణము, ముందు రచియించి తత్సూత్రములఁ జెనుంగు
బాసచేఁ జెప్పె నన్నయభట్టు దొల్లి, పర్వములు మూఁడు శ్రీమహాభారతమున

వ. ఆసమయంబున. ౪౩

తే. భారతముఁ దెనిఁగించుచుఁ దా రచించి, నట్టిరాఘవపాండవీయము నడంచె
ఛందము నశించ నీభక్తి సంగ్రహించె, ననుచు భీమనయెంతయు నడఁచెదాని.

వ. తదనంతరంబ. ౪౪

ఉ. ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పినభారతంబులో
నేవి వచింపఁ గాఁ బడియె నెందును దానిని కాని సూత్రసం
పాదనసేమిచేఁ దెనుఁగుపల్కు వ వొక్కటిఁ గూర్చి చెప్పఁ గా
రా దని ద్రాతవాటికపరాక్షసుఁ డీయమంబుఁ జేసెనన్. ౪౫

క. ఆమూఁడు పర్వములలో, సామాన్యుఁడు నుడువు తెనుఁగు లరసికొని కృతుల్
దాము రచించిరి తిక్కసు, ధీమణి మొద లైనతొంటితెనుఁగుకవీంద్రుల్. ౪౬

తే. రాజరాజనరేంద్రతనూజుఁ డార్య, సఖుఁడు సారంగధరుఁడు శైశవమునందు
నన్నయ రచించునెడఁ బఠనం బొనర్చె, నన్యులెవ్వరెఱుంగ రీయాంధ్రభక్తి.

క. ఆతఁడు దనకాళ్లు చేతులు, మతి చెడి జనకుండు దఱుగ మత్స్యేంద్రునిసం
గతి నవి గ్రన్నన మొలచిన, ఖ్యాతి సిద్ధులఁ గలసి యొక్కసిద్ధుం డయ్యెన్ ౪౮

క. ఆలోకనమునుఁ డు మొన్నటి, కీలకనమ నామతంగగిరికడ నాసంగన్
బాలసరస్వతి సత్కవి, డోలిఁ దెనుఁగుటీక దాని కొప్పఁగఁ జేసెన్. ౫౦

క. ఆదిని భీమకవీంద్రుఁడు, గోదావరిలోనఁ గలిపెఁ గుత్సితమున నా
మీఁదట రాజనరేంద్ర, త్వాదయితునిపట్టి దాని మహిఁ వెలయించెన్. ౫౧

క. ఇల నెనుబదిరెం డార్యలు, గలిగి పరిచ్ఛేదపంచకంబునఁ దగునీ
విలసితభక్తి మతంగా, చలవిప్రునకున సీయుసదనముఁ జేరున్ ౫౨

క. మును నారాయణభీముఁడు, దనకు సహాయుఁడుగ సంస్కృతము వాగనుశా
సనుఁడు రచియించె దాని, దెనుఁగింపఁగ నీకుఁ దోసు నేఁడు దగుమున్.

క. సురభాషయందు నల్పా, క్షరముల బహ్వర్థసాగరము లిమిడింపఁ
దురుసూత్రంబుల నవి వి, స్తరముగఁ దెనుఁగింప కున్నఁ దగమే తెలియన్. ౫౪

తే. నారికేళపాకంబుగా నన్నయకవి, ప్రక్రియాకౌముదిని ముట్టఁబలికెఁ గానఁ
గేవలాంధ్రులు గాన రాత్రోవ నీవు, గోస్తనీపాకమై రసముఁ గూర్పవలయు

ఆ. శబ్దశాసనుండు సంస్కృతగ్రంథంబు, గానఁ దెలుఁగుమాట గలయ రాయ
  లక్షణంబె కాని లక్ష్య మొక్కటియును, బలుక కునికిఁ దెలియఁ బడవు కొన్ని.

తే. ఒక్కసూత్రంబువలన సముద్భవించు, శబ్దములు లెక్క పెట్టంగ శక్య మగునె
  నలువకైనను బలుకులేఁ జెలువకైన, నైన నెఱిఁగింపు మొకకొన్ని యైన నీవు.

చ. రమణను సత్కవీంద్రులు పురాణచయంబు నితిహాససంక్తికా
  వ్యములును దొల్లి యైన నిపు డైనను ముంగల నైన దీని సూ
  త్రములను దక్క వేఱొకపథంబున నాంధ్రముఁ జేయఁ జాలమిన్
  మఁ దెనుఁగింపు దీన నవి సర్వముఁ జేయుఫలంబు నీ కగున్. ౫౭

క. తాతనయు నూత్న దండియు, నీ తెనుఁగులలక్షణం బొకించుక యైనన్
  జేతః ప్రౌఢిఁ జెప్పిరి, క్ష్మాతలమున దీని తెఱఁగు గా వవి యెల్లన్. ౫౮

తే. ఆంధ్రభాషామహాకాననాంతరమున, సంతతంబును శబ్దాపశబ్దసరణి
  తెలుఁగ నేరక మదిసంశయించు తెలుఁగు, కవులు సుపథంబులిందును గాంతురిలను

తే. కవుల కుపకార మగుటచేఁ గలుగుసుకృత, లాభమందుననగు సద్యశోభివృద్ధి
  దాన సమకూలు నాకపదంబు దీనిఁ, దెనుఁగుఁ గావించుకంటె శోభనము గలదె

ఆ. ధరణి నీకు నిష్టదైవ మెప్పుడుఁ గామె, పల్లె నున్న చక్రపాణి యగుట
  సంకేతంబు దీని నతనికిఁ జేయుము, విప్రవర్య మాకు వేఱు గలదె. ౬౧

చ. అని యతఁ డానతిచ్చె వన నంతట మేల్కని నాల్గుదిక్కులుం
  గనుఁగొని యద్భుతంబుఁ గుతుకంబును దెంపమునం జెనంగ నేఁ
  గినఁ గల దేవి యుద్ద మని కేరుచు నుండెడువేళ నాచుతం
  గనగనివాసి పుస్తకనికాయధరుం డొకరుండువచ్చినన్. ౬3

క. ఆవిప్రు నతిథిఁ గా సం, భావించి భుజింపఁ బెట్టి భాషించు నెడన్
  దా విశ్వశ్రేయ మనుచు, నీవచనము సదువ నెచటి దిది యన నతఁడున్ ౬౪

క. నన్నయభట్టీయములో, నన్నఁగఁ బ్రథమార్య గాదె యీపాత్రములో
  నున్నవి యవి యెనుబదికెం, డన్న మహాద్భుతముఁ బొంది యపు డెల్లరకున్.

వ. మదీయస్వప్నఫలం బంతయుఁ దేటపడ నెఱింగించిన నాకర్ణించి సకలజనంబులు నానందంబుఁ బొంది రందుఁ గొందఱు మాతృసంబంధు లగుమదీయబంధువులు గూడఁ గులసింధుసౌగంధికబంధులును గృతప్రబంధులును నీతియుగంధరులును గావున నాకిట్లనిరి. ౬౬

క. హరిఁ గాంచుటచే మోక్షము, సిరిచే నర్థంబు ధాత్రిచే భూమియు శం
  ఖరథాంగప్రముల విజయము, విరచింపు మటన్న కృతిని విద్యయుఁ గలుగున్. ౬౭

ఆ. శ్రేయ మబ్బు నంచుఁ జెప్పె విష్ణుఁ డనంగ, మంచికల యటంచు నెంచ నేల
యతఁడు సెప్పు మన్న దితనిచే నిప్పుడు, గలిగె నిదియె సాక్షి గాదె మనకు.
వ. అదియునుంగాక.

## కర్తృవంశావతారము.

సీ. శ్రీవిష్ణునాభిరాజీవసంభూతుఁ డేవసుమతీసురునకు వంశకర్త
రామాయణామరభూమిరుహాబ్ధి యేవితతాగమాంతసంవేద్యగురుఁడు
కశ్యపాత్రివశిష్ఠగౌతమభృగువు లేసూనృతభాషణు లోడువారు
పృథుశాస్త్రకళాధురీణుం డెవ్వఁడు దేగురుతపోరాశికిఁ గూర్మిపట్టి
తే. యతఁడు దనరారు సర్వలోకైకయోగ్య, తారకాపథవర్తి విస్తారకీర్తి
దురితకర్మపరిత్యాగి పరమయోగి, ధర గుణస్థాని శ్రీభరద్వాజమౌని. ౨౦
తే. అమ్మహామౌనిగోత్రాబ్ధి నవతరించి, తమ్ములును దాను నన్యోన్యతను దనర్చి
తమ్ములనుపేరునను సోముఁ డ్రప్రస్తరించు, నారసోమాహ్వయుఁడు కాకనూరిఘనుఁడు
తే. అతఁడు మధురమఖసమూహములఁ దొరఁగి, వేదశాస్త్రపురాణాదివాదనములను
గాకనూరికిఁ జేసిన కారణమునఁ, గాకనూరింటివాఁ డన ఘనతఁ గాంచె.
సీ. బాలుఁడై కాశికాపట్టణంబున కేగి బ్రహ్మేంద్రునొద్ద శాస్త్రములు చదివె
బ్రహ్మరాక్షసుతోడఁ బ్రశ్నము చెప్పంబడి కట్టినగండభాగంబు నొందె
సరికొండసీమలో సంచరించెను గాకనూరనుసర్వాగ్రహార మొకటి
నిడుదవెల్లిని బొద్దినేపల్లి నివరళపురిని మాన్యక్షేత్రములు గడించె
తే. నవనిసఖ్యాక్షుఁ డగుట గంగాంబికాభి, రాముఁ డనఁగను నక్కఁబు సోముఁ డనఁగ
మనియె నిలఁ గాకనూరికృష్ణసుతుండు, సోముఁ డభినవచూతసద్ధాత్రిమునను.
చ. అతఁడు భవప్రితాపహరున కర్మ్యుఁ బితామహుఁ డాఖ్యుఁ డంపు భా
రతిని దపంబునం గని వరం బడిగెం దనయింట విద్య ప్ర
స్రుత మగుచుండ నంమలకు సున్మ జగంబునఁ గాకనూరిసం
తతి యగువారు శోభనదినంబుల మున్నగ వాణిఁ గొల్చుటల్. ౨౪
తే. గంగయంబకు సూరునిగాంచె నాకన్, సోముఁ డని చెప్పఁ జెల్లను జోద్యమగు నె
కాంచె చెక్కుకుమారుల గంగయంబ, సోముఁ డల గాకనూరివంశోత్తముండు.
వ. వా రెవ్వ రనిన. ౨౫
సీ. అమరేశ్వరుండు భోగాతిశయంబున సమరేశ్వరుం డన నతిశయిల్లుఁ
గొండలయ్య నదల్ప గురుశౌర్యమహిమచేఁ గొండలయ్య యనంగ గోమటుఘనుఁడు

వంగప్పఁ డాశ్రితరక్షణప్రౌఢిమ రంగప్పఁ డన ఖ్యాతి రంగు గాంచు
లక్ష్మణుం డగ్రజాలాపానువర్తి యై లక్ష్మణుం డన భూతలమున వెలయు
తే. నందులోఁ గాకమూరిరంగాహ్వయుండు, గనియెనలువురుతనయులఁ గన్నమాంబ
యందుఁ దిరుమలభట్టు గంగార్యవర్యు, నెలమిఁ బెదసోముఁ జినసోము నిందులోన
సీ. ఒకనివాకిలిఁ గాని యుండఁ డెన్నటికైన నుగ్రుఁడు గాఁడు దానొక్కనాఁడు
కంట మంటలు రాలఁ గనుఁగొనఁ డెవ్వరి, నేరఁ డెన్నటికిని నీరు ద్రావఁ
గుత్తుకంటు విషంబు గూరిచి వర్తింపఁ డనిశంబు నొక్కని నడిగికొనఁడు
సంతతంబును బౌరుషమువెత్తి గాంచఁడు క్రతుఫలు దాఁ జేయఁ గాని చెఱుపఁ
తే. డన్ని సద్గుణములు గల్గెనేని పూని, జోడు సేయఁగ వచ్చు నా సోముఁ గాక
మూరికులవారిజాతచకోరమదవి, రామునకు రంగఘనుపెదసోమునకును. ౭౦
సీ. కొట్టించె నెవ్వఁడు గుఱువాపి వప్రదక్షిణభాగమున రొంపిచెర్లలోనఁ
గట్టించె నెవ్వఁడు ఘనశిలాసాలంబు రంగుగా శంకరలింగమునకుఁ
బెట్టించె నెవ్వఁడు పృథుతరారామంబు గుడిపాటికడ నిన కొండత్రోవఁ
బుట్టించె నెవ్వఁ డప్పురి యామ్యదిశ గుంటఁ ద్రవ్వించి పశువులు ద్రావ జలము.
తే. క్షితిఁ దలంపఁగ సర్వజ్ఞ శేఖరుండు, సత్పథవిహారి ద్విజరాజచారులక్ష
ణాన్వితుం డెవ్వఁ డతఁడు సోమాభిధుండు, కాకమూరికులాబ్ధిసాగరభవుండు.
ఉ. పట్టెమపోతనార్యసుతవర్యుఁ డనం దగు సిద్ధిభట్టుతోఁ
బుట్టినకృష్ణఁ గైకొని సుపుత్త్రుల వెంగన గన్నభట్టు బ
ల్దిట్టను గంగయ న్సుతలఁ దిమ్మను రంగను లింగ గోపమా
రట్టిడిఁ గాకమూరి పెదరంగయసోముఁడు గాంచె వేడుకన్. ౭౧
క. వినుతమతిఁ గాకమూరిజ, ననమణి యగుసోమునగ్రనందనుఁ డగువెం
గన బుధుఁ డన నెగడె జగం, బున సోమునినందనుండు బుధుఁ డగు టరుదే.
తే. పల్లెనాటను నూటతొంబదియు నాల్గు, గ్రామముల నీడు గానక కాకమూరి
వెంగ నార్యుఁడు వేదవేదాంగములను, బ్రస్తుతికి నెక్కె మాఱటబ్రహ్మయనఁగ.
ఆ. కాకమూరివెంగఘనుఁడు నేసమయందుఁ, గాంచె మొదల నప్పకవిని నన్ను
వెనుక సోమనార్యు వేంకటపతిఁ గృష్ణు, భట్టు లక్ష్మణాఖ్యబాలుఁ గాంచె. ౭౩
క. శ్రీగిరిని నిలిచి నీవును, భోగివిభూషణునిపట్టుపుకవీంద్రుఁడ వై
వాగీశవినుతకామెప, లీగరుడాసనకృపాకలితవాక్సిద్ధిన్. ౭౪
సీ. జగతి నాపస్తంబశాఖోక్తపట్కర్మపద్ధతిఖండనిబంధనంబు
కాలబాలార్క వాక్యజ్యోతిషగ్రంథసంహితాసుశ్లోకసంగ్రహంబు

శ్రీమదనంత ప్రసిద్ధమహావ్రతకల్ప కథాంధ్రోక్తికావ్యరచన
శ్రీనగాధీశను శ్లేషనిందాస్తుతిభావగర్భితసీసపద్యశతము
తే. లలితకవికల్ప కాఖ్యానలక్షణంబు, మహితసాధ్వీజనాఘధర్మద్విపదము
సంబికావాద నామకయక్షగాన, కృతియుఁ జేసితి కాకనూరికులయప్ప. ౧౫
క. ఇట్టిమహాగోత్రంబునఁ, బుట్టితినీ విట్టిశుభముఁ బొందుట యరుదే
గట్టిగ నాదేవుఁడు సమ, కట్టినయది తెనుఁగుఁ జేయఁగాఁ దగుననినన్. ౧౬
క. పరమోత్సుకతను నన్నయ, విరచించినభక్తి వ్రాసీ విప్రుని గాశీ
పురి కనిచి వృద్ధబాంధవ, గురువిబుధులచే ననుజ్ఞ గొని చిత్తమునన్. ౧౭

కవివిచారము.

క. లోకంబునఁ గలవిబుధా, నీకములో నెవరిఁ బోల నేరుతు నైనన్
నా కిచ్చె నాంధ్రశబ్ద, వ్యాకరణముఁ దెనుఁగుఁ జేయుమని హరి కరుణన్. ౧౮
తే. మహినివాగనుశాసనమయుఁడొనర్చు, నిమ్మహాగ్రంథమును నావమెక్కియాంధ్ర
శబ్దజలరాశి తరియించుజనులు కేను, గర్ణధారుఁడ హరియనుగ్రహముపేర్మి.
ఉ. ఎన్నఁగ నన్నయాఖ్యకవి యీకలి కాదిని జెప్పదాని భీ
మన్న హరించెఁ గ్రమ్మఱ మహాత్ముఁడు రాజనరేంద్రపట్టి దా
మొన్న నొసంగె విప్రునకు మూల మతం దొనరించెఁ డీక నా
కన్నది నున్న విన్నగియుఁ గాదు మహాద్భుత మబ్బె నా కిటన్. ౨౦
క. మూలము చెప్పిననన్నయ, భూలోకబ్రహ్మ యతనిబుద్ధి దెలిసి వ్యా
ఖ్యాలక్ష్యంబు లొనర్చిన, బాలసరస్వతులఁ బోలు ప్రాజ్ఞులు గలరే. ౨౧
క. ఎక్కడిచుతంగపర్వత, మెక్కడికామెపలి సుకవు లీలో లేరే
గ్రక్కున నిది దెలిఁగింపక, దక్కట నను ధన్యుఁ జేయు తలఁపున నేమో. ౨౨
క. అటిక్కనముఖ్యకవి, వ్రాతముచే నీతెలుంగువ్యాకరణము ధా
త్రీతలమునఁ గడు నంత, ర్ధ్యాతం బై తెనుఁగు గాకపోవుట లెల్లన్. ౨౩
వ. మత్పురాతనజననఘనతర తపోవిశేషంబువలనన కదా యని చింతించి నితాంత
సంతుష్టాంతరంగుండనై. ౨౪
తే. తనయనుగ్రహమునఁ జెప్ప నను చునిస్సఁ, గలనవచ్చినహరితానెకలఁడు నాకుఁ
దెలియనిపదంబు లెల్లను దెలుప నింక, శంకసేయఁగ వలదని సమ్మతించి. ౨౫
వ. మున్ను బృందారకభాష నశేషవిద్యాజలజాసనుం డగుశబ్దానుశాసనుండు సం
క్షేపంబుగాఁ గూర్చిన యాంధ్రవ్యాకరణంబునందలి, సంజ్ఞా, సంధి, తత్సమ,
దేశ్య, క్రియాపరిచ్ఛేదంబు లయిన నుం దెనుఁగుఁబలుకుల నేనువిస్తరించి భా

షాపరిచ్ఛేదంబును, వర్ణపరిచ్ఛేదంబును, వళిప్రాసపరిచ్ఛేదంబును, పద్యపరిచ్ఛే
దంబును, సంధిపరిచ్ఛేదంబును, తత్సమపరిచ్ఛేదంబును, దేశ్యపరిచ్ఛేదంబును,
క్రియాపరిచ్ఛేదంబును, ననునామంబుల నభిరామంబు లగునాశ్వాసంబు లెనిమిది
గా నెలకూచి బాలసరస్వతి సకలభాషాకవిమహోపాధ్యాయ ప్రణీతాంధ్రవ్యా
ఖ్యానగ్రంథము జాధారంబుగా రచియింపం బూని.

క. దశమీసురగురువాసర, శశితారావజ్రయోగషష్ఠకరణయు
క్తశరాసనలగ్నంబున, శిశిరకరాంశమున మొదలు సేసితిఁ గృతికిన్. ౯౭

వ. ఇట్లు కృతప్రారంభుండనై మదీయేష్టదేవతం గాంచి నమస్కరించి వినుతించి
యతనిం గుఱించి షష్ఠ్యంతములు విన్నవించెద. ౯౮

## షష్ఠ్యంతములు.

క. సాయపవేంకటపతిభూ, నాయకదత్తాగ్రహారనగరప్రాగ్దే
శాయతదేవాలయమునఁ, బాయక వసియించు గోపభామాపతికిన్. ౯౯

క. శ్రుతశాస్త్రాగమజితగీ, ష్పతి నక్కెమ పెద్దనార్యసంపాదితపు
ణ్యతరాగ్రహారపూర్వ, క్షితిజశమీయామ్యమున వసించినహరికిన్. ౧౦౦

క. తంగెడసీమను నిగ్గర, గంగాసమనాగనమ్న గాపూర్వమునం
బింగళిపురదక్షిణమున, రంగుగ నెలకొన్న గోపరత్నంబునకున్. ౧౦౧

క. కేతవరనామపట్టణ, దైతేయాశాసమన్వితనికేతునకున్
వాతాత్మజతార్క్ష్యసమ, న్వీతునకు సమస్తలోకవిఖ్యాతునకున్. ౧౦౨

క. ఆలఘుతరశీలునకు మం, గళగుణజాలునకు దనుజకాలునకిందో,
పలనీలునకును గానే, పలిగోపాలునకు ఘోషపతిబాలునకున్. ౧౦౩

తే. అంకితము గాఁగ నేఁ జేయునట్టియాంధ్ర, శబ్దచింతామణిగ్రంథసారపాద
పంబునకు నాలవాలంబుపగిది నొప్పు, నట్టిభాషాపరిచ్ఛేద మెట్టి దనిన. ౧౦౪

## ప్రథమాశ్వాసము.

క. శ్రీభోజతనూజాన, త్యాభాషాసహిత తార్క్ష్యహనుమద్యుత భ
ద్రేభాధిపపోషణ తుల, సీభూషణ కామెపల్లిశ్రీగోపాలా. ౧౦౫

క. అవధారు శబ్దశాసనుఁ, డవనిఁ గలియుగమునకాది నారాజమహేం
ద్రవరంబునఁ జెప్పినయాం, ధ్రవచోవ్యాకరణసూత్రతతిఁ దెనిఁగింతున్. ౧౦౬

క. భాషానిరూపణం బా, ర్యాపట్కమునందుఁ దొలుత నాంధ్రకవిశిరో
భూషణ మగునన్నయ సవి, శేషంబుగఁ జెప్పె సంకుచితవాక్యములన్. ౧౦౭

## భాషాపరిచ్ఛేద మూలసూత్రంబులు.

### ఆర్యావృత్తశ్లోకంబులు.

విశ్వశ్రేయః కావ్యం త దదోషౌ పరికృతౌ చ వాగర్థౌ
సా వా గ్యా రసవృత్తి స్సన్ధ్యోహి రసో యథాతథం కవిభిః.
స్వస్థానవేషభాషాభిమతా స్సన్తో రసప్రలుబ్ధధియః
లోకే బహుమన్యన్తే వైకృతకావ్యాని చాన్య దవహాయ.
ఆద్యప్రకృతిః ప్రకృతి శ్చాద్యే ఏషా తయో ర్వికృతిః
కేవలత యానుసర్ప త్యుభే చ యేయం యథాతథా భాషా.
తజ్జా సమా చ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి
ప్రకృతిద్వయజా తజ్జా, తుల్యా తు సమా, ప్రవాహినీ దేశ్యా.
సిద్ధి ర్లోకా ద్దృశ్యా లోకా న్నన్యాదృశ శ్చ నిత్యశ్చ
సంస్కారార్థో నియమో నియమాద్గ్రామ్యం హి యత్త్వపభ్రంశః.
విరళాన్ పేచోషాదికశబ్దాన్ ప్రవ్యాహరన్తు శబ్దజ్ఞాః
ఇహ తు ప్రవ్యాహార్యం సజ్జేతితసుప్రసిద్ధ మేవ పదమ్.
ఇతి శ్రీసకలభాషావాగనుశాసననన్నయభట్టవిరచితాన్ధ్రశబ్ద
చిన్తామణౌ భాషాపరిచ్ఛేదః ప్రథమః.

వ. ఈశ్లోకంబులాఱునుం బంద్రెండు సూత్రంబులయ్యె నవియెల్ల నింక వివరించెద.

### పూర్వగ్రంథ నామసంగ్రహము.

తే. సంస్కృతమునకు నాంధ్రభాషకును దొల్లి, లక్షణములు శాకల్యమల్లనసుధీంద్ర
చిన్నకోటపెద్దనసుకవిప్రముఖులు, క్షితి నొనర్చిరి లోకోపకృతికిఁ జెక్కు. ౧౧౮

వ. అవి యెయ్యవి యనినం బ్రతాపరుద్రీయంబును, కువలయానందంబును, రసమంజరియును, సాహిత్యచంద్రోదయంబును, సాహిత్యరత్నాకరంబును, వృత్తరత్నాకరంబును, చమత్కారచంద్రికయును, షడ్భాషాచంద్రికయును, షడ్భాషావివరణంబును, త్రివిక్రమవృత్తియు, హేమచంద్రఫక్కికయును, గవిభల్లటఫక్కికయును, నధోక్షజఫక్కికయును, శబ్దానుశాసనీయంబును, గవిరాక్షసీయంబును, గవికంఠపాశంబును, గవిమూషికమఞ్జాలంబును, గవిగజాంకుశంబునుం గవిసర్పగారుడంబును, గవిజనాశ్రయంబును, గవిలోకసంజీవినియును, గవికం

తాభరణంబును, గావ్యాలంకారచూడామణియును, గావ్యచింతామణియు,న
థర్వణచ్ఛందంబును, గోకర్ణచ్ఛందంబును, శ్రీధరచ్ఛందంబును, ననంతామాత్య
చ్ఛందంబును, ఛందోదర్పణంబును, నలంకారసంగ్రహంబును, నలంకారరత్నా
వళియు, నాంధ్రభాషాభూషణంబును, రేఫఱకారనిర్ణయంబును,లక్షణవిలాసం
బును, సులక్షణసారంబును, సర్వలక్షణసారసంగ్రహంబును,లక్షణదీపికయును,
శారదాదీపికయును, శారదాముకురంబును, శారదాతిలకంబును, వాగీంద్ర
చూడామణియును, నరసభూపాలీయంబును, మొదలుగా నీక్షింప లక్షణగ్రం
థంబులు లక్షోపలక్షలు గలవందు. ౧౧౦

క. ఒకదానికంటె మఱి వే, ఱొకటి విశేషంబుఁ జెప్పుచుండుకతమునన్
సకలగ్రంథములును జదువక దెలియునె లక్షణప్రపంచం బెల్లన్. ౧౧౧

## ప్రబంధమహిమ.

క. ఇది చదివిన పిమ్మట మఱి, యెదియేనియుఁ జదువుబుద్ధి యేలా వాడమున్
బదఁపడి గ్రంథము లన్నియు, వెదకి వెదకి సార మెల్ల వివరింపంగన్. ౧౧౨

తే. పద్యతను వెల్ల నొక్కదర్పణమునందుఁ జూపడు తెఱంగునను గవితోపయోగ
లక్షణములన్నియును సరళంబుగాఁగ, నెఱుఁగఁబడునిందుఁ దెలియ నూహించిరేని.

తే. సారభూమకు శబ్దశాస్త్రంబు పగిది, దెనుఁగునకు నావశ్యకం బిది దీనిఁ జదివి
చెప్పిన ప్రబంధము జగత్ప్రసిద్ధి నొందు,నురక రచియించినది యప్రయోజకమగు.

క. రత్నములకు నిల నత్కృతి, రత్నములకు మఱి తురంగరత్నములకు స్త్రీ
రత్నములకు లక్షణములె, యత్నంబునఁ జూడవలయు నంద్రు మనీషుల్. ౧౧౫

క. ఈక్షితిని రాజరాజును, భిక్షునిగాఁ దిట్టఁ, గూటిపేదను యక్షా
ధ్యక్షునిగాఁ దీవింపను, లాక్షణికుఁడె యెన్నిభంగుల సమర్థుఁ డగున్. ౧౧౬

తే. ఉత్తముఁడు లక్ష్యలక్షణవృత్తవేది, పరఁగు మధ్యముఁ డన లక్ష్యపద్యవేది
సారిది నధముఁడు లక్షణశ్లోకవేది, లక్షణజ్ఞుల కివి యపో లక్షణములు. ౧౧౭

క. తొలుత నలక్షణసూత్రం, బు లెక్కింగి పిఱుంద లక్ష్యములు దెలియంగా
వలయును గావున లక్షణ, ములు లక్ష్యంబులును బాఠముగఁ జేయఁ దగున్. ౧౧౮

## —మూలసూత్రము—విశ్వశ్రేయః కావ్యమ్. 1.—

క. ధర్మములలోన నుత్తమ, ధర్మము కావ్యము నిజంబు ధర నెవ్వని కా
ధర్మము చేకులు నతఁడు సు, ధర్మను వసియించుఁ దక్కుదైవత యుగముల్.

క. తనయుఁడు చెలువును గావ్యం, బు నిధానము గుడి వనంబు భూదేవస్థా
పనమును ననునిద్యోద్యను, జను శాస్త్రములందు సప్తసంతతులనఁగన్. ౧౨౦

తే. దుష్కృతము లెన్ని చేసినఁ దున్ని సప్త
సంతతులలోన నొక్కటి సలుపునతఁడు
కుతుకమునఁ దననూటొక్కకులమువారి
నరకములఁ బాపి ముక్తికి నడపు నిజము
నెగడుఁ గావునఁ గావ్య మన్నిటికిఁ దొడవు. ౧౨౧

క. పురివఱదనీరు గోదా, వరిని గలసి యోగ్య మైనవడువునఁ గడు దు
శ్చరితుం డైనను గావ్యాం, తరమునఁ జెప్పఁబడి పావనచరిత్రుఁ డగుక్. ౧౨౨

క. తొలి నెవ్వని నామము స, త్కృతి నెన్నిదినంబు లుండు దివి నా పుణ్య
వ్రతుఁ డంత కాల ముండును, గృతి నింద్ర ద్యుమ్నునికి దృష్టాంతముగాక్.

క. తనకు హితార్థము లెఱిఁగిలు, చు నఘంబు లడంచు ధనము శోభనము యశం
బును గూర్చు నఖిలసురలక్, గనఁబడఁ గాఁ జేయు నెపుడుఁ గావ్యము కవికిక్.

తే. మేటిబ్రహ్మర్షియయ్యె వల్మీకభవుఁడు, గాంచె రవిని మయూరుండు గడియలోన
హారిణోగము వాసె శ్రీహర్షునందు, కావ్యమునఁ జెందరాని సద్గతులు గలవె

చ. అలరఁ బురాణకావ్యముల నాద్యులు చెప్పినవారు దక్కఁగాఁ
దెలియఁ జతుర్యుగంబులను దీపుల నేఁడిట నెంత తెందఱో
యిల జననంబు నొంది మది యేగిరి పుణ్యచరిత్రు లందులో
పల నిపు డొక్కఁ డేనియును బ్రస్తుతి కెక్క నెఱుంగ మెక్కడక్. ౧౨౬

తే. రామకథలోనఁ గపులు వారాశిఁ గట్టి, రనుచు వాల్మీకి చెప్పఁగ నిఖిలజనులు
సేతు వనుచు నెఱింగిరి చెప్పకున్న, నదియు నొకసోగ దిది యటంచ్రను గాదె.

క. వివరింప యజుర్వేదము, కవి యగువిప్రుండు శుచి జగంబుల నేత
ల్పద్వివిమలకావ్యనుమిక్కిలి, పవిత్ర మగుఁ గపిలగోవుపాల లెఱుఁగునక్. ౧౨౮

తే. ఉపమ గలిగిన శయ్యల నొప్పియున్న, నంత్రుషవుని కావ్యంబు గ్రాహ్యంబు గాదు
పాయసం బైన సంస్కారపక్వ మైనఁ, గాకచ్పృష్టంబు హవ్యంబు గానియట్లు.

కావ్యభేదంబులు.

సీ. ఉచ్చారణక్రియ నొప్పారు వర్ణంబు, వర్ణసంచయమున వఱలుఁ బదము,
పదవితానంబున భాసిల్లు వాక్యంబు, వాక్యభేదమున నిర్వటిలు నర్థ,
మర్థవశంబున నమరును భావంబు, భావసంగతిఁ గనుపట్టు రసము,
రససంప్రసక్తిచేఁ బొసఁగును బద్యంబు, పద్యరాశిని గూర్పఁబడును గావ్య,

తే. మట్టి కావ్యంబు ద్వివిధ మైయతిశయిల్లుఁ, బరువడిఁ బ్రబంధ చాటుప్రబంధములన
సర్గముల సంస్కృతమున, నాశ్వాసములను, దెనుఁగునఁ, బ్రబంధమనునది తన
రుఁ గృష్ణ.

సీ. పురమును ఋతుషట్కమును బ్రయాణంబును శైలంబు వేఁటయు సాగరంబు
మహనీంద్రపుణ్యాశ్రమంబును మంత్రంబు దూత్యంబు పిదప నద్భుతరణంబు
విజయంబు మద్యపానజవికారంబును వనవిహారంబును వారికేళి
కన్యాంగసౌందర్యకథనంబు హిమకరాభ్యుదయంబు విప్రలంభోచితంబు
తే. పద్మమిత్రోదయంబును బరిణయంబు, సురతమును దౌహృదంబును సుతజననము
ననఁగ నిరువది రెండు వర్ణనలు గూర్చి, చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనివాస.
క. కనుఁగొన సంఖ్యాబద్ధం, బు నసంఖ్యాకంబు నాఁగ భువి నిరువిధమై
తనరారుఁ బూర్వకవిమత, మున నాచాటుప్రబంధములు జలజాక్షా. ౧౩౨
తే. నాల్గుదెగలయుదాహరణములు ముక్త, కాదిపంచాశదశమును సంఖ్యాన్వితములు
గద్యరగడద్విపదదండకములు మంజ, రులును సంఖ్యారహితచాటువులు నృసింహ.

ముక్తకాదిపంచాశత్తెట్టి దనిన.

సీ. ఒనరు ముక్తక మన నొక్కపద్యము, ద్వికంబగు రెండు, త్రికము మూఁడైనఁ, బంచ
రత్నంబు లైదు, వారణమాల యెనిమిది, నవరత్నములు పద్యనవక మైన,
భాస్కరమాలిక పండ్రెండు, శశికళ పదియాఱు, నక్షత్రపంక్తి యిరువ
దియు నేడు, త్రింశదాహ్వయము ముప్పది, రాగసంఖ్య వెండియు రెండు సాగెనేని,
తే. వరుసఁ బంచాశదాఖ్య, మవ్వల శతకము, నష్టసమధికశతికంబు ననఁగ వేయు
నేఁబదియు, నూఱు, నూటపైనెనిమిదియును, సప్తశతి సప్తశతమైన శార్ఙ్గపాణి.

— మూ. సూ—త దదోషా పరికృతా చవాగర్థా. 2. —

తే. కృతికి నెప్డు శబ్దార్థముల్ రెండువలయు, నవియలంకారయుతములు నఖిలదోష
రహితములుగాఁగఁ జూచి కూర్పంగవలయుఁ, గామెపలిబాలగోపాలగానలోల.

శబ్దార్థలక్షణాలంకారసీసమాలిక.

సీ. సర్వలక్షణసారశబ్దార్థయుగళంబు మహితశుద్ధసువర్ణమణులభంగిఁ
బదపద్యభూషణప్రచయరూపంబు లై లలిఁ గావ్యలక్ష్మి నలంకరించు
కారణంబున నలంకారాఖ్యలను జెంది బహుభేదములను జూపట్టుఁ గృతుల
నఖిలకావ్యములకు నాత్మలు రీతులు ప్రాణముల్ వానికిఁ బ్రాణదశక
మౌలి వైదర్భిగౌడికాపాంచాలికాలాటికాఖ్యానకలిత లైన
నాలుగురీతు లెన్నంగ నర్థవ్యక్తి సౌకుమార్యోజఃప్రసాదకాంతి
మధురతాసౌకర్యసమాధిసామ్యశ్లేషములు పదియును బ్రాణములు దలంప
శయ్యాచమత్కారశబ్దస్ఫురణపదావృత్తిరీతి ప్రాణవితతు లెల్ల

శబ్దలక్షణము లై జగతిక్రైఁ బొగడొందు నుభయవిస్ఫురణంబు నొప్పునట్లు
వదలక మును గొన్నవర్ణంబు కృతులను బలుమాఱు నుడివినఁ బ్రాస మయ్యె
నదియు సుకరదుష్కరావాసనద్విత్రిచతు రనుసంజ్ఞల సప్తవిధము
లయ్యె ననుప్రాస మందులోపల ఛేకవృత్తిలాటము లన నుత్తెఱంగు
లేకార్థశబ్దంబు లేక పద్యంబులోఁ బునరుక్తిదోషంబు పొందకుండ
నడుగక వేమాఱు నుడువఁగ లాటాఖ్య జను ననుప్రాస మై జరుగుచుండు
లాటంబులో శృంఖళన్యాయబంధంబు ప్రతిషేధశృంఖళబంధనంబు
మాలికాదీపసమాఖ్యయు సారంబు నేకావళియు నన నెసఁగు నైదు
పలుమాఱు నొకభంగిపలుకులు వలుకుచో నర్థంబు వేఱైన యమక మదియు
నాదిగతంబు మధ్యగతంబు నంతగతాఖ్యంబు నాదిమధ్యమగతంబు
నాద్యంతగతము మధ్యాంతగతంబును జరణత్రయగతంబు సర్వగతము
నుపమానపదగోపనోక్తియు నన నవవిధము లై యమకముల్ విస్తరిల్లు
నరిగమపధను లోష్ఠ్యనిరోష్ఠ్యములు తలకట్టులును గుడులు శృంగములు నేక
వర్ణంబులు నక్షిప్తవచనసంఘట్టనంబులు నాదిగా నిట్లు వొదలు చెల్లఁ
జిత్రకవిత్వప్రసిద్ధనామంబు లై పెం పొంది వీఁకల కిం పొనర్చు
నరవి గూఢచతుర్థచరణవర్ణముఁ జతుర్విధకందమును బంచవిధసువృత్త
పద్యంబు సీసరూపద్విపదాఖ్యయుఁ గందగర్భితమణిగణనికరము
మొదలు గా నొకపద్యమునఁ జెక్కుపద్యంబు లిమిడి ఛందోక్తదోషములు లేక
కనుపట్టునవి యెల్ల గర్భకవిత్వవిఖ్యాతిచే శ్రవణసుఖం బొనర్చు
గోమూత్రికాఛత్ర గుచ్ఛకుండలి నాగకంకణమర్దలఖడ్గచక్ర
పంకజసర్వతోభద్రమాలాఘురి ప్రభృతిబంధంబు లేర్పడఁగఁ జెప్ప
వృత్తము ల్బంధకవిత్వవిశ్రుతము లై కవులకుఁ జెవులపండువులు సేయు
ప్రాసాదిగాఁ జెప్పఁ బడిన వన్నియు శబ్దవితతి కలంకారవితతు లయ్యె
ధరనలంకారప్రధానతాసురసప్రధానతావస్తుప్రధానతలును
భాసిల్లు నారభటీసాత్త్వలీభారతీకైశికీనామధేయవృత్తు
లర్థస్ఫురణసమాఖ్యయు లాంగలీఫలపాకమృద్వీఫలపాకములును
గడు ముఖ్యగౌణలక్ష్యధ్వనివ్యంగ్యముల్ గణుతింప నర్థలక్షణము లయ్యెఁ
జర్చింపఁ గృతులకు జాతిగుణంబులు ద్రవ్యక్రియలు జీవితంబు లగుట
నవి యేతెఱంగున నమరు నట్లన చెప్ప వలయు జాతిస్వభావంబు ననఁగ
నది మొదలొక్కని మూఁడుపదులపై నెనిమిదియెసఁగుతద్భేదంబులెఱుఁగ వలయు

జాతియు నుపమయు సద్రూపకంబును భ్రాంతిమంతంబు నపహ్నుతియును
దీపకత్రయము నాక్షేపంబు శ్లిష్టంబు నుత్ప్రేక్షయును దుల్యయోగితయును
వ్యతిరేకమును నుదారతయుఁ బ్రేయస్స్వంబు నెసఁగ విరోధ మావృత్తివిధము
భావికాఖ్యానంబుఁ బరివృత్తియును సమాహితము నప్రస్తుత స్తుతిపరంబు
వ్యాజస్తుతియును బర్యాయోక్తియును విశేషోక్తి వక్రోక్తి సహోక్తిసంజ్ఞ
లూర్జస్వియును సమాసోక్తి సమాఖ్యయు జగతి విభావనాసంకరములు
రసవంతమును నిదర్శనమును సూక్ష్మంబు లవనామకంబు హేతువుఁ గ్రమంబు
నాశీర్వచనము నర్థాంతరన్యాసంబు నతిశయోక్తియు నుదాత్తాభిధంబు
నన నొప్పు నిన్నియు నర్థంబులకు నలంకారభేదంబు లై కానఁబడును.
దొలుతటీరూపకాదులు తమలోఁ దాము కలసి సంసృష్టిసంకరము లనఁగ
ద్వివిధంబు లగు నందుఁ దిలతండులన్యాయసంసృష్టిఁ గృతులఁ బ్రశస్తమయ్యె,
సంకరంబులు రెండు జరుగు దుగ్ధోదకన్యాయ, నృకేసరిన్యాయములను
తే. క్షితిని శబ్దార్థసంసృష్టిఁ జెందునట్టి, సంకరంబులు మఱియును జాలఁ గలవు
వరుసనవియెల్లఁ దెలియంగ వలయుఁ బూర్వ, శాస్త్రలక్షణలక్ష్యోక్తసరణివలన.

## శబ్దార్థదోషసీసమాలిక.

సీ. కనుఁగొన దుష్ప్రయోగము వైరివర్గంబు ధరఁ దత్సమాసశబ్దక్రమంబు
నపసంస్కృతాఖ్యంబు నప్రయుక్తంబు విసంధి దుస్సంధి కుసంధిపదము
లవల నకారశూన్యంబు హీనోక్తియుఁ గొఱలుదీర్ఘపుకాకుఁ గుఱుచకాకు
సమసనభంగంబు ఛందోయతిప్రాసభంగంబులు ననంగఁ బదియు నాలు
శబ్దగతప్రదోషంబు లై యొప్పారుఁ గృతులు సాగవు వీని నెఱుఁగకున్న.
న్యూనపదోపమయును నధికపదోపమయు నప్రసిద్ధోపమాభిధంబు
నసదృశోపమయు మహాధికోపమయును నీచోపమయు వ్యర్థవాచకంబు
దేశసమయలోక దిక్కాలశాస్త్ర విరోధాగమకళా విరోధములును
వ్యాకీర్ణకము నసమర్థ మపార్థంబు విరసంబు నతిమాత్రవిశ్రుతంబు
నశుభలజ్జాజుగుప్సాశ్లీలములు సంశయంబు సందిగ్ధ నేయార్థములును
బ్రక్రమభంగం బపక్రమంబును గ్రమభంగంబు ప్రతికటుపరుషములును
క్లిష్టగూఢార్థం బపుష్టార్థకము నసంగతదోషము పదప్రకర్షణంబు
నధికపదంబు సమాప్తపునరాత్తంబు హీనపదంబు నిర్హేతుకంబు
నవిమృష్టవిధేయకాంశె మన్యార్థంబు నప్రతీతికము ననర్థకంబు
భిన్నసంబంధంబు భిన్నలింగము భిన్నవచన మలంకారవర్జితంబు

జెలి నప్రయోజకక్లిష్టంబు నేకార్థకంబును బునరుక్తకంబు ననఁగఁ
దొడరు నేఁబది యర్థదోషంబు లివియందు దెలియక కృతి సేయ నలవి గాదు
పదపడి మను బల్కుప్రాణాదులను గూర్చి చెవులకు నింపుగాఁ జెప్పిరేని
ధీరులు సద్గుణాధికతచే నవియ చేపట్టుదు రొక్కొక్కపట్టునందు.
శ్రుతిసంస్కృతియు మధురతయు, నస్పష్టార్థమునకు నర్థవ్యక్తియును, బదప్ర
కర్షంబునకు ధాత్రి హర్షవాక్యము, సూక్తితంత్ర మశ్లిష్టాభిధానమునకు,
గ్రామ్యంబునకు నెల్లఁ గాంతియు, ననుచితార్థంబుల కెల్ల నుదాత్తతయును,
సంధిదోషముల కూర్జస్వియు, శ్రుతిపరుషంబుల కెల్లను సౌకుమార్య
మప్రతీతికమున కాప్రసాదంబుఁ, బ్రేయస్కంబు బహుసమాఖ్యమునకుఁ,
గ్రమభంగమునకు సంక్రమతయు, న్యూనాధిక పదంబులకు సామ్యకల్పనంబు,
పొందియు నిబ్బంగి వెదకి గుణాధిక్యములు గూర్చి దోషముల్ దొలఁగఁ జేసి
తే. రచనగావించు కృతిబుధరచనలందుఁ, దనరు నాచంద్రభాస్కరతార మగుచుఁ
గావున నలంక్రియాశాస్త్రకథితఫణితి, నరయఁదగు వీని నెల్ల భూసురవరేశ.

—మూ. సూ:—సా వా గ్యారసవృత్తిః. 3.—

క. రసమునకు నాశ్రయం బై, యసదృశ మగు నెద్ది యని గదా శబ్దము రా
క్షసదమన రసికు లనఁగా, వసుమతిఁ దద్విధము నెఱుఁగువారలు సుమ్మీ.

రసవివేకము.

—మూ.సూ:—సాధ్యోహిరసోయథాతథంకవిభిః. 4.—

తే. తగ రసాశ్రయవాక్యసంతతులు గూర్చి, కావ్యము లొనర్చువారలౌ కవు లనంగ
నట్లు గావున నేభాష నైనఁగవిత, పలుకువారికి సాధింపవలయు రసము. ౧౩౯

పంచవిధభావసీసమాలిక.

సీ. రమణ మనోవికారము బహిర్వ్యాప్తమై భాసిల్లు నది సుమీ భావ మనఁగ,
నది య విజ్ఞానసమాఖ్యచేఁ జెన్నొందు యాత్మకు మనసుచే నబ్బుచుండు,
నామనంబున కిఁద్రియములచే నగువాని కైదింటికిని విషయములవలనఁ
గలుగును నాజ్ఞానకలిత మాభావంబు తరుణులయందును బురుషులందు
నాత్మసముద్భూతమై నవరసముల నమరఁ జేయుచు విభావానుభావ
సాత్త్వికవ్యభిచారసంజ్ఞలచే నాల్గుచందంబు లగు, నందుఁ జను విభావ
మాలంబనోద్దీపనాహ్వయంబుల రెండుతెఱఁగుల, ధాత్రి నుద్దీపనాఖ్య
మాలంబనోక్తగుణాలంబనని చేష్టితాలంక్రియాత్మ విహారలీల

లనఁజతుర్విధములఁ దనరారు, ననుభావ మంగచేష్టోద్భూత మగుచు వెలయు,
ధర మనోవృత్తి సత్త్వం బనఁబడు నందు సంభవించినయది సాత్త్వికంబు,
గణుతింప నాసాత్త్వికము కంపఘర్మసంస్తంభ వైవర్ణ్యవైస్వర్యబాష్ప
విలయరోమాంచసంజ్ఞల నష్టవిధముల జరుగు, నవ్వల వ్యభిచారికంబు
స్థాయిభావమున నిత్యత్వంబు నొందక వ్యభిచరించుచు, సాగరాంతరమునఁ
బొదలుభంగఁగముభంగిఁ బొడముచు,నడఁగుచు,సంచారిభావసంజ్ఞ యనువాల్చి
వ్యాధ్యసూయావేగహర్ష లజ్జామర్షదైన్యావహిత్థ నిద్రావిసాద
శంకామదగ్లానిచపలతాపస్మారసుప్తిచింతాశ్రమౌత్సుక్యమరణ
గర్వమోహాలస్యనిర్వేదసంత్రాస ధృతిజడతోగ్రతా స్మృతివితర్క
మతిసుసంబోధనోన్మాదనామంబులఁ జెప్పు ముప్పదిమూఁడు భేదములను,
బ్రకటంబు లైస్థాయి భావంబు లన రోషశమజుగుప్సా భయోత్సాహశోక
హాసవిస్మయరతు లనఁగఁ దొమ్మిది యొప్పునవరసోద యకారణంబులగుచుఁ
బంచవిధంబులై పరఁగు భావంబులు స్థాయిభావసమన్వితమ్ము లగుచు.

తే. వీని నన్నింటి నెఱిఁగినవెనుకఁ గాని, నవరసంబులు పుట్టుచందములు వాని
భేదములు లక్షణంబులు నాది గాఁగఁ, దెలియఁ బోలదు తంగెడ దేశవాస.

## శృంగారరససీసమాలిక.

సీ. వెన్నముద్దకుఁ బాకవిధిచే ఘృతత్వంబు దనరుభంగిని నవస్థాయిభావ
ములకు విభావప్రముఖ్య భావంబులవలన రసత్వంబు గలుగుచుండుఁ,
దద్రసం బంతయుఁ దనరుఁ గావ్యములందుఁ నాట్యంబులందు ననారతంబు,
వినునార్యులకుఁ గావ్యవృత్తంబులును, గనుఁగొనురసజ్ఞులకు నర్తనములందుఁ
గలుగుఁ గాని రసంబు గలుగ దారోప్యంబు, గావున నటియించుకాంతలందు
గరిమ నారసము శృంగారంబు హాస్యంబు రౌద్రంబు కరుణ వీరంబు నద్భు
తంబు బీభత్సంబు దారుణంబును శాంతమును నాఁగ నవవిధంబుల మెలంగు
వరనవస్థాయిభావములలోఁ జెప్పినరతియె పో భావాదిరంజనముల
నయ్యెను శృంగార, మది నీలవర్ణంబు వెన్నునిమొన సామవేదవాశ
వర్యంబు గడు సౌకుమార్యంబు కైశికీవృత్తిని మధురతా విధమునందు
సుప్రసాదాభిధాన ప్రాణఫణితిని విరచింప నొప్పుకవిత్వమునను
జెనుదాయ బీభత్సమున కది సంభోగభవమును విప్రలంభజము ననఁగ
ద్వివిధ మయ్యెను, బంచవిధ భావకథిత ప్రపంచకపోష్య మై పరఁగునట్టి
సందర్శనాలాపసంస్పర్శనాశ్లేష నఖరదక్షత చుంబనక్రియాద్య

మవనిపై సంభోగభవము, తద్విప్రలంభజ మనునది మూఁడుభంగు లయ్యె
సంగప్రభూతం బయత్నసంభవమును నైసర్గికంబు ననంగ నందు
వింశతిగీతముల్ వెలఁదుల కొప్పారు యౌవనగుణచేష్ట లందులోనఁ
దనరారు నంగజాతము మూఁడుభేదంబులై హావభావ హేలాహ్వయములు,
నప్రయత్నజ మనునది సుశోభాకాంతి దీప్తిప్రగల్భతాధీరతలును
మధురతౌదారతాఖ్యము లన నేడుచందంబు లయ్యె, నైసర్గికమ్ము
కిలికించితవిలాసలలితలీలాఖ్యలు విచ్ఛిత్తిబిబ్బోక విభ్రమములు
కుట్టమితంబును మోట్టాయితంబును విహృతంబు నన దశవిధము లయ్యె
భావంబు మొదలుగా భావోదయక్రియావింశతి యన నవి వినుతి కెక్కు
కుంభినిపై విప్రలంభ శృంగారోపకరణంబులై రసాకరము లగుచు.
శ్రవణసందర్శన ప్రణయవిరోధప్రవాసాది కలనలవలనఁ బొడమి
వెలఁదులకును బురుషులకును వరుసతో నొదవునవస్థలు పదియు రెండు,
నయనసంప్రీతిమనస్సంగ సతతసంకల్ప ప్రతాపజాగరకృశత్వ
విషయానుభవపరిద్వేషలజ్జాత్యాగ సంజ్వరోన్మాదమూర్ఛామృతాహ్వ
యంబుల, రతిరహస్యకళాప్రవీణులు జగతిఁ బ్రతాపంబు సంజ్వరంబు
నను రెండువశలును గొనక యవస్థలు పదియ కా నెంతు, రేపట్టునందుఁ
బ్రకృతికథాసమాప్తికరంబు సహితంబు నశుభప్రసంగంబు నగుటఁ జేసి
ద్వాదశదశ పురాతనకథాక్రమమునఁ గాని వర్ణింపరు కావ్యములను,
తే. గవులు దీని నెఱింగి శృంగారరసము, పలుకునట్లుగఁ గావ్యముల్ గూర్పకున్న
ఖ్యాతి కెక్కునె రసికసభాంతరముల, సర్వలోకస్ఫురందరాశానివేశ.

అష్టరససీసమాలిక.

సీ. రసపోషణము లన నెసఁగువిభావముఖ్యంబులవలన సువ్యక్తభంగిఁ
బడయు నవస్థాయిభావముల్ నిజగుణసత్త్వంబులగుచు రసత్వమొందు
నందు శృంగారరసాంతరభేదసంతతు లెల్లను మున్న భాషితము లయ్యె,
నింక హాస్యాదులనెనిమిదింటను గల్గుభేదముల్ చెప్పెద వేలుపేఁడ,
బూర్వోక్తహాసంబు భువిని హాస్యం బయ్యె, నది యల్పమృదువు సామాన్యవాయ
మర్జునప్ఫుని కుంజరాననుచేసుడఁ గిరుణాప్రియాణి శృంగారభవము
సొంపొందు మధురతా సుప్రసాదములను భారతీవృత్తిని బద్యములను
మూఁడుభేదంబులు మొనచేను త్తమమధ్యమాధమంబు లనంగ నందులోన
హసితస్మితము లుత్తమాఖ్యలు, విహసిత ప్రహసితంబులు మధ్యభావితములు

క్షితి నపహసితంబు నతిహసితంబును జనుఁ గావ్యములను గనిఁ బ్రశస్తిఁ
బంచమభావసంభవమహాక్రోధంబు రౌద్రరూపము దాల్చె రక్తనిభము
హరునియాశిగ మథర్వాన్వయప్రభవంబు భ్రుకుటిప్రయుక్త మద్భుతవిపంచి
యుద్ధృతాగ్రము ప్రసాదౌజంబులను గూర్చి యారభటీవృత్తి నమరఁ జెప్ప
వెనుకఁ జెప్పినశ్లోకమున నమ్యెఁ గరుణఁ దామసి నథర్వామ్నాయవిహితజలజ
సమవర్తిదాసి కాసాయసన్నిభకాంతి హాస్యాదికార్ద్రిరసాత్మజాత
శాకుమార్యమునఁ బ్రసాదమాధుర్యంబులను గైశికీవృత్తిఁ జను రచింప
స్థాయిభావోదితోత్సాహంబు దా వీరరస మయ్యె నెపుడు సాహసవిరోధి
కించిత్ప్రిగల్భితోదంచిత మోజః ప్రసాదసాత్వతులను జరుగుఁగవిత
ప్రథమవేది సుపర్వభర్తరాణువ మూఁడువిధము లైయదిధాత్రి వెలయు సమర
వీరంబు వితరణవీరంబు గారుణ్యవీరంబు నన భావవేద్య మగుచు
విస్మయాహ్వయమున వెలయుభావను విభావాదులచే నద్భుతాభిధాన
మున నొప్పు నాశ్వలాయనసూత్రజము కమలాసనుబడివారి యమణకాంతి
రౌద్రరసాదివీరరసప్రసూతంబు స్వాపృదుత్వ మోజఃప్రసాద
విధముల భారతీవృత్తిఁ గావ్యంబులయందుఁ జెప్పఁగ నొప్పుఁ బొందుగాను
నవభావభేవమధ్యవిభాషితజుగుప్సబీభత్స మనఁగ నొప్పిదముఁ గాంచు
నారభటీప్రసాదౌజసవిధముల నొప్పుపద్యముల నత్యూర్జితంబు
సన్నుతాపస్తంబసంతతి శృంగారశత్రువు నందికేశ్వరునిబంటు
కాలవర్ణము ద్విప్రకార మై యది చెప్పఁబడు జుగుప్సాఖ్య బీభత్సరసము
పెను బొంద వైరాగ్యబీభత్సరసమును నసఁగ నీభేదంబు లరయవలయు
మునుపు తొమ్మిదిభేదములలోన నెన్నిదభయము భయానకాహ్వయముచేతఁ
బరఁగు యాజుషము బీభత్సంబుపట్టి ధూమ్రాభంబు వీరరసాహితంబు
భర మహాకాళునివళమాయి సాత్వతి నోజఃప్రసాదసంయుక్తి నమరుఁ
గవితల నీమత్ప్రిగల్భంబు సర్వాంగకంపనవైస్వర్యకారణంబు.
శమము శాంతం బయ్యెఁ జంద్రసన్నిభము నిర్వైరమొంపును బరబ్రహ్మలెంకఁ
గ్రమమున ధర్మార్థకామ మోక్షము లనుపురుషార్థములను దాఁ బొందఁ జేయు
నల్పమార్దవము కావ్యములఁ బ్రసాదమాధుర్యభావాఖ్యవృత్తులఁ బొసంగు.

తే. నీరసాంతరభేదంబు లెల్లవయస, సాటిఁగిసమయోచితములుగా హృదయములకు
నింపు పుట్టఁగఁ గృతుల వర్ణింపవలయు, శ్రీగిరీశాన్యభాగధాత్రీనివేశ. ౧౮౨

## నాయకనిర్ణయసీసమాలిక.

సీ. నవరసంబులకు జన్మస్థానములు నలుగురు ముఖ్యు లగునాయకులు దనర్తు
రొగి ధీరలలితధీరోద్ధతధీరప్రశాంతధీరోదాత్తసంజ్ఞికు లనఁ,
గలరు వెండియు నాకనలుగురు శృంగారరససంభవాస్పద ప్రథితగుణులు
ధారుణి ననుకూలదక్షిణశఠధృష్టు లనఁగ, వీరలకు సహాయపరులు
మహిని నల్వురు పీఠమర్దవిదూషకవిటచేటకులనంగ వెలయువారు,
మదనకళాశాస్త్రవిదులచేఁ బూరుషజాతులు నాలు గెంచంగఁ బడియెఁ
బాంచాలదత్తక భద్రకకూచిమారాభిధానంబుల, నవియుఁగాక
నుపజాతులన వెండియును మూఁడు శశవృషహయనామకములఁ జెన్నారుచుండు.
వసుధ నాయకుఁ డెంత రసికుఁ డైనను గాంత వెలిగాఁగ రసము సంధిఁదుగాన
నాయికాభేద మంతయు విస్తరంబుగాఁ దెలిపెద, నవరసాధీన లైన
యంగనలకు స్వకీయయుఁ బరకీయయు సాధారణయు ననఁ జనుఁ ద్రివిధము,
లందులోన స్వకీయ యనుభామినికి గుణభేదములను మూఁడు భేదము లగు
నుర్వి ముగ్ధయు మధ్యయును బ్రగల్భయు నన, నాక్రచందంబున నుండు ముగ్ధ,
మధ్యాఖ్యఁ జనుఁ దనుమధ్య ధీరయును ధీరాధీరయును నధీరాభిధయును
ననుమూఁడు దెఱఁగుల విమలిగాంచుఁ, బ్రగల్భయనఁ దియును నట్లన లిశయిఁ ల్లు
కృతివిశేషములచే ధీరాదికామినీమణులు జ్యేష్ఠామధ్యమాకనిష్ఠ
లగుమరు వరుసతో. నవని నాపరకీయ ద్విప్రకారంబుచేఁ దేఁరిల్లుఁ
గరపరిణీతయును గన్యకయును ననఁ, బరిణీత వర్ణింపఁబడదు కృతులఁ,
గన్యక పురుషాభికాంక్షిత గాన నంగరసంబులను బరికల్పిత యగు.
శృంగారరసనిధానాంగన లెనమండ్రు చర్చింప వాసకసజ్జికయును
నభిసారికయు ఖండితాఖ్యయు స్వాధీనపతికయుఁ బ్రోషితభర్తృకయును
విగ్రహాంతరితయు విరహోత్కలితయు విప్రలబ్ధయు నన. వీరలకును
దూతిక లాల్గురు ప్రాతివేశినియు శిల్పినియుఁ గారువును లింగినియు సఖియు
ధాత్రీలనుప్రబాలయు. వీరు లేకున్నతటి నేర్పుమైఁ బ్రియతంత్రములకుఁ
దమకుఁ దా మైనను దగ దూతిభావంబు గైకొని నడపుట కార్యసరణిఁ.
గామశాస్త్రమునందుఁ గామినీమణులకు వెలయుజాతులు నాల్గువిధము లగుచుఁ
జెలఁగింపఁ బద్మిని చిత్తిణి శంఖినీహస్తినులన, వీరి కందఱకును
నలువాండ్ర ముత్తెఱఁగుల నుపజాతులు హరిణియుఁ దురగియుఁ గరిణియు నన.

లలి భావరసనాయకులయందుఁ గలిగినభేదంబు లెల్లఁ దెల్పితి వరుసను
గ్రంథవిస్తారశంకను వానిలక్షణంబులు లక్ష్యములు నిందుఁ బలుకనైతి

తే. నట్లగుట భావరసనాయకాదిభేద, సంచయమున కలంకారశాస్త్రవితతి
వలన లక్షణలక్ష్యముల్ దెలిసి పిదప, రసను వర్ణింపఁ దగుఁ గవిరాజులకును.

## సుకవిమాహాత్మ్యము.

తే. మణివలనఁ గంకణమును గంకణమువలన
మణియును బ్రకాశ మగునట్లు మదిఁదలంప
సుకవివలన నాయకుఁడు నాయకునివలన
సుకవియుఁ బ్రసిద్ధిఁ గాంతురు సకలదిశల. ౧౪౪

తే. నాకుజాతునిచే రఘునాయకుండు, వ్యాసుచేఁ బాండవులు, కాళిదాసుచేత
భోజుఁడు, ప్రసిద్ధినొందిరి భువిని వసుధ, నడక లెల్లను గథలుగానుడువుకతన.

క. ఇమ్మహిని మునులచే వెల, సెమ్మును గావ్యములు ‹‹నాస్పృశిః కురుతేకా
వ్యం›› మ్మనువచనార్థంబున్, సమ్మతిఁ గలిపేళ సుకవిజనులే మాన్యుల్. ౧౪౬

## సత్కవిలక్షణము.

క. ధరణీసురుఁడు ప్రశాంతుఁడు, గురుభక్తుఁడు శుచియుఁ గల్పకుఁడు పూర్వకవీ
శ్వరవాక్ప్రతిబోధకుఁడు, గరుణామతి యొప్పుఁడతఁడు కవియనఁ బరఁగున్

క. శ్రుతిశాస్త్రాంగపురాణ, ప్రతతియు నితిహాస కావ్యభరతాగమముల్
స్మృతిసంగీతరతికళా, గతుల నలంకృతుల నెఱుఁగఁగా దగుఁ గవికిన్. ౧౪౮

## సప్తవిధకవులు.

ఆ. వినుతిఁ గాంతు రిల వివేకివాచకరాచి, కార్థశిల్పభూషణార్థు లనఁగ
మార్దవానుగతసమాహ్వయుఁడును నాఁగఁ, గవులు సప్తనామకములతోడ.

సీ. గణవర్ణశబ్దార్థగుణదోషనికరంబుఁ బరికించి కూర్పఁ గల్పము వివేకి,
బహుచిత్రానుప్రాసపదబంధనియమంబు వదలక కృతి సేయు వాచకుఁడు,
మృదుమధురోక్తులు వెడకి కావ్యం బెల్ల రచియించుఁ బదపడి రాచికుఁడు,
మితశబ్దములలోన నతివిపులార్థంబు నిమిడించు నర్థాఖ్య నెసఁగునతఁడు.

తే. సెప్ప యమకంబు లెప్పట్ల శిల్పకుండు,పొందుపఱుచు నలంకృతుల్ భూషణార్థి,
సరసపదవిరళార్థవిస్ఫురణముగను, జూపురస మొందు మార్దవస్ఫుటకరుండు.

## కుకవినిరాసము.

తే. జర్లిపదములు నాలుగు సంతరించి, గురువు లిడుచోటలఘువులు గొన్ని గూర్చి
విరతి గూడక పేఁటులు వెతకికొనుచు, నచ్చుపొల్లులపైనుంచునతఁడు కవియె.

తే. వ్రణము గని నిర్మలాంగంబు వదలునీఁగ,
యనఁ గుకవితప్పుఁ గని యొప్పు నరఁచిపుచ్చు
జల ముడిగి పాలు ద్రావుహంసంబుకరణిఁ,
దప్పువిడనాడి యొప్పుసత్కవి గ్రహించు.

తే. తనకుఁ దెలియని వన్నియుఁ దప్పు లనుచుఁ
గుకవి హాస్యంబు గావించు, సుకవివరుఁడు
దడవు చర్చించి తెలియు, నంతటను దెలియ
కున్నఁ దద్దయుఁ బెద్దల నొద్దఁ దెలియు. ౧౫౪

క. భరఁ దమరు సత్కవుల మది, పరులు కుకవు లనుచుఁ గృతులఁ బరిహాసమొన
ర్తురు గర్వమతు "లయోగ్యః, పురుషో నాస్తి", యనుమాటబుద్ధిఁ దెలిసియరుగా.

క. భ్రష్టులు తామే సత్కవు, లుత్కృష్టకవుల మనుచు సభఁ జరింతురు "వ్యాసో
చ్ఛిష్టం జగత్త్రయ" మ్మను, నష్టాక్షరమునను గాదె యడఁకువ మదికిన్. ౧౫౫

## కవితాప్రశంస.

తే. విబుధలోకంబు కవిత్వవిద్య యనుచుఁ, జదువువచనాగమునను సంశయము గలదె
విద్యలకు నెల్ల నుత్తమవిద్య కవిత, దానిఁ దెలియుట విశ్వమంతయును గనుట.

క. ధారుణినాకుజమూడుతి, పారాశర్యులు చరించుభావుకశిష్టా
చార మవశ్య మ్మని కవి, తారతమతు లైరి కాళిదాసప్రముఖుల్. ౧౫౬

మ. జననాథాగ్రణి యాత్మరాజ్యమున నిచ్చల్ పూజ్యుఁ డాసీమఁ బా
సినఁ దా గవ్వయుఁ జేయుఁ, డన్నికడలన్ శ్రేష్ఠుండగు విద్వాంసుఁ, డా
యనకన్నం గవి మేటియా "సుకవితా యద్యస్తి రాజ్యేన కిం"
మ్మనువాక్యంబు నిజంబు దీనిఁ గని కావ్యంబుల్ రచింపందగున్. ౧౫౭

క. వనితయుఁ గవితయుఁ దాన్తై, చనుదెంచుట గలుగు నేని సరసం బగు ధా
త్రినిబ ల్మికోలు గావిం, దినవిరసం బగునట్టుంచుఁ జెప్పిరి విబుధుల్. ౧౫౮

క. ఛందోలంకారాదుల యందలిపా టెల్లఁ దుదిని వ్యర్థము గాదే
సుందర మగువాక్యంబుల, పొందెఱిఁగి రచింపబుద్ధి పుట్టక యున్నన్. ౧౬౦

క. విరచించు శక్తి పుట్టని, పురుషునిచమువులు ప్రకాశములు గావు వసుం
ధరదీపరహితసదనాం, తరమున రేయిఁబడియున్న ద్రవ్యములక్రియన్. ౧౬౧

తే. ఆశుధారాకవిత్వంబులందు శయ్య, లుపమ లుత్ప్రేక్షలును లేక యుండుఁగాన
నెంత చర్చించినను బద్య మంతసార, వంతమగుఁగాననిలుకడ వలయుఁగృతికి.

## దేశభాషావిశేషంబులు.

మూ. సూ.—స్వస్థానవేషభాషాభిమతా స్సంతో రసప్రలుబ్ధధియః,
లోకేబహుమన్యంతే వైకృతకావ్యాని చాన్య దపహాయ. 5

మ. నిజదేశంబులవేషభాషలపయి న్నిత్యాభిమానస్థులై
ప్రజ మెచ్చ న్రసలుబ్ధబుద్ధు లగుచుం బ్రాజ్ఞుల్ స్వదేశ్యంబులే
నిజ మంచుం గొని యన్యదేశములవాని న్మెచ్చ రేపట్టునన్
గజరాజావన ప్రస్ఫుటార్థరసముల్ గావించు నెల్లప్పుడున్. ౧౬౩

క. తమతమభాసలకవితలు, దమతమదేశముల కొప్పిదము లగుఁ బరదే
శములకుఁ గూడ నొకింతయు, నమరోక్తులు సకలభూములందును వెలయున్.

క. తలఁపఁగ సంస్కృతకావ్యం, బులు దమయర్థములు సకలభూజనములకున్
దెలిసినను దెలియకున్నను, బొలు పొందఁగ నిచ్చు నాల్గుపురుషార్థములన్.

క. హరికథ లైనను దమక, ర్థరసానుభవంబు లేనిరసవద్దేశాం
తరభాషాకావ్యంబులు, దొరకొని పఠియింప ఫలము దొరకునె దానన్. ౧౬౬

క. ఆయాదేశమువారికి, నాయాదేశంబుభాష నమరినకావ్యం
బాయతపురుషార్థంబులఁ, బాయక సమకూల్చు దేవభాషయ పోలెన్. ౧౬౮

క. సురభాషార్థము దెలియని, తరుణులకును శూద్రులకును దమతమసీమం
బరఁగినమాటలఁ జెప్పిన, వరకావ్యము పఠనమున కవశ్యం బయ్యెన్.

క. క్షితి మ్లేచ్ఛభాష శ్రుతిగ, ర్హిత మగు నట్లైన నాధరిత్రిని దానిన్
మతి రోసి విడువఁ గూడదు, సతతము వ్యవహారహాని సంధిలు కతనన్. ౧౬౯

క. నీతం బని దేశీయము, జాతీయంబును వచించుసమయమున నిజ
జ్ఞాతలభాషాకృతులను, ఖ్యాతిగ మ్లేచ్ఛోక్తు లాదిగాఁ గూర్తు రజా. ౧౭౦

ఆంధ్రకవితాపితామహునిచాటుధార:—

మ. సమరక్షోణిని గృష్ణరాయలభుజాశాతాసిచేఁ బడ్డమ
ర్దమదోర్దండపుళింకకోటి యవనవ్రాతంబు సప్తాశ్వమా

ర్గమునం గాంచి శబా సహెబా హరిహరంగా ఖూబు ఖోడాకి తే
తుమకీ బాయిలబాయి దేవలికి యంచు ర్మింటికిం బోవుచున్. ౧౪౧

నందితిమ్మనచాటుధార:—

శా. రాయగ్రామణి కృష్ణరాయ భవదుగ్రక్రూరఖడ్గాహిచేఁ
గాయంబూడ్చి కళింగదేశనృపతుల్ కాసిర్ఝురీఘామణీ
మాయాకీకుమటూకులోటుకుహుటూమాయూసటాబాహాకే
మాయాగ్గేయమడే యటంచ్రుదు దివి రంభాజారునిన్ యక్షునిన్. ౧౪౨

శాళహస్తిమహత్త్వమునందు:—

సీ. చిజ మాడుదేవర నిజకృపామహిమఁ జె న్నారునాయిల్లు బిహారు నీకు
నాకు నీపాదార్చనము సేయ నశలింగమూర్తి సేకుతె వచ్చి మూర్త మాడి
యొడయచిత్రేశ నాయునికి నీపజ్జన మాడుశివార్చన మాడుబేకు
విచ్చేయ డివిబూది వీడియం బందుకో జంగమస్వామి నాసదనమునకు.
తే. నోగిరంబులు మంచి మే లోగిరమున, నావటించెదఁ బసఁడు మీరారగింపఁ
బ్రతిదినంబును జంగమార్చనము లేక, తనువువడ నొల్ల రూపకందర్ప యనఁగ.

## భాషాష్టకోత్పత్తివివరణము.

తే. భాష రెండు దెఱంగులఁ బరఁగుచుండు
సంస్కృతము ప్రాకృతము నన, సంస్కృతంబు
ప్రకృతి యన నొప్పు, దానికిఁ బ్రాకృతంబు
వికృతి యగుఁ దంగెడాహ్వాయవిషయవాస. ౧౪౩
తే. భారతీదేవి శైశవభాషితంబు, ప్రాకృతము పంచవిధ మయ్యెఁ బ్రాకృతంబు
శౌరసేనియు మాగధీసంజ్ఞికయును, గ్రమతఁ బైశాచికయు నపభ్రంశ మనఁగ.
క. నామ మపభ్రంశం బని, సామాన్యముగాఁ దలఁపఁ జన దది భాషా
భామాశిశుత్వభాషిత, మై మెఱఁగుటచే సుశబ్ద మగు నెల్లెడలన్. ౧౪౪
ఆ. పద్మపత్రనేత్ర పైశాచికీభాష, యందు భేద మించుకంత గలిగి
సొంపు మీఱుచుండు చూళిక పైశాచి, లెక్కలోనఁ దానునొక్కటగుచు.
తే. ప్రాకృతాదులు చెళితజ్జపదములగుచుఁ, బలు తెఱంగులఁ దనలోనఁ గలసియుండు
కతన నీయాంధ్రభాషయుఁ గవిమతంబు, నందుఁ బ్రాకృతభేదంబె యనఁగ నొప్పు.
క. ఈరీతి భాష సంస్కృతప్రా, కృతసంజ్ఞల ద్వివిధ మయ్యెఁ గొంచఁగఁ దత్ప్రా
కృతము పెస నేడుతెఱఁగులు, వితతమగుట నెల్ల సప్తవిధభాష లగున్. ౧౪౫

తే. సంస్కృతము ప్రాకృతంబును శౌరసేని, జగతిపై మాగధియును పైశాచికయును
చూళికయు నపభ్రంశంబు సారిది నాంధ్ర, భాషయును నివి చను నష్టభాషలనఁగ.

ఆ. వరరుచి ప్రణీత వాక్యంబులను బతం, జలికృతోరుభాష్యములను వెలయు
పాణినీయ సూత్రపంక్తిని బఠియించు, శబ్దజాలమెల్ల సంస్కృతంబు. ౧౮౧

తే. ఇలఁ ద్రివిక్రమరచిత వృత్తులను సోమ, చంద్రసూరి ప్రణీత భాష్యంబుచేతఁ
దనరు వాల్మీకి మూలసూత్రములవలనఁ, బ్రాకృతాదిషడ్భాషలు ప్రథమఁ జెందె.

క. తెలుఁగునకుఁ బోడను లక్షణ, ములు బాలసరస్వతి ప్రముఖబుధకృతటీ
కలవలనను దెల్లం బై, చెలువగు నీయాంధ్రశబ్దచింతామణిచేఁ. ౧౮౩

సీ. స్వర్గలోక ప్రశస్తము సంస్కృతము మహారాష్ట్రదేశీయంబు ప్రాకృతంబు
శూరసేనాఖ్యఁ బ్రస్తుతికెక్కు నాటను జను లాడునది యౌ శౌరసేని
మగధదేశోక్తులు మాగధీభాష పిశాచసంజ్ఞికములై జగతిఁ బొదలుఁ
బాండ్య కేకయ సాల్వ బాహ్లీక సూప గాంధార నేపాళ కుంతలసు దేష్ణ

తే. భోజకన్నౌజకంబులఁ బొసఁగు మాట, లరయఁ బైశాచికా చూళికాహ్వయములు
వెస నపభ్రంశ మాభీరవిషయజాత, మాంధ్రభూమిభవం బాంధ్రమయ్యె శౌరి.

తే. దేవభూసురమునిధరిత్రీతలేంద్ర, సచివకంచుకి విటవిదూషకవిరక్త
వారయోషిన్నృపామాత్యవనితలకును, జెప్పఁదగు సంస్కృతము సుధాసింధుశయన.

సీ. క్షపణజైనాదికకర్మహీనులకును భామాజనులకును బ్రాకృతంబు
క్షితి వైశ్యశూద్రప్రభృతిమధ్యమాధమజాతుల కెల్లను శౌరసేని
ధీవరలుబ్ధకాదివినీచజాతులమానవులకు నెల్ల మగధభాష
మొగిఁ బిశాచాసురముఖ్యుల కెల్లఁ బైశాచికానామభాషాద్వయంబు

తే. పతితచండాలయవనాదిపరమునీచ, జాతినరుల కపభ్రంశ మీతెలుఁగు
నీచువారికి నాంధ్రంబుఁ జెప్పవలయుఁ, గావ్యనాటకముల గోపికాభుజంగ.

ప్రకృతివికృతిభేదంబులు.

మూ. సూ:—ఆద్యప్రకృతిః ప్రకృతిశ్చాద్యే ఏషా తయోర్వికృతిః. 6

తే. క్రమమునను సంస్కృతప్రాకృతములు రెండుఁ
బరఁగు నాద్యప్రకృతియును బ్రకృతి యనఁగ
వెలయు నీరెంటికిని దెల్గు వికృతి యనఁగ
నందగోపాంగనాపుత్ర నలిననేత్ర. ౧౯౯

## తద్భవస్వరూపము.

మూ. సూ:— కేవలతయానుసర్వత్యు భేచయేయంయథాతథాభాషా.

తే. ప్రకృతులను రెంట రెండురూపముల నమరు
తద్భవములు ప్రత్యేక మాంధ్రంబు లగుచుఁ
జంద్రునకుఁ జందురుం డని సంస్కృతమునఁ
జందుఁ డని ప్రాకృతమున నీచందమునను.

దీనికిశబ్దసూత్రము.

ప్రయోగమూలం వ్యాకరణమ్.

వృత్తి. వ్యాకరణము లోకవ్యవహారమూలకము. అది యెట్లు లనినఁ దెలుఁగు నకుం బ్రాకృతభాష ప్రకృతి యనిపించుకొనును. ఆప్రాకృతమునకు సంస్కృత భాష ప్రకృతి యనిపించుకొనును. అదిగానఁ బ్రకృతు లనఁగా సంస్కృతప్రాకృతములు. ఆరెంటియందుఁ గొన్ని తద్భవములు, ప్రత్యేకముగా నొక్కొక్కదాన నొక్కొక్కవిధమునఁ బుట్టి రెండురూపములఁ దెలుఁగులలోను గలసి యున్నవి. కనుక వానికన్నిటికిఁ దెలియునట్లుగా సందులోపల నొకచంద్రశబ్దమునకుఁ జెప్పుచున్నాము. సంస్కృతమునందుఁ గలద్విత్వాక్షరమునందుఁ గ్రిందను జడ్డ యై యుండెడు రేఫము ప్రాకృతభాషగాఁ బలుకునప్పుడు లోపించును గాన నా రేఫము లోపము గాక ప్రత్యేకముగా నుండొకయక్షరమై నిలుచుట చేత దకారమునకుఁ బ్రాకృతమునకు రానికొమ్ము వచ్చుటచేతను జందురుశబ్దము శుద్ధసంస్కృతశబ్దమున నే యయిన తద్భవము గాని సంస్కృతము చెడి యయిన ప్రాకృతమువలన నయినది గాదు.

చజౌ తజ్జే ప్రాకృతే చ దంత్యా వేవ న సంశయః.

టీ. తజ్జే=తద్భవమునందును, ప్రాకృతే చ=ప్రాకృతము నందును, చజౌ=చకారజకారములు, దంత్యావేవ=దంత్యవర్ణములే యగును తాలవ్యములు గావనుట. సంశయః=సందేహము, న=లేదు. అనునధోక్షజ ఫక్కికావచనముచేత సంస్కృతజాత మైనతద్భవము గనుక మొదల నున్నచకారము దంత్యమయి తెలుఁగు వర్ణకము చేరఁగా చఁదురుండు అని యాయినది ప్రాకృతమున నయ్యోనేని నాదకారము క్రింది రేఫము లోప మౌనుగాని, ప్రత్యేకాక్షర మై యుండదు దకారమునకుఁ బొల్లును రాదు. అది యెట్లంటేని.

ప్రాకృతవ్యాకరణసూత్రంబులు.

కగచజటడతదపబమక్ష్గకగ్లపశో రుపర్యద్రే.

వృ. ఉపరి స్థితానాం స్పర్శవర్గాద్యతృతీయానాం మవర్ణజిహ్వామూలీయోప
ధ్మానీయానాం శషసానాంచ లోపః స్యాత్ నతు ద్రశబ్దే.

టీ. ఉపరిస్థితానాం=మీఁదనున్న, స్పర్శవర్గాద్యతృతీయానాం=కచటతపగజ
డదబలకు, మవర్ణజిహ్వామూలీయోపధ్మానీయానాం=ఁకగ్గ-ఁప-అని-కపలకు ముందర్ధ
విసర్గసదృశము లయినవర్ణములు జిహ్వామూలీయోపధ్మానీయంబు లనంబడు. మకా
రగ్గకగ్గపవర్ణములకు, శషసానాంచ=శషసలకును, లోపః=అదర్శనము, స్యాత్=అగు
ను. ఇందుచేతఁ జంద్రశబ్దమునందు రేఫమునకుమీఁద నుండెడినవర్ణమునకు లోపము
రాఁగా నతు ద్రశబ్దే ద్రకారము గలశబ్దమునందు లోపము లేదు గావున దవర్ణలో
పము లేదయ్యెను.

సూ:—రవలా మధశ్చ.

వృ. అధస్థితానాం రవలానాం లోప స్స్యాత్.

టీ. అధస్థితానాం=జడ్డలు గలయక్షరములయందుఁ గ్రింద నున్న, రవలానాం=
రేఫవకారలకారములకు, లోపః స్యాత్=లోప మౌను, ఈసూత్రముచేతను దకా
రము క్రిందనున్న రేఫము లోపింపఁ జంద అనియుండెను.

సూ. శేషాదేశస్యాహ్రోచోఖోః.

వృ. హకారరేఫవర్జితస్యానాదేః శేషస్యాదేశస్యచాచః పరస్యద్విత్వంస్యాత్.

టీ. హకారరేఫవర్జితస్య=హకారమును రేఫమును దక్కఁ దక్కిన, అనాదేః=
మొదటిది గానట్టి. శేషస్య=లోపింపఁగాఁ జిక్కినదానికిని, ఆదేశస్య=ఆదేశ మైన
దానికిని, అచః పరస్య=అచ్చునకంటెఁ బర మైనదానికిని, ద్విత్వం=జడ్డ, స్యాత్=
అవును. ఇందువలన హవర్ణము రవర్ణముగాదు. కావునను దకారమును రేఫమును
సంయుక్త మైనద్రవర్ణమునం దధస్థిత మైన రేఫము లోపింపఁగాఁ జిక్కినది గాఁగా
ను జకారముమీఁద నున్నయకార మచ్చుగనుక దానిమీఁద నున్నఁదున దకారము
నకు జడ్డ వచ్చుటం జేసి చందఅయెను. ఇట్లుప్రాకృతభాష గనుక మును చెప్పిన
యక్షోత్తుజవచనమువలన నాది నున్నచకారము దంత్యమాయెను. అది తత్సమము చే
యఁగాఁ జందుఁడని నిలిచెను. కాఁబట్టి యీమాట సంస్కృతమునఁ బుట్టినప్రా
కృతమున నే ఆయినతద్భవముగాని శుద్ధసంస్కృతమున నైనది గాదు. ఈ రెండుశ
బ్దములకు నాదిమకవి ప్రయోగ ప్రసిద్ధి గలదు గావున నిట్టివన్నియుఁ బ్రకృతులు
రెంటను రెండువిధములఁ బుట్టినవని తెలిసికొనునది. ఇందుకుఁ బ్రయోగము.

నృసింహపురాణమునందు:—

చ. సురుచిరపానపాత్రమున సుందరి యొక్కతె కేల నిండుచం
దురుఁడు ప్రకంపితాంగములతోఁ దిలకించెఁ దదాననాంబుజ
స్ఫురితవికాసవైభవము సొంపు లడంకువ ద్రుచ్చలింపఁ జె
చ్చెరఁ జనుదెంచి కట్టువడి చేష్టడి భీతి వడంకుచాడ్పునన్. ౧౭౮

నైషధమునందు:—

చ. కెరలి మహాసివేమసహకృత్స్వరి తద్భటకోటిచాతురీ
పురి సపరాంగణంబులఁ జతుస్సరిదావరణంబులన్ యశో
భరనుల సేతుచందు బహుభంగులఁ బన్నమనాటినిండుచం
దురునునుసోగవెన్నెలలతోఁ దుఁ జూగడుతద్గుణంబులన్. ౧౮౦

ఆ. తెలుఁగు లొక్కకొన్ని దేవతాభాషనె, తద్భవాబు లగుచుఁ దనరుచుండు
ధరణిఁ గొన్ని ప్రాకృతమునఁ దగుచునుండు, దెలియవలయు వానితెలుఁగు లెల్ల.

తే. ప్రాకృతమునంటకళింపభాషయయ్యెఁ, దజ్జముసముద్రమునకు సంద్రంబటంచు
నాకసవ్యాప నంటక ప్రాకృతమున, నైనచో దానిని సముద్ద మనఁగ వలదె.

వ. ఇలమలకుఁ బాల్కాణముగాఁ గొన్ని తద్భవములు లోకమునం దాద్యప్రకృతివ లననే యయినవి గాని ద్వితీయప్రకృతి నయినవిగా వంటలోప. సముద్రశబ్దము నకొక్కటికిఁ జెప్పుచున్నాము. మొదటిప్రకృతియందులోప మయ్యెడుదకారము క్రిందటిరేఫము లోపను గాక నిలిచినందుచేతను సంద్రశబ్దము ప్రథమప్రకృతి నైనతద్భవముగాని ద్వితీయప్రకృతి నైనదిగాదు. అది తత్సమము చేయ సంద్రమ యినది. రెండవప్రకృతినైన, కగచజటడతదపబవుల్గకల్గపసోరుపర్యద్రే, అన్నం దునఁ జంద్రశబ్దమునకు వలెనే సముద్రశబ్దమునందలి దకారమునకు లోపము రాఁగా, నతు ద్రశబ్దే, అనుటవలన లోపమురా దాయెను. రవలామథశ్చ, అని మునుపు చెప్పినసూత్రముచేత దకారముక్రిందిరేఫము లోపింప సముద్దమని నిలువ, శేషాదేశస్యాప్రోహచోక్తోః, అనువానివలనను మునుపటివలెనే దకారమునకు ద్విత్వ వచ్చెఁగనుక సముద్దయాయెను. ఆదితత్సమము చేసినసముద్దము అని యుండవలెను. ఈమాట నాదిమకవులు ప్రబంధముల వ్రాసినవారును గారు సంద్రమనియే చెప్పిరి. అటుగాన నిట్టివెల్లను శుద్ధసంస్కృతమున నైన తద్భవము లని తెలిసికొనునది.

లక్ష్మీశబ్దమునకు.

క. నాకులభాషను ముట్టక, ప్రాకృతమున లచ్చి దాఁ బరఁగు లచ్చియనన్
నాకోక్తి నైన లక్ష్మికిఁ, బ్రాకటముగ లక్కుమి యని పలుకఁగ వలదే. ౧౮౩

దీనికిం జెలిపిడి లోకమునందుఁదద్భవములు కొన్ని ప్రాకృతభాషవలన నైనవి కాని దేవతాభాష నైనవి గావు. అది యెట్లన, లక్ష్మీశబ్దమునకుం జెప్పుచున్నాము.

సూ. మనయానాం.

వృ. అధస్థితానాం మనయానాం లోపస్స్యాత్.

టీ. అధస్థితానాం=ద్విత్వాక్షరములయందుఁ గ్రిందనున్న, మనయానాం=మకార నకారయకారములకు, లోపః=లోపము, స్యాత్=అగును. ఇందువలన క్షకారము క్రింద నున్న మకారమునకు లోపము రాఁగా లక్షియని యయ్యెను.

సూ. క్షః.

వృ. క్షస్య ఖస్స్యాత్.

టీ. క్షస్య=క్షకారమునకు, ఖః=ఖకారము, స్యాత్=అగును. దీనిచేత క్షకారమునకు ఖకారము వచ్చెను. రాఁగా లఖి యనురూపము సిద్ధించెను. తెలుఁగున స్పర్శవర్గద్వితీయవర్ణములు లేవుగాన లచ్చియని నిలిచెనది ప్రాకృతంబున నైనతద్భవము గాని, దేవభాష నైనతద్భవము గాదు. సంస్కృతమునను నెన్యేనేని క్రింద నున్న మకారము ప్రత్యేకము స్పర్శవర్గద్వితీయము. ముంగల నాకయక్షరమై నిలిచెనేని లక్షిమియగును. ఆంధ్రమునందు షకారము లేదుగాన, అది లోపమై కకారమునకు ద్విత్వము రాఁగా లక్కిమి, వికల్పమున ద్విత్వ లోపమైన లకిమి యయ్యెను. ఈ రెండువిధములతద్భవములలోను బూర్వకవులు ప్రబంధములయందు లచ్చి యని ప్రయోగించిరి గాని లకిమి యని ప్రయోగింపలేదు గావున నిట్టిశబ్దము లెల్లను ద్వితీయప్రకృతి నైనవని యెఱుంగునది, దీనికిఁ బ్రయోగము.—

విరాటపర్వమునందు:—

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగ రాదు రా
లచ్చికినైన మెనంగినబలంబులు రెండును గెల్వ నేర్చునే
హెచ్చుగుఁ గుందగుఁ బోడరు లెల్లవిధంబుల కోర్చునట్లు గా
కెచ్చఁ దలంచి యొక్కమెయి నిశ్చితి బొందగు నింతయుం దగున్. ౧౫౮

రామాభ్యుదయమునందు:—

తే. రాచపాలు నిజన్నంబు గాచినాఁడు, లచ్చిపుట్టిల్లు కోలకుఁ దెచ్చినాఁడు
చాలుచేరింటితో య్యాలి నేలినాఁడు, ప్రశమినున మించు ప్రోద్దవంశమునందు.

తే. శౌరసేన్యాదిపంచభాషలును బ్రాకృతంబులోభేదములు గానఁ దద్భవములు
వానియందును బుట్టును వర్ణభేదములును బంచవిధంబులై తెలుఁగునందు. ౧౫౯.

తే. శౌరసేని జాదంబు పైశాచియందు, సాన చూళిక యనియెడుదాన రావ
కొల మపభ్రంశభాషోక్తివలన మూఁగ, దనరు మాగధ జక్కులు తద్భవములు.

ఇందునకుం దెలివిడి. ద్యూతశబ్దమునకు.—

సూ. ద్యర్య యోర్జః.—

వృ. ద్యకారస్య, ర్యకారస్య, చానయోః, ర్జకారాదేశ స్స్యాత్.

టీ. ద్యకారస్య=ద్యయనునక్షరమునకు, ర్యకారస్యచ=ర్యయనునక్షరమునకును, అనయోః=యీరెంటికిని జకారాదేశ స్స్యాత్=జవర్ణ మాదేశమవును. ఇందు నద్యకారమునకు జకారము రాఁగా జూతమని యుండెను.

సూ. ద స్తస్య శౌరసేన్యా మఖావచోస్తోః.

వృ. అనాదేరచః పర స్యాసంయుక్తతకారస్యదః స్యాచ్ఛౌరసేన్యాం.

టీ. అనాదేః=మొదటియక్షరముగాకయున్న, అచఃపరస్య=అచ్చుకంటెం బరమైయున్న, అసంయుక్తస్య=సంయుక్తముగాని, తకారస్య= తవర్ణమునకు. దస్స్యాత్=దవర్ణమౌను, శౌరసేన్యాం=శౌరసేనియందు, దీనిచేత తకారమునకుఁ దవర్ణము రాఁగాజాద మాయెను ఇది శౌరసేనిభాష నైనతద్భవము.

ఇందుకుం బ్రయోగము సభాపర్వమునందు:—

క. జాదమిదియేల యడుగుము, భేదము దమలోనఁ బుట్టుఁ జెలుచన యప్ప
ద్భేదమునఁ జేసి యెగ్గు, ల్పాదిల్లు ధరిత్రిఁ బ్రజకు భయజననంబై. ౧౪౮

నైషధమునందు:—

క. కాదంబరి ద్రావింతును, జాదం బాడింతుఁ గతల జొక్కులఁ బెట్టక
పైదలుల నియోగింతును, వైదర్భిసనూజమీఁది వల పుడిగింతున్. ౧౪౪

శాణశబ్దమునకు

సూ. శషసాః షః.

వృ. శషసాః షసంజ్ఞా స్యుః.

టీ. శషసాః=శకారషకారసకారములు, షసంజ్ఞాః=షఅనుసంజ్ఞ గలవి, స్యుః= అగును.

సూ. శో స్సత్.

వృ. శషసానాం సకార స్స్యాన్నిత్యమ్.

టీ. శషసానాం=శకారషకారసకారములకు, సకార స్స్యాత్ =సవర్ణమవును, నిత్యం = నిత్యముగా, ఈసూత్రమున, శకారమునకు సకారము రాఁగా సాణ యనియుండెను.

సూ. నో ణనోః పైశాచ్యామ్.

వృ. ణకారనకారయోః నకారస్స్యాత్ పైశాచ్యామ్.

టీ. ణకారనకారయోః=ణవర్ణ నవర్ణములకు, నకారః స్యాత్=నవర్ణమవును, పైశాచ్యామ్=పైశాచియందు. ఇప్పుడు చెప్పినదానను ణకారమునకు నవర్ణము రాఁగా సానఅయెను. ఇది పైశాచికభాష నైనతద్భవము.

రాజకులశబ్దమునకు

సూ. గజడదబఘఝఢధభాం కచటతపాః ఖఛఠథఫాః.

వృ. స్పర్శవర్గతృతీయచతుర్థానాం తత్తత్ప్రథమద్వితీయాః క్రమేణ స్యుః.

టీ. స్పర్శవర్గతృతీయచతుర్థానామ్=స్పర్శవర్గములయందు మూఁడవ యక్షరములకును, నాలవవానికిని, తత్తత్ప్రథమద్వితీయాః క్రమేణస్యుః= ఆయావర్గముల యొక్క మొదలివర్ణములును, రెండవయక్షరములును, క్రమేణ=వరుసగా, స్యుః= అవును.-ఈసూత్రమున జకారమునకుఁ చకారము రాఁగారాచయాయెను. కులమున కుఁగొలము ఆయెను అది సమముచేసిన రాచకొలము. ఇది-చూళికాపైశాచికాభాషనైనతద్భవము.

మూళశబ్దమునకు.

సూ. అచోస్త్వోభోః,

వృ. కఖతథపఫాం-గఘదధబభాః-అచః పరేషా మసంయుక్తానా మనాదీనాం- కతపవర్గప్రథమద్వితీయానాం తృతీయచతుర్థాః క్రమేణ స్యుః.

టీ. అచః పరేషాం=అచ్చుకంటెఁ బరములైన, అసంయుక్తానాం= సంయుక్తాక్షరములుగాని, అనాదీనాం=మొదలివిగాని, కతపవర్గ ప్రథమద్వితీయానాం=కతప వర్గములయొక్క మొదలియక్షరములకును, రెండవ వానికిని, తృతీయచతుర్థాః=తమ వర్గములయందలి మూఁడవనాలవయవి, క్రమేణ=వరుసగా, స్యుః=అవును, ఇది అపభ్రంశభాష నైనతద్భవము.

ఇందుకుఁ బ్రయోగము.

సారంగధరచరిత్రమునందు:—

చ. తలవరు లేగ వేగఁ బులితండను నెత్తుటిజొత్తుకై హలా
హలిమెయి రాఁగ రాఁగలయనంటి వృకంబులు క్రొంబొదల్ రొదల్
చిలుకుచు సేఁగ సేఁగలును జీవలు దొంతరలై పయిం బయిం
విలవిల మూఁగ మూఁగనలె శొగ్గిలి పల్కఁగ లేక వేదనన్. ౨౮౦

యక్షశబ్దమునకు.

సూ. ఆదే ర్యో జః.

వృ. ఆదే ర్యస్య జ స్స్యాత్.

టీ. ఆదేః=శబ్దాది నుండెడు, యః=యకారమునకు, జః=జకారము, స్యాత్=అవును. దీనను మొదలియకారమునకుజకారమురాఁగా. జక్షః అనియుండెను.

సూ. క్షః.

వృ. క్ష ఇత్యస్య జిహ్వామూలీయః స్యాత్.

టీ. క్ష ఇత్యస్య= క్ష యనునక్షరమునకు, జిహ్వామూలీయః= జిహ్వామూలీయము,స్యాత్=అగును, పాణినీయవ్యాకరణమునందు,ఁ్కక ఇతి జిహ్వామూలీయః,అన్నందుచేతజిహ్వామూలీయ మనఁగా దాపలివిసర్గముగలకకారమునకుఁ బేరుగాన,ఁ్కక అనునదిరాఁగా జఃక యని నిలిచెను, మునుపు చెప్పిన అఘోఘ్షఃఘక్కౢకా వచనమువలన జాక్షరముదంత్యమాయెను ఆంధ్రమునందు విసర్జనీయము లేదు గాన నది లోపింపఁగా జక్క అనియుండె నది తత్సమము చేయఁగా జక్కులు ఆయెను ఇది మాగధీభాష నైనతద్భవము.

సీ. కుక్క గోలెము బవి కూళ గుండము కంతి గుజ్జు కరాటంబు గజ్జి కట్టె
సిక చేత చిక్కంబు చిన్నె సింగము సెజ్జ లక్క లచన సుద్ది లయ్య లాగు
ప్రోడ పొత్తము పోఁక పుడమి బన్నము బూది బీరంబు బికిరము పిట్టుపుటము
పదినె వెన్నఁడు వంక పడుగు వీడెము వన్నె రక్కసి రవణంబు రిక్క పగ్గ.

తే. పీఁట దయ్యము తోరంబు పెట్టెచుట్టి, బత్తి జతనము జాతర ముత్తియంబు
దాది కుప్పసమిటికెనిద్దంబు పెరిమె,యివమువెసడిగ్గి యయనఁదళ్ళవములయ్యె.

దీనికివివరము.

కుక్కురశబ్దమునకుకుక్క గోళశబ్దమునకుగోలెము ఆవిశబ్దమునకుబవి క్రూరశబ్దమునకుకూళ కుండశబ్దమునకుగుండము గ్రంథిశబ్దమునకుకంతి కుబ్జశబ్దమునకుగుజ్జు కరండశబ్దమునకుకరాటము ఖర్జూశబ్దమునకుగజ్జి కాష్ఠశబ్దమునకుకట్టె శిఖాశబ్దమునకుసిక చేష్టా శబ్దమునకుచేఁత చిక్యశబ్దమునకుచిక్కము చిహ్నశబ్దమునకుచిన్నె సింహశబ్దమునకుసింగము శయ్యకుసెజ్జ లాక్షకులక్క లాంఛనకులచన సూక్తికిసుద్ది అంబకులయ్య లంఘుకులాగు ప్రౌఢకు ప్రోడ పుస్తకమునకు పొత్తము పూగకుపోఁక పృథివికిపుడమి భగ్నమునకుబన్నము భూతికిబూది వీరశబ్దమునకుబీరము భిక్షకుబికిరము పిష్టమునకుపిట్టు స్ఫుటకు పుటము పథూనికిపదినె విష్ణు.

నకువెన్నఁను వక్రమునకువంక వటునకువడుగు వీటికివీడెము వర్ణమునకువన్నె రక్షశ్శ్మబ్రమునకు రక్కసిరచ్యకు రవణము ఋక్షమునకురిక్క ప్రజ్ఞకు పగ్గె విస్తరము నకుపీట దైవమునకుదయ్యము స్థూలమునకు తోరము పేటికకుపెట్టె మృత్తికకుమట్టి భక్తికిబత్తి యత్నశబ్దమునకుజతనము యాత్రకుజాతర మౌక్తికమునకు ముత్తియము ధాత్రికిదాది కూర్పాసమునకుకుప్పసము ఇష్టికకుఇటిక స్నిగ్ధకు నిద్దము ప్రేమకు పేరిమ హిమమునకు ఇగము.

సూ. వాస్యాత్క్వచి ద్వకారో నాదిగత స్యాద్యవర్గసరళస్య.

అనియెడు నీయాంధ్రశబ్దచింతామణిసూత్రమువలనఁ గకారమునకు వకారమురాఁగా ఇవుని యనవచ్చు. దిశకుదెస దీర్ఘికకు దిగ్గియ. ఇట్టివిలోకంబుననేకములు గలిగియుండు నవియెల్లం బ్రాకృతవ్యాకరణమువలనను సంస్కృతాదిభాషాసప్తకంబున నుద్భవించి తద్భవముల వలయు తెలుఁగుపలుకు లని తెలియ వలయు.

త్రిలింగదేశతద్భవము.

క. శ్రీక్షితిధరకాళేశ, ద్రాక్షారామంబు లనఁగఁ దనరారెడునీ
త్రిక్షేత్రంబుల లింగము, లీక్షితిని త్రిలింగసంజ్ఞ నెన్నిక కెక్కెన్. ౨౦౩

తే. తత్త్రిలింగనివాస మై తనరుకతన
నాంధ్రదేశంబు దాఁ ద్రిలింగాఖ్య నొప్పెఁ
దెలుఁగగుమఁ దద్భవము దానివలనఁ బొడమె
ననుకఁ గొందఱు దానినే తెనుఁగు నండ్రు.

ఆంధ్రభాషాభేదచతుష్టయము.

మూ. సూ. తజ్జా సమాచ దేశ్యా గ్రామ్యాచేయం చతుర్విధా భవతి.

తే. దైత్యదమన తత్సమ మనఁ దద్భవ మన,
దేశ్య మన గ్రామ్యభాష నాఁ దెనుఁగు నాల్గు
విధము లగు నందుఁ దత్సమ విడిచి మూఁడు
నాంధ్రములె యెందు నందు గ్రామ్యంబు దిరుగు. ౨౦౪

తజ్జలక్షణము.

—మూ. సూ.—ప్రకృతిద్వయజా తజ్జా. 9.—

తే. వఱలుసిద్ధాక్షరములలో వర్ణసమితి, దూలఁబోఁ బల్కనర్థంబుదొడరు కొనుచు
సంస్కృతప్రాకృతాఖ్యభాషాద్వయమున, నుద్భవించిన తెలుఁగులుతద్భవములు

## దేశ్యలక్షణములు.

— మూ. సూ.— ప్రవాహినీ దేశ్యా. 10. —

క. ఏదేశమున మానవులకు, నా దేశము భాష దేశ్య మయ్యె గరుత్మ
ల్లాది జనవ్యవహారము, చే దాని నెఱింగి కృతులఁ జెప్పఁగ నొప్పున్. ౧౦౭

## ఆంధ్రదేశ్యభేదంబులు.

క. జలశయన యాంధ్రదేశ్యం, బులు రెండు దెఱంగు లయ్యె భువి శుద్ధాంధ్రం
బులు నన్యదేశజాంధ్రం, బులు నాఁ గా మెఱలి నామపురనరధామా. ౧౦౮

తే. ఆంధ్రదేశపురస్థాయు లైనసకల, జనములకును మఱుంగు దేశంబు లేక
తేటతెల్లమి గాఁ బల్కు మాట లెల్ల, నవని శుద్ధాంధ్రదేశ్యంబు లనఁగ బడును.

క. పాలును జెరుగును జేయని, వాలాయం బుట్టఁ బట్టి వంచుక త్రాగెన్
తో లెక్కక నీబిడ్డఁడు, జోఁలెతి చేమున్న యనఁగ శుద్ధాంధ్రంబుల్. ౧౦౯

క. కేళన యాంధ్రులు నానా, దేశంబులయందు నిలిచి తెలుఁగులె తత్త
ద్దేశోక్తు లంటఁ బలికిన, నాశబ్దము లన్యదేశజాంధ్రము లయ్యెన్. ౧౧౦

సీ. ఆలంబు చివ్వ కయ్యము పోరు బవరంబు దుర మని యోటరి బొమ్మి కలను
వెలఁది యింతిపడంతి యొలనాగ చెలిబోటి పొలఁతితొయ్యలి నాతి మెఱఁత నెలఁత
మేను వేసని మోవి గౌను డెందం బల్కు వీను ఉల్లను కేలు వెన్ను నొసలు
వావిరి యేడ్తెఱ వఱలుట కొఱలుట నలి నొగి మొగిఁ బన్వె నలువు పొలుపు

తే. నెలతునుకవాఁకవలవంతనెమ్మినెఱకు, [illegible]రజము సోయగనుగొనయంబుచిలువ
పొల్లచెచ్చెర మక్కువ తెల్లమియనఁ, దనర నిటు లన్యదేశజాంధ్రములు పెక్కు.

క. నెలకొను సంస్కృతతత్సను, వులు దొరలక తద్భవదేశ్యముల మాఁటను సం
ధిలి కేవలాంధ్రములు నా, నలరుఁ గృతుల నచ్చ తెనుఁగు లంద్రు తెలుఁగున్.

క. తెలుఁగు మఱుంగులు ప్రాఁదెనుఁ, గులు తద్భవదేశ్యములను గూర్చి వృషపదం
బులు గాఁగ నచ్చ తెనుఁగులు, మెలఁకువతోఁ జెప్పఁ దగు శమీప్రాంతగృహా.

తే. ఇట్టిమేఖల కదయించినట్టి సీతఁ,
జేకొనియె రాఘవుం డని చెప్పుచోటఁ
గడలి మొలనూలిచేడియ గనినపడుచుఁ
దెచ్చుకొనె రాచఁ డనఁగను దెనుఁగు మఱుఁగు. ౧౧౪

క. తొల్లింటి కవుల వాక్యము, లెల్లను బ్రాఁదెనుఁగు లయ్యె నిప్పటివారల్
చెల్లబడి వాడునవియు, దెల్లమిగా నింకఁ బ్రాఁతతెలుఁగులు నృహరీ. ౧౧౫

క. పుడమియు సిరియును బడఁతులు, వెడవిలుతుఁడు పసిఁడికడుపు వేల్పును గొడుకుల్
గడలి విషమట్టు పాములు, నడుచు గుఱ్ఱము స్వామి కనఁగ నచ్చ తెనుంగుల్.

క. కవులకు దేశ్యము లోక, వ్యవహారమువలనఁ దెలియ నగు నాలోక
వ్యవహారము నిత్యంబును, భువి నిజదేశమున యోగ్యమును నగుఁ గృష్ణా. ౨౧౭

తే. అవనియందు లోకవ్యవహార మనఁగ, నాత్మదేశంబులను బెద్దలైనవార
లాడుభాషావిశేషవాక్యములలోన, వాడుకొనువచ్చునవి దుగ్ధవార్ధిశయన. ౨౧౮

వ. అవి యెయ్యవి యనిన. ౨౧౯

సీ. మదిరాక్షిచెవులు తొమ్మిదిలెక్కలన రాదు ముద్దియకనులు తమ్ములన రాదు
శుకవాణిబుగ్గలు ముకురంబులన రాదు చెలిపండ్లు మల్లెమొగ్గలన రాదు
గజయానచండ్లు బంగరుకుండలన రాదు సతిబొడ్డు సుడి యని మెచ్చదగదు
సరసిజాననముద్ది సైకతంబన రాదు హరిమధ్యకాళ్లు ఘళ్లనఁగ రాదు.

తే. క్రమత వీనికి వీనులు కన్నుఁదోయి
చెక్కులును బలువరుసలు నిక్కుఁజన్ను
గవయుఁ బొక్కిలి పిఱుఁదు చొక్కంపుటడుగు
లనుచు మును వాడి రవియ చేకొనఁగ వలయు. ౨౨౦

తే. రణము వర్ణించుచో వీరరసమునందు, యుద్ధపంచకమునఁ దిక్కుటొజ్జ సారెఁ
గాళ్లటంచు రచించుట గాంధికవులు, చెప్పకొనిరి మీఁగాళ్లని చెలఁగి కృతుల.

సారంగధర చరిత్రమునందు సీసపాదము:—

సీ. ఉన్మత్తపుష్పనానారత్నకుచ్చిళ్లు చెలఁగి మీఁగాళ్లపైఁ జిందులాడ,

## గ్రామ్యపదలక్షణము.

మూ. సూ. సంస్కారార్థో నియమో నియమా ద్గ్రామ్యం
హేయ స్త్వపభ్రంశః. 11

తే. ఉక్తలక్షణవంతమై యుండునట్టి, కావ్యము నెఱుఁగవలయు సంస్కార మనుచు
హీనలక్షణకావ్యంబు నెఱుఁగవలయు, గ్రామ్యమనుచు నపభ్రంశకంబు ననుచు.

క. లక్షణవిరహితకావ్యము, పక్షిగమన గ్రామ్య మనఁగఁబడు నది పెద్దల్
వీక్షింపరు లక్షణయుత, మీక్షితి నగ్రామ్యమని గ్రహింతురు ప్రీతిన్. ౨౨౩

తే. క్షితి నపభ్రంశపదములు కృతులయందుఁ గవులలోఁ జన చెప్పనర్హములు గావు
గాన నాంధ్రకవీంద్రులు వానిఁ దెలియ, వలయు నీశాస్త్రమునఁ దమతలఁపు నిలిపి.

తే. పలుకఁగా గ్రామ్యజనములు పలుకునట్టి
తెనుఁగు మాటలు గ్రామ్యంబు లనఁగఁ బడియె

వర్ణలోపంబు నొంది కావ్యములఁ జొరవు,
పదులఁదెగడెడుచో నొప్పఁ జాలదొంగ.

తే. అక్షరవిలోపమై యుండునట్టిపలుకు, గ్రామ్యమన నొప్పనదె యపభ్రంశకంబు
ననఁగఁబడును నాకడనాడ యనుచు మఱియు, నడుమనున్నక కారంబును డుపకున్న.

క. వస్తాఁడా హరిసొమ్ములు, దెస్తాఁడా గొల్లడంట దిట్టక కరుణ్
జూస్తాఁడా కాఁగిలి నేఁ, డిస్తాఁడా చెప్పమన్న నివి గ్రామ్యోక్తుల్. ౧౨౪

## అగ్రామ్యపదలక్షణము.

మూ.సూ. విరళాః పేచోషాదికశబ్దాః ప్రవ్యాహరన్తు శబ్దజ్ఞాః.
ఇహ తు ప్రవ్యాహార్యం నజ్యేతి సుప్రసిద్ధ మేవపదమ్.

సీ. ధరణిపైఁ బుట్టినధ్యాపపురుషంబున బహువచనంబునఁ బరఁగుచుండు
నట్టిపేచోషశబ్దాదులు కడు నప్రసిద్ధంబు లగునైన శేషశయన
వేదంబునందు వానిఁ బ్రయోగంబులు గలవు నవార్తికంబులును "నోధ
నాస్త్యప్రయుక్త" యటంచు మహాభాష్యమునఁ బతంజలియు క్షమురె యటంచుఁ

తే. బలుకుటను సంస్కృతమున శబ్దజ్ఞులప్ర, సిద్ధశబ్దంబులనుగూర్చి చెప్పచుందు
రాంధ్రమున సుప్రసిద్ధంబు లైన పూర్వ, కవిసమయసిద్ధపదములు గాని చొరవు.

వ. పేచ యనుటకు ధాతువు డుపచ వ్యాకే యనునది. ఊష యనుటకు ధాతువు వస నివాసే యనునది. ౧౨౫

ఆ. గ్రామ్యమైన నాంధ్రకవులు సంకేతిత, సుప్రసిద్ధ మనుచు సూత్రమునను
గలిమి బూర్వసుకవికావ్యోక్తములు ప్రసి, ద్ధంబులైనఁ గూర్పఁదలఁతు రెపుడు.

వ. అది యెట్లనినఁ గనియె నన వలసినభూతార్థక్రియాపదైక వచనంబునందు వర్ణలోపముచేసి కనె నంటయని గ్రామ్యపదముగావాగనుశాసనులు ప్రయోగించిరిగాన నదిసాధకము చేసికొని యాంధ్రకవితాపితామహుఁడు కొనియె ననుటకుఁగొనె ననిచెప్పె నది యెవ్విధమనిన.

ఆదిపర్వమునందు:—

క. వనకన్యక యఁట, నేనఁట వనమున గాంధర్వమున వివాహం బఁట నం
దనుఁ గనెనఁట యలిబితినఁట, వినఁగూడ నెయిట్టిసంగి విపరీతోక్తుల్. ౧౨౬

విష్ణుచిత్తీయము నందు:—

ఉ. పూని ముకుందు రాజ్ఞఁ గనుబొమ్మనె కాంచి యభాండభాండముల్
వానను మీఁదఁ బోవ ననువం గొనెఁ దన్నన నగ్రనిక్కల

శ్వానచలత్వనిష్ఠలై సమస్తజగంబుల జాడ్యచేలసల్
గానుతి కెక్కు సైన్యపతి కాంచనవేత్రము నాశ్రయించెదన్. ౧౩౩

## కందగీతిగర్భచంపకమాల.

చ. నరహరి కేశవా వనజనాభ రమాధవ వంశహస్తబం
ధురసుగుణాకరా దురితదూర జనార్దన దోర్బలాఢ్య గీ
ర్వరగిరిశస్తుతా మురహరా సురపూజితముఖ్యపాద సుం
దర పురుషాగ్రణీ భుజగతల్పశచీపతి పుత్రరక్షణా. ౧౩౪

## గర్భకందము.

క. హరి కేశవా వనజనా, భరమాధవ వంశహస్త బంధురసుగుణా
గిరిశస్తుతా మురహరా, సురపూజితముఖ్యపాద సుందరపురుషా. ౧౩౫

## గర్భగీతము.

తే. వనజనాభ రమాధవ వంశహస్త, దురితదూర జనార్దన దోర్బలాఢ్య
మురహరా సురపూజితముఖ్యపాద, భుజగతల్ప శచీపతిపుత్రరక్ష. ౧౩౬

## ఆశ్వాసాంత గద్యము.

వ. శ్రీమదాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, కామెపల్లిపురమందిర, నందనందనచరణారవిందవందనాఖిలాఘసంసారాపరిభావ, వెంగనార్యతనూభవ, విద్యాభిశేషసురాచార్య, కాకనూర్యప్పకవివర్యవిరచితంబైన యాంధ్రశబ్దచింతామణి యనువ్యాకరణశాస్త్రంబునందు గోవింద, కౌస్తుభ, వైజయంతీ, శ్రీవత్స, మురళీ, పంచాయుధ, పీతాంబర, బర్హిబర్హ, లక్ష్మీ, శేషానంత, గరుడ, విష్వక్సేన, మారుతి, పరమభాగవత, విధాతృ, శారదా, శివ, భవానీ, గణేశ, గుహ, లోకపాల, గ్రహ, పురాతనవర్తమానభావికవి గురునమస్కారంబును, స్వప్నప్రకారంబును, భగవద్వాక్యంబును, గ్రంథప్రధానంబును, గద్యవంశావతారంబును, కవివిచారంబును, ప్రబంధమహిమయుఁ గావ్యభేదంబులును, శబ్దార్థలక్షణాలంకారదోషంబులును, కవితాపరిశంసయు, దేశభాషావిశేషంబులును, భాషాష్టకోత్పత్తివివరణంబులును, ప్రకృతివికృతిభేదంబులును, తత్ఫలంబులును, ఆంధ్రభాషాభేదచతుష్టయంబును, పూర్వకవిసమయసిద్ధపదంబులును, గ్రామ్యాగ్రామ్యంబులును, గలభాషాపరిచ్ఛేదం బను ప్రథమాశ్వాసము.



# అప్పకవీయము.

## ద్వితీయాశ్వాసము.



శ్రీమహితకొండవీటీ
నామకరమ్యగిరిదుర్గ నగరాభిమత
శ్రీమకరవాహనహరి
ధామస్థితకామెపల్లిపురవరశరణా. ౧

క. ఆపఢారు శబ్దశాసనుఁ, డపుడిఁ గలియుగమున కాది నారాజమహేం
ద్రవరంబునఁ జెప్పినయాం, ధ్రవచోవ్యాకరణసూత్రతతిఁ దెనిఁగింతున్ ౨

క. శిష్టార్యావింశతి వి, స్పష్టముగా నక్షరప్రపంచము లోకో
త్కృష్టుఁడు నన్నయ సుకవుల, కిష్టాపత్తిగ వచించె నెంతయుఁ బ్రీతిన్. ౩

వర్ణపరిచ్ఛేదమూలసూత్రంబులు. ఆర్యావృత్తశ్లోకంబులు.

ప్రాణా స్సమానతోచోభిమ రనుస్వార ఏ జ ఝోవక్రః
వక్రతమ ఏజ్ఞుల స్స్యుస్సమానతః ప్రాణినో ద్రుతాఖ్యో నః. ౧

కచటతపాః పరుషాఖ్యా గజడదబా స్తుసరళాః స్థిరాస్త్వితరే,
ఏతా స్సంజ్ఞా స్సర్వా జ్ఞాత్వా పశ్చాత్ప్రవర్తయేదత్ర. ౨

బాలేందుపరిధిశృంగావర్తకుశగ్రంథిదాత్రపరశుసమాః,
ఆద్యా ఇభకరతుల్యా స్త్వదీర్ఘా శ్శూలసన్నిభా వన్త్యాః. ౩

సిద్ధ స్సాధ్య శ్చానుస్వారః పూర్ణార్ధభేదతో ద్వివిధః,
హ్రస్వాత్పూర్ణోపి భవే ద్దీర్ఘాచ్చే ఖండపవస జ్ఞేయః. ౪

దరశార్ఙ్గపిప్పలదళాంకుశపన్నగసన్నిభాః క్రమా త్పరుషాః,
స్తంభవిరేఖాధిక్యా స్తఏవ వర్గద్వితీయ వర్ణాద్యాః. ౫

కీరతరిహస్తినుస్తకనుక్తి తులాసనవితర్దిసీరసహాః,
అన్తస్థాశ్చోష్మాణో దన్త్యచజౌ గురురలా చ బిన్దుయుతా. ౬
ఆద్యాయాః పఞ్చాశద్వర్ణాః ప్రకృతే స్తుతే దశోనా స్స్యుః
సప్తత్రింశదిహాన్యే చానుప్రవిశన్తి శబ్దయోగవశాత్. ౭
ద్వివిధా దిదుదేదో తో చో వక్రతమా వనుస్వారా,
కగచజయుగటడణతదనపబమయరయుగలయుగవసహాశ్చహలః.
వికృతిపదాద్యా ప్రథమాన్తస్థ తృతీయానునాసికా వన్తః,
అయిగవుగాదేశాన్తః క్రమేణ సర్వత్ర వక్రతమయోన్వా. ౯
వా స్యాత్క్వచిద్వకారో నాదిగత స్యాద్యవర్గసరళస్య,
అర్ధన్త్యస్తాలవ్య శ్చర్వక్రః స్యాన్మిథ స్సవర్ణశ్చ. ౧౦
లఘువో లఘువ శ్చేతి ద్వేధాన్తస్థా న్వదన్తి శాస్త్రారః,
అన్యే న్యవ్యాకరణస్పష్టార స్త్వత్ర గృహ్యతే ద్వివిధః. ౧౧
ఆద్యః క్రియాసు భూతాద్యర్థసముద్యోతినం వినా సర్వః,
యత్రశ్శృతి మార్యా లఘుయం ప్రవదన్తి ప్రాణతః పరం ప్రాణమ్.
క్వచిదపినస్త ఉదోతౌ దంతోష్ఠభవస్య వికృతిశబ్దాద్యా,
నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తునిత్యం స్యాత్.
శుభవర్ణా శ్శుభశబ్దా యే చ శుభగణా స్తఏవ కావ్యాద్యా,
గ్రాహ్యాః పురాస్త్రరసగిరి రుద్రేష్వకచటతపా నిన్ద్యాః. ౧౪
ఆద్యోవళిర్ద్వితీయో వర్ణః ప్రాసోఽత్ర పాదపాదేషు,
స్వస్వచరణేషు పూర్వః ప్రాసస్సర్వేషు చైక ఏవస్యాత్. ౧౫
వృత్తం జాతి శ్చేతి ద్వివిధం పద్యం గణైర్నిసర్గాఖ్యైః,
సంబద్ధం వృత్తం స్యా దుపగణమాత్రాభి రన్వితా జాతిః. ౧౬
శాస్త్రార ఏకమాత్రాం లఘోర్ద్విమాత్రే గురోరితి వదన్తి,
గౌలౌ గగలలసంజ్ఞౌ గ్లో హగణో లఘుగురూ లగో వగణః.
గత్రితయం లత్రితయం మనసంజ్ఞా వాద్యమధ్యమాన్త్యార్ణాః,
గురవ శ్చేద్భజసగణా లఘవో యది యరతసంజ్ఞకాః క్రమశః.

మిత్రౌ నగలావిన్ద్రౌ నలనగసలభరతా శ్చన్ద్రౌ మ లఘుః,
రలరగతలతగనవనహ భలభగసలలనలలనగగసవసహాః. ౧౯
దీర్ఘస్సంయుక్తాద్యః పూర్ణానుస్వార పూర్వవర్ణ శ్చ,
ఏతే గురవ శ్శేషాస్సర్వే లఘ్వక్షరా ఇతి జ్ఞేయాః. ౨౦

ఇతి శ్రీసకలభాషా వాగనుశాసన నన్నయభట్ట విరచితాన్ధ్రశబ్ద
చిన్తామణౌ వర్ణపరిచ్ఛేదో ద్వితీయః.

వ. ఈశ్లోకంబు లిరువదియును నలువదిరెండు సూత్రంబు లయ్యెనవి యెల్లనిందు వివరించెద.

తే. కాంచనాంబర కవితాప్రపంచ మెల్ల, వర్ణరూపంబు గాన నావర్ణములకుఁ
గలుగుభేదంబు తెలుఁగక కవిత వలుక, వలను గామి వచించెద వానినెల్ల.౫

వర్ణసంజ్ఞలు.

క. మాతృకలు వర్ణములు మఱి, భూతలమున వర్ణములు లిపులు వ్రాలుననక్ష
ద్రైతేయవిభంజన వి, ఖ్యాతములగు నక్షరాహ్వయము లీరైదుక్ష. ౬

సీ. ఆమలుపదియాఱు నచ్చులుస్వరములు ముప్పదిమూఁడు కాముదలుగాఁగ
నవనిపై హల్లులు వ్యంజనమ్ములు నయ్యె నీవ్యంజనములలో నిరువదేను
స్పర్శముల్మొదలియక్షరములు పయినాల్గు నంతస్థములు యకారాదికములు
పిదప శవర్ణంబు మొదలుగానూష్మంబు లయ్యె నాస్పర్శంబు లైదునైదు

తే. వర్ణములు గూడ నొక్కొక్కవర్గ మగును, వర్గవర్గంబుతుద లేనువర్ణములును
ధరణి ననునాసికము లనఁబరఁగుచుండు, జమ్మికడఁగామెపలినున్న చక్రపాణి. ౭

సీ. అత్వంబకారంబు ననఁ దలకట్టునిక్కము దానిదీర్ఘ మాకార మయ్యె
నిత్వంబికారంబు నిది పిల్లగుడికిఁ బే రీకార మనగుడి నెసఁగుదీర్ఘ
మమరు నుత్వము నుకారము ననఁగుఱుచకొమ్మూకార మన దీర్ఘయుక్తశృంగ
మొనరు వట్రువ ఋత్వమును ఋకారము నన దీనిఁబాఁచిన ఋత్వదీర్ఘమయ్యె

తే. నేత్వ మేకార మైకార మైత్వ మయ్యె,నోత్వ మోకారమౌకార మౌత్వమయ్యె
వసుధఁబ్రత్యేకలిపులైనవ్యంజనముల,పైనిఁ గూడిననిమ్మాడ్కిఁ బలుకఁబడును.౮

తే. అత్తు నాత్తును మఱి యిత్తు నీత్తు నుత్తు,
నూత్తు నేత్తును వెస నైత్తు నోత్తునౌత్తు
వరుసతో నివి పదియును స్వరములయ్యె,
ముంగలఁ బ్రయోగములఁ దెలియంగవలయు.

క. నిడుదలు నెఱియక్కరములు, పొడవులు చాఁపులును దీర్ఘములు ననఁగఁ గ్రొ
 వ్వడి వ్రాలు కుఱుచ లలరును, గిడుసులు గుజ్జులు ననంగ ఘృణి హ్రస్వలిపుల్. ౧౦

క. సున్న యన బొట్టనంగా, నెన్న ననుస్వారసంజ్ఞ లీవలపల రెం
 డున్నవి విసర్గ మనఁ జనుఁ, బన్నగపతిశయన ధవళపంకజనయనా. ౧౧

ఆ. గజడదబలు మొదలుగా వర్గవర్గంబు, నందు మూఁడు మూఁడు నౌ ఘోషకండు
 యావిలిపులు నాల్గు నన్యవర్ణయుతంబు, లైనశసలు ఘోష లనఁగఁ దనరు. ౧౨

తే. ఒత్తు జడ్డయు ద్విత్వసంయుక్తములును, మహిని సంయోగవర్ణనామంబు లయ్యెఁ
 బైస్వరము లేక కడుఁ దేలఁ బలుకఁబడిన, వ్యంజనంబులు పొల్లులనం జెలంగు.

మూ. సూ: ప్రాణా స్సమాసతో ఽచో బిన్దు గనుస్వార ఏజథో వక్రాః,
 వక్రతమ ఐజ్ఝల స్స్యుస్సమాసతః ప్రాణినో ద్రుతాఖ్యోనః.
 కచటతపాః పరుషాఖ్యా గజడదబాస్తు సరళాస్థిరా ఇతరే,
 ఏతాస్సంజ్ఞాస్సర్వా జ్ఞాత్వా పశ్చాత్ప్రవర్తయే దత్ర. ౧

సీ. అచ్చులు ప్రాణంబు లని చెప్పఁబడు ననుస్వారంబు బిందుప్రశస్తిఁ గాంచు
 నేత్వంబు నోత్వంబు నెసఁగువక్రము లన వానిమీఁదివి రెండు వక్రతమము
 లిలఁ బ్రాణు లనుఫేర నేపారు హల్లులు ద్రుతమనంగ నకారమతిశయిల్లు
 వర్గాదులను గలవర్ణంబులైదును బరుషనామంబులై ప్రణుతికెక్కుఁ

తే. బంచవర్గతృతీయముల్ పరమపురుష, సరళములు శేషహల్లులు స్థిరములయ్యె
 శబ్దశాస్త్రంబుగాన నీసంజ్ఞ లెల్లఁ, దెలిసి యీగ్రంథమునఁ బ్రవర్తించు టొప్పు.

## వర్ణోత్పత్తిస్థానంబులు.

క. ఇమ్మహి ద్విస్థానోద్భవ, తమ్ములు ఋమ్ముక్రవక్రతమ యుగ్మనకా
 రమ్ములు మఱియేకస్థల, జమ్ములితరవర్ణములు భుజంగశయానా. ౧౪

సీ. ఉదయించు నత్వంబు మొదలుగా రెండురెండచ్చులువరుసతో నలుతఁదాలు
 వుల నోష్ఠముల నవుదల దంతమూలఁ గంఠతాలువుల గళోష్ఠతలములందు
 బొట్టు నాసను గళంబున విసర్గంబును గాదివర్ణము లైదు నైదు గూడి
 తగఁ గంఠతాలుమస్తకరదోష్ఠముల నంతస్థము లాలుమస్తకరదముల

తే. నూర్ధ్వదంతాధరంబుల నూష్మలిపులు, క్రమతఁ దాలుశిరోదంతకంఠములను
 బలువ్రాయి శిరంబున బండిరాకు, స్థానభేదంబు లేదు దంతములఁ జజలు. ౧౫

వ. బలువ్రాయి యనఁగా దొడ్డళకార మనుట. ౧౬

తే. అలఘురలదంత్యచజలకు హ్రస్వవక్ర, ములకు నిందుఁ బ్రత్యేకించి పలుకనియెడఁ
 గ్రమతఁ దత్తత్ప్రధానవర్ణముల కెవ్వియవి యెవానికి నని తెలియంగ వలయు.

తే. అచ్చులొకవర్గ మన్యొ సర్వాక్షరంబు,లయినువర్గంబు లయ్యె యాద్యష్టకంబు దలఁపనాకవర్గమింపుఁగొందఁబనుతంబు,సూక్ష్మములునాకవర్గమైరెమొప్పుచుండు.

శుద్ధాంధ్రలిపులు, వీనికి లేఖనక్రమము.

క. మొదల నకారాద్యచ్చులు, పదియాఱును వానిపిఱుఁద బాణాసురదు ర్మదహర కాదిలిపులు ముప్పదిమూఁడును బుట్టి వాక్ప్రపంచంబయ్యెన్. ౨౦

మూ.సూ. బాలేందుపరిధిశృంగావర్తకశగ్రంధిదాత్రపరశుసమాః.
ఆద్యా ఇభకరతుల్యా స్త్రద్దీర్ఘాశ్యాల సన్నిభా వన్యా. ౨౧

సీ. విదియచంద్రునిమాడ్కి వెలయ నత్వము దానికడివంక శృంగంబుకొనగుణింపఁ బ్రభవించుఁ దక్కినప్రాణంబు లెల్లను, నడిమికి గుడి వట్టి పిడుపనిత్తు కుడి నావుకొమ్ముకైవడి వ్రాయ నుత్వంబు క్రిందను సుడినిల్ప ఋత్వమయ్యె వలపల మీఁదికి మెలిగొన్న ఌస్వర మెడమనెత్వంబు బొప్పుఁ గొడవలిక్రియ

తే. యామ్యమునగంద్రగొడ్డలియట్లొనర్పఁ, గ్రాలునోత్వమిన్నింటిదీర్ఘములుకడిని గరిగరాకృతి నిలుపంగవరుసఁదనరు,నమరునైత్వౌత్వములు త్రిశూలమఃలకరణి.

వీనికిరూపములు.

౦ - ఇది అకారము ౦౼ - ఇది ఆకారము, ౮ - ఇది ఇకారము, ౮ా - ఇది ఈకారము, ఋ - ఇది ఉకారము, ఋా - ఇది ఊకారము, ౄ - ఇదిఋకారము, ౄా - ఇది ౠకారము. ౧౮ - ఇది ఌకారము, ౧౮ా - ఇది ౡకారము, చె - ఇది ఎకారము, చా - ఇదిఏకారము, ౨ - ఇదిఐకారము, కి - ఇది ఒకారము, కీ - ఇది ఓకారము, చో - ఇది ఔకారము, అనుక్రమన్యవత్ అనున్యాయము చేతనీశబ్దానుశాసనసూత్రమునందుఁ జెప్పినయనుస్వారమును, విసర్జనీయమును, సకలదేశప్రశస్తమైననాగరలిపియందు, నెటువలెనో, యటులఁ దెలిసికొనునది. తత్స్వరూపంబులు - ౦౦ - అం - ఇది పూర్ణానుస్వారము, ౦ః - అః - ఇది విసర్జనీయము, ఇవి యచ్చులనంబడు.

అనుస్వారనిర్ణయము.

మూ.సూ:— సిద్ధ స్సాధ్యశ్చా నుస్వారః పూర్ణార్ధభేదతో ద్వివిధః,
హ్రస్వా త్పూర్ణో పిభ వేద్దీర్ఘా చ్ఛేఖణ్డఏవ స జ్ఞేయః.

సీ. ప్రాసంగ దీర్ఘాఖండపూర్ణంబు లనుపదంబులు సంజ్ఞ లొ గట్టి బొట్టులకును హ్రస్వఖండార్ధంబు లనుశబ్దములు మాఁదు సరసున్నలకుఁ బేరులగుచు నుండు శబ్దంబులోఁడనె జనియించుబిందువు సిద్ధంబు నాఁగఁ బ్రసిద్ధ మగును బుధమి సకారంబు పెడి గైకొనయామనుస్వారంబు సాధ్యసంజ్ఞముగ వెలయు

తే. నిక్క మీసిద్ధసాధ్యంబు లొక్కటొక్కటి, ఖండపూర్ణంబులన ద్విప్రకార మయ్యె
నవియె క్రమ్మఱహ్రస్వదీర్ఘాక్షరముల, మీఁదరెండుతెఱంగులై మెఱయుఁగృష్ణ.

ఆ. వెలఁది చెలఁగునిన్నుఁ దలఁచిన నన సిద్ధ, ఖండబిందు వయ్యెఁ గమలనాభ
పొంక మైనయింతిపొందు నొంపగు నన, సిద్ధపూర్ణబిందు విద్ధచరిత. ౨౩

క. భువిఁ గొలిచెదఁ గాళిందీ, ధవు ననుచును వికృతులను ద్రుతంబులుచెవి విం
దువు లైన వెల్ల సాధ్యో, ద్భవఖండము లయ్యెఁ గామెపల్లినివేశా. ౨౪

క. కెందమ్ములు చెంగలువలు, ముందర చెంగావిచీర ముంగొంగన నీ
చందమువెల్లను నందిత, బృందారక సాధ్యపూర్ణబిందువు లయ్యెన్. ౨౫

మూ. సూః—హ్రస్వాత్పూర్ణో విభవేద్దీర్ఘాచ్ఛేత్ఖణ్డ ఏవసఙ్జ్ఞేయః.

తే. జగతిపై సిద్ధసాధ్యసంజ్ఞలఁ బొసంగు
ఖండములు హ్రస్వలిపులపై నుండెనేని
వానిఁ బూర్ణంబులను జేయ వచ్చుఁ గృతులఁ
బూర్ణములు ఖండములు సేయఁ బోసఁగ వెందు. ౨౬

క. కొలఁకులకుఁ గొలంకులు నాఁ, దలఁపులకుఁ దలంపు లిట్లు తగ సిద్ధము లై
కల వందుఁ జిలుతసున్నలు, వెలయును బూర్ణంబు లగుచు విమథరతల్పా. ౨౭

క. జలజాక్షుఁ గొలుతు ననుచో, జలజాక్షుం గొలుతు ననుచు సాధ్యార్ధము భూ
తలమున నెగసున్నయు నై, చెలు వగుఁ గామెపలివాస సిద్ధోల్లాసా. ౨౮

తే. నిధువ లగునక్కరములపై నిలిచినట్టి, యర్ధబిందువు లన్నియు నరసి చూడ
ధరణిసిద్ధంబులైన సాధ్యంబు లైన, ఖండములెకాని పూర్ణముల్ గావుసుమ్ము.

ఆ. లోఁగ వించు కైన బాఁగతనంబున, దోఁచి వలువ లెల్ల దాఁచినావు
గీఁజుపోర కిమ్ము సేఁ జన వలెనన్న, నిదుదమీఁద సున్న నిలుచు నగము. ౩౦

తే. హల్లులను బంచవర్గంబులందు మొదలి, వర్ణములకును మూఁడవవర్ణములకుఁ
దక్క నితరాక్షరములకుదాపలికడ, నాంధ్రపదమధ్యమునఁ బుట్టదర్ధబిందు.

సీ. కొంకక పీఁకపై కొమ్మలోఁ జనుదెంచి ముంగల నాగినమురు వధించె
మించి చేయ్యాఁచక మేదినీసుతుఁ ద్రుంచి సెంజిలి రోఁజుకన్నియలఁ గొనియె
మింటితోఁటను గల మేటివృక్షము దెచ్చి మెండుగా వేఁడిన మెలఁత కిచ్చె
వింతసేఁతల గోపకాంతల వలపించి బొం చూఁది బహువిధంబుల రమించె.

తే. కంపుతూపులుగలవన్నె కానిఁగాంచెఁ, గంబమునఁబుట్టెఁదాఁచేటికరణినాస్ప
సారహరి యనఁ బూర్ణంబు లర్ధములును, బరమసరళాదులను గనుపట్టు నిట్టు.

తే. నగముఁజావిల్లిచలె బ్రాయసగమునున్న, నింటుజావిల్లివలె బ్రాయ నిండుసున్న

యయ్యోసీథేవము లెటెంగి యాంధ్రకృతుల, వ్రాయఁ దగు చిందువులు పొంద
(వేయపక్ష.

వ. ౦ ఇది యర్ధబిందువు, ౦ ఇది పూర్ణబిందువు. 33

మూ. సూ: శరశార్ఙ్గపిప్పలదళాఙ్కుశపన్నగసన్నిభాః క్రిమాత్పరుషాః,
స్తంభ విరేఖాద్యైక్యా స్త ఏవ వర్గద్వితీయవర్ణాద్యాః.

సీ. శంఖశార్ఙ్గద్విపాశనదళాంకుశపన్నగాకృతులను మీఁద నడ్డరేఖ
వలపల నొక్కటి నిలుపంగఁ బరుషంబు లైదును వరుసఁ జెన్నారుచుండుఁ
గ్రిందఁ గంబముపోల్కి గీ టొక్కటిడిన నాద్యములు రెండవలిపులై పొసంగుఁ
గైనున్న గీటు లిబ్బడి సేయఁ బ్రథమాక్షరంబులు సరళవర్ణంబు లగును

తే. గంబమొక్కటి రేఖాయగంబు క్రింద, వ్రాసినఁదృతీయమునుజతుర్థంబునగును
నిలువుగీటులు రెండునుంగలసి తమ్ముఁ, గదియఁద్రొల్లిటివనునాసికంబులగును.

హల్లులకు రూపంబులు

క - ఇది క్ కారము, ఖ - ఇది, ఖ్ కారము, గ - ఇది గ్ కారము, ఘ - ఇది ఘ్ కారము, ఙ - ఇది ఙ్ కారము, చ - ఇది చ్ కారము, ౘ - ౘ్ కారము, ఛ - ఇది ఛ్ కారము, జ - ఇది జ్ కారము, ౙ - ఇది ౙ్ కారము, ఝ - ఇది ఝ్ కారము, ఞ - ఇది ఞ్ కారము, ట - ఇది ట్ కారము, ఠ - ఇది ఠ్ కారము, డ - ఇది డ్ కారము, ఢ - ఇది ఢ్ కారము, ణ ఇది ణ్ కా కారము, త - ఇది త్ కారము, థ - ఇది థ్ కారము, ద - ఇది ద్ కారము, ధ - ఇది ధ్ కారము, న - ఇది న్ కారము, ప - ఇది ప్ కారము, ఫ - ఇది ఫ్ కారము, బ - బ్ కారము, భ - ఇది భ్ కారము, మ - ఇది మ్ కారము.

ఇవి స్పర్శము లనంబడును.

మూ. సూ:—కీరనౌహస్తిమస్తకశుక్తితలాసనవితర్దిసీరసమాః,
అంతస్థాశ్శోష్మాణో దన్త్యచజౌగురురతాచ బిన్దుయుతౌ.

తే. శుకతరిమత్తగజకుంభశుక్తిసన్నిభంబు లంతస్థములు తులాభద్రపీఠ
వేదికాహలనిభములు శాదిలిపులు, దంత్యచజగురురలలకుఁ దనరు బొట్లు. 34

య - ఇది య్ కారము, ర - ఇది ర్ కారము, ల - ఇది ల్ కారము, వ - ఇది ల్ కారము, శ - ఇది వ్ కారము. ఇవి యంతస్థము లనంబడు.

త్రి- ఇది శ్వర్ణము, నా- ఇది ష్కారము, నో-ఇది స్కారము, హ్మ ఇది హ్కారము, ళ్ల - ఇది ళ్ కారము, ఇవి యూష్మము లనంబడు.

క. పొల్లులయి తాము పుట్టియు, హల్లులు ప్రాణములతోడ నంబాధితనయా
వల్లభ కూడి కదా తల, ముల్లు గుడులు శృంగములును మొదలుగఁ బాల్చున్.

వ. అది యెట్లనిన.

క - క్, కు - క, కూ - కా, కి - కి, కీ - కీ, కు - కు, కూ - కూ, కృ - కృ, కౄ - కౄ, క్లు - క్లృ, క్లూ - క్లౄ, కె - కె, కే - కే, కై, కొ - కో, కౌ కై, కౌ, కం - కఁ, కః - కః.

ఇటుల హల్లుల కెల్ల వ్రాయునది.

## ఇది స్వరగుణితము.

తే. ఎన్ని హల్లులు జడ్డలై యున్న నేమి, పొల్లులకు మీఁద నుండెడుహల్లు లెల్ల
గడపటను వ్రాయుద్విత్వమొక్కటియె తాల్చు, దాని మొదలైనతలకట్లువాని నెల్ల.

వ. ప్రద్యుమ్నుఁడు — బా ఉ క్య — యు చ ఇటువలెఁ గ్రిం

దను వ్రాసినయొత్తులకే తలకట్లు మొదలైనవి వ్రాయునది. ఈలిపియందు రేఫమున కునొత్తులు వ్రాయునది గాని వలపలగిలక లేదు అది యెట్లనిన. ౪౦

తే. మొదల రేఫాక్షరంబు నాపిదప దాని
జడ్డయును గూర్చి యొకటిగాఁ జమవుకొనుచు
ముందు జడ్డయు వెస రేఫమునకు బదులు
గిలుక విభజించియు లిఖింతు రలఘుమతులు.

వ. స్వర్గ మనుటకు — ఇ ౩ కు బా యు యిటుల వ్రాయునది. ౪౧

క. పద్యాదిప్రాణంబుల, నాద్యంతస్థములుగాను నజ్ఝులు కృతులం
జైద్యహర వ్రాయుదురు తము, విద్యాధిక లెల్లఁ జూచి వికవిక నవ్వన్. ౪౨

ఈప్రాఁతలిపులు ప్రతిపుస్తకమున వేఱువేఱుగా నుండుటంజేసి వీనికుదిరిక చక్కఁగాఁ దెలియఁబడ దయ్యె. ౪౩

క. ఇరు వీఁగ లుడత లూ ళ్ళై, వ్వరు నేమిటి కొక్కఁ డోపు వానికి నమ్మసి
కరణిపదంబుల మొదలివి, స్వరము లనుచుఁ దెలిసి వ్రాయఁ జనుఁబద్యాదిన్.

క. పలబొట్టులపైవర్ణం, బులక్రిందట నవిదొ వరల మాషవతులు జ
   డ్డలు చేసి వ్రాయుచుందురు, విలిఖింపకు వాని నెందు ద్విత్వము లార్యుల్.౪౬.

ఆ. హల్లుమీఁద నున్నహల్లు దానికి ద్విత్వ, మొందుఁ గాని వేఱె యొకటి గాదు
   సంధివేళ నది విచారించి వ్రాయుచోఁ, జాప రెండు దానఁ బ్రాజ్ఞులెల్ల. ౪౭

## పంచాశద్వర్ణ నిర్ణయము.

మూ.సూ: ఆద్యాఃపూః పంచాశద్వర్ణాః ప్రకృతేస్తుతే దశోనాస్స్యుః షట్త్రింశ దత్ర తేన్యే చానుప్రవిశన్తి శబ్దయోగవశాత్.

తే. అయిమపదులగు సరభాషకక్షరమ్ము, లందుఁబది ప్రాకృతమునకునడఁగిపోవు
   దాఁగిచనఁబదియును మూఁడుదెలుఁగుభాస, కెనఁగుఁదత్సమపదములనేఁ
   (బదియును.

## వరరుచి వచనము.

శ్లో. ద్విధాక ఏచోనుస్వారో విసర్గ ష్షోడశ స్వరాః,
   స్పర్శా అన్తస్థలోష్మాణ శ్చతుస్త్రింశ ద్ధలస్మృతాః.

టీ. ద్విధా=రెండువిధము లైన,అకః= అకృ ౡల్యాహారంబును, అక్కులనఁగా- అ ఇ ఉ ఋ ౡ, ఈ యయిదక్షరములకుఁ బేరు. అది యె ట్లనఁగా.

## పాణినీయసూత్రములు.

హలన్త్యమ్.

వృ. ఉపదేశే న్త్యం హ లిత్స్యాత్.

టీ. ఉపదేశే = సూత్రమునందు, అంత్యం=కడపటిదైన, హల్=వ్యంజనాక్షరము, ఇత్ = ఇత్తనుసంజ్ఞ గలది, స్యాత్= అగును- ఇందుచేత నిత్తనఁగ సూత్రముకొన నున్న పొల్లనుట.

ఆది ర న్త్యేన సహేతా.

వృ. అన్త్యేన ఇతా సహితః ఆదిః మధ్యగానాం స్వస్యచ సంజ్ఞాస్యాత్.

టీ. అన్త్యేన=కడపటనున్న,ఇతా=ఇత్తులోడ, సహితః=కూడుకొన్న,ఆదిః=మొదటిఅక్షరము,మధ్యగానాం=నడుమనుండెడునక్షరములకును,స్వస్యచ=తనకును

సంజ్ఞా స్యాత్ = పేరగును. కడపట నున్నయిత్తుతోఁ గూడుకొనిన మొదటిఅక్షర మనకును నుండెడునక్షరములకును దనకునుపేరగును అన్నందుచేతఁ దుద నున్న నకారమునకుఁ బొల్లు పనిలే దాయెఁ గనుక.

సూ:—తస్య లోపః.

వృ. తస్యేతో లోప స్స్యాత్.

టీ. దానికొన నున్నయిత్తునకు లోప మగును. ఇం దున్న కవర్ణము పొల్లు లోపింపఁగాఁ జిక్కిన యయిదక్షరములును హ్రస్వములుగాను దీర్ఘములుగాను నుచ్చరింపఁగా అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, అనిపది యక్షరం బు లయ్యెను, ఏచః= ఏ, ఓ, ఐ, ఔ, చ్ అను నేచ్ ప్రత్యాహారనునందు ము నుపటివలెఁ గొన నన్నచకారము లోపింపఁగా మిగిలినవి నాలు గాయెను.

సూ:—"ఏజ్ఞ్రహ్స్వో నాస్తి."

అనుదానిచేత నీయేజ్జునకు హ్రస్వము లేదుగాన ఏ, ఓకారములు గీర్వాణ భాషయందుఁ గుఱుచలు లేవు. అనుస్వారః= పూర్ణబిందు వొకటి (సంస్కృతము నందు నర్ధానుస్వారము లేదు,) విసర్గః= విసర్జనీయ మొకటి యవ్వియుఁగూడఁగా, స్వరాః= అచ్చులు, షోడశ= పదియాఱు, స్పర్శాః= స్పర్శములు ఇరువదియైదు, అన్తస్థోష్మాణః= అంతస్థములు నాలుగును దొడ్డళకారమును, ఊష్మములు నాలు గును, హలః= వ్యంజనములు, చతుస్త్రింశత్ = ముప్పదినాలుగు, అచ్చులు పదునా ఱు, హల్లులు ముప్పదినాలుగు, ఉభయములు గూడ నేఁబది వర్ణము లాయెను.

తే. అచ్చు లొకపదియాఱును వ్యంజనములు
పాండుపుత్త్రసహాయ ముప్పదియు మూఁడు
దొడ్డళా యందులోపలఁ దొరల నయ్యె
నమరభాషకు నేఁబది యక్షరములు. ౪౯

సీ. ఏకనీళము దేవహేళనంబు నటంచు యాజుసామ్నాయంబునందు లేదా
కాళనాళవ్యాళగోళహింతాళంబు లనుచు సంస్కృతభాషయందు లేదా
గయ్యాళి ప్రల్లు నగల్లు వల్లపుకొళ్కు తాళికె నంచు నాంధ్రమున లేదా
పాళం బెలుంగనికూళ విరాళి పిసాళించు ననియు దేశ్యమున లేదా

తే. యాగమజ్ఞులు దొడ్డళాక్షరంబు, లండ్రు లేకున్న సన్నంబు నదియుఁ గూడ
నాకటిగాఁ జేసి బీజోపయోగి గాన, షాను జేకొని రవి శబ్దసరణి గాదు.

వ. ఆగమజ్ఞులు పంచాశద్వర్ణంబులలో నున్నళకారమును గూర్చుకొన్నందులకు మ హా విద్యలోనిశ్లోకంబులు. ౫౦

శ్లో. మూలాధారగ్గుదస్థానం స్వాధిష్ఠాన స్తు మేహనమ్,
నాభి స్తు మణిపూరాఖ్యం హృదయాబ్జమనాహతమ్.
తాలుమూలంవిశుద్ధాఖ్య మాజ్ఞాఖ్యం నిటలాంబుజమ్,
సహస్రారం బ్రహ్మరన్ధ్ర మిత్యాగమవిదో విదుః.

శా. ఆధార స్తు చతుర్దళో రుణరుచి ర్వాసా న్తవర్ణాశ్రయః
స్వాధిష్ఠాన మనేక వైద్యుతనిభం బాలా న్తషట్పత్రకమ్,
రత్నాభం మణిపూరకన్దశదళం డాద్యం ఫకారా న్తకమ్
పత్రై ర్ద్వాదశభి స్త్వనాహతపురీ హైమీకఠాన్తాన్వితా.

శా. దృష్ట్వా వరం స్వరషోడశై శ్చ సహితః జ్జ్యోతి ర్విశుద్ధాంబుజమ్
హం క్షేత్యక్షరపద్మపత్రయుగళం రత్నోపమాజ్ఞాపురీ,
తస్మా దూర్ధ్వ మధోముఖం వికసితం పద్మం సహస్రచ్ఛదమ్
నిత్యానన్దమయీ సదాశివపురీ శక్తేః నమ శ్శాశ్వతమ్.

తే. కాకు సా జడ్డలైన ఋకార మగుట, దలఁప కేఁబదిలిపులలోఁ దాఁగూర్చి
లోలుత భిన్నాక్షరం బైనదొడ్డ ళ నను, విడిచిపెట్టె ననంతుండు పెట్టి గాఁడ.

వ. ఛందము నందు ననంతుఁడు చెప్పినపథము. ౫౩

క. యరలవ లంతస్థలు నాఁ, బరఁగును శషసహలు దేఁటపడు నూష్మ లనన్
బొరిపి ఋకారము గూడుక, సరి నేఁబది యయ్యె వర్ణసంఖ్య ధరిత్రిన్. ౫౪

క. లళలకు భేదము లే దను, పలుకున ళా దొలఁగి యైదుపదు లగు వర్ణం
బులు సంస్కృతభాషకు మఱి, తెలుఁగున అళలనఁగ రెండధిక మగుఁ గృష్ణా.

ప్రాకృతోనాక్షరపరిగణన హేమచంద్రాచార్యవచనము.

శ్లో. ఋౡవర్ణా హ్రస్వదీర్ఘావై జాద్యా వనునాసికౌ,
శషౌచ దశ తే న్యూనాః ప్రాకృతోక్తిషు సర్వతః.

టీ. హ్రస్వదీర్ఘాః= హ్రస్వదీర్ఘము లైన, ఋఌవర్ణా= ఋకారఌకార ములును, అనఁగా ఋ, ౠ, ఌ, ౡ అనునవియును, ఐచ్=ఐఔలును, ఆద్యౌ= మొదటి వైన, అనునాసికౌ=అనునాసికములును, అనఁగా మొదటియనునాసికము లైనఙకారఞకారము లనునవి, శషౌ చ=శవర్ణషకారములును, తే దశ= ఆపదివర్ణములును, ప్రాకృతోక్తిషు=ప్రాకృతవచనము లయందు, న్యూనాః=తక్కువ. అనఁ

గా సంస్కృతభాషకుఁ జెప్పిన నేఁబదివర్ణములలో, ఋ, ౠ, ఌ, ౡ, ఐ, ఔ, ఙ, ఞ, శ, ష, అను నీపదివర్ణములు ప్రాకృతభాషకుఁ దక్కువ యగుచున్నవనుట.

తే. సప్తమస్వరముఖచతుష్టయము ద్వాదశస్వరంబును లోకసంఖ్యాస్వరంబు
నుర్వి నాద్యనునాసికయుగము శషలు, ప్రాకృతంబున నిక్కమీపదియు లేవు.

వ. లోకసంఖ్యాస్వర మనఁగా గణితశాస్త్రోక్తసంఖ్యను జతుర్దశలోకములు గనుకఁ బదునాలవస్వర మనుట. అనఁగా నౌకారము. ౪౬

## ఆంధ్రభాషావర్ణసంఖ్య.

మూ. సూ:—ద్వివిధావిదు దేదోత్తోచో వక్రతమా వనుస్వారౌ,
కగచజయుగటడణతదనపబమయరలవసహళస్తుహల్వర్గః.

సీ. అచ్చులలో సప్తమాక్షరం బాదిగా వరుస నాల్గును దుదివర్ణ మొకఁడు
స్పర్శాక్షరములందుఁ బంచవర్గములను సమము లై యుండునక్షరములు పది
మొదలివ్యంజనవర్గములను రెంటను దుదిఁ గనుపట్టుననునాసికద్వయంబు
నూష్మవర్ణము లన నొప్పునాల్గిటిలోనఁ బ్రథమద్వితీయాక్షరములు రెండు

తే. నెన్న నీరెుండు కడమ గాఁ గరువదియును, జగతి శుద్ధాంధ్రదేశ్యభాషాపదముల
వెదకినను లేవు తత్సమపదములందుఁ, దనరు నిన్నియు నది సంస్కృతంబు గాన.

క. తుదలను వికృతివిభక్తులు, గదియఁటచేఁ దెలుఁగులందుఁ గలసెను గాకో
యనువర తత్సమపదముల, మొదలాద్యప్రకృతిశబ్దములు దెలుఁగగునే. ౪౭

సీ. దేవతాభాషను దీర్ఘంబులే కాని కలవైనఁ గుఱుచలు గాక యుండు
హరవిశ్వదివససంఖ్యాచ్చులు దెలుఁగులఁ గడు హ్రస్వములును దీర్ఘములు నగును
సంస్కృతంబునఁ దాలుజనమాత్రమే కాని జగతి నన్యస్థానసంభవంబు
చర్చింప దెలుఁగునిచజ లాంధ్రమునఁ దాలుజాతంబులును దంతజములు నగును.

తే. దలఁప నేకప్రకారమై ద్విరుక్తి, లంటు భేదంబు లేని రేఫాక్షరంబు
రేఫము ఱకారమును నన రెండు దెలుఁగు, లగుచు వికృతులఁ దనరు మహాఘశయన.

వ. హరవిశ్వదివససంఖ్యాచ్చు లనఁగా గణితశాస్త్రోక్తసంజ్ఞను, హర యనఁ బదునొకొండవయచ్చు ఎకారము, విశ్వ మనఁగాఁ బదుమూఁడవయచ్చు ఒకారము, దివస మనఁగాఁ బదునేనవయచ్చు అం అనునది. యీమూఁడచ్చులకుఁ దెలుఁగున హ్రస్వమ్మును దీర్ఘంబును గల వనుట. అంఅనుదానికి దీర్ఘము రాఁగా అంఆయెను. ఇంతమాత్రమున నచ్చుల మొదల నకారంబును అకారంబును రెంటనున్నవి దానికిం జెప్పరాదా దీనికిఁ జెప్పవలెనా యనఁగా, నవియాకారమునకుఁ జెప్పటగాదు. అనుస్వారము ప్రత్యేకముచ్చరింపశక్యము కాదు గా

నఁ బాణిన్యాచార్యులు వ్యాకరణమునందు అం ఇత్యనుస్వారః అని అకారము తోఁ గూర్చి చెప్పెను గాన అం అనఁగా బిందువునకు సంజ్ఞ. ఆబిందువునకు హ్రస్వదీర్ఘము లెట్టులఁగలుగు ననఁగా వక్ష్యమాణ పద్యముచేతఁ దెలిసి కొనవచ్చును.

౬౧

ఆ. బిందువునకు రెండుభేదంబు లగు హ్రస్వ, దీర్ఘరూపములను దెలుఁగులందు హ్రస్వమనఁగ నొప్పు నర్ధబిందువు దీర్ఘ, మనఁగఁబూర్ణబిందు వయ్యెఁగృష్ణ.

క. తక్కువపదియును గొమ్మిది, యెక్కువలిపు లాఱు నయ్యె నేఁబదిలో నీ లెక్కను ముప్పదియును నే, డక్కరములు నిలిచె శుద్ధ మగునాంధ్రమునన్.

వ. తత్తద్వర్ణభేదాభేదంబు లెఱింగించెద.

౬౨

మూ. సూ:—వికృతిపదాద్యా ప్రథమా స్తస్థతృతీయానునాసికాన స్తః.

క. తెలుఁగున యణకారంబులు, గలుగవు శబ్దాదులను యకారముపగిదిన్ బలుకఁబడునవి స్వరము లగు, ఖలపూర్వామరవినాశ కామేశలీశా.

౬౩

కొమ్ము ఱకారలు.

సీ. క్రుజ్ క్రుధ క్రూర శిశ్రు శ్రుతి విశ్రుత శుశ్రూషి సుస్రుతి స్రు కృశ్రీనములు భ్రూణ భ్రుకుంశ బభ్రు భ్రువాణంబులు భ్రుకుటిక భ్రూలతా ప్రకటితములు కద్రువ ప్రుషద ద్రుమ ద్రుహిణ ద్రుహి సౌరద్రు విద్రుమ శత్రువులును ధ్రువమును ప్రుతమువుభుమిఁగ్రాగకొమ్ము లైతన రారుఁ గాని ఋత్వములు గావు.

తే. వత్రువలు లేవు తెనుఁగునవానిపగిదిఁ, బలుకఁలిపులెల్లఁ గ్రాగకొమ్ములు నిజంబు దుమునిందాకఁజైమ్యఁపుద్రుమ్లేననఁగ, రోహిణీభర్తృచరమూర్ధిఁగ్రుంకెననఁగ

నృసింహపురాణమునందు సీసపాదము:—

సీ. క్రూరకెన్నిపశైలకులిశనిపాతంబు ఘనకలుషోరగగరుడమూర్తి.

౬౪

చ. శ్రుతిమతకర్మయోగములు చోద్యపురూల్యము లప్పకంబునన్ జపరతిఁ బుద్ధ్యవస్తువులు సారవిముక్తిపదంబు లన్నువా రతులితవిష్ణుశాసనసమాహితు లైనమహాత్ములంటతో పఁగొనువాడు మీసువిహితవ్రతపారగు లైన బోధనుల్.

౬౫

కావ్యాలంకారచూడామణియందు:—

క. భావమె యుంటుక వచనా, వ్యావళితవికాస మైసహాసము శృంగా రావిర్భావనివాసము, భ్రూవల్లి మదంచనంబు మును నెలుఁగఁబడున్.

౬౬

ప్రభావతీ ప్రద్యుమ్నమునందు సీసపాదము:—

సీ. సురటి చేకొని భద్ర శుశ్రూష గావింప.

౭౦

ఆ. అద్రుపవిద్రుప నమక్రియాపదంబులయందుఁ, గలిగిన ట్రుసుఁసులగలిగినయందు
ద్రాలు తేలఁ బల్కఁ గ్రారకొమ్ములుగాని, వట్రుసుడులుగావు వనజనాభ.

## ఋత్వాక్షరంబులు.

సీ. ఋష్యమూకాద్రియు ఋష్యశృంగుండును ఋక్షమ్ము గేంద్రుండు ఋక్షపదము
ఋశముఋత్విక్కునైర్ఋతి ఋతుపట్కమ్ము ఋతుపర్ణభూపతి ఋతంభరయును
ఋషభవాహనుఁడును ఋషియు ఋగ్వేదంబు ఋభురాజ ఋణమును ఋద్ధియు జౌళ
నమనీపదంబుల కాదివర్ణంబులు సప్తమస్వరము లై జగతిఁ బరఁగుఁ.

తే. గృష్ణ వృత్రాంతకా హృషీకేశ మదన, జనక పృథ్వీకుమారభంజన యటంచు
హల్లులందును వట్రువలనరియుండు, సంస్కృతంబున యదువంశసార్వభౌమ.

## వక్రభేదంబులు.

ఆ. ఏక మోక మిట్టు లేత్వంబు నోత్వంబు, నమరభాష నిడదలకును గాని
హ్రస్వలిపులు గావు హల్లుపై నట్లన, యగు నిలగిరికోకిలాల యనఁగ. ౭౩

ఆ. పెక్కులేల కృష్ణుఁడొక్కఁ డోపఁడె పసి, నెలవు నేల యరసి పాలమున నోన
ననఁగ నిట్లు తెనుఁగులందు వక్రయుగంబు, హ్రస్వములునుగ నిడద్రాలు నగును.

## వ్యంజనలోపము.

ఆ. పూనె నెగసెఁ బొదవెఁ బొసఁగెఁ బొందె నటన్న, పలుకులందు మొదలఁ గలుగునట్టి
వ్యంజనంబు లడఁగి వానిపై స్వరములు, నిలుచు పలసినపుడు నీరజాక్ష. ౭౪

పూనె ననుటకు విష్ణుచిత్తీయమునందు:—

ఉ. పూని ముకుందునాజ్ఞఁ గనుబొమ్మనె కాంచి యజాండభాండముల్
వానను మీఁదఁ బోవ నమును గొనెఁ దన్నన నగ్రనిశ్చల
త్వానపలత్వనిష్ఠ లై సమస్తజగంబులబాహ్యచేతనల్
గా నుతి కెక్కు సైన్యపతి కాంచననేత్రము నాశ్రయించెదన్. ౭౫

హల్లులోప మైనయూనె ననుటకుఁ బారిజాతాపహరణమున:—

క. మానవతి యిట్లు మానస, మాన క్రోధములచేత మరలించి చింతా
ధీనగతి నుండ నదిలో, నూనె ప్రేమమును సంబుగోదకుఁ దనివోన్. ౭౬

నెగసె ననుటకు ఆదిపర్వమునందు:—

ఆ. కర్మబంధములను గ్రక్కునఁ బాయుచుఁ, బుణ్యగతికి నెగయుపురుషునట్ల
బంధనంబు తెల్లఁ బాయుచు శీఘ్రము, నీరిలోననుండి నెగయుదెంచె. ౭౭

విరాటపర్వమునందు సీసపాదము:—

సీ. నెగడిన కోనలతో నింగి యంతంతకు నవలఁ బోవఁగఁ దనరారుదాని. ౪౯

ఉద్యోగపర్వమునందు:—

క. ఎఱకలు విచ్చుచుఁ బంతము, దెఱచుచు వ్రేగడఁచి సొగసి త్రెళ్లి పవడఁద్రై
యఱచిననోడకుమనిహరి, నెతినక్కఁగఁద్రోఁచియెత్తె నెగయఁగఁ గృపతోన్.

వ్యాంజనలోప మైనందులకు శృంగారనైషధమునందు సీసపాదము:—

సీ. ఒంటి కాలున నిల్చి యూర్మిమారుతములఁ జిగురుటెక్కులరేఁకు లెగయుచుండ.

పాదవె ననుటకు నృసింహపురాణమున:—

తే. అదరిపాటున నెసవిచ్చిపాదవికొనినఁ, దాలగి పోవంగఁగూడకమలముషవనుఁ
డింపుడలచూర్చుకొనియెనోయిప్పనసఁగనమరుఁదాళవృంతములవందానిలంబు

తే. పాదవి యొండొంట దివియును భువియు దెసలుఁ
బాదవికొని యండచీఁకటిప్రోవునలన
మిక్కుటంబుగ గాటుక గ్రుక్కినట్లు
కరనటం బన జగదండ ఖండ మమరె. ౭౩

క. అది యట్లు కాదె నిప్పనఁ, గెద లంటునె దేవదేవు శ్రీరమణీశు
మది నుంచుకొన్నవానిని, బాదవునెయాపదలు రవిఁ బొందునె తనువుల్.

హల్లోపమునకుఁ జిత్రభారతమున:—

క. తదనంతరంబ గ్రమ్మఱ, యదువిభుఁడు కృపాబ్ధియై వాణీశ
గ్రాడశేవల కాశ్చర్యం, బొదవ మనిచె నునయసైన్యయోధుల నెల్లన్. ౭౪

ఉద్యోగపర్వమునందు:—

క. పడపడి మస్తర మనుప్పె, పనమూఁడవ యేడు గడవఁబనుట యెరిది ద
మ్మైన రెలుఁగకుండ నాపద, లొదవఁగ సైరించి రిట్టి యునికియుఁ గలదే.

పానరె ననుటకు నుద్యోగపర్వమునందు:—

క. ధనమును రాజ్యము నంశం, బును ధర్మజునకు మదంబుఁ బొనరించను స
జ్జను లైనవారి కడఁకువ, యును నిన యును నివియ తెచ్చు నుర్వీనాథా. ౭౬

మ. అని నిక్కైచ్చి వృకోదరుం డతఁడు కార్యం బింత తెల్లంబుగాఁ
బొనరం బల్కెనె యంచుఁ బేరెలుఁగు సొంపుం జెంద వక్త్రంబుపొ
ల్పున దర్పం బెలయంగ నుగ్ర మలుగం బాంగారఁ దప్పంచిహిత
ధ్వని యై మించుమహాగ్రసింధురముచందం బొంది పాల్చెం దగన్. ౭౭

హల్లోపమునకుఁ బ్రబంధపరమేశ్వరుఁడు చెప్పినయహోబలమాహా
త్మ్యమున:—

క. నిను నాశ్రయించియును నేఁ, ననఘా కడ లేని వనట యనువనధిలో
మునుఁగుదునె ప్రతీకారం, బొనరింపఁ గదయ్య దీని కూహింది కృపన్. ౧౯

హరిశ్చంద్రోపాఖ్యానమునందు:—

చ. ధనమునిపుప్పకంబునకుఁ దాఁ జెనవచ్చె నటంచు లోకముల్
వినుతి యొనర్పఁ బో ల్పెసఁగి విప్రమహా త్రికవప్రశిలకాం
చనఁయుతము న్సువేగహయసంఘటితంబును నైన తేరు పెం
పొనరఁగ నెక్కె మిక్కిలి సముత్సుకతం బురబాహ్యవీథులన్. ౨౦

పొందెననుటకు శంభుదాసుని లక్ష్మీనృసింహకథయందు:—

ఉ. పొందవు దుఃఖము ల్బాయును పొందదు పొందదు దైన్య మెమ్మెయిం
బొందవు తీవ్రదుర్దశలు పొందుఁ బ్రియంబులు పొందు సంపదల్
పొందు సమగ్రసౌఖ్యములుఁ బొందు సమున్నతకీర్తు లెందు గో
విందపదారవిందపదవీపరిణద్ధగరిష్ఠచిత్తులన్. ౨౧

ఓదాదేశ హ్రస్వంబులు.

తే. కాంచు హ్రస్వద్వితీయవక్రంబు నందు, లొక్కఁ డనువీని రెండనయక్కరంబు
హ్రస్వమగుఁబో టనుపదంబునందు మొదలి,వర్ణము నుగణ్యములను గావలసినపుడు

అందొఱు అనుట కాదిపర్వమున:—

క. గెలుపు నెడ నేయు నెడ వడిఁ, బలుపు నెడం జనఁగు నెడ నపారబలంబుల్
మెలఁగు నెడ ఘేమునకు నం, దొఱు గీడ్పడఁదోడఁగి రుద్ధతులు రాజసుతుల్.

ఆరణ్యపర్వమునందు సీసపాదము:—

సీ. శూరులు ధృతరాష్ట్రసుతులు సుర్యోధనాదులు దురాధర్షు లందొఱును మనకు.

ఓత్వము రామికి విరాటపర్వమునందు:—

క. ఎఱుక గలవారి కైనను, గఱపక దక్క రుచితప్రకారము శుభమున్
గొఱలుహితు లట్లగుట నం, దఱకును జెప్పంగ వలయుఁ దగినబుద్ధుల్।

ఒక్కొ యనుటకుఁ గర్ణపర్వమునందు:—

మ. సమదాటోపత వాయునందనుఁడు ధృష్టద్యుమ్నుఁడై నేయు లే
కమనోవృత్తిఁ గడంగి తో నధువ దోర్గర్వంబు శోభిల్ల శౌ

ర్యము సొంపార నలింపకోటి వొగడన్ రారాజు సైన్యంబులో
క్కాముగింపెల్ల గిలంగ బెట్టదిమె సత్కోత్రిఘాతతరంగంబునన్. ౯౬

మనుచరిత్రమునందు:—

క. ఇట నవ్వనజాక్షియు న్నొక్కటఁ గతిపయసఖులు దన్నుఁ గొలిచి నడువఁగాఁ
గటకరుచులింఘుకరచపద, కటకసముత్కృష్టకేళికలహంసిక నై. ౯౭

రాఘవపాండవీయమునందు:—

స్రగ్ధర. ఆరాజన్యోత్తముం డిట్లనువిశరథసు డై భవత్సత్వరవ్యా
హారం బి ట్లోర్చి యుం టస్యనుగఁ గొనకు మాత్రాంగనాశుక్కతాదృ
క్సాలోగ్రేష్వాస మ ట్లస్త్రీపతిత మహ కొంచంగ నాచేతి కాటం
గ్రహరేష్వాసంబు లేదొక్కఁటను గలుగునె మద్ఘోర యుద్ధంబు నైఁపన్. ౯౮

ఓకారము రానదులకుఁ గాశీఖండమున:—

ఉ. కంటికి నిద్ర వచ్చునె, సుఖం బగునే రతికేళి, జిహ్వకున్
వంటక మిందునే, యితరవైభవము ల్పదివేలు మానసం
బంటునె మానుషంబు గలయట్టిమనుష్యున కెంతవానికిన్
గంటకుఁ డైనశాత్రవుఁ డొకండు తనంతటివాఁడు గల్గినన్. ౯౯

విరాటపర్వమునందు సీసపాదము:—

సీ. శక్రాదిసురలకొస్సుగ్రామ మొనరించిభాండనంబేర్చునొక్కరుఁడుగాఁడె.

చాటనుటకు ద్రోణపర్వమునందు:—

క. కటకటపేరినచెన్నె, తుటతొత్రిలి యున్న మోములోఁదను గొడు కె
చ్చటఁ బడి యున్నాఁడో యి, చ్చోటుఁజూపెడువాఁడు లేరెచూడఁద వాసిన్.

విష్ణుచిత్తీయమునందు:—

మ. స్ఫుటఘూర్ణోమహాదిశంక వార్ధి ర్షరక్షు ల్విన్నుఁ జేర్పం దటి
చ్ఛటగార్యంబుగఁ గాలుకొంచు ఘన మై ష్మాఘోర వర్షింప న
చ్చోటునుం ద్రోచి గ్రసింపఁ బోలుఁ గలశీసూనుండు గాకున్ననొ
క్కాటఁ దాగాగ్రహఘాస్కరేందుమణిశుక్తుల్ వ్యక్త మై లోఁచునే. ౧౦౨

హ్రస్వము గానందులకు మనుచరిత్రము:—

ఉ. పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక నీవు ద్రోయ ని
చ్చోటఁ భవన్నఖాంకురము సోఁకెఁ గనుంగొను మంచుఁ జూపి యు

ప్పాటలగంధి కేదననెపం బిడి యేడ్చెఁ గలస్వనంబునన్
మీటిన విచ్చుగబ్బిచనుమిట్టల నశ్రులు చిందు నంచఁగాన్. ౧౦౩

వక్రభేదంబులు. పాణినీయసూత్రము.

సూ.—తద్ధితే ష్వచా మాదేః.

వ. ఇతి ణితి చ తద్ధితే పరే అచా మాదే రచో వృద్ధి స్స్యాత్.

క. హైయంగవీనమునకున్, నైయంకవశబ్దమునకు న్యైయగ్రోధ
న్యైయక్కృతంబుల కాదిని, వ్రాయంగా వలయుఁ బ్రథమవక్రతమంబుల్. ౧౦౪

క. నైయగ్రత్రైయంబక, వైయాకరణాగ్రగణ్యవైయాఘ్రపదీ
వైయాత్యంబులమొదలను, వ్రాయం దగు బుధులు ప్రథమవక్రతమంబుల్.

క. యౌవనయౌవతకౌస్తుభ, సౌవర్ణకయౌవరాజ్యసౌషీరమహీ
దౌవారికశబ్దంబులఁ, దావుకొను ద్వితీయవక్రతమములు మొదలన్. ౧౦౬

క. సౌవగ్రామికశౌవన, సౌవశ్వనసౌవిదల్లసౌదశ్వలస
త్సౌవరశబ్దనుల మొదల, వావిరినిలుచున్ ద్వితీయవక్రతమంబుల్. ౧౦౭

నృసింహపురాణమునందు.—

ఉ. శ్రీస్తనకుంకుమద్రవనిషిక్తభుజాంతరభాగవిస్ఫుర
త్కౌస్తుభనూతనార్కరుచిగర్వితనాభిసరోజసౌరభ
ప్రస్తుతమత్తభృంగరవరాగరసోల్బణభోగిభోగత
ల్పాస్తరణుం దలంచు సుకృతాత్ములపాస్తసమస్తకల్మషుల్. ౧౦౮

క. మెచ్చులగుకబ్బములలో, నచ్చతెనుఁగు పల్కులందు నైత్వౌత్వంబుల్
వచ్చిన నొం డగు రెం డగు, విచ్చలవిడి వలసె నేని విబుధస్తుత్యా. ౧౦౯

మూ. సూ:-అయిగవుగాదేశా స్త్రిక్రమేణ సర్వత్ర వక్రతమయో ర్వా.

క. క్రమమున వక్రతమములకు, నచురు నయిక్కను నవుక్కు ననియెడునాదే
శములు వికల్పంబున నై, త్యమదాపహ యాంధ్రభాషయం దెల్లెడలన్. ౧౧౦

ఆ. లోకహితముకోలుకుఁ బైకొని చుట్టుల, లయ మొనర్చి శిష్టు లయిననృపుల
నేల యేలు నిలిపెఁ గా లిచ్చి నలుదెసఁ, దవిలి కృష్ణరాయఁ డవుర యనఁగ.

కవర్గాక్షరభేదంబులు.

మూ. సూ:—వాస్యాత్కచ్వచి ద్వకారో నాదిగతస్యాద్యవర్గసరళస్య.

సీ. పరుగులు పరువులు పగడంబు పవడంబు పగలుట పవలుట పగలు పవలు
నగుబాటు నవుబాటు నలుగురు నలువురు తగులాట తవులాట తొగలు తొవలు

త్రాగుట త్రావుట ప్రేగులు ప్రేవులు ప్రోగులు ప్రోవులు సోఁగ సోవ
యిఁగ మివ మగు నవు నిగురాకు నివురాకు లీగు లీవులు మ్రానిపేగ చేవ
తే. తిగియలు తివియలు పయిఁ దిగిచెఁ దివిచె
ననుచు నిట్లుంగి నొకవేళ నాదివర్ణ
ములకుఁ దక్కంగఁ గొన్నిమాటలను గృతులఁ
బ్రథమసరళంబులకు వకారములు వచ్చు. ౧౧౨

శృంగారనైషధమునందు.—
మ. పవిసంగంబునఁ దాప మొందినశచీప్రాణేశు కెంగేలికిం
జివురుం గైదువ జోదువల్ల నుపదేశించెక్ రహస్యంబుగా
నవనీహారపయోమిళన్మలయజస్నానార్ద్రపర్యంత మై
యువతాళించుపిదర్భరాజతనయాహృద్యస్తనద్వంద్వముక్. ౧౧౩

శాంతిపర్వమునందు.—
చ. వినుము నరేంద్ర విప్రుఁ డలిపెక్ జమదగ్నిసుతుండు శాప మి
చ్చె సమరభర్త వంచనము చేసె వరం బని కోరి గొంతి మా
న్చె నలుక భీష్ముఁ డర్ధరథుఁ జేసి యలంచెఁ గలంచె మద్రరా
జనుచిత మాడి శౌరి విధి యయ్యె నరుం డనిఁ జంపెఁ గర్ణునిక్. ౧౧౪
చ. ఘనసంచితాంధకారరిపుఖండనచండమయూఖరాజిచే
ననుదినముం బ్రభాతములయం దమృతాంశుమరీచు లేగఁగా
వనజము లుల్లసిల్లఁగఁ దొవ లుడుఁగం బ్రథమాద్రిఁ బొల్చున
ద్దినమణికి న్నభోమణికి దేవశిరోమణి కేను మ్రొక్కెదక్. ౧౧౫
తే. ఆఁగె లోఁగెను వీఁగెను దాఁగె నీఁగె, వాఁగెననునివి మొదలగువాక్యములను
బొదలునక్షరములుచిన్నబొట్లుపైఁ గ,కారములు గాని యనునాసికములుగావు.

## చవర్గాక్షరభేదంబులు.

మూ. సూ:—అ ట్తస్య స్తాలవ్య శ్చ ర్వకః స్యా న్మిథస్సవర్ణ శ్చ.
ఆ. ధరణి దంత్యములును దాలవ్యములు నన, వికృతిచజలు రెండువిధము లయ్యె
వీనిఁ దెలియ కున్న విశ్రమభంగంబు, దొడరి కావ్యములను దోష మొకవు.
ఆ. దంతజంబు లెల్లఁ దలకట్టులును వాని, యందు దీర్ఘములును బొంది యుండఁ
దాలుజాక్షరములు దనరారు హ్రస్వాది, వక్రయుతము లగుచు వనజనాభ.
ఆ. చలము మాని కుసుపు చట్టకేశవ ప్రొద్దు, చాల నయ్యెఁ బశువ్రజంబు వెడలె
జతలు గూడి వచ్చి సఖులు చీరెద రేల్య,జా గనంగ దంతజంబు లయ్యె. ౧౧౬

ఆ. చెప్ప రాని క్రొవ్వుచేఁ గంసుపంపునఁ, జెలఁగి కొనుచుఁ దన్నుఁ జేరి పెనఁగ
 జెట్టి మట్టుపెట్టుఁ జిలుతయే నందుని, పట్టి యనఁగఁ దాలుభవము లయ్యె. ౧౨౦

ఆ. చేతఁ జీర బైడు చేరెడువరహాలు, చేసె దంత జిత్తు చేక టొకటి
 చేఁదుకొనియెఁ గృష్ణుఁ జేర్చుక యన నిట్లు, వఱలుఁ గొన్ని దీర్ఘ వక్రలిపులు.

తే. దంత్యముల నరవంకలు ద్రైవభాషఁ, గనము తాలవ్యములఁ దలకట్లు లేవు
 ప్రాకృతమునందుఁ దద్భవపదములందు, దంత్యములె కాని తాలుజాతములులేవు.

వ. వక్రమునకుఁ దద్భవము వంకలు, అరవంక లనఁగా గుఱుచయెత్వములు, దీ
 ర్ఘమునకుఁ దద్భవములు తీఁగలు. ౧౨౩

ఆ. చందమామ గాయఁ జక్కెరవిలుకాఁడు, జాజిపువ్వుటంపజల్లు గుఱియఁ
 జామ కాక కోర్వఁ జాలక హరి వచ్చు, దనుక బడలె ననఁగ దంత్యచజలు.

వ. చంద్రమశ్శబ్దతద్భవంబు చందమామ, జాతికి జాజి, శ్యామకు చామ, శర్క
 రకు చక్కెర, జలమునకు లళయో రభేదః అనుసూత్రముచేత జళము,
 దానికి లడయో రభేదః అనుదానిచేత జడ మాయెను. అది ప్రాకృతము
 చేసిన నాది వర్ణము దంత్యమాయెను. అది తద్భవము చేసిన జల్లు. ౧౨౪

క. తొడరు జటాశబ్దమునకు, జడ యనునది తద్భవంబు చదలును జానుం
 గడు నచ్చానుఁగు లివి పద, పడి మూఁడును దంత్యములుగఁ బలుకఁదగు హరీ.

వ. జటాశబ్దతద్భవము జడ. ౧౨౬

ఆ. జడలు మెఱయ వచ్చి సంయమిశ్రేష్ఠుఁడు, చదలు ప్రూనిపువ్వు శౌరి కిచ్చె
 సరస నున్న దనుచు జా నొప్ప భీష్మక, తనయ కిచ్చె నతఁడు దగ వెలింగి.

పారిజాతాపహరణమునందు సీసగీతి.—

తే. దేహకాంతులు బాలచంద్రికల నీన, జడలు మోదుప్రపల్లవశంకఁ జేయ. ౧౨౯

నైషధమునందు సీసపాదము.—

సీ. చదలేటిబంగారుజలరుహంబులతూండ్లు, భోజనంబులు మాకుఁ బువ్వుబోఁడి.

అనంతునిఛందమునం దుపజాతి.—

 పినాకికోదండము బిట్టు ద్రుంచెన్, జా నొప్ప గెల్చె న్జమదగ్నిసూనున్
 ఘనుం డితం డుర్వి ననంగ రెంటన్, జా నైనవృత్తం బుపజాతి యయ్యెన్.

క. భూమిని మింటను జంచ, త్సామరజాతీయ యనుట పరికించి బుధ
 గ్రామణులు చంచ లని వెసఁ, దా మేత్వం బిడరు పదిరి తలక ట్టగుటన్. ౧౩౨

తే. ప్రాసముల రెండు నొకటిగాఁ బలుకవచ్చు, వడికి స్వరమైత్రి లేకున్న నుడుగ రాదు

పొట్టిమొత్వములకు దంత్యములకుఁ దక్క, భేదములు లేవు చజలకు వేదవేద్య.
ఆ. రాచనెలఁతలందు నీచెలియకు భోజ, రాజతనయవంటిమోజ గలదె
చక్కఁదనము గాక సద్గుణంబును గాంచెఁ, జెఱకుఁగోల ఫలముఁ జెందినట్లు.
తే. దంత్యతాలవ్యచజలకు ధరణి వ్రాయు, తటిని శుద్ధాంధ్రలిపిని భేదంబుకలిమి
వ్యర్థకృతులను దలకట్టులనుచునాకట్ల,నిదియు నాకదాన నదియనునిడఁగరాదు.

రాఘవపాండవీయమునందు. —

ఆ. ఎంచు వేఁట రాఁరె యితరు లేమన సుతో, దారసంగసుఖము తప్పఁ ద్రోచి
తకట పాంసురాజయశ మెన్నఁ వై తతి, క్రూరదశరథేశకులము వోయ. ౧౩౬
వ. ఈపద్యములో రామాయణార్థమున అజయశ మని సమాసము చేసే పలుక జకారము తాలవ్యం బయ్యె భారతార్థమున పాంసురాజ యని సంబుద్ధిగాఁ బలుక నావర్ణమే మరల దంత్యం బయ్యె. ఇట్టివలెనే యావిషహా కవి ప్రయోగంబు లుండఁ, దాలవ్య వర్ణాంతరంబున దంత్యముగాఁ జెప్ప రా దని యేల పలికితి వనఁగా నాద్యప్రకృతిని దంత్యచజలు లేవు గాన శుద్ధసంస్కృత మైనపాండు రాజశబ్దంబునం గల జకారము తాలవ్యమే కాని దంత్యము కానేరదు. ఇది తెలియక కేవలాంధ్రులు దంత్యాక్షరముగా నుచ్చరింతు రది లాక్షణికమతము కాదు. అట్లగుటం జేసి కవితాప్రవర్తకులైన సూరపరాజుగారు ఇంతవట్టును విచారించి ప్రయోగించిరి. ౧౩౭

పాణినీయసూత్రము.

సూ:—ఛే చ.

వృ. హ్రస్వస్య, ఛే పరే తుగాగమ స్స్యా త్సంహితాయాం విషయే. హలంత్య మితిసూత్రేణ క కారస్య ఇత్సంజ్ఞా. తస్య లోప ఇతిలోపః తు, ఉపదేశే జనునాసిక ఇతి ఉలోపః.

సూ:—స్తో శ్చునా శ్చుః.

వృ. స్తో స్సకారతవర్గయోః శకారచవర్గాభ్యాం యోగే శకారచవర్గౌ స్తః. శివచ్ఛాయా.

సూ:—ఆఙ్మాఙో శ్చ.

వృ. ఏతయో శ్ఛే పరే తుగాగమ స్స్యాత్. ఆచ్ఛాదయతి. మాచ్ఛిదత్. పదాన్తా ద్వేతి వికల్పాపవాదః.

సూ:—దీర్ఘాత్.

వృ దీర్ఘా చ్ఛే పరే తు క్స్యాత్. హ్రీచ్ఛతి, మ్లేచ్ఛతి.

సూ:—పదాన్తాద్వా.

వృ. దీర్ఘాత్పదాన్తా చ్ఛేపరేతుగ్వాస్యాత్, లక్ష్మీచ్ఛాయా, లక్ష్మీఛాయా.

సీ. ఛాగ పుచ్ఛవ్ఛటాచ్ఛందోయ దృచ్ఛాసితిచ్ఛ త్రపద్మచ్ఛదచ్ఛలాచ్ఛ
విచ్ఛి త్తికచ్ఛాపకచ్ఛపరిచ్ఛేదపృచ్ఛాప్యచ్ఛవిచ్ఛిరతుచ్ఛగుచ్ఛ
పదములు మొద లైనత్రిదశభాషాశబ్దముల నాదిమధ్యాంతములను గలుగు
స ప్తమవ్యంజనాక్షరము హ్రస్వముమీఁదఁ దనక్రిందఁ దాన ద్విత్వమగుచుండు.

తే. నిడుద లగునక్షరంబులకడిన నిలుచు, నప్పు డవికల్పకంబున నట్లన యగు
బంధురవిలాస చంద్రికాభదరహాస, భర్మమయవాసశ్రీకామెపలినివాస. ౧౩౭

టవర్గాక్షర భేదంబులు.

ఆ. ఠవర ఠీవి ఠేవ ఠావును ఢాకయు, మొదలుగా ద్వితీయములు చతుర్థ
వర్ణములును గలుగువాక్యంబులును స్వాదే, శ్యములుగాని వైకృతములు గావు.

క. కొమ్మపలు నీవు పతనము, లిమ్మోయి నెరపుడు విదేల యేచెద వకటా.
కమ్మఁగ నవాతుచక్కెర, గ్రమ్మఁగ మాటాడు ఠవర కలకంఠవరా. ౧౪౦

మనుచరిత్రమునందు:—

క. దివి బిసరుహబాంధవసైం, ధవసంఘం బెంతదవ్వు దగ లే కరుగన్
భువి నంతదవ్వు మేమును, ఠవఠవ లే కరుగుదుము హుటాహుటి నడలన్.

పాండురంగమాహాత్మ్యమునందు సీసగీతి:—

తే. సఖులుపరిహాసకులు వేడఁజనకయువళి, భు క్తనిర్ము క్తపరిధానయుక్తఁడగుచు
ననుచు ఘంటాపథంబున నగుచుఁదిరుగు, నాఅపుగలఠీవి జాతిమాత్రోపజీవి.

రామాభ్యుదయమునందు సీసపాదము:—

సీ. ఠేవ మీటుంగఁ దటన్నటి ప్రేరేచి క్రొవ్వుగా వెఱపులు గొనగఁజేసి. ౧౪౩

సుభద్రాపరిణయమునందు:—

శా. దేవబ్రాహ్మణభ క్తిప్రోవు ప్రియవ క్తృత్వంబుకాణాచి వి
ద్యావైశద్యముదిక్కు ధర్మమునకుం దాగ్కాణ మర్యాదకున్
రా వాచిత్యముజీవగఱ్ఱ కీర్తిశిష్టత్రాతసంతోషణ
శ్రీవజ్రాంగి యహాలశత్రుఁడు మహీభృన్మాత్రుఁడే చూడఁగన్.

శశిబిందుచరిత్రమునందు:—

క. నాకాకసు లైనను నీ, ఢాకకు నిల్చెదరె కటకటా మముఁబోట్లం
జేకొని సంరక్షింపక, నీ కిటు లుచితంబె యరవణింప నరేంద్రా. ౧౪౫

సీ. క్ష్వేళంబు క్ష్వేడంబు చోళుఁడు చోడుఁడు తాళంబు తాడంబు దళము దడము
క్రోళంబు క్రోడంబు నాళంబు నాడంబు నీళంబు నీడంబు గాళి గాడి
వ్యాళంబు వ్యాడంబు చూళిక చూడిక వళి వడి హేళి సర్వజ్ఞ హేడి
జలకేళి జడకేడి వెలలఁడు వెడలఁడు కేళంబు కేడంబు పాళి పాడి
తే. నేవళము నేవడం బిట్లు నిర్జరాంధ్ర, భాషలను రెంపు గొన్నిశబ్దంబులందు
సరయలకభేదమోర భేవ యటన్న సూత్ర, మునళకారంబునకు డత్వము ఘటించు.
సీ. డిండీరదీప్తి పోఁడిమి మీలు నీకీర్తి దిండీరపాండిమఁ దెగడు నవ్వు
డంభ మిచ్చటను గూడను కృష్ణ నీ వేగి దంభంబు మిత్రవిందకడఁ జేయ
డాడిమీఫల మిమ్మోడకు నేల కొనిపొమ్ము దాడిమీఫలము సుదంత కిమ్ము
డోలిక నూఁగు వేఁడుక నీకుఁ గల్గిన దోలిక లత్షణతోడ నెక్కు.
తే. మనుచు నీపద్యమునఁ జరణాదులందు, నిలుపుపదముల మొదలను గలుగు వ్రాలు
డత్వదత్వంబులందు రెంటను బొసంగు, శాబ్దిక మతంబునను వనజాతనయన.
తే. డంభ డిండీరడోలికాడాడిమాది, శబ్దముల కాదివర్ణము ల్సంస్కృతమున
నుపరివర్గతృతీయ మై యొప్పునట్లు, దెనుఁగున డకారము దవర్ణమొనరుచుండు.
తే. దాక దగ్గఱి దిగ్గియ దాయఁ బోయి, దాపలను దిగ్గుమను వైకృతముల మొదల
డాక డగ్గఱి డిగ్గియ డాయఁ బోయి, డాపలను డిగ్గుమని డాకడంగి నిలుచు.

రాజశేఖరచరిత్రమునందు:—

శా. డాకేల న్నిజకన్యకామణులు కంఠశ్రీలు గీలించి వీ
డాకంజాతము లాస్నహేల నఖరేఖం దార్చి సంగీతవి
ద్యాకౌశల్యము గాన రా మదికి నాహ్లాదంబు సంధిల్లఁ గా
రీకల్యాణముఁ బాడి రప్పుడు పురంధ్రీరత్నముల్ వేడుకన్. ౧౫౦

ద్రోణపర్వమునందు:—

చ. డిగకుఁడు వాహనంబులు గడిందివగంటిమి గోలుపోవ మీ
రు గడఁక దక్కి పెట్టకుఁడు రూపఱ నాయుధము ల్సహా స్త్రశ
క్తి గెలుతు నేన మత్కులిశతీవ్రశరంబుల వైభవంబు భూ
రిగదవిహారభంగియు నరిప్రకరంబులు పిచ్చలింపఁగన్. ౧౫౧

ఉద్యోగపర్వమునందు:—

ఉ. డక్కెను రాజ్య మంచు సకటా యిటు తమ్ముని భాగ మీక నీ
వెక్కటి మ్రింగఁ జూచెద వ దెట్లరుగున్ విను మీను లోలతన్

గ్రక్కున నామిషంబుశవి గాలను మ్రింగినమాడ్కి సువ్వెయి
ట్లుక్కిపుఁ డైననీకొడుకునుల్లము నిన్నిటు లాపఁ గూడునే. ౧౫౨

వైజయంతీవిలాసమునందు:—

తే. దొంగవలె వచ్చి యిక్కడ దొంగినావ, దేవయా బావగారు పెద్దామె కోప
గించినంమలకా బళా మంచివాడఁడ, వేమనందును ముసలాపె యేవివేకి. ౧౫౩

వ. డంభడిండీరాదిశబ్దములవలెనేయన్నఁదుచేత రెండునుంగలవుగనుకదకారమునకు

ఆరణ్యపర్వమునందు:—

క. జగనుల నెల్లను నిండిన, పొగడ్తకును వెలితి చేసి పొలయొడలికి సై
తగుస్ీజన్మవ్రతములు, దిగ విడువఁగ నిపుడు నాకుఁ ద్రిభువనదీపా. ౧౫౪

ఉద్యోగపర్వమునందు: —-

క. తగ నీలో నూహింపుము, దిగ విడువకు ధర్మతనయు దృఢమతి వై పొం
దగుచందము కొడుకులకును, బెగడలకును జెప్పి తేర్పు పెం పేర్పడఁగన్.

పారిజాతాపహరణమునందు:—

ఉ. తామరదోయిలోఁ దవిలి దాఁపెడు తేఁటులువోలెఁ బెన్నెరుల్
వేమఱుఁ జేతులం బెడిచి విప్పి విదిర్చి నఖాంకురంబులన్
గోమలలీల దువ్వి తెలిగొజ్జఁగినీ రటు చల్లి చల్లి గం
ధామలకంబు వెట్టె నొకయంగన కాళియనాగభేదికిన్. ౧౫౬

తే. పడఁతుక వడంకుగుబ్బలిపడుకఁ చెంతఁ, గడిమిమ్రాఁకులకడ నుండుఁగడఁకతోడ
వేఁడుకొనఁదగు నాపువ్వుబోఁడిననఁగఁ, గడలిపులుగావు సరళముల్గానికృష్ణ.

నృసింహపురాణమునందు సీసపాదము:—

సీ. వడిగాలి సుడిసిన మిడుఁగురు లందందఁ బొదలినఁ బాలిమి వదలనీక. ౧౫౭

చ. కడిఁదివరంబు వారిరుహగర్భునిచేఁ గొని నాఁడు వాఁడు మీ
యెడ ననిశంబు పెన్పగయు నీసును రోషము నెమ్మనంబులో
జడి గొని యుండుఁ గావున నసాధ్యుఁ డవధ్యుఁడు దైత్యనాథుఁ డే
వడువునఁ బౌరుషంబు గొని వాని జయించుట వ్రేఁగు చూడఁగన్. ౧౫౮

రాఘవ పాండవీయమునందు సీసపాదము:—

సీ. పుడమి తేఁ డీరితిఁ గడఁగి డెందము మృగవ్యాపారకేళిన మకేలషింప. ౧౬౦

తే. పోఁడిమియనురవడియనునాఁ డెమునను,
పలుకులఁదృతీయసరళముల్ వలసినపుడు

భువిస్వకీయమానునాసికఁబుబునుగాఁగఁ,
బలుకఁబడునావికవులకబ్బములకలిమి. ౧౬౧

రంగనాథునిరామాయణమునందు ద్విపదము.—

రాణివాసద్రోహి రావణుఁ బట్టి, పౌణిమి చెలుపవా బుధులు నుతింప. ౧౬౨

రాఘవ పాండవీయమునందు ద్విరదగతి రగడము.—

పౌణిమిగవకుళకుజపూగములఁబూగములరాణఁవనరారినపరాగములరాగముల

తే. సారవంత మై కర్ణునిసైన్యము రవ, ణించుఁ గా కేమిటికి నిల్చు నృపవరేణ్య
పూనిసేయంగఁదగనదిదానవార్య, మతని సమయించుటయునాకు నతిభరంబె.

శాంతిపర్వమునందు:—

చ. యజనము దానకర్మములు నధ్యయనంబు తప స్సహింసయుఁ
బ్రజ కనురాగ మైనపరిపాలన శాంతియు సంగరంబున
న్విజితవిభీత మై యురవణించుట యన్నియు ధర్మముల్ కురు
వ్రజతిలకాయమూన సమరంబు సుధర్మము వీనిలోపలన్. ౧౬౪

చంద్రికాపరిణయమునందు.—

ఉ. నాణెము సూడ నున్నదితినందను లందలు నాక్కరాశిదు
ప్రాణిఁటు వీఁ పొకంటు నాకరాశి యజుండు జగంబు గాల్పఁ గ
ల్యాణవిదూరు లొకడచుయఁగదలు పుణ్యజనాఖ్యలు న్జగ
త్ప్రాణసమాఖ్యుఁ డీభలుఁడు నైరి సుండీ విపరీతలక్షణుల్. ౧౬౫

తవర్గాక్షర భేదంబులు.

ఆ. వెతకి వాని కతికె జతికిలఁ బడి యావుఁ, చితుక చీర లుతికె గౌతికెననుచుఁ
బలుకుచోఁ దకారముల దకారములును, మసె నేని నిలుప వచ్చుఁ గృతుల.

కవిగజాంకుశమునందు.—

క. ఒదుగు మలతుణ మెలుఁగకు, గొదుకు చుఁద్రాసంబువడియుఁగూడుక మీఁదుల్
వెదకుచుఁ బదసంధులు చెడ, నదుకుచు వెతకవిత చెప్పనతఁడుం గవియే.

ఆముక్తమాల్యదయందు.—

చ. కదళిగభీర పుష్పపుటికాచ్ఛటఁ జేతుల నిప్పవిండి నైఁ
గుదురుగ నిల్పి యోపుగతి గూనలనూనియ నించి త్రాట ము
న్నదికినశాటి వ్రేల నదినాక్కటిఁ గ్రుంకిచి వత్తు రెండ తే
వవలకఁ బూతనింట శనివారమునం బరదేశ వైష్ణవుల్. ౧౬౬

చిత్రభారతమునందు:—

చ. చదివినవారికెన్నఁగినసభ్యుల కున్నవి వాంఛ సేయుబ
ల్లిదులకుఁ గల్గు విప్రులకు లేఁగలతోఁ గనుపట్టులతుపె
న్పాదవుల నిచ్చునట్టిఫలము న్హయమేధము సేయుపుణ్యముల్
గొాదకక ధాత్రి యంతయు నకుంఠితదాన మొనర్చుశ్రేయముల్. ౧౭౦

కళాపూర్ణోదయమునందు:—

చ. అది శతతాళదఘ్న మనుసార్థకనామముతోడ నుత్తమ
హ్రదములలోఁ బాగడ్తఁ గనినట్టిది యందునఁ బడ్డవానికిన్
బ్రదుకులె యంచు. ౧౭౧

వాసిష్ఠరామాయణమునందు:—

చ. కదిసిన నోరవోవుదురు కబ్బపుదొంతులసత్పదార్థముల్
గఱుకుచు నెట్టివారిఁ బొడగన్నను గుబ్బసిస్నేహసౌఖ్యముల్
మదికి నసహ్యమై శునకమార్గమునం జరియించుచున్నదు
వ్యథకవు లెల్ల మత్కవిత తప్పులు పట్టక యూర కుండుఁడీ. ౧౭౨

అంతస్థభేదంబులు:—

మూ.సూ:—లఘ్వో లఘువ శ్చేతి ద్వేధా న్తస్థాన్వద న్తి శాస్త్రరః
అన్యే న్యవ్యాకరణస్పష్టా ర స్త్వత్ర గృహ్యాతేద్వివిధః.

క. అలఘులఘునామకంబుల, నలరు నిరుదెఱంగు లగుచు నంతస్థము లీ
తెలుఁగున నయ్యెను శేషము, యలవలు సెప్పఁబడి యందు వ్యాకరణములన్.

క. ఆద్యంతాంతస్థంబులు, చోద్యం బగుపాణినీయసూత్రమువలనన్
హృద్యము లై యాగమసం, వేద్యా లఘ్వ లఘువు లన ద్వివిధము లయ్యెన్.

యవలు రెండువిధము లయినందులకు.—పాణినీయసూత్రము.

సూ. హలి సర్వేషాం.

క. పలుకులఁ బ్రాకృతసూత్రము, వలనను ద్వివిధంబు లగుచు వసుమతిలోన
న్వెలయుఁ దృతీయాంతస్థము, వలమును గొంచెం బనంగ వనజదళాక్షా.

లకారము రెండువిధము లైనందులకు—వాల్మీకిసూత్రము.

సూ. లోళః పైశాచ్యామ్.

వృ. లకారస్య ళ స్స్యాత్, ముకులస్య, ముకుళః. గలస్య, గళః. ప్రలయస్య, ప్రళయః.

క. అంతస్థంబులలోపల, వంతున కనఁగా ద్వితీయవర్ణం బీగ్రం
థాంతరమున నిరుడెఱఁగఁగుఁ, గంతుజనక రేఫమును అకారం బనఁగాక.

రేఫము ద్వివిధ మైనందులకు.

మూ. సూ.—ర స్త్వత్ర గృహ్యతే ద్వివిధః.

టీ. రస్తు= రేఫమయితే, అత్ర= ఈ యాంధ్రభాషయందు, ద్వివిధః= రెండువిధములుగా, గృహ్యతే= గ్రహింపఁబడుచున్నది.

యకారభేదంబులకు.

మూ. సూ:—ఆద్యః క్రియాసు భూతాద్యర్థసముద్యోతిన మాద్యగం
వినా సర్వః.

సీ. ఆంధ్రోక్తిమొదల నాద్యంతస్థ ముండదు ప్రాణ మై యది గనుపట్టుఁ గాని
నుడుగులనడుమను గడను యా కెంపును దలకట్టు దక్క నెత్వంబు లేదు
యాకు భూతాదిక్రియాద్యోతితములఁ జూపట్టునత్వము దలకట్టు గాదు
తలకట్టు వక్రము ల్దాల్చునీ రెండును నలఘు యకారంబు లనఁగఁ బరఁగు

తే. నిప్పు డీవంకఁ గనుగొంటినింతలోన, నెచ్చటికి నేగ ననఁగ నాద్యచ్చులయ్యెఁ
గయ్య మైనను గానిమ్ము గాయకమునఁ, గాయ నలె శౌరి ననఁ దలకట్టులయ్యె.

సీ. ఎక్కడఁ గనఁబడియెడుఁ జక్రి చెలులార యింక నెవ్వరు చనియెదరు వెదక
నీవేళ నెటకుఁ బోయెద వన్న మిన్నక యేగెన న్నే మనియెదరు మీరు
హేమాంగదము లిడియెదఁ జెప్ప రే వాని సేరితిఁ బాడఁగనియెదము మనము
హితము దలంపఁ డాయెను నన్నుఁ గని నగియెడుసవతుల కిది హేతువయ్యె

తే. ననుచు నిట్లు భూతాదిక్రియాపదాంత, ములకును విశేషణపదక్రియలను దక్క
మొదలియంతస్థమున కేత్వములు త్రిలింగ, దేశభాషను బుట్టవు దితిజభేదిఁ.౧౭౦

ఆదియకారంబునకు నుద్యోగపర్వమునందు:—

తే. కొంచెమైననుదగఁబంచికుడువ మేలు, పనులయెడదుఃఖమొచ్చియప్పంబుసుఖము
ననుభవించుట హితము శత్రునకు నైన, నిచ్చుటయె లెస్స యడిగినయెడ నృపాల.

మధ్యయకారమునకు రుక్మాంగదచరిత్రమునందు:—

మ. ధననాథప్రియకంఠకాళిమము మోదం బొప్ప వీక్షించి చ
య్యన జంబూఫల మంచు దాని నిజహస్తాగ్రంబు వే చాఁచి యే

పునఁ బల్మాఱును బట్టి రాఁ దిగుచువేల్పుంబ్రోడ విఘ్నేశ్వరుం
డనుమోదంబునఁ జేయు మత్కృతికి నత్యంతంబు నిర్విఘ్నమున్. ౧౭౦

విజయవిలాసమునందు:—

మ. అసిన స్మీమవిలోఁ దలంచునది మే లౌ సిద్ధసంకల్పు లీ
రని యావేళనె చిత్రవాహనుఁడు కొల్వై యుండఁగాఁబోయి యా
యన రా రమ్మని గారవించి సుముఖుండై రాజుగా రిప్పు డే
మనినా రయ్యని వార్త లంచుఁ బయిపై నాసక్తితోఁ బల్కఁగన్. ౧౭౧

వ. భూతాదిక్రియార్థంబులు దెలుపని కడపటియకారమునకు.

విరాటపర్వమునందు:—

ఉ. స్వాంతము శాపలగర్వఘనసంతమసాంధము గాఁగ శంక యా
వంతయు లేక కీచకుఁ డహంకృతి ముంగలినాగపంటపా
భ్యంతరసీమఁ జొచ్చి దరియం జని యారసి సెజ్జ గాంచి య
త్యంతముదావహం బగుడు నందు రయంబునఁ గేలు సాఁపఁగన్. ౧౭౨

చమత్కారమంజరియందు:—

మ. ధరలోనన్ ద్విజరాజనామమున సత్సంగంబున న్సత్కళా
నిరతి న్మించియు నుత్పలప్రియుఁ డన న్నిత్యంబు రాజీవసం
హరణం బే కరజాలముల్ సొనిపి సేయం బూను నీచంద్రుఁ డో
తరుణీ వీనికి నెంతఁ జేసిన దయాదాక్షిణ్యముల్ గల్గునే. ౧౭౩

క్రియాపదాంతయకారమునకు శృంగారనైషధమున:—

చ. అడిగితి నొక్కనాఁడు కమలాసను లేఁకి వారువంబ నై
నడుచుచు నుర్విలో నిషధనాథుని కెవ్వతె యొక్కభార్య య
య్యెడు నని చక్రఘోషమున నించుక యించుక గాని యంత యే
ర్పడ విన నైతి నీ వనుచుఁ బల్కినచందము దోఁచె మానసీ. ౧౭౪

తే. ధరణిపుయ్యెలపయ్యెద తాయెతులను, గలయికారంబులకు వక్రములు నిజంబు
ముద్దరాజురామన వానిమాఁటెని బద, మధ్యయాలని చెప్పె నిమ్మాట మిథ్య.

తే. ఊఁచు నెలకా కగుటచేత నుయ్యె లయ్యెఁ
బయిని యొద కున్కి వక్రోక్తిఁ బయ్యె దయ్యెఁ
దల్లి కాపున కైకట్టఁ దగినసరులు
త్రేలఁ బల్కఁగఁ దాయెతు ల్డైశ్యమునను. ౧౭౫

వ. హేలాశబ్దమునకుఁదద్భవమేల. అది కులుచకాకుచే హ్రస్వముగాఁ బలుకఁగా ఎల ఆయినది.ఊఁచెదు సెల గనుక ఉయ్యెల హృదయశబ్దమునకుఁ దద్భవము ఎద ఆయెను. దానికిఁ బై నుండెడిది గనుక వక్రసమాసమునఁ బయ్యెదయాయెను. ఎత్తులనఁగా దక్షిణదేశీయమున దండలకుఁబేరు. దానిజడ్డను తేలఁబలికిన ఎతు లాయెను. తాయి యనఁగాఁ దల్లి ఆతాయి శిశువులకు శరీరరక్షగాఁ గట్టునది యెతులు గనుక తాయెతులు అటు గనుక శబ్దాది నున్న అచ్చులు గాని హల్లులు గావు సంధిచేతను లఘుయకారము లైనవి. ఇవి మూఁడును ప్రత్యేకపదములు గాని యేకపదములు గావు. వీనిని దెలియక ముద్దరాజు రామనకవి లోకసంజీవనియందుఁ జెప్పికొనిన పద్యము. ౧౮౭

తే. తాయెతులు నుయ్యెలయుఁ బయ్యెదయును దక్కఁ
గలుగ దెత్వంబు మధ్యయకారమునకుఁ
మదిని గ్రియఁ దక్క నెత్వంబు గదియ దాది
నత్వ మొందదు దెనుఁగున నబ్జనాభ. ౧౮౮

ఉయ్యెలకు పరణ్యపర్వమునందు:—

చ. కలి దమయంతిఁ బాప సమకట్టఁ బొరింబొరిఁ బాయ నోపఁ డా
లలనను దీర్ఘసౌహృదజలంబున నిట్టులు రెంటియందు న
న్నలుఁడు విమోహరజ్జులు పెనంగ గతాగతకారి యైనను
య్యెలయును బోలె నూఅడక యెంతయుఁ బ్రొద్దు వినిశ్చితాత్ముఁ డై. ౧౮౯

పయ్యెదకు యయాతిచరిత్రమున సీసపాదము:—

సీ. వలఁ బడ్డజక్కవల్ వలె నున్న జిలుగుపయ్యెదలోనిగుబ్బపాలిండ్లు మెఱయ.

తాయెతులకుఁ జంద్రభానుచరిత్రమునందు సీసపాదము:—

సీ. ఒకయింతిమొరఁగిన సికమీఁదసుడిపువ్వులొత్తులు దోరయుతాయెతులు చుట్టి.

లఘుయకారమునకు.

మూ. సూ:—య శ్రుతి మార్యా లఘుయం ప్రవదన్తి ప్రాణతః పరం ప్రాణమ్.

తే. తొలిపదము తుదివర్ణంబుతోడఁ దమకు, సంధి లేనిపదాదిగ స్వరము లెల్ల
లఘుయకారంబులై భూతలమున వెలయు, దేవకీపుత్ర జాంబవతీకళత్ర. ౧౯౦

క. సురనది యమాత్మజకాకో, దరపతి యాసనను మరుఁడు తనయుఁడు రతిసుం
దరి యన్న ననఁగుకోడలు, సిరి యద్దియు నాలుఁ బరపు శ్రీహరి కెపుడున్.

## రేఫభేదంబులు.

తే. రేఫము ఱకారమును నన రెండు దెఱఁగు, లగుచు వికృతిపదంబుల నమరియుండు
వానిసంస్కారపూర్వకావ్యప్రయోగ, సరణుల నెఱుంగవలయు సజ్జనవిధేయ.

వ. సంస్కార మనఁగా లక్షణవంత మనుట. ఇందులోనే భాషాపరిచ్ఛేదమునం
దుఁ జెప్పియున్నది.

తే. ప్రకృతి శబ్దానుశాసనోభయకవిసఖ, శంభుసేవకసోమభాస్కరులచేత
భారతాదుల విభజింపఁబడియెఁ దొల్లి, కరివరద రేఫములును ఱకారములును.

## రేఫాక్షరసీసమాలిక.

సీ. శ్రీకామెపల్లిపురీగోపికాజార యసురసంహార నీ కంకితముగ
నాదికవీంద్రకావ్యము లెల్ల శోధించి క్రమత హ్రస్వములు దీర్ఘములునైన
యచ్చులమీఁదను హల్లులమీఁదను గలుగు రేఫఱకారములు వచింతుఁ
దాళ్లపాకాన్వయోదధిపూర్ణధవళదీధితి వేదతిరుమలదేశికుండు
మొదలైనవారలు మును రచించినయవి యెల్లఁ జాలవా యనఁగ వలదు
వెండియు నాకకొన్ని వెదకి కూర్చితిఁ గవిరాజులు మే లని ప్రస్తుతింప
నిఱ్ఱి వెఱ్ఱియు నని యిట్లు క్రిందను జడ్డ లుండెడులివి యెల్ల బండిఱాలు
వీనిద్విత్వము లొకవేళఁ బోయినఁబోవు జెఱిపోఁతుకఱిమేఁక గొఱియయనఁగఁ
జనిరి కాంచిరి చేకొనియెద రనియెదునవి మొదలైనక్రియాపదముల
తుదలను సంస్కృతపదములందును దద్భవములయందును ఱకారములు లేవు
క్రచ్చఱ బ్రతుకుట గ్రాలుట మొదలగు క్రారము రేఫవర్ణములె యగును
జేకూఱె ననుటకుఁ జేకుఱె నని యిట్లు పాడుగు లెల్లను హ్రస్వములుగఁ జేసి
పలికెడువేళ రేఫములును ఱాలును మునుపటియట్లనే తనరుచుండు
ఱా దక్క సకలాక్షరములమీఁదను గార కదియ లకారక్షకారము లన
నట రవర్ణమున కొక్కటికిని ఱై నిఘ యని నిల్చుటను రేఫ మనఁగఁ బరఁగె
నరదంబు సేనాంగ మరుగుట పోవుట యరి కప్పు మరసగ నరుసు వింత
యరయుట వెదకుట యిరవొందు టమరుట యిమపదంబయు గార్హ మినవు నెళవు
కలనఁ జెట్టుసుమమటగద్దికసేయుట యరణించు టురు లొడ్డు టురులఁ ద్రోయు
టురనడించుట పోఁకనాత్రుటయరవడి యరియాపటయ డెంచనరియఁ జేయు
టురగలి చిచ్చు మేఁకెరు వెరమాంసట యొర గాఁగ భోజనంబిడి యొరియుట
యొరులొంరుతారులు సొమ్ములొరయుట యొరిచుకేకరింవాఁడితూపులుకరిసెముకృషి

కరువలి పుత్త్రడి కఱఁగి యాకఱణిని గరుగునఁ బోసి యొక్కరుఁడు చేసెఁ
గరవాలు ముక్కర కరకరల్ కరకరి కరిగోరుటలు కనికరము వాన
గుఱియుట తొలకరి కారఁ బ్రాణములు కరకరఁ గ్రాలికర మొప్పఁ గెరలి పడుట
గరిత బంగరు మేనుగరువాల్చెఁ గఱిచెలి* గరగ చేఁబట్టుట గరువతనము
గిరగిర ద్రావు వేగిరపడి జేగురుకొండపై గుఱుపోతు గురుసు పట్టి
గుఱువులు చారుచు గుఱువుగా గుఱుగాకు గుఱుగుల బెట్టి ముగ్గురును వండి
చెరు(ఱు)చుటయునుమరి చెచ్చెరచేటను జెరుగుట చెరువులోఁ జొరవఁ జేసి
చూరక యచ్చెరువుగా చిరుగనికోకలచెర(ఱ)గులు చించుట చెరుగు మనుట
తరచి యాడుటయుఁ జిత్తరుబొమ్మ తరఁగలు తరిచిన మజ్జిగ తరము బడిత
తరము శక్యము మూఁడుతరముల చుట్టంబు తరలఁ జారుట తరతర దిరుగుట
తిరిసినకూడు మార్తురమేని నెత్తురు తెరలఁ గాఁగిన నెయ్యి తెరువు దారి
తెరతెర వచ్చుట తెరలు గట్టుట తెంపు తెర(ఱ)గులవారిలో దొరలుకొనుట
తొరితొరి చెమ్మట దొరగుట ఛెదరుట దఱి ద్రొక్కి జూదరి దరికొలుపుట
దురము సేయుట దుర్దురబోయి కుమరుట దొరయుట సరియాట దొరకొనుటయు
దొర రాజు దొరకొలు నొరయుట* బొసఁగుట నరవెంట్రుకలు పెద్దనరము నురుగు
నెరయఁగాఁ జల్లుట నెరసులు పరుసంబు పరువులు వెట్టుట పరవు నిడుపు
పరిషను దెంచుట పరిగొని పరిపరి పరఫుట నించుట పఱువడి యనఁ
బరిమారుచుట పెనుపరి నేమపరి దొడ్డసరి చప్పరంబు దెప్పరము పరగఁ
బరికింప పనుసు పొంపిరి వోనఁ బురికొని పురపురఁ బొక్కుట పెరుగు పెరవు
పెర తేనె పొరిఁబొరి పొరుగునఁ బొరిగొని పొరిగడుగుట పొరపొచ్చెము పొర
పొరలుట చీఁపురు పొరకలు బరికట్టె బరుజులు గజ్జెలు బరవసంబు
బరు లుబ్బఁగా నానవాలు ద్రావుట బరిమేను గంధఁపుచెక్క మీఁది బరడు
బిరుదు లబ్బురము గొబ్బరకాయ బెరయుట బురబురఁ బొంగుట బురదనేల
మరులు మోహము బుద్ధి మఱపుట తామర మరియాద క్రమ్మర(ఱ) మరలి చనుట
మిరియంబు మురిపెంబు మురియలు తునియలు మురమురలాడుట మెరమెర యును
మొరపనేలయుఁ జేంట్లు మొరయుట మొరపును రమ్మని పిలుచుట రచ్చరంగు
రంకెలు రజ్జులు రమణి రక్కసి రసి రివ్వలు రిత్తయు రెట్ట రెండు
దేవర విహరంబు తెరువరి తలవరి యెవ్వరు నెయ్యరు నవ్వరనఁగ
వరచేను వరుజులు వరుసయు వర(ఱ)పును నోవరి విరవిరఁ బోవుటనఁగ
విరిసిన విరుతెల్ల విరియఁ జల్లుట కాలువురు పలువురు నలువురు పనువురు

వెఱవఱి వెఱవాక వెఱసు దూసరివడ్లు సరకు లమ్మట సరి సరకు గొనమి
సిరికి నై సురియలసురుఁగుట సెరబడి* సొరిది మోహరములు హరుఙ్గొనుట
మొదలుగా నొకకొన్నిపదముల హ్రస్వాక్షరములపై రేఫంబు లమరి యుండు
నారెకు ల్తలవరు లారాట మారట మాఱఁ గూరినశోక మాఱఁ గాఁగి
నట్టిపా లారనియసల మాఱఁగ* ధర్త్ర మాఱసెఁ దనకన్నులారఁ జూచె
శ్రమ మాఱెఁ బొంగారెఁ జల్లారెఁ దనరారె సిరిక లెత్తుట యిగురు పెట్టు
టిశేడుజగను లీరెలుఁగు హీనస్వర మీ రన నిమ్ము పేరూరు పల్లె
యారార్చు టూరట యూర కుండుట దొంగ లేరి యనుట యిదియేరి కనుట
యోరోరి యనుమాట కోరుచుకొనుటయు నోర వోయినగోనె లోరసిలుట
కారు(బు)లు కల్లలు కారుమెఱుంగులు పసుకాను ముక్కారు పంటకారు
కారించుట రిపులు కడు నొప్పి పెట్టుట కారాకు కారాట కాఱియంబు
కూరుట పొందుట కూరుకు నిద్ర చేఁగూరుట కూరిమి కూరదినుట
దుమ్ములు గూరగా నేయుట గాత్రంబు గూరుట దాఃకిఁ గూరుతు ననఁ
గోరిక గోరుట కోరప్పనము పంది కోరాడ కోగతి కోర గిన్నె
గారెలు భక్ష్యముల్ గారాము బంగారు గోరు గారాబంబు గారవంబు
చీరికిఁ గొన క్రైపుచీరలు గోరుట చేరవ చెంతలఁ జేరఁ డనఁగఁ.
జీరుట పిలుచుట చూ రనఁగాఁ బొడి చారు ద్రావుట చిన్న చూరకత్తి
తా రెల్ల నేగిరి తీరనికినుకతోఁ దూరుపునాటికిఁ జేరు శెక్క
తేరెడ పనుచు నేతేర తేరకుతేర తేరోరి సొమ్ములు తోరముగను
దూరులు వలుకుట నారచీరలు వింటినారి విన్నారు కన్నార మనఁగ
నీరు ద్రావుట పోర నీ రయి పోఖుట నేరుపు నేరేపు నోరు వదుట
పూరేపు జగడంబు పేరుట పే రాఖ్య పేరిన నేతులు పేరురంబు
పోరామి పోరచి పోరోరి యనుటయు పోరుట పోరాట పోరితంబు
బారు గట్టుట దైత్యుబారికిఁ దప్పుట బారెము బీరంబు బూరటిలుట
బూరుగుచెట్లలో బూరుగ లూఁదుట బూరెలు బేరంబు బేరజంబు
బోరనిమ్రోయుట బోరుఁగొండలనంగ బోరలు క్రిందుగా బోరగిలుట
మారటమూర్తి దైయె మారిమసంగుట మారేడు వేమారు మారుతు రన
మీరల మేరలు మోరత్రో పులనంగ రాయంచరాచూలి రాయిడిపడి
రాణ రాణించుట రాయలు రాణువ రాపాడి రాముల్క రాసు* రావి
రాచుట రాఁజుట రాయుట రాలుట రాగిల్లుటయును దారా యనుటయు

రాను పో మ్మనుటయు రారాపు పలుకు పోరా వినరా యేలరా చలంబు
రీతి గా దనక నీరీతి రూపించుట రూపుట రూపరి రూపు రూక
రేయి గేదంగిపూఁరేకులు రేయెండ రోఁజు రోఁకలి రో(లో)లు రోవెలంది
ఘనులార బాలుర కాలారి జాలారి పేరు కోలారి తలారికాండ్రు
వారువ మశ్వంబు నారనికోపంబు వారించుకొనుటయు వారకలును
వాసక వార లెవ్వారును దెలియనివారు గా రిది యెల్లవారకంబు
వీరలసాటి లేరీ రాజ్యమున నన సారెలు జూదంబు సారె సారె
సైరణ లేక వేసారుట సూరెలు సోరణగండ్లును సేరుపసపు
తే. సారు సారంబు నోడచేహరి వింత, పోర యనునిట నాదిగా నొక్కకొన్ని
తెలుఁగుపలుకులలోపల దీర్ఘలిపుల, పైఁ దనరారుచుండు రేఫములు కృతుల.

## హ్రస్వాక్షరములమీఁది రేఫములకు రూపములు.

అరదంబు- రథము
అరుగుట. .పోవుట
అరి యనఁగాఁ దనకన్న దొ
డ్డరాజునకుం జెల్లించు పన్ను
అర- సగము-దీనికిలక్ష్యము
అరగంటఁ జూచుట -
సగముకంటఁ జూచుట
అరవాయి...సగము నోరు
అరగొఱఁత..సగముతక్కు
వ- ఇవి మొదలైనవి
అరుదు...వింత
అరయుట-పరామృశించుట
ఇగురొందుట...అమరుట
ఇరు...అనఁగా రెండు దీ
ఇరువాగు (నికిలక్ష్యములు
ఇరువంక
ఇరువురు...ఇద్దఱు
ఇరువాయి...రెండునోరులు
ఇరు గేలు... రెండుచేతులు
ఇరుమేనుఇవి మొదలయినవి
ఇరవు - నెలవు (చుట
ఉరుమాట- జగడమున గద్దిం
ఉరణించుట

ఉరులొడ్డుట-వేఁటకాఁనిపని
ఉరులఁ ద్రోయుట...కోట
లు మొదలయినవిపడఁ
గొట్టుట
ఉరవడించుట
ఉరువడి...బిగ్గర
ఉరియాడుట
తెరిద మురియఁ జేయుట
ఎరగలి-చిచ్చు (లు
మేఁకెరువు - మేకపెంట్రిక
ఎరమానుట...ఎరపరికము
విడుచుట
ఎరగా నాహారముఁబెట్టుట
ఎరియుట
ఒరులు...అన్యులు
ఒండొరులు...ఒకరొకరు
సొమ్ము లొరయుట.. ఒర
గంటను రాయుట
ఒరిమి...కలిపికోలుతనము
(ఒరిమికయనియుం గలదు)
కేకరి...వాఁడితూపులు
కరిసెము...కృషి
కరువలి...గాలి

పుత్తడి కరఁగుట-కంసాల
(వానిపని
ఈకరణిని-ఈరీతిని
కరుగునఁబోయుట - పోఁ
తఁబోయుట
ఒక్కరుఁడు
కరవాలు...ఖడ్గము
ముక్కర=ముత్తెము
కరకరలు
కరకరి
కరి గోరుట
కనికరము - దయ
వాన గురియుట
తొలకరివానలు
కొరఁ ప్రాణములు
కరకరఁ గ్రాలుట (ప్పుట
కర మొప్పుట...మిక్కిలియొ
కెరలుట
గరిత...పతివ్రత
బంగరు...పైఁడి
మేను గరు దాల్చుట...గగు
రుపొడుచుట
కరిపెళి*

గరగ- పెండ్లిలోఁ జేతఁ బట్టుకొని యుండెడు ముంత
గిరువతనము - సరకు సేయకపోవుట
గిరగిర ద్రాయుట
వేగిరపడుట
జేగురుకొండ
గురుపోతు
గురుసులవరపు గురుసులు (విశేషము
గురువులు జారుట...గమన
గురువుగాను దొడ్డగాననుట
గురుగాకు...గురుగు కూర
గురుగులు - పిడతలు
ముగ్గురు
చెరు(లు)చుట
చెచ్చెర చేటను చెరుగుట
చెరువు - తటాకము
చొరవఁ జేసికొనుట
చొరకపోవుట
అచ్చెరువందుట
చిరుగనికోక
చెరఁ(ఱ)గులు-అంచులు
చెరుగుట
తరచి యాడుట
చిత్తరుబొమ్మ
తరఁగలు-కరళ్లు
తరచినమజ్జిగ
తరము-ఝడిత (మాగాదనుట
తరముగా దనఁగా - శక్య
మూఁడుతరముల చుట్టము
దేహము తరఁటఁ జారుట
తరతర
తిరుగుట - సంచరించుట
తిరిసెనకూడు

మారుతురు - పగవారు
మేనినెత్తురు
తెరలఁ గాఁగిన నేయి
తెరువు-దారి, త్రోవ
తెరతెర వచ్చుట
తెరలు గట్టుట (గలు
రెండు తెరఁగులు- రెండు తె
తొరలుట - కలయుట
తొరితొరి
చెమట తొరఁగుట
బెదరుట చింత్యము
దరి ద్రొక్కుట
జాదరి
దరికొలుపుట (నేయుట
దురము సేయుట- జగడము
దురదురఁ బోవుట
కుదురు సేయుట
దొరయుట - సరివచ్చుట
దొరకొనుట
దొర - రాజు
దొరకోలు
దొరయుట* పొసఁగుట
నర - వెండ్రుకలు
పెద్దనరము - జీవనరము
నీటినురుగులు
నెరయఁ జల్లుట
నెరసులు
పరుసము
పరువులు వెట్టుట
పరపు - నిడుపు
పరిచను దెంచుట
పరిగొనుట
పరిపరి
పరపుట - నించుట
పరువడి

పరిమారుచుట
పెనుపరి
నేరుపరి
దొడ్డపరి
చప్పరము
దెప్పరము
పరఁగ
పరికించుట
పరుసు
పొంపిరి వోవుట
పురికొనుట
పురపురఁ బొక్కుట
పెరుగు
పెరడు - ఇంటివెనుక
పురిటిపగవు
పురుడు - ఈడు
పురికొల్పుట
తుట్టెపురువులు
పెరుఁగుటనిక్కుట
పెర - తేనెతెట్టె
పొరిఁబొరి
పొరుగు
పొరిగొనుట
పొరిగడుగుట
పొరపొచ్చెము
పొర
పొరలుట
చీఁపురు
పొరకలు
బరికట్టె
బరుజులు - గజ్జెలు
బరవసము
బరులు - వళులు
బరిమేను-దిసమొల(తాఁట
గంధపుచెక్కమీఁది బరడు

బిరుదులు
అబ్బురము
కొబ్బరికాయ
చెరయుట
బురబురఁ బొంగుట
బురదనేల
మరులు - మోహము
బుద్ధిమరపుట
తామరపువ్వు
మరిచూడ
క్రమ్మర(అ)
మరలిచనుట
మిరియము
మురిపెము
మురియలు - తునియలు
కోపము మురమురలాడుట
మదిలో మెరమెర
మొరపనేల (యుట
తేఁళ్లు మొరయుట - కూ
మొరడు - మోటు
రమ్మని పిలుచుట
రచ్చ
రంగు
రంకెలువైచుట
రజ్జులాఁడి
రమణ
రక్కసి
రహి
రిచ్చపడుట
రిక్తకు రిత్త
రెట్టవడుట
రెండుచేతులు
దేవర
వివరము
తెరువరి

తెలవరి- తెలారి
ఎవ్వరు
ఇయ్యరు దానమియ్యరు
నవ్వరు
వరిచేను
వరుజులు గట్టుట
వరుస
వర(అ)పు-వానలేమి
ఓవరి
విరవిరఁ బోవుట
విరియుట - విప్పవుట
విరులు - పువ్వులు
విరియఁ జల్లుట
కాలువురు - కాల్బలము
పలువురు
నలువురు
పదువురు
చెరవరి
చెరవాక
చెరసులు వేయుట
చూసరినడ్లు, కేసరులు,
దినసరులు, మొదలైన
వన్నియు
సరకు అమ్ముట
సరి
సరకు గొనమి
పరవసేయకపోవుట
సిరి...లక్ష్మి
సురియలు...చూరకత్తులు
సురుఁగుట-అదృశ్యమగుట
సెరబడి*
సారిది...చాలు
మోహరము - దండునకుఁ
పెద్దమొన
హరువు...ఉపాయము*

ఇవి హ్రస్వాక్షరముల
మీఁది రేఫములు.

—o—

దీర్ఘాక్షరములమీఁది
రేఫములకు రూప
ములు.

ఆరెకులు...తలవరులు
ఆరాటము
ఆరటము
ఆరఁ గూరినశోకము...తీర
నాడినదుఃఖము
ఆరఁ గాఁగినపాలు (యగ్ని
ఆరనియనలము...శమింపని
ఆరుట (ర్లించుట
ధర్మమారయుట - పరాము
తనకన్నులారఁ జూచుట -
కన్నులనిండుగఁ జూ
చుట
శ్రమ మారుట - బడలిక
దీరుట
పొంగారుట-పొంగు దీరుట
చల్లారుట చల్లదనము నిం
తనరారుట (డుట
ఈరికలెత్తుట-ఇగురుపెట్టుట
ఈరేడుజగములు
ఈరెలుఁగు...హీనస్వరము
ఈరు - ఇమ్ము
ఊరు-గ్రామము (వుట
ఊరాచుట...దుఃఖముడు
ఊరకుండుట-చాలించుట
దొంగ లేరని యడుగుట
ఇది యేరికి...ఎవ్వరికనుట
ఓరి యని పిలుచుట
ఓరుచుకొనుట

ఓర వోయినగోనెలు
ఓగసిలిపోవుట
కారు(ఱు)లు-కల్లలు
కారుమెఱుంగులు
పటుకారు
ముక్కారు-పంటకారు
రిపులు గారించుట- నొప్పి
కారాకులు [చేయుట
కారాటము
కారియము...కర్జము
కూరుట- పొందుట
కూరుకుట-నిద్రవోవుట
చేఁగూరుట
కూరిమి
కూర దినుట
ఎమ్ములు గూరఁగా నేయు
ట-ఱొముకలు నాటనే
యుట
గాతము కూరుట నాటుట
దానికిఁగూరుతు ననుట
కోరిక
కోరు-అప్పనము, కానుక
కప్పము
పంది కోరాడుట
కోరడి=కరగోడ
కోర=గిన్నె
గారెలు
గారాము
బంగారు
గోరు-నఖము
గారాబము
గారవము
చీరికిఁ గొనక
అయిదు చీరలు-కోకలు
చేరువ-సమీపము

చేరుట
చీరుట-పిలుచుట
చూరు-పొడి
చారు ద్రాగుట
చూరకత్తి
తారు (పము
తెరనికినుక...శమింపని కో
తూరుపునాడు-దేశము
తేరులు-రథములు
తేరెదము అనుట
ఏతేరిన వచ్చితేని అనుట
తేరకు తేర
తేర యనియుం గలదు
తేకోరి-తేరాఓరీయనుట
తోరము
దూరులువలుకుట
నారచీరలు
వింటినారి
పిన్నారు
కన్నారము
నీరు ద్రావుట
పారనీరయిపోవుట-పచ్చుట
నేరుపు
నేరేడు
నోరు వదుట
పూరేడుపిట్ట
జగడము పేరుట
పేరు...నామము
పేరిన నేతులు
పేరుగము...పెద్దబొమ్మ
పేరాముదపుగింజలు మొద
పోరామి [లయినవి
పోరచికూరమొదలైనవి
పోరోరి- పోరా యోరియ
పోరుట [నుట

పోరాట
పోరితము
బారు కట్టుట
దైత్యుబారికిఁ దప్పుట
బారెడు
బీరము
బూరటిలుట
బూరుగుచెట్టు
పెద్దబూరుగ యూఁచుట
బూరెలు - పిండివంటలు
ఓడబేరము
బేరజము
బోరని మ్రోయుట
బోరుగొండలు
బోరలుట[క్రిందుగానుబోర
మూరట మూర్తి [గిలుట
మూరి మసంగుట
మారేడు
వేమారు
మారుతురు - పగవారు
మీరలు
మీరును
మేరలు
మోరత్రోపు
రాయంచ
రాచూలి
రాయిడిపడి
రాణ
రాణించుట
రాయలు
రాణువ
రాపొడి...రాచినపొడి
రాములకపండు
రాసు - యథార్థము*
రావిచెట్టు

రాచుట
రాఁజుట
రాయుట
రాలుట
రాగిల్లుట
రారా యని పిలుచుట
రాను పొమ్మనుట
రారాపువలదు
పోరా
వినురా
ఏలరా చలము
రీతి గాదు - నడితి గాదు
ఈరీతి నిరూపించుట
రూపుట- ఒకరిని తెలుపుట
రూపరి
రూపుచెడుట
బంగారురూక
రేయి - రాత్రి

గేదంగిపూరేకులు
రేయెండ - వెన్నెల
రోఁజు పుట్టుట
రోఁకలి
రో(లో)లు
రోజెలఁది-వేశ్య
ఘనులార(సంబుద్ధి)
వాలురు (ప్రథమాబహువచనము)
కాలారి
జాలారి
వేరు
కోలారివాఁడు
తలారివాఁడు
వారువము - గుఱ్ఱము
వారసికోపము...శమింపని
వారించుకొనుట [కోపము
వారకలు
వారక

వారలు
ఎవ్వారు
తెలియనివారు గారు
వారకము
వీరలు
సాటిలేరు
సారెలు - జూదము
సారెసారె
సైరణ లేక
వేసారుట
సూరెలు - పార్శ్వము
సోరణగండ్లు - గవాక్షము
సేరుపసపు
సోరు
సౌరము - ఒకమతము
ఓడసేహారి
వింతవిహారలు

ఇవి దీర్ఘాక్షరములమీఁది రేఫములు.

అకార సీసమాలిక:—

సీ. ఆఱవఱ లనఁ దునియలు నోట నఱచుట యఱిమఱి యఱగొఱ లఱుముటయుబ్బ
టఱకడఁ జెట్టుట యఱచేర నఱకాల నఱవలు ద్రావిడు లఱువు డఱిసె
లఱిగిపోవుట కొంచె మఱుటఱమఱ సేయు టఱ లేకచనుటఱు గఱుపుకొనుట
ఆఱువదిగో ట్లఱ పొఱఁడు గుజ్జుక్కఱ రూపఱి పొలుపఱి యేపఱచుట
పెంపఱి సిగ్గఱి బిట్టఱి పెల్లఱి నఱయిల్లు క్రచ్చఱ యక్కఱపడి
యఱకమ్ము టను ఱంటులఱడఱకం బిఱియుట కదియుట నలుగుటయును నన
నిఱులు చీఁకటిబండియిఱుసు క్రిక్కిఱియుట యిఱుకటంబిఱుకన్న మిఱిసిచెడుట
యఱఁడు హైఱానఁ డేఱు నుఱుకుట వేచను టఱపడం జెల్లెడ నుఱుతపిల్ల
లఱు వన్నెలా వను టఱది చెట్టిదమ్మ్యను ఱకమానక మొగులొడ్డిఱయుఱిమె
నుఱుకఱి బలమఱి యాఱియయిల్లుఱియుట యుఱనికోపంబున నుఱుకఁ బట్టి
గొఱపఱికంబున నొఱఁగుట మ్రొక్కుట యొఱుపు కెంపెఱుకువాఁ డెఱుక చెప్ప
జెఱకులు నాటెక్క తెఱఁగుట తెలియుట యొఱపుసొమ్మొకరిది యొఱదిమాంస

సొఱలుట విలపించు టొఱవదేహం బొఱగాల నుండుట యొఱకత్రిమూర్త
యొఱకటంబునఁబోవుటొఱపులు నాఁడెక్కులొఱగువిళ్లతలాడయొఱగునంక
కఱపుట నేర్పుట కఱతలు పోకిళ్లు కఱదలు బుద్ధులు కఱటిమంకు
కఱకు కాఠిన్యంబు కఱవు దుర్భిక్షంబు కఱ కప్పు మెకములఁ గఱచుఁ గుక్క
కెఱపుట కెఱయు నుక్కెఱయుఁ బక్కెఱ(ర)యను కుఱుమాపు కుఱుకం
(టుకుఱుచ కుఱులు
కుఱువలిగొనుటయుఁ గుఱకుఱకుఱుకులు కుఱుగఱకుఱఁగలికిఱుపు క్రాను
కొఱకొఱలాడుటకొఱంతతక్కువ పండ్లు గొఱుకుటకోపంబుకొఱడు వడుట
కొఱ యనఁగాఁబనికొఱలుటనిండుట కొఱఁబూఁదుటసొమ్ముకొఱకునవట
గఱిక నట్టులు గఱగఱికలు గఱుగులుగఱిసె డగ్గఱనంపగఱిపగఱును (యను
గిఱికొనుట యుమాటగిఱుకయు గిఱుమెట్లు* గిఱులుబ్రాయుటయనుగిఱుపుట
గుఱక వెట్టుట గుఱగుఱ గుఱు వెట్టుట గుఱుకొని గుఱి గుఱికొండి గుఱుతు
గుఱుములు గింజలు గొఱుగుట వపనంబు గొఱవంక పిట్టలు గొఱ(ర)క కట్టె
వా చఱమట గొఱనలి కాఁచి చఱచుట కరమునఁ జఱచుట గట్టుచఱులు
చిచ్చఱపిడుగులు చిఱుతయుఁ జిఱునవ్వు చిఱికొట్టి చిఱిమి ముచ్చిఱితనమునఁ
జుఱుకుపుట్టఁగ మేను చుఱచుఱఁగాల్చుటచెఱువు నఘుజియించిచఱుకఁబిట్టు*
చెఱచెఱలాడుట చెఱుచుట చెఱుచుట చెఱసాల చెఱకులు చెఱిసగంబు
జఱిజఱి* పూజఱి(రి)జాఁజఱి(రి)జఱిగొని* జఱ(ర)పుటజఱ... జఱి(రి) గేనుట
చేతుల విసఱుట జిఱజిఱఁ ద్రిప్పుట జుంజుఱు వెంట్రుకల్ జొఱజొఱ యనఁ
దఱుఁగుట వెలితియుఁ దక్కువయును గోసి వైచుటయును నగుఁ బలసినపుడు
తఱుగఱి బేహారి తఱుఁగనిసంపద తఱిగొలుపుయుట ముత్తఱులు తఱుచు
తఱి వేళ పయనంబు దఱలుట ఫుచ్చినతఱకలు శత్రుల దఱియఁ జొచ్చెఁ
దఱుముక వచ్చుట తఱిగొని నడచుట తిఱుగ రెండవసారి తిఱిఁ జెనుచుట
తిఱుగలి తుఱుము పాతెఱ మోవి యేత్తెఱ తెఱలినవాసన తెఱకొనుటయుఁ
దెఱపి సేయుట కన్ను దెఱచుట పాఱుట తెఱవలు తెఱకువ తెఱఁగువిధము
తొఱలుట కలయుట తొఱఁగుట నందొఱు నఱదలు నెఱదలు క్రొంద ఱింద
ఱిద్దలు పదఱు(రు)చుఁ బెద్దఱికంబున గద్దఱి యద్దఱ(ర)కట్టెమఱ(ర)ను
నఱుకొంచెముక్రొన్ననఱుకుట నిఱుపేదన ఱుసుగానఱుప్రట నెఱప్రపోడవు
నెఱి యనఁగాబాగు నెఱదొడ్డ గొప్పయనగు నెఱియనఁగను మిగులననట*
నీటుల నెఱపుట నెఱి లేనిమిత్రుఁడు నెఱయుట నిండుట నెఱిక కొనుట*

నెఱుసు లాయంబులు నెఱులు కేశంబులు పఱపఱఁ జించుట పఱు(రు)సదనము
పఱచుట సేయుట ప్రవహించుటయు వేగ నుఱుకుటయును నగు నుచితభంగిఁ
బఱికెలు పఱియలు పఱివోవు టుప్పఱ పఱతెంచి పఱిగొని పఱ పఱియలు
పఱు వైనపుల్వు చూపఱఁ బఱిమార్చుట తెంపఱి(రి) పెంపఱఁ దెప్పిఱిలుట
పిఱుఁదను వెనుకను బిఱుఁదు నితంబంబు పిఱు సనుటయు దొడ్డ పిఱికితనము
పుఱియు కపాలంబు పెఱికలు గోనెలు పెఱిగిన మీసముల్ పెఱికికొనుట
పెఱ యితరార్థంబు పెఱసనిపోవుట బఱబఱ నీడ్చి దబ్బఱ పలుకుట
బిఱబిఱఁ ద్రిప్పుట బిఱుసులు బుఱుజులు మఱువమ్ము ద్వాంతంబు మఱుఁగుచాటు
మఱచుట మఱునాఁడు మఱదలు మఱఁదియు మఱియు నేమఱుట పల్మఱు మఱుగుట
మఱుపడి క్రమ్మఱ మఱులేక క్రమ్మఱి పడమఱ మఱిగాలు పెడమఱ(ర)లుట
మిఱుచూపు మిఱుమిట్లు మిఱుమిఱి చీఁకటి మిఱిమొండె మిఱి మెఱము లిడుట
మెఱపులు మెఱయుట మెఱుఁగులీనుట కను మొఱఁగుట దాఁగుట మొఱకవెలితి
మొఱలు పెట్టుట మొఱ మొఱలుగా మొఱయుట మొఱుగుసుకక్కులు మొ
(ఱకుతనము

అఱ్ఱు అఱపిల్లుట అఱ(ర)చఱంకు అఱికలు అచఱవల్ అఱపము అంతఱ(ర)వఱి
ఱెక్కను వైచుట ఱివ్వన ఱువ్వుట ఱెక్క ఱే(రె)ప్పలు ఱెల్లు ఱే(రె)మ్మ ఱొమ్ము
వఱతయు వఱదయు వఱదుగూయుట వంగ వఱు(రు)గులు వఱలుట విఱిగి చనుట
విఱిచోటు విఱిగాలి విఱినిడి కంబను విఱుగుట వెఱ బొమ్మ వెఱచఱచుట
వెఱచుట వెఱఁగు నివ్వెఱ సుఱసుఱ స్రుక్కుట వఱుసు ఱనుట విఁకూదిగాఁగఁ
గొన్ని తెనుఁగుఁ బల్కుల హ్రస్వములమీఁదఁ దప్పక బండిఱా లొప్పుచుండు
వెల్లంకి తాతన బొల్లెను బండిఱా నిడుదమైఁ గలుగదు నిక్క మనుచుఁ
గావున నేను దీర్ఘముల పైఁగల పెద్దఱా లొకకొన్ని యేర్పఱతు నింక
నాఱు సంఖ్యాపద మాఱడి యూఱు(రు)కపంట చిచ్చాఱఁ శాపంబు లాఱె
నాఱితేజము లాఱినముఱెంబు తడియాఱె శ్రమ మాఱఁ దాప మాఱె
నాఱుపు లాఁడ నోటాఱె దేహం బెల్ల నూఱడి చాలించు నూఱుఁ(రుఁ)గాయ
లుదకంబు లూఱు(రు)ట గోఁకపండ్లేఱుక యేఱువసీమలో నేఱు దాఁటి
కాఱు(రు)పోతు బెంపొంతకాఱి(రి) కాఱడవులు కాఱియపనుట నగాసిలుటయుఁ
గాఱుట జాఱుట కోఱలు పండ్లు గీఱుట నాఁటుటయును దీఱుటయు నయ్యేఁ
జేఱె(శె)డు మాడలు చీఱుట రెండుగాఁ జేయుట యయ్యేల చేఱు(రు)లనఁగఁ
జూఱ యొల్లరను దోఁచుట చూఱపీనులు చాఱుబెబ్బులి చాఱపప్పు

జాఱుపయ్యెద లబజాతికన్నియలు హజా*ఱ(ర)ంబులోనఁదు జాఱు*లనగఁ
దాఱు(రు)మెకంబు లీలీఱున దీఱివ దీఱుట పొదలలో దూఱుటయును
దేఱి చూచుట గడి దేఱుట ధన్నంబు దేఱుట యింతకొఁ దేఱుమ రన
సొన్నాఱి(రి) నాఱు వైచుట నాఱు విడుచుట నీఱు సిప్పలమీఁదిసిండుబూది
పసపునూఱుటనూఱుపసుల నన్నూఱుమున్నూఱన వెసదొమన్నూఱును ననఁ
బాఱుఁడు బ్రాహ్మణుఁడేఱు పాఱుట యింకఁబాఱుటవెన్నిచ్చిపాఱుటయును
బడఁతిపేహము గరు పాఱుట పీఱు(రు)ట చినుఁగుట పోఱఁడు చిన్నవాఁడు
చీఱు వోవక యినుమాఱు మాఱడుగుట మాఱి(రి) మసంగుట మాఱుపడుట
మాఱుమాటాడుటమాఱు(రు)మొగంబు వేమాఱు(రు)పెద్దలమాటమీఱనుట
తొచు నీలపుతాయి తాఁగ వెన్నెలతేఁటు తేసి తేసున గంగ తే(రే)పుతెప్ప
తేఁచుకుక్కలు తేల తేఁగు క్రేపే తేఁచుట తోయుట వెదకుట తోఁత వడుట

తే. వేఱు వడుటయు పీఱిఁడి వే తొకటియు
నావిగాఁ గొన్ని యాంధ్రవాక్యములయందుఁ
బాదుకొను దీర్ఘములమీఁద బండిఱాలు
వీని నెఱుఁగక కృతిసేయు వెట్టి గలఁడె.

## ఱులుచలమీఁది అకారములకు రూపములు.

| | | |
|---|---|---|
| ఆఱవఱలు...కునుకలు | ఆఱ లేక చనుట - ఆపోహ | క్రచ్చఱ |
| నోటనఱచుట...కూయుట | ము లేకపోవుట | అక్కఱపడి |
| అఱిమఱి - బడిబడియనుట | పెండ్లియఱుగు...చింత్యము | ఆఱకమ్మటము |
| ఆఱగోఱలు | ఆఱువుకొనుట- దక్కించు | ఆఱకంబములు చింత్యము |
| ఆఱునుట...ఆబ్బుట | కొనుట చింత్యము | ఆఱం(ర)టి |
| ఆఱకడఁ బెట్టుకొనుట... | ఆఱువడకోళ్లు | ఆఱదులు - స్త్రీలు మెడను |
| పొదిగిటఁ బెట్టుకొనుట | ఆఱపోఱఁడు-పొట్టివాఁడు | గట్టుకొనెడు పూసలు |
| ఆఱచేయి | అక్కఱ | చింత్యము |
| ఆఱకాలు | రూపఱి | ఆఱకము- అన్నమఱుగకుం |
| ఆఱవలు-ద్రావిడులు- చిం | పొలపఱి | [డుట చింత్యము |
| ఆఱువుడుకుప్పసమ [త్యము | ఏపఱచుట | ఇఱియుట...కదియుట దీని |
| ఆఱిసెలు...అప్పములు | పెంపఱి | కి లక్ష్యములు |
| ఆఱిగిపోవుట - తక్కువయి | సిగ్గఱి | ఇఱిచను చిన్నచనుంగవ |
| పోవుట చింత్యము | పట్టఱి | ఇఱికికొనిపోవుట కదియిం |
| ఆఱుట - నశించుట | పెల్లఱి | చుకొనిపోవుట...ఇవి |
| అఱవఱసేయుటచింత్యము | ఆఱమూఁత ఇల్లు చింత్యము | మొదలైనవి |

ఇఱెనుట...నలిగిపోవుట చింత్యము
ఇఱు(రు)లు - చీఁకటులు
బండియిఱు(రు)సు - చింత్యము
క్రిక్కిఱియుట...మిక్కిలిక
ఇఱుకటముకుసిలి(దీ)యుట
ఇఱుకు - కొంచెము
అన్నమిఱె సిపోవుట...కది యఁబడి ముద్ద కట్టుట
ఉఱఁడు...సురేంద్రు నైనను నైకొనఁడు [వుట
ఉఱుకు- వేగముగఁ బో
ఉఱ యనఁగా మిక్కిలి యనుటదీనికిలక్ష్యములు
ఉఱుకట్టిపరము
ఉఱుతనదుకే క్తి వాలయఁ...
...ఇవి మొదలైనవి
ఉఱువు - లావు
ఉఱిది - బెట్టిదము
ఉఱక - మానక
మేఘ మఱుముట
ఉఱుకతె
బలమఱె
ఉఱిము - దిట్ట - చింత్యము
ఉఱవి - తెగువ
ఉఱుకప్పిల్లు
ఎఱపఱికము చింత్యము
అడుగులుకెఱఁగుట- [మొ క్కుట చింత్యము
ఎఱుపవన్నె
ఎఱుకువాఁడు
ఎఱుక చెప్పుట
ఎఱకలు - తెక్కలు
ఎఱుఁగుట - తెలిసికొనుట

ఎఱవులసొమ్ము- మఱొకరి సొమ్ము చింత్యము
ఎఱచి- మాంసము
ఒఱలుట - శోకించుట
ఒఱవ దేహము
ఒఱగాల నిలుచుట
ఒఱ - కత్తిపిడిదిమూఁత
ఒఱకటపుదోవను బోవుట
ఒఱపులు- ఉక్కులు, ఎమ్మెలు
ఒఱగువిల్ల
ఒఱగు - వంకె
కఱపుట...నేర్పుట
కఱతలు...పోకిళ్లు
కఱదలు...బుద్ధులు
కఱటి...మంకువాఁడు
కఱకు- కాఠిన్యము- దీనికి
కఱ కెక్కుట [లక్ష్యములు
కఱకు లాడుట ఇవి మొద లైనవి
కఱవు దుర్భిక్షము [ములు
కఱ-కప్పనలుప్రదీనికిలక్ష్య
కఱకంఠుఁడు
పోఁకఱ
తప్పకఱ
నీలకఱ ఇవి మొదలయినవి
కఱ పటదీనికిలక్ష్యములు
పండ్లఁగఱచుట
వ్రేళ్లు గఱచుట
పూరి గఱచుట
పింజపింజ గఱచుట - ఇవి
కిఱపుటకెఱ [మొదలైనవి
కెఱయుట
ఉక్కెఱ - పిండివంట
పక్కెఱ(ర) - చింత్యము
కఱుమాపుచీర -కొఁలమా త్రము మాసినచీర

కుఱు - కంటు
కుఱుచ...కొంచెము
కుఱు(రు)లు - వెంట్రుకలు
కుఱువలి గొనుట చింత్య [ము
కుఱకుఱ
కఱుకులు
కుఱుగడ
కుఱఁగలి
కుఱువు వ్రణము చింత్యము
కొఱకొఱ లాడుట చింత్య [ము
కొఱఁత- తక్కువ
పండ్లు గొఱుకుట
గుఱ్ఱపుకొరడ [డుచునది
కొఱడు...ఆకాశమునఁ బొ
కొఱ-పని- దీనికిలక్ష్యములు
కొఱగామి
కొఱగాదు
కొఱమాలుట
కొఱయవుట [దలైనవి
కొఱగలవాఁడు...ఇవిమొ
కొఱలుట పూర్ణమవుట
కొఱవిని గాల్చుట
సొమ్ముకొఱుకు-చతుర్థి
గఱికనట్టులుచింత్యము
గఱుగుకాయలు చింత్యము
గఱిసె
డగ్గఱ...సమీపము
అంపగఱి(బాణముతెక్క)
పగఱు- పగవాఁడు
గిఱికొనుట - కుప్ప వడుట
మోటగిఱుక...చింత్యము
గిఱుక మెట్లు*
గఱుక చెప్పులు
గిఱుబుర్రాయుటచింత్యము

గిఱుప్రుట
గుఱకపెట్టుట- నిద్రావికా[రము
గుఱగుఱ
గుఱుపెట్టుట
గుఱుకొనుట
గుఱిగడచుట-మేరదప్పుట
గుఱికొండి
గుఱుతు
గుఱుతులు - గింజలు
తలగొఱుగుట చింత్యము
గొఱవంక పిట్టలు చింత్యము
గొఱ(ర)క కట్టె
వాపఱచుట
కొడవలి కాఁచి వఱచుట-
అడుచుట దీనికి లక్ష్యములు
చేఁతఁ జఱచుట
పీఁపు జఱచుట
నేలఁ జఱచుట
గోడ సున్నము జఱచుట
యివి మొదలైనవి
గట్టు(కొండ) చఱులు
చిచ్చఱ ఇంగలము దీనికి
చిచ్చఱ పిడుగు [లక్ష్యములు
చిచ్చఱకన్ను
చిచ్చఱకోల - ఆగ్నేయా
స్త్రము ఇవి మొదలైనవి
చిఱుత-కొంచము- దీనికి
లక్ష్యములు
చిఱుతప్రాయము
చిఱుతనడుము (నవి
చిఱుతగండు- ఇవి మొదలై
చిఱు-పిన్నయిందులకు లక్ష్య
ములు
చిఱునవ్వు
చిఱుచెమట

చిఱువోడ
చిఱుపులి - ఇవి మొదలైనవి
చిఱికొట్టి
చిఱిమి
ముచ్చిఱితనము
చుఱుకుపుట్టుట
సేను చుఱచుఱఁగాల్చుట
చెఱువున బ్రాహ్మణభోజ
చెఱగఁబట్టుట [నము.
చెఱచెఱలాడుట
చెఱుముట రాచుట
చెఱుచుట
చెఱసాల
నల్ల చెఱకుగోలలు
చెఱిసగము
జఱిబఱి
పూజఱి
బాఁజఱి
జఱిగోని
జఱ(ర)పుట - ఆలస్యము
సేయుట
జఱజఱ
జఱు(రు)గుట-పోవుట
చేతులవిసఱుట
జిఱజిఱఁద్రిప్పుట
జుంజుఱు వెంట్రుకలు
జోఱజోఱ
తఱుఁగుట - వెలితియగుట-
దీనికి లక్ష్యము
నెయ్యితఱుఁగుట
మతియుఁదఱుగుట-తక్కు
వగుట-దీనికి లక్ష్యములు
ధారణతఱుఁగుట (లైనవి
కాంతితఱుఁగుట- ఇవి మొద
కొన్నిచోట్లతఱుగుటయనఁ

గాఁగోసిపైచుట దీనికి
లక్ష్యములు
తలతఱుగుట (లైనవి
కూరతఱుగుట- ఇవి మొద
తిఱుగఱి-క్రయమునిర్ణయిం
చువాఁడు
తఱుఁగని సంపద
తఱిగొలుపుట
ముత్తఱులు-వశులు
తఱుచు బాహుళ్యము
తఱి-వేళ
పయనంబు దఱలుట
పుచ్చినతఱకలు
శత్రులదఱియఁజొచ్చుట
తఱుముకపోవుట
తఱిగొని నడచుట
తిఱుగ-రెండవసారి
తిఱిగెనుచుట
తిఱుగలి
తఱుము-వేనలి,కొప్పు
వాతెఱ-మోవి
ఏడ్తెఱ
తెఱలిన వాసన
తెఱకొనుట
తెఱపి సేయుట
కన్నుదెఱచుట - పాపుట
దీనికి లక్ష్యములు
నోరుదెఱచుట (లైనవి
తలుపుదెఱచుట-ఇవి మొద
తెఱవలు-స్త్రీలు
తెఱకువ
తెఱఁగు - క్రమము దీనికి
లక్ష్యములు
తెఱఁగెట్టివో కోయనుట
తెఱఁగొప్ప

తెఱఁగులేమి [నవి
ఇక్తెఱఁగున- ఇవి మొదలై
తొఱలుట - కలయుట
తొఱఁగుట
అందొఱు
ఇందఱు
అందఱు
ఎందఱు
కొందఱు
ఇద్దఱు
పదఱు(రు)ట
పెద్దఱికము
గద్దఱికాఁడు
అర్థిఱ(ర)
కట్టిదుఱు(రు) [లక్ష్యములు
నఱుకు- కొంచెము - దీనికి
నఱుకుపేలు
నఱుకుముక్కలు
మ్రాను నఱుకుట
నిఱుపేద
నుఱుము - నుగ్గు
ధాన్యము నుఱుపుట
కోక నెఱవు పొదవు
నెఱి-బాగు దీనికిలక్ష్యములు
నెఱిదప్పివడుట
నెఱి చెడుట
నెఱిఁబడుట
నెఱిమొగము
నెఱికాఁడు(రు)లు
నెఱినొచ్చుట
నెఱిద్రోవ [మొదలైనవి
నెఱిచక్కఁ ద్రోచుట ఇవి
నెఱయనఁగా దొడ్డ దీనికి
నెఱతనము [లక్ష్యములు
నెఱగూడుటదొడ్డనాటుట

నెఱనారసము
నెఱసతి
నెఱవాదులు
నెఱదాతలు
నెఱబిరుదులు
నెఱపంటలు
నెఱచందురుఁడు, ఇవి మొదలైనవి
మఱియు నెఱయనఁగా గొప్ప దీనికి లక్ష్యములు
నెఱమంట
నెఱదెవులు [నవి
నెఱవెండ్రుకలు మొదలై
నెఱియన మిగుల*
నెఱులు నెఱపుట
నెఱిలేనిమిత్రుఁడు [చుట
నెఱయుట అంతట విస్తరిం
నెఱిక కొనుట*
నెఱఁకులు - ఆయములు
నెఱులు-తలవెండ్రుకలు(ను
కోకపఱపఱచించుటచింత్య
పఱు(రు)సదనముచింత్యము
పఱుచుట సేయుటదీనికిల
పఱిచినపాట్లు [క్ష్యము
నిక్కుపఱచుట
సిగ్గు పఱచుట [లైనవి
భంగ పఱచుట-ఇవి మొద
కొన్ని చోట్ల పఱచుటయ
నఁ బ్రవహించుట దీని
కి లక్ష్యము
నెత్తురుకాలువలై పఱచుట
ఒకచోట పఱచుట-యన
వేగనుఱుకుట దీనికిలక్ష్యము
వెనుకొని పఱచుట
గుఱ్ఱము పఱచుట

శత్రులఁ బఱపుట [లైనవి
అమ్ములఁబఱపుట-ఇవి మొద
పఱికలు
పఱియలు సేయుట
పఱివోవుట-ముంచుకొనుట
అంపఱకోపక- బాణసమూహము
పఱతెంచుట - వచ్చుట
పఱిగొనుట- నిండికొనుట
పఱిపఱియలు సేయుట
పఱు వైనపువ్వు
చూపఱు - పొషగినవారు
పఱిమార్చుట
తెంపఱి(రి)
పెంపఱ
నెప్పిఱిలుట [లక్ష్యము
పిఱుఁదను వెనుకను దీనికి
వానిపిఱుఁదనె చొచ్చుట
విఱిగి పిఱిఁదికిఁ బాఱుట
ఇవిమొదలైనవి [లము
ఒకపట్టున పిఱుఁదు కట్టిస్థ
పిఱుసనుట
పిఱువోవుట-వెను దీయుట
దొడ్డకిఱికితనము
తెలపుఱియ కపాలము
పెఱికలు...గోనెలు
పొడవు పెఱుగుట
అమ్ములుపెఱుకుట-పీఁకుట
పెఱయన మఱియొకటి దీనికిలక్ష్యములు
పెఱమూఁకలు
పెఱచేతను
పెఱవారు [నవి
పెఱ చోటు ఇవి మొదలై
పిఱుసపోవుట

బఱబఱ నీడుచుట
దబ్బఱమాటలు
బిఱబిఱఁ ద్రిప్పుట
బిఱుసు గాల్పుట
కోటబురుజులు
మఱువ... మంటికొండ
మఱుఁగు... చాటు... దీనికి లక్ష్యములు
మాట మఱుఁగు పెట్టుట
కనుమఱుఁగుచోటు [టు
బలవంతునిమఱుఁగు చొచ్చు
మైమఱుఁగు... కవచము
కొండలు మఱు అని యనిరి ...ఇవి మొదలైనవి
మఱచిపోవుట
మఱునాఁడు
మఱఁదలు
మఱఁది
మఱియు
ఏమఱుపాటు
పలుమఱు
మఱ(ర)గుటమచ్చికలౌట
మఱుపడి
క్రమ్మఱ-మరల
మఱులేక మఱుఁగులేక
క్రమ్మఱుట-తిరుగుట
పడమఱ... దిక్కు
మఱ(ర)గాలు
పెడమఱలుట
మిఱుచూపు
మిఱుమిట్లుగొనుట
మఱిమఱి చీఁకటి
మఱి మొఱడెము
పిల్లలిమఱి... బడిబడి
మెఱమఱలు వైచుట

మెఱపులు మెఱయుట
మెఱుఁగు లీనుట
కనుమెఱుఁగుట- డాఁగుట
మొఱక - వెలితి
మొఱ పెట్టుట
మొఱ మొఱ లాడుట
మొఱయుటకోపవికారము
కుక్కలు మొఱుగుట
మొఱకుతనము
అఱ్ఱు వాంచుట
అంపిల్లుట
వజ్రపుటఱ(ర)వలు
అఱకు వోవుట
పట్టురవిక
అఱవలు కోపము
అంపము
అంతు
అఱ(ర)వ
ఱిక్కవైచుట
ఱివ్వన నెగయుట
ఱాళ్లను ఱువ్వుట
చిలుక ఱె(రె)క్కలు
కను ఱె(రె)ప్పలు
ఱెల్లుగడ్డి
పూఱె(రె)మ్మలు
బలుఱొమ్ము
పఱత పెల్లి
ఏటివఱద
నఱడుగూయుట
కాసఱనఱు(రు)గు
పఱలుట
దండు విఱిగి చనుట
విఱిపోవుట
విఱిగాలి
విఱి(రి)విడి

కంబము విఱుగుట
వెఱ బొమ్మలు
వెఱచఱచుట
వెఱచుట
వెఱఁగొందుట
నివ్వెఱపడుట
సుఱసుఱ క్రుక్కుట
ఉసు ఉసు అనుట
ఇవి కుఱుచలమీఁది ఱకారములు.

---

నిడుదలమీఁదిఱకారములకు రూపములు.

ఆఱు లెక్క దీనికిలక్ష్యములు
ఆఱువపులు
ఆఱుమాట లివి మొదలైనవి
ఆఱడిపోవుట
ఆఱు(రు)క పంటచింత్యము
చిచ్చాఱుట
పాపము లాఱుట
ఆఱనితేజము
ఊటాఱినముత్యములు
కోకతడియాఱుట
శ్రమ మాఱుట
ఆఱుపులు [టు
దేహమంతయు నోటాఱు
ఊఱడి విశ్రమించి [ము
ఊఱు(రు)గాయలు చింత్య
నోరూఱు(రు)ట
రేఁగుబండ్లఱుట
ఏఱువ - సీమ
ఏఱుదాఁటుట
కాఱు(రు)పోతులు
పెంతకాఱి(రి) చింత్యము

కాఱడవులు
కాఱియపడుట - గాసిపడుట
కాఱుట-జాఱుట
కోఱలు నోటిపండ్లు
గీఱుట నాటుట
పండ్లను గీఱుటలీపుట
చేతె(రె)డుచూడఱు
చీఱుట నడిమికిరెండుగాఁ జేయుట
ఉయ్యాలచేఱు(రు)లు
చూఱ అందఱిని దోఁచుకొనుట
చాఱమీనుచేఁప
చాఱలబెబ్బులి
చాఱపప్పు
పయ్యోదపాఱుట
బజాఱికన్నియలు
హజాఱ(ర)ము పెద్దకొలువు చావడిచింత్యము
తుజాఱి* ధనముగలవాఁడు చింత్యము
తాఱుట పరువెత్తుట
తీఱుట
పనితీఱుట
ఈతీఱున
చేయవలసిన పనితీరుట
తీఱినమిట్టగుడ్లు
పొదలలో దూఱుట
తేఱి చూచుట తేరకొనఁ జూచుట
గడిదేఱుట
ధర్మముదేఱుట
ఇంతకుం దేఱుదురు
పొన్నాఱి అగసాలవాఁడు
వంగనాఱు వైచుట

నీఱుఅనఁగా నిప్పుపైఁగప్పి యుండెడుబూడిద
పసపు నూఱుట
నూఱుపదులు
పాఱుఁడు-బ్రాహ్మణుఁడు
ఏఱు పాఱుట
ఇంకఁ బాఱుట
వెన్నిచ్చిపాఱుట
దేహము గరుపాఱుట
పేఱుట-చినుఁగుట
పోఱఁడు-చిన్నవాఁడు
ఏఱు వోవుట
ఇనుమాఱు
మాఱుసుగుట
మాఱి మసంగుట - గావుపట్టుట
మాఱుపడుట
మాఱుమాట-ఎదురుమాట
మాఱుమొగము
వేమాఱు
మాటమీఱుట
ఱాచుట
ఱాఁగ-జారిణి
నీలపుఱాయి
వెన్నెలఱేఁడు-చంద్రుఁడు
ఱేపే
ఱేసున
గంగఱేవున
ఱే(రే)వు
ఱేఁచుకుక్కలు
ఱేల
ఱేఁకు
ప్రేఱేచుట
ఱోయుట-వెదకుట
ఱోఁకవచ్చుట

వేఱు వడుట
వేఱిఁడి
వేఱొకటి

ఇవి నిడుదలమీఁది బండిఱాలు ఉభయ రేఫలు.

అఱుగుట-పోవుట
చెఱుచుట
తెఱఁగులు
తొఱలుట
తొఱఁగుట
నెఱయుట-విస్తరించుట
పఱిగొనుట
పఱిచనుదెంచుట
పఱిమెయి-పఱమొకటి
పఱిమార్చుట
పెఱుఁగుట
క్రమ్మఱ
మఱలుట

ఇవి కుఱుచలమీఁది రేఫఅకారములు రెండునగును

ఆరుట - శమించుట
తీఁనికినుక
తీరుట
పొర నీరయి పోవుట
మారిమసఁగుట
వేమారు

ఇవిదీర్ఘములమీఁది రేఫ అకారములు.

కఱుచలమీఁది రేఫఱకారములు రెండు నయినందులకు లక్ష్యములు.

అఱుగుట పోవుటకు మౌసలపర్వమునందు:—

క. మఱునాఁడ యగుట లెస్సగ, నతిగె నినుం డపుడు వేఁడి యడరినదీప్తుల్
తఱఁగలి గొని పశ్చిమగిరి, చఱికిన నభిచూరుఁ డైవిశదుఁ డై తోఁచెన్.

చెఱుచుటకు సభాపర్వమునందు:—

క. వెఱచఱువ నింతకంటెను, దఱుచగ బాణంబు లేసి తడయక పగఱం
జెఱుతు నని యిసుమఁ జల్లుచు, నుఱక ధనంజయుఁడు రణజయోన్నతినరిగెన్.

తెఱఁగునకుం గవిజనాశ్రయమునందు:—

క. నెఱయంగా నీఛందము, తెఱఁ గెఱుఁగక కవితఁ జెప్పఁ దివురునతఁడు ద
బ్బఱచీకు చీకుగుఱ్ఱముఁ, జఱపినగతి నిఖిలహాస్యపదనిరతుఁడగున్. ౧౦౦

తొఱఁగుటకు నృసింహపురాణమున సీసపాదము:—

సీ. పరమాత్మపదములఁ దొఱఁగి పాఱెడు నేటితరఁగలపై లీల దాఁటి దాఁటి.

నెఱయుట —

తే. పొగడ్రమ్మఁకులమొదలనుబుప్పరసము, తొఱఁగినెత్తావియందున నెఱయనొప్పెఁ
బూచుకొఱకునున్నుసింవులుదలిర్పఁ, గడఁగివనలక్ష్మి యమిసీనకల్లయనఁగ.

పరిగొనుట పరిచను దెంచుటకు విరాటపర్వమునందు:—

చ. పరిచను దెంచె గోగణము పట్టె నన న్విని పిన్న గాన మీఁ
దరయక రాజనందనుఁ డహంకృతితోఁ జఱతెంచి సైన్యవి
స్ఫురణముఁ జూచి భీతిఁ దనబుద్ధి గలంగినఁ బాఱఁ జొచ్చె నీ
పురుషునిశౌర్యసంపదయు భూరిబలంబు నెఱుంగఁ డేమియున్. ౧౦౩

పరిమెయి యన్నందులకు శాంతిపర్వమునందు:—

చ. పరిమెయిఁ బాటి వారు గని పట్టి వెసం జెడకేలు గట్టి తె
చ్చి రసురరాత్రి యిట్లు దగఁ జేరఁగఁ దేవల దీక్షితఘ్నునిం
బొరిగొని వే తినుం డనినఁ బోకడ మాలినవార మయ్య యి
ద్దురితశరీరముం దినఁగ దోసము మా కని వార లొల్లమిన్. ౧౦౪

పెరుఁగుటకు స్త్రీపర్వమునందు:—

కే. పెరుఁగుట స్రగ్గఁగఁ జవులం, బొరయుట యరుచంబుగాఁగఁ బుట్టుటసావం
జెరయుట పాయఁ బదార్థో, త్కరములనైజ మది యెట్లు దప్పింప నగున్.

బ్రమ్మఱ కారణ్యపర్వమునందు:—

మ. పఱచుం దవ్వుగఁ జేయులంతి నిలుచుం బ ట్టీక యాసాసలం
ధిఱనోవుం బొదలందు డింపుఁ బొడమం బెట్టుల్కి వేదాఁటుఁ గ్ర

క్ష్మతి చూచుం జెవి దాఁచి నిల్చి మలయు న్నట్టాడుఁ గోరాడు నే
మతి నెమ్ముందుఁ దృణంబు మేయు మలయున్ మాయామృగం బిమ్ములన్. ౨౦౭

మఱఁద లనుటకు భాస్కరరామాయణమునందు:—

చ. ఎఱిఁగి యెఱింగి మున్నతఁడె యెగ్గొనరింపఁడె దానికై కదా
చెఱఁ గొని వచ్చుటం బిదప సీత వృథాకథ లింక నేల పెం
పఱ బ్రతు కింత తీయనె ఖరాదులచావున కేమి చింత నీ
మఱఁదలిబన్న మేపగిది మానిని యూఁగుడు సంధి చేసినన్. ౨౦౮

నెఱసెననుటకు - నృసింహపురాణమునందు:—

మ. ధరణీమండలి జర్జరం దిరిగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె ని
ర్జరనాథప్రముఖాఖిలామరనివాసశ్రేణులం బోలిమై
నెఱయం బంకజసంభవాలయమున న్నిండారె సర్వేశ శ్రీ
కరదైతేయతనూభవోద్భవకథాకల్యాణ మద్ఘోషమై. ౨౦౯

నిడుదలమీఁది రేఫఅకారములు రెండును అయినవానికి లక్ష్యములు-

అఱుటకు శాంతిపర్వమునందు:—

క. కౌరవులు సేయునవమతి, కారణముగఁ గోప మెత్తెఁ గర్ణునివదనాం
భోరుహము గనుఁగొనఁగ శ్రమ, మాఱు న్నావశము గాక యాతనిబుద్ధిన్.

ఆదిపర్వమునందు:—

క. కాఱడవిఁ బఱచు మృగముల, నూఱడకం దిగిచి డస్సి యున్నతనిశ్రమం
బాఱంగా నెదఁ బాపము, దీఱఁగఁ బై వీచె నన్నదీపవనంబుల్.

కాఱులకు నుద్యోగపర్వమునందు:—

ఉ. ఆఱడిపోకయు స్థలము నందుటయుం గని పల్క నేరమి
న్నాఱటనోరిడాన నయి మాటలు చిత్తమునందు నిల్ప కేఁ
గాఱులు ప్రేలెద న్విమఁడు కర్ణను నెగ్గును గాన నల్కమై
పీఱిఁడి నైననూనిసితి వెండి వివేకముగల్గ నేర్చునే.

తీఱుటకు రామాయణమునందు:—

ఉ. మీఱినకోఁతులు న్నిగిలి మింటికిఁ బర్వినపల్లవెంట్రుకల్
తీఱినమిట్టగ్రుడ్లు నతితిగ్మతరం బగునట్టిసాహసం
బాఱనిలేఁజము ద్దిశల నంటినచేతులు లోకరాజిలో
నేఱిన మేటిరూపముల నెంతయు నేర్చిరి రాఘవు ల్వడిన్. ౨౧౩

తేఱుటకు యుద్ధకాండమునందు:—

క. తేఱుమరు రిపుల నక్కఱ, మీఱుదురును నిపుడు మూర్ఛ మెయి నిట్లున్నా
రాఱని తేజంబులతో, నీఱు పయిం గవిసి యున్న నిప్పులుఁబోలెన్. ౧౧౩

త్రిపురాంతక దేవుని యుదాహరణమునందు:—

ఉ. ఆఱఋషియాస నీరసధనాధిపలోకమునిండ్లవాకిళుల్
దూఱుట మాని శ్రీనగముతూరుపువాకిట దూఱి పాపముల్
నీఱుగఁ జేసి గంధవతి నీళ్లను గ్రుంకి మనంబులోనిచి
చ్చాఱఁగఁ జేయు టొప్పుఁ ద్రిపురాంతకదేవునకై సమస్క్రియల్. ౧౧౪

మాఱి యనుటకుఁ గర్ణపర్వమునందు.

ఉ. పాఱినఁ జూచి కౌరవనృపాలుఁడు సూతతనూజుతోడ నీ
కాఱియ మద్బలంబునకుఁ గాఁ దగునే విధా ప్రసంపవ
న్మాఱినసేవు గల్గఁగ నమేయపరాక్రమ నీకుఁ బాండవు
ల్మాఱి తలంప నీవగుబలంబును జేవయుఁ జూపు మిత్తఱిన్. ౧౧౫

వేమా అనుటకు నృసింహపురాణమునందు:—

క. మీఱినమానులకినుకకు, మాఱలుగక యున్న మీసమగ్రతమ వే
మాఱు గొనియాడఁగాఁ దగు, గీఱునె సాత్త్వికులబుద్ధిఁ గిల్బిషచయముల్.

క. తెలిపితి నన్నయభట్టా, దులకావ్యములందునాకు దొరకిన రేఫం
బులుబాలు మఱియు నెందులఁ, గలిగినఁ దగవనక యవియుఁ గైకొనుటొప్పున్.

క. తొలుతటివారలు వాడని, తెలుఁగులపలుకులను గలస్వితీయాంతస్థం
బులుగూర్పరు తద్భేదం, బులు దెలియమి బుధులు ప్రాసములకు యతులకున్.

లకారభేదంబులు.

తే. దురితసంహార నిర్జరోక్తులనె కాదు, తెలుఁగుదొడ్డళకారంబు వికృతియందు
నెళవు దళవాయి మేళంబు నీళ్లనంగఁ, బళ్లెరం బుఁగకుళ్ళలకళ్లె మనఁగ.

ఆ. ప్రథమమీఁద నుండుపంచమవర్గాది, వర్ణమునకు బదులు వచ్చి నిలుచు
లాఁతి యనువకార మాఁతమై తెలుఁగునఁ, బరువు పెట్టి చిక్కువడిగొ ననఁగ.

మూ. సూ.—క్వచిదపిన స్తడదోతౌదంతోష్ఠభవస్య వికృతిశ్శబ్దాదా.

సీ. టాటివా గలవోఘృశబ్ద మొక్కటి దక్క, సంస్కృతాంధ్రముల మజ్జగములందు
శబ్దంబు మొదల నిశ్చయముగాఁ గొమ్ములు నోత్వంబులును గల్గవొకటి కైన
వాకు శృంగములకైవడినోత్వములభంగి శబ్దాదిఁ గలయవి స్వకము లగును
రెండునులాఁతుల నుంచుఁగృష్ణుఁడుగిన్కవుట్టు మోదినఁ జెట్టు వాలిసెననఁగ.

తే. నడుమఁ గొమ్ములు సంస్కృతాంధ్రముల రెంట,
బలిసి జాత్యక్షరములకే గలిగి యుండు
భావుకము నీవుభావుకంబుభవుఁడనంగఁ,
బాడవుదీవులుసవురంబుపువ్వులనఁగ.

లఘ్వలఘుభేదంబులకు:—

మూ. సూ.—నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు
నిత్యం స్యాత్.—

క. సంస్కృతకావ్యంబులలోఁ, గాకోదరశయన లఘుయకారము హల్లై
కైకొనఁ దగు బ్రాసములకు, జోకయె స్వరహయలు వడికిఁ జొప్పడు టరుదే.

తే. ప్రియుఁడు రాఁడాయెసత్యభామయడఁగాఁగ,
నెన్నిమాయలుపన్నెనో యెఱుఁగ రాదు
గాయఁగాఁజొచ్చెశశిమింట నాయనంగుఁ,
డేయఁగాఁజొచ్చెసఖిచక్రిరేఁడియనఁగ

క. రెండర్థంబులపద్యము, లుండెడిచో నొకటి యచ్చు నొకయర్థమునన్
నిండారుహల్లు నగు మఱి, ఖండన వ॥సినను లఘుయకారము కృతులన్.

రాఘవపాండవీయమునందు.—

క. విని యతనిం దనపై నిడు, కొనియేఁగినియమితిఁ దగనిఘోరార్తి యొన
ర్చినవాఁడ మీకు దుష్యుఁడ, నని తనుఁదెలుపుచును వాని కప్పనఁ జేసెన్.

సీ. త్రైయక్ష పాంసీయ పీయూష వైయాత్య హైయంగవీన నైయాసిక త్వ
దీయ స్వకీయాస్మదీయ మదీయ ప్రభృతులను గియ్యలు పెట్ట రాదు
ఉయ్యాలయ్యాన్వయ్యసాహాయ్యసాన్నాయ్యధాయ్యహేయ్యములనికాయ్యములను
గయ్యాశబ్దమునను గియ్యలు గల వని తెలిసి ప్రాసములకు నిలుప వలయు.

తే. పైనెడ పయాటయు నాయాలి బలుగ యాళి,
యనుపదంబులఁ గొన్నిటి నగసి చూడఁ
దొలఁగు నిలుచును గియ్యలు దెలుఁగులందు,
సత్యభామా ముఖాంభోజ చంచరీక.

శశిబిందుచరిత్రమునందు.—

ఉ. పయ్యెదఁ బాపి గుబ్బలను బాహులఁ బట్టఁగనిచ్చి మోవిపైఁ
దియ్యని తేనియ న్మనసు దీరఁగఁ గ్రోలఁగ నిచ్చి యుప్పుడో

తొయ్యలి నీవి ముట్టినను ద్రోచెద వేనఁగు నిచ్చి యంకుశం
బియ్యక కయ్య మాడఁ దగునే నను నీగతి నేఁచఁ బాడియే. ౧౨౮

చిత్రభారతమునందు:—

ఉ. అయమరాచలంబు ధనువై కలసిల్లఁగ విష్ణుఁ డమ్ముగా
వేయువిధంబులం బరిధవిల్లెడుశింజిని గూర్చినట్టిశూ
లాయుధు నొక్కమాత్రమున నంగము ద్రయ్యఁగ మోది మించి తాఁ
దీయనివింటనే వెనుకఁ దీయనిధీరమున న్మనోభవా. ౧౨౯

రేఫమునకు:—

తే. జ్ఞాతికైరంబు నొంది ప్రాసంబులందు, విశ్రమములందుఁ దమలోన వేలు గలిగి
దేవదానవులట్లన తెనుఁగులందు, మించి రేఫఱకారముల్ మెలఁగుఁ గృష్ణ.

క. భ్రమయక రేఫములకు రే, ఫములను ఱాలకును ఱాలుఁ బ్రాసములను వి
శ్రమములను జెప్పఁదగునీ, క్రమమెఱుఁగక రెండునుంగుకవిగూర్చుఁగృతిన్.

ఆ. సారిది భోజకన్య నరదంబుపై నిడి, శేయఁ దెచ్చె ననఁగ రేఫ మయ్యె
నుఱఁది యనక స్నిగ్ధ పటిచి రుక్మిని బాల, ఱట్టు చేసె ననఁగ ఱా ముకుంద.

తే. చెల్లునని ముందుకీమనచెప్పె ననుచుఁ, గలుపుదురు రేఫములను ఱకారములను
దుష్టకవులవి యొకటైనఁ దొంటిపెద్దలెందలును నేల విభజింతురని తెలియరు.

క. వలసిన రేఫఱకారము, లలనఁ దా నొకటి కొక్కటని శ్రీమనరే
పలుకట గలిగిన నాతఁడు, గలిపినలక్ష్య మొకటైనఁ గనఁబడ దన్నే. ౧౩౩

ఉ. బన్నెరపోతరాజకృతభాగవతంబు సలక్షణంబుగా
కెన్నఁడి నేమిటం గొదువ యెంతయు నారసి చూడఁగాను రే
ఫమ్ములు ఱాలునుం గలసి ప్రాసము లైనకతంబునం గదా
యిమ్ముల నాదిలాక్షణికు లెల్లను మాని రుదాహరింపఁగన్. ౧౩౪

శారదాదర్పణమునందు:—

తే. చఛజఝులకును మొదలియూష్మములుమూఁడు, సరసవడినిల్పఁగానేకజాతివైన
బండిఱాకు రేఫము వడి కుండ రాదె, ప్రాసవర్ణంబులకుఁ గూర్ప రాదుగాని.

అనంతుని ఛందమునందు:—

క. ధర నెక్కటివళులై తగు, లరమఱవలు వానితోఁ దొలంగక లాకు
న్నగి శా యని విశ్రమవే, ళ రమాధవ రెండునుం గలసె వర్తించున్. ౧౩౬

ఆ. మరుసితండ్రి లోకమహితుఁడు యాదవ, రాజసింహమూర్తి రక్షకుండు
ఱాఁగ వేలు పనఁగ ఱంపిల్లు నెక్కటి, వసులునాఁగ నిట్టువనజనాభ. ౧౩౭

కావ్యాలంకారచూడామణియందు:—

క. లరమఖవ లేకతరవళు, లరయఁగఁ దమతమకె కవులయనుమతి వళులై
పరఁగుఁ బదాంతమకారము, పొరినూఁదిన యూరిచనినఁబుపుబుభువు లగుచున్.

లక్ష్యము.

ఆ. అజ్జలాడి యూగి తాపడి సభలోన, తేనిపోరిలోన తిప్పఁ బోరసి
తెన్న నుడుగుపుడమి తేండ్ల నేల నుతింప, మనకు విశ్వనాథుఁ డొనరియుండ.

సర్వలక్షణసారసంగ్రహమునందు:—

తే. మహిమ నెక్కటివళులనమరవఱలలు, రహి నిడమతమకయిమేగు రమ్యచరిత
వనధిగంభీర సద్గుణవాస యనఁగ, భంజితాసురసముదాయ యాంజనేయ.

రేఫలోపము.

క. నేను పనునట్టిలపితము, లో రేఫం బచ్చుతోఁ జ లోపం బగు రా
ధారమణ వలసినప్పుడు, భారతమున సోమయాజి పలుకుటవలనన్. ౨౪౧

విరాటపర్వమునందు:——

క. ద్యూతక్రీడకుఁ గొంకొక, నేతుం గపటమున నొప్పనిజనంబులు నా
చేతధన మెల్లఁ గొని పరి, భూతి యొనర్చిన విరక్తిపొడమి వెడలితిన్. ౨౪౨

మౌసలపర్వమునందు:——

క. కాచి కొని వచ్చి తగ నా, నేఁడినయట్లచట నిచట నిలిపితి మునినా
థా చేటును భంగంబును, నైచిత్రము శోకమునకు నగ్గం బయ్యెన్. ౨౪౩

లోపము రామికి రాజశేఖరచరిత్రమునందు:——

క. ఏరికి బుద్ధిబలంబులు, కారణములు గావు సువ్వె కలలే ధరిత్రిన్
సేరిచి బ్రతికినవారలు, నేరక చెడ్డట్టివారు నీరజనేత్రా. ౨౪౪

కారవములకు.

తే. క్రిందు గ్రద్దయుఁ ద్రోపయుఁ ద్రిమ్మటయుఁ
బ్రోచుటయు బ్రతికించుట మ్రొక్కుటయును
వ్రేలుటయు స్రుక్కుటయు నన వీనిమొదలి
వ్రాలిటులఁ గొన్నిటను గ్రారవములు చెందు. ౨౪౫

లకారమునకు.

క. పిరమణములకును బ్రాసా, క్షరములకును లళలు దొడ్డసన్నములును మ
చ్చరమా తెలుఁగళ చెల్లును, హరనుత "లళయో రభేద" యనుసూత్రమునన్.

ఆ. గంగకొడుకుమాట గాదని సభను జె, ల్లపడ నెల్లనృపులలోన హరిని
గొల్లఁ డనుచుఁ జాఁప్రల్లి చేదివిభుండు, వాలిసెంబఱచిబలము నెళవుఁజేసె.

వకారమునకు.

తే. పొలుపడి నిల్చు లాఁతివా ప్రాసమునకు, జాతివాకు సవర్ణమై శంక లేక
యతికిఁ బంచమవర్గాద్య మగుటఁ జేసి, చెల్లు వకారమునకు లక్ష్మీభుజంగ.
తే. అవనితనయునిచేతఁ బట్టు వడియున్న, పడుచుకొమ్మల హరి చెట్ట వట్టి యేలెఁ
దవిలి పదియాఱువేవురుసఖులుఁ దాను, మేలువాఁడనఁ దనునిచ్చమెచ్చుకొనఁగ.
తే. లాఁతి జాతికి వడికి నిల్పఁ దగ దనుచు, సూత్రమునఁ జెప్పలేదని చూడవలదు
నన్నయార్యుఁడుపంచమామ్నాయమునను, నిలుపు లక్ష్యంబులకుమాఱువలుకవలెనె.

ఆదిపర్వమునందు:—

ఉ. భూనుతకీర్తి బ్రాహ్మణుఁడు పుట్టఁగఁ దోడనె పుట్టు నుత్తమ
జ్ఞానము సర్వభూతహితసమ్మతబుద్ధియుఁ జిత్తశాంతియు
స్నానమవప్రహారము సమత్వము సంతతవేదవిద్యను
ష్ఠానము సత్యవాక్యము దృఢవ్రతముం గరుణాపరత్వమున్. ౨౫౧
క. నువు నువ్వు నూవు నూఁబు, వ్వొవఁ డెవ్వాఁ డెవ్వఁ డేవఁ డీతఁ డనంగాఁ
బువు పువ్వు పూవు పూవొ, గ్గవురా వికసించె ననఁగ నగు వలయునెడన్.

నూ వనుటకు శశిబింబచరిత్రమునందు:—

క. నూవుంబువ్వును సంపెఁగ, పూవు గెలిచి చిరుచుము త్రైపుంజల్లి దగ
స్టా వైచె ననఁగ ముంగర, తో వనరుహనేత్రనాస తుల లేకొప్పన్. ౨౫౩

ఏవాఁడనుటకు శాంతిపర్వమునందు:—

క. నీ వాకలి వేల యిలఁ బది, వేవురు వే వలచి పట్టి వెదకిన నడ్డం
బై వచ్చు వలదు నానిం, దేవాఁడు మగండు లేమి నెఱుఁగవు కంటే. ౨౫౪

శాంతిపర్వమునందు:—

క. ఏవానిబంధుమిత్రులు, జీవధనంబులును దప్పిఁ జెదుసు గృహునిం
గా వాని నెన్నఁగాఁ దగుఁ, గేవలతనుకార్శ్యయుతుఁడు కృశుఁడెన రేంద్రా.

పూ వన్నందుల కాముక్తమాల్యదయందు:—

ఉ. వేవిన మెడపైవలభి వేణికఁ బంట వహించి విప్పఁగాఁ
బూవులు గోళ్ల మీటుతఱిఁబో మెసఁతేఁటుల మ్రోఁత కామిశం

కావవహా హాఁ గృతాభ్యసన శాటను దంతపు మెట్లమెట్టడిం
జేనడి వీణ మీటుటయుఁ జిక్కడలించుటయున్ సరింబడన్. ౨౧౭

వ. తక్కినవి ప్రసిద్ధంబు లగుటం జేసి యిందు వ్రాయఁబడ వయ్యె.

## సకారభేదంబులు.

క. శస తెలుఁగక చదనంగాఁ, బొసఁగ ద ద ట్లనిన శకలము సక్ర త్రనుచో
వసుధ సకలము శక్ర త్రన, రసికులు నవ్వుదురు గాన రాక్షసవైరీ. ౨౧౮

సీ. శకృతిపదాదిని వెలయునా అవహల్లు మొదలివిభక్తిపైఁ గదిసెనేని
యరయఁ దృతీయోష్మ మగు శౌరి సీరలు దాఁచి గోపస్త్రీల సేఁచె ననఁగఁ
బ్రథమోష్మవర్ణంబుఁ బరికింపఁ దద్భవాద్యంధ్రదేశోక్తులయందు లేదు
సింగంబు సింగిణి సెవమును సెలగోల సీసెఁడు పసి గొసఁ జేసి రసఁగ
తే. శేషసన్నుత యివి తృతీయోష్మలిపులు, గాని ప్రథమోష్మవర్ణము ల్గావు వీనిఁ
దెలియకరచించుకృతులుధాత్రీతలమునఁ, బ్రాసభంగంబులై నగుబాటుఁజెందు.

క. తెలుఁగుపదంబుల నెత్వము, గలమూఁడవయూష్మమును శకారముఁ గాఁగం
బలుకుదు రజ్ఞజనంబులు, సెలగోలలు సెనగ లాఉసేరులు ననుచోన్. ౨౧౯

## హకారవివేకము.

సీ. బహ్వక్ష విహ్వల జిహ్వ హ్వ లాహ్వన గహ్వ రోపహ్వర ప్రహ్వ కహ్వ
శబ్దంబులు వకారసహితంబు లగుఁ గాని బిందుపూర్వములు దా మెంచఁగావు
సంహతి సంహారి సంహిత సంహార సంహాన నాంహో నృసింహ రంహ
బృంహణ పదములు బిందుపూర్వకములు గాని వకారయుక్తములు గావు
తే. మామ డులు నిల్పు బ్రహ్మజిహ్మగపదములఁ
జిహ్న మనుచోట నాముడిఁ జెందియుండుఁ
గియ్యలగు లేహ్య గుహ్య ప్రగుహ్యములను
బ్రాసముల నీని నెఱిఁగి చెప్పంగ వలయు. ౨౨౦

## కావ్యాదిగ్రాహ్యవర్ణంబులు.

మూ. సూ. శుభవర్ణా శ్శుభశబ్దా మే చ శుభగణా స్త ఏవకా
వ్యాదౌ గ్రాహ్యాః.

తే. లిపుల కధిదైవతంబులు లింగములును, బ్రాణగతి ఫలబీజంబు లాసనములు
నమృతములు విషములునదగ్ధాదిభములు, దెలిసి కావ్యముఖంబుననిలుపవలయు.

క. జడ్డలు గలమాతృక తొలి, నిడ్డ నఘోవర్ణములకు నేటికి మీఁదన్
దొడ్డనొరబిడ్డకైవడి, నొడ్డెలకనుపడ్డ వ్రాయ కూహింపఁ దగున్. ౨౬౭

## వర్ణాధిదైవతంబులు.

తే. వారిధరలు కంతురమ లంబికామరాంబ, లలకుమారవరాహశక్రులు వసుత్రి
దివఖేషకన్యలుమధుచిత్రభవులుకాళి, కార్యలు హరాభవులుపత్తలచ్చులకును.

సీ. స్పర్శవర్గములకుఁ జతురాస్యపవమానకరిముఖగణపతినరమృగేంద్రు
లింద్రావరజగుహాద్రీంద్రబాలభైరవజీను లంతకాగ్రసపశివచుపేశ
వాణులు ఫణినాథవాసుకినందికేశ్వరపద్మమిత్రశంకరులువీర
భద్రకేశవదస్రభద్రకాళీశూలధారులు నింక నంతస్థములకు
ఆ. మారుతాగ్ని పూర్వమాతంగవరుణులు, శాదివర్ణములకు శ్రీదినేశ
వాణినాకధరులు వల పైనళాకు భూ, తనులు నాగమోక్తదైవతములు. ౨౬౮

తే. కృతిముఖాక్షరదేవత పతికి సుకవి, వరునకును లేఖకునకును వాచకునకు
శ్రోతృజనములకును శుభాశుభఫలంబు, లెలమిఁ గల్పించుచుండు మహీస్థలమున.

## వర్ణలింగంబులు.

క. పుల్లింగంబులు ప్రాణము, లెల్లను స్త్రీలింగములు మహిని స్వరములతో
హల్లులు నపుంసకంబులు, పొల్లు లగుఁ గకారముఖ్యములు నలినాక్షా. ౨౬౯

ఆ చిరవిభూతి పతికి స్త్రీలింగలిపు లిచ్చు, భంగపఱుచు షండలింగలిపులు
భూరివైభవంబుఁ బొందించుఁ బుల్లింగ, లిపులు తొలుత నిలిచి లేఖవినుత. ౨౭౦

## వర్ణంబులకు నల్పప్రాణమహాప్రాణంబులు.

ఆ. స్పర్శవర్గజాతసమలిపు లొండొండ, వర్గమునను విషమవర్ణములును
నాలు గూష్మములును నలిమహాప్రాణంబు, లల్పసంజ్ఞికంబు లన్యలిపులు. ౨౭౧

క. తొలుత మహాప్రాణంబులు, నిలిచినఁ గృతినాయకుండు నీల్గును వెలలో
పల నల్పప్రాణాక్షర, ములు గూర్చినఁ జెక్కువర్షములు జీవించున్. ౨౭౨

## వర్ణంబులకు దేవమనుష్యతిర్యగ్రౌరవగతులు.

సీ. ప్రాణవర్ణములును బవిదాలు పంచమాక్షరములఁ బాసినస్పర్శములును
హ్రస్వంబు లగుతటి నాదిత్యగతు లగుఁ బావులైనపుడు భూజనగతు లగుఁ,
జింతింప ననునాసికాంతస్థవర్ణంబు లరయ నెప్పుడును దిర్యగ్గతు లగు
శషసహాక్షరచతుష్టయమును దొడ్డక్కరంబును గూడ రౌరవగతు లగు
తే. గృతిమొదలనిల్పి సురగతుల్ కీర్తిసేయు, మనుజగతులు విరోధినాశనముఁ జేయుఁ
గినిసి తిర్యగ్గతులు చాలఁ గీడు సేయుఁ, బతికి రౌరవగతులు పాపంబుఁ జేయు.

## వర్ణంబులకుఁ బ్రత్యేకఫలంబులు.

ఆ. శుభకరంబు లాభ విభవనాశదములు, నాల్గు కీర్తిదములు నాల్గు హాని
దములు రెండువరుస దప్పక కావ్యంబు, మొదల నిలుపఁ బ్రాణములు మకుంద.

సీ. ధనధాన్యసుతరాజ్యకనకంబులును యశోనాశనారోగ్యదైన్యప్రతాప
మరణంబులును దుఃఖమానభంగద్రవ్యరోగభద్రములును భోగయుద్ధ
ధైర్యతేజఃపరితాపంబులును శౌర్యకీర్తిస్త్రీభోగసంప్రీతివంశ
నాశనంబులును మానక కాదివర్గంబు లైదు నొసంగుఁ గల్యాణదేహ

తే. ఖేదదీర్ఘాయువులు యకారాదు లిచ్చు, జయభయశ్రీసుఖంబులాప్తము లొసంగు
నాయ వల్పంబుగాదొడ్డశా రెుసర్పుఁ, గవికిఁ బతికిని బద్యాదిఁ గదియనపుడు.

## వర్ణంబులకు బీజచక్రము.

సీ. నిలువుగీటులు పది నిలిపి రేఖాపట్క మడ్డంబుగా గీచి యాదిలిపులు
తొలిదొంతిక్రిందుక్రిందుల రెండు రెండిడి రెండవవాన నొంటొంటు గూర్చి
కడపలిప్రాణంబు కడగ మన్న లిఖించి హెచ్చు లాదానిపైయింట నిలిపి
తరువాతిదొంతులధామంబులను గాదు లొక్కటొక్కటి క్రమ మొప్ప వ్రాసి

తే. యడ్డమగఁ జూడనయ్యె వాతాగ్నిభూమి, జలజబీజంబులివి కావ్యములకు మొదల
నిలుప ఖేదార్తిధనహర్షనిర్ధనంబు, లొసఁగుఁ గర్తకు భర్తకు నుదధిశయన.

## బీజాక్షరచక్రము.

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అఆ | ఎ | క | చ | ట | త | ప | య | ష | ఇవిగాంయు | వాయుబీజాక్షరములు పద్యాదినినిలిపిన ఖేదము. |
| ఇఈ | ఐ | ఖ | ఛ | ఠ | థ | ఫ | ర | స | ఇవిగాంయు | అగ్నిబీజాక్షరములు పద్యాదిని నిలిపిన ఆర్తి. |
| ఉఊ | ఓ | గ | జ | డ | ద | బ | ల | హ | ఇవిగాంయు | భూమిబీజాక్షరములు పద్యాదినినిలిపిన ధనము. |
| ఋౠ | ఔ | ఘ | ఝ | ఢ | ధ | భ | వ | ళ | ఇవిగాంయు | జలబీజాక్షరములు పద్యాదినినిలిపినహర్షము. |
| ఌౡ | అం | ఙ | ఞ | ణ | న | మ | శ | అః | ఇవిగాంయు | గగనబీజాక్షరములు పద్యాదిని నిలిపిననిర్ధనము. |

## ఊర్ధ్వముఖాధోముఖపార్శ్వముఖంబులు.

(దియఁ

తే. వత్రుసుటలూర్ధ్వముఖములు నక్రమములును, గుడసులునధోముఖంబులుగడమప
ార్శ్వముఖములువరుసనొఁ బ్రాణహాని, ఖేదసంపదలొసఁగుఁ గావ్యాదినిలిచి.

### వర్ణంబులకు నమృతవిషంబులు.

క. పరువడిహ్రస్వము లమృతా, క్షరములు కృతిమొదలఁగూర్పఁ గదము లడంచున్
ధర నిడుపులు విషలిపు లవి, గరళముగలి గ్రమింగుఁ బతిని గావ్యాధి నడన్.

### వర్ణంబులకు దుష్టనక్షత్రంబులు.

క. పలికెడుకబ్బమునకు మొనఁ, దల నెలకొనునక్కరంబు తారకదగ్ధా
దుల నైదింటను దొరలక, వెలసిన నాయకున క్రిందవిభవం బబ్బున్. ౨౬౬

### దగ్ధజ్వలితధూమితతారలు.

తే. క్రూరఖేటను విడిచినతార దగ్ధ, యెపుడు వసియించునది జ్వలితాఖ్య దాని
ముంగలిది ధూమితంబెవినూఁడుగృతికి, మొదలఁగదిసినమృతిదుఃఖగదములొదవు

### మృతజీవరోగభంబులు.

తే. సైంహికేయగ్రహస్థితర్క్షంబుమీఁది, తార మొదలుగఁ బదునాఁడిదనుక జీవ
యుతములవతలివన్నియు మృతము లిట్లు, త్రివిధముగఁ జెప్పఁబడియెపరించి జనక.
ఆ. తమ్మిచుట్టు నున్న తారక మొదలుగ, మృతము లేదు ప్రాణయుతము లర్క
పరిమితములు రోగభంబులు గూడంగ, నిది వసిష్ఠమతము యదుకులేశ. ౨౬౯
క. కృతిమొదల నిలిచి చంపును, మృతనక్షత్రంబు చాల మేలొనరించున్
సతతంబు జీవతారక, పతికిఁ దెవులు సేయు రోగభము నెలలోనన్. ౨౭౦

### అవకాద్యర్ణ స్వరనిర్ణయము.

### వరరుచిసంహితోక్తవచనంబులు.

శ్లో. స్వరాః పఞ్చవిధాః ప్రోక్తా అ, ఈ, ఊ, ఏ జీతి క్రమాత్,
తైర్యుక్తా అవకాద్యర్ణా ఏకైకం పఞ్చధా భవేత్.
అవకహడా మటపరతా నయబజఘా శ్చాథ గసదచలాః,
వర్ణా ఏతే భానా మేకైకం పఞ్చధా క్రమశః.
ఐత్వ మౌత్వ మనుస్వారో విసర్గో వా భవే ద్యథా,
సర్వస్వరాణాం మాతృత్వా దేషా మస్వరో భవేత్.
ఋత్తై వ్రర్త్వయో ర్మిథో హ్రస్వదీర్ఘయో రైక్య ముచ్యతే,
యామళోక్త మిదం జ్ఞాత్వా వదే త్సర్వబలాబలమ్.

క. తలకట్టులు గుడుసులు కొ, మ్ములు వెస నేత్వములు నోత్వములునన బ్రాణం
బులు పంచవిధము లై హ, ల్లుల నెల్లను గూడుకొని నిలుచు దారలకున్. ౨౭౧

తే. అవకహడలును మటపరతాక్షరములు, నయభజఖఘగసదచలవర్ణములు వరుస
నిరువదియు స్వరపంచకాన్వితము లగుచుఁ, గృత్తికాదుల నాల్గేసిహత్తియుండు.
తే. ప్రాణషోడశమునకు నాద్యస్వరంబు, జనని యగుటను బిందువిసర్గవక్ర
తములకుఁదానయగునిడుదలకునెల్లఁగుఱుచలగువ్రుసుడులకుగుమసులగును.

నక్షత్రాధిపతులు.

సీ. అశ్వినీప్రభృతుల కైదింటికెని దస్రయమకీలిధాతృనీహారకిరణు
లార్ద్రాదులకు శంకరాదితిచిత్రశిఖండిసంభవభుజంగమపితలును
నిజముపూర్వాఫల్గునీముఖ్యములకు భగార్యమార్కత్వష్ట్రహరిణహయలు
మతి విశాఖకు శతమఖవహ్ను లిద్దఱు పిదప ననూరాధ మొదలుగాఁగ. ౩౫౪
తే. నాలుగింటికి మిత్రేంద్రనైరృతాంబు, లుత్తరాషాఢనుండి యష్టోడువులకు
విశ్వవిధివిష్ణువసుతోయవిభువిరించి, పాదహిర్బుధ్న్యపూషులు పతులు కృష్ణ.
క. ఏతారకు నెవ్వఁడు విభుఁ, డాతనినామంబు లెల్ల నాతారకుఁ బ్ర
ఖ్యాతముగాఁ జెప్పంబడు, జ్యోతిశ్శాస్త్రంబునందు సుమనఃస్తుత్యా. ౩౫౬
వ. ఇంక వర్ణంబులకు నక్షత్రంబులును రాసులును నెఱుంగు తెఱంగు వివరించెద.

కాలజ్ఞకల్పోక్తశ్లోకంబులు.

శ్లో. అకారః కృత్తికా మేష ఈ, ఊ, ఏకృత్తికా వృషః,
ఓ, వా, వీ, వూ, ధాతృవృషా వే, వో, మృగవృష స్తథా.
కా, కీ, మృగశిరాయుగ్మం కూ, ఘం, ఙం, ఛ, శివాయుగం,
కే, హా, కో, అదితిద్వంద్వం, హీ సురాంబాకుళీరకాః,
హూ, హే, హో, డా, పుష్యకర్కి డీ, డూ, డే, డో, హి కర్కటః,
మా, మీ, మూ, మేమఘాసింహౌ మో, టా, టీ, టూ, భగేభభుక్.
టే, ఉత్తరాభహర్యక్షౌ, టో, పా, పీ, ఉత్తరావధూః.
పూ, ష, ణా, ఢా, హస్తకన్యా పే, పో, చిత్రా కుమారికా,
రా, రీ, చిత్రా, తులారాశీ రూ, రే, రో, తా, మరుత్తులా,
తీ, తూ, తే వైశాఖతౌలీ తో విశాఖా సరీసృపః,
నా, నీ, నూ, నే, మైత్రకీటౌ నో, యా, యీ, యూ, స్యరా డవిః
యే, యో, భా, భీ, వైశ్యదాపో భూ, ధా, ఫా, ఢా, జలం ధనుః,

చే, విశ్వేదేవకోదణ్డో భో, జా, జీ విశ్వవాళ్పరః.
జూ, జే, జో, ఖాభిజిన్మక్రో ఖీ, ఖూ, ఖే, ఖో, హరిగ్రహః,
గా, గీ, ధనిష్ఠామకరో గూ, గే వసుపయోధరః,
గో, సా, సీ, సూ శతభిష గ్ఘటరాశి రుదాహృతః,
సే, సో, దా అజరాట్కుమ్భా ధిఅజైకపదో ఝషః,
దూ, శా, ఝూ, దా అహిర్బుధ్న్యతారాక్షేత్రం తిమిజ్గిలః.
దే, దో, చా, చీ, పౌష్ణతారా రాశిః పాఠీనసంజ్ఞికః.
చూ, చే, చో, లా అశ్వినీ భా లీ, లూ, లే, లో, భరణ్యజః.

వ. ఇండియు వీనికి నాధారంబులు కొన్ని గల వవియునుం జెప్పెద. ౨౫౫

శ్లో. ఘోరార్ద్రికద్వితీయశ్చార్ష హిర్బుధ్న్యతృతీయకే,
డకారో జలభ స్యాన్తే తద్వితీయే థ కారకః
భవర్ణక స్తత్తృతీయే ఏతే వర్గచతుర్థకాః,
ద్వితీయే హిర్బుధ్న్యభస్య ప్రథమోష్మాక్షరం విదుః,
రౌద్రాదాహిర్బుధ్న్యతోయార్క నక్షత్రాణాం మనీషిభిః,
ద్వితీయాదిత్రిపాదేషు యే వర్ణాః కీర్తితాః పురా,
తేషా మేకైకవర్ణ స్స్యా త్సర్వస్వరసమన్వితః,
మాత్రుత్వా దస్వర స్తేషా మేక ఏవ ప్రకీర్తితః,
ఆద్యద్వితీయవర్గానునాసికాక్షరయో ర్మిథః,
భేదో నా స్తి బుధ స్తద్వ ద న్త్యవర్గసమార్ణయోః,
యత్ర తిష్ఠ న్తి నామాదౌ సంయోగవ్యఞ్జనాక్షరాః,
తత్రాదివ్యఞ్జనం గ్రాహ్య మి త్యుక్తం బ్రహ్మయామళే,
రేఫాన్వితాక్షరో యత్ర నామాదౌ నృపభృత్యయోః,
ధనధాన్యాయ దమ్పత్యో ర్గ్రాహ్యం రేఫ స్తు నేతరః.

తే. హరునిరిక్క రెండవకాలునవలిఖార్ద్ర, మూఁడవపదంబునను సలిలోడుపునకు
నద్ధినేత్రకృశానుసంఖ్యాంఘ్రులందుఁ, గ్రమత వర్గచతుర్థాక్షరంబు లమరు.

క. జలరవిశివోత్తరాభా, ద్రలతొలిపాదములఁ దక్కఁ దక్కినమూఁటన్
గలిపుల కేస్వరంబులు, తల నిలిచిన నొకటి గాఁగఁ దలఁపఁగ వలయున్.

క. మిఁచి ప్రథమానునాసిక, మెంచఁ జవర్గాంత్యమునకు నైక్యెఁ బెల్లున్
బంచమవర్గచతుర్థము, వంచింపక స్వద్వితీయ వర్ణమున గగున్. ౨౫౬

క. పతినామాద్యర్ణమునకుఁ, గృతిముఖమున నుండువ్రాయికిని గీర్వాణ
స్తుత ద్విత్వంబు లున్న నథో, గతము లుడిగి మీఁదిమాతృకయ గొనుటొప్పున్.
క. నామాది నుండువర్ణము, దామోదర రేఫసంయుతం బై యున్నన్
యామళమునందు రేఫం, బే మిక్కిలి గ్రాహ్య మనుచు నెన్నంబడియెన్.

## నాయకాక్షరకూటంబులు.

తే. నేతృనామాది నుండెడిమాతృకకును, గావ్యముఖవర్ణమునకును గాంతిజాతి
చక్రగణయోనిలింగనక్షత్రయోగ, రాశిఖగమైత్రు లరసి కూర్పంగ వలయు.
క. కుశలమున వధూవరులకుఁ, బఱుపఁగ దైవజ్ఞమణి విచారించుగతిన్
గృతికన్యానాయకులకు, హితమతిఁ దెలియఁ దగు సుకవులివి తొమ్మిదియున్.

## అక్షరకాంతికూటములు.

తే. ప్రథమదశమచతుర్థస్వరంబు లెఱుపు, లసితరుచులు తృతీయషష్ఠాష్టమములు
పంచమైకాదశంబులు పచ్చవన్నె, లిందునిభములు తక్కిన యొనిమిదియును.
సీ. శ్యామలశుభ్రశోణార్జునకృష్ణంబు లసితకనీలారుణాంజనాభ
కాళిమ లరుణశుక్లచ్ఛవిపీతసితేతరరక్తంబు లిందుకాంతి
హరిణమేచకహరిద్రాభపాండురములు సితకృష్ణధవళలోహితసుపర్వ
పతిశిలాభంబులు స్పర్శవర్గములకుఁ గృష్ణారుణాసితక్షీరరుచులు.
తే. నాల్గునంతస్థములకుఁ గుందనపుఁ జేట, గెంపుటాచాయయును బవడంపుజిగియు
మొల్లవిరిమిసిమియునూష్మములకుఁ దెలుపు, గాళకారంబునకును వన్నియలు వరుస.
ఆ. విధుశరీరకాంతి వీక్షించి తత్కాంతి, గలుగునక్షరములు కావ్యములను
మొదల నిలుపఁ దేజ మొదవు పేరాకచాయ, వర్ణమిడినఁ దెవులు వచ్చు నిజము.
క. శ్వేతము నీలము నేకము, భూతలమునఁ బీతరక్తములకు నభేదం
బై తనరుఁ గృతులయందును, నీతెఱఁగునఁ దెలియ వలయు నిభపతివరదా.

## అక్షరకులకూటము.

సీ. ఆదిషోడశమును గాదిపంచాశవర్ణంబులును ద్విజాన్వయభవములు
తపవర్గమాతృకాదశకసమాంతస్థములు రాజగోత్రసముద్భవములు
తలపోయ నంతస్థములలోన శేషులు నూష్మంబులును విట్కులోద్భవములు
రదనజాతచజాక్షరములును గురులగల్ జగతి నంఘ్రిజవంశసంభవములు
ఆ. వీనిఁ దెలిసి కావ్యవిభుని దేజాతి త, జ్జాతియక్షరంబు సత్కవీంద్రు
లరసి కృతిముఖంబునందుఁ బొందించిన, నొసఁగు సకలశుభము లిరువురకును.

## స్నిగ్ధరూక్షాక్షరంబులు.

ఆ. అధిపుకులముబార్యియ యల్పాసు వైనను, స్నిగ్ధ మయ్యె నేని సిరు లొసంగు
నన్యజాతిలిపి మహాప్రాణ మై రూక్ష, మనఁగ మొదల నిలిచి యునికిఁ బాపు.

## అక్షరచక్రకూటము.

సీ. అయి యూర్ధ్వరేఖలయందుఁ దిర్యగ్రేఖ లై దిడి యిండ్లు పదాఱుఁ జేసి
యధిపనామాద్యక్షరాదిగా నచ్చులు హల్లులు గురుళకారాంతము లుగ
నాద్యగ్ని హారసిద్ధిహ స్తవేదాదిత్యదిగ్గ సకరినృపతిమనుబాణ
శైలవాసరవిశ్వసంఖ్యాలయంబుల లిఖియించి యామీఁదిలిపులు మరల
తే. వెనుకట్టుల నిలిపి తక్కినవి రెండు, పదియు మూఁడవ లావునఁగుమరు పలిచి
జగతి నరివర్ణశోధనచక్ర మిట్లు, వ్రాయఁగాఁ దగు నేఁబదివర్ణములను. ౩౦౨

సీ. నాల్గిండ్లు పైని గ్రిందను బ్రదక్షిణముగా జత గూడి యొక్కొక్క చవుకమయ్యె
నట్టిచౌకములు నాల్గవి క్రమంబున సిద్ధసాధ్యసుసిద్ధారిసంజ్ఞమ్ము లగు
నవి గాక యొక్కొక్క చవుకంబునను గల్గునిరవులు నాల్గును వరుసతోడ
క్షితి సిద్ధసాధ్యసుసిద్ధారు లన నొప్పఁ గావునఁ గడచవుకంబునందుఁ
తే. గలగృహంబులు నాల్గింటఁ గడమ మూఁడు, చవుకములయందుఁ గడపలి సదనములను
బద్యముఖవర్ణములు గనుపట్టెనేని, పఠికి నెటువంటిహితుఁడైనఁ బగయ యగును.

## అరివర్ణచక్రోద్ధారణము.

| | | | |
|---|---|---|---|
| ౧ ఏటర | ౨ అంఙమ | ౩ ఐఠల | ౪ అఃతస |
| ౫ ఛబఉ | ౬ గధఒ | ౭ జభఔ | ౮ ఘనఆ |
| ౯ ఙఢశ | ౧౦ ఖదళ | ౧౧ ఓడవ | ౧౨ కథహ |
| ౧౩ ఞయఋౠ ఌౡ | ౧౪ చఫఈ | ౧౫ ఝమఊ | ౧౬ ణపఇ |

వ. ఎఱ్ఱాప్రగడ తనకును, ఆరణ్యపర్వశేషము మొదలిపద్యమునకును, అక్షరచక్రము చూచుకొనినందులకుఁ దెలివిడి. తెనుఁగున శబ్దాదిని యకారము లేదు గనుక నెఱ్ఱాప్రగడనామాద్యక్షర మచ్చుగాన, ఎకారము అది మొదలుకొని ప్రాయఁగాఁ బద్యాదివర్ణము, స్ఫురదరుణాంశు, అన్నాఁడు గాన ద్వితీయాక్షరమునందు మీఁదటియక్షరమే కారణము గనుక సకారము సాధ్యపుచోకము నందు సాధ్యపునింట నిలిచెఁ గాన సాధ్యసాధ్యము మంచిది, యెవరికిఁ జూచినను నిటువలెనే. ౩౦౪

క. ఆరయ నామాద్యక్షర, తారాగణమును దదీశతారాగణముల్
వైరము నొందిన భర్తకు, ఘోరార్తి ఘటించు మైత్రిఁ గూడిన నొప్పున్. ౩౦౫

తే. అధిపతికి నేండ్లు ముప్పది యైనదనుక, నతఁడు పుట్టినరిక్కయు నంతనుండి
నామధేయంబు మొదలివర్ణమున కైన, చుక్కయును జేకొని బలంబుఁ జూడవలయు.

క. జనియించిన తారయు లుం, గని జనులకు నామతారకయు చేకొనఁగాఁ
జను నని సంహితలోపల, ననియె వసిష్ఠుండు గోచరాధ్యాయమునన్. ౩౦౬

సీ. నవతార లొక్కగణం బగు నట్టిగణంబులు మూఁడువిధంబు లయ్యె
హయమృగాదితిపుష్యహస్తమారుతమైత్రశేవతీశ్రవణముల్ దేవగణము
లగ్నీంద్రవరుణచిత్రాహిమూలలు విశాఖావసుమఖలు రాక్షసగణములు
పూర్వత్రయవిరించిశర్వోత్తరత్రయయామ్యముల్ నృగణంబు లనఁగఁ జెలఁగు

తే. నుత్తమము రెండుగణములు నొకటియైన, మధ్యమము సురనరగణాహ్వయము లైన
నధమ మాదిత్యగణము దైత్యంబు లైన, నాశనము దానవంబు మానవము లైన.

## యోనినిర్ణయము.

ఆ. మురవిభేది కావ్యముఖవర్ణతారకా, యోని నాయకర్క్ష యోనితోడఁ
బొందుఁ గూడెనేని బూర్ణాయు వగు వైర, మొందెనేని హాని చెందుఁ బతికి.

సీ. వాజిశతోడు లశ్వినులు యామ్యాంత్యభంబులు కరు లగ్నిజ్యములు గొఱియలు
బ్రహ్మేంద్రు లహులు నర్పపునర్వసులు పిల్లు లిల మఘఫల్గును లెలికకూన
లుత్తరాహిర్బుధ్న్య లాహింప గోవులు వాయుహస్తంబులు వాహరిపులుఁ
దలఁప నింద్రాగ్ని చిత్రలు పులు లింద్రానురాధ లేణంబులు రాక్షసాగ్ద ౧

తే. లడవికుక్కలు జలభంబు హరియుఁ గపులు, విశ్వతారాభిజిత్తులు వేఁటమృగము
లజపదంబు ధనిష్ఠయు నరసి చూడ, బాలకంఠీరవంబులు పద్మనాభ. ౩౧౦

ఆ. ఏకయోను లైన నెంతయు మంచిది, కొంతమేలు భిన్నజంతు లైన
వైరజాతు లైన వర్జనీయము వాని, తెఱఁగు గౌరవంబుఁ దెలియవలయు. ౩౧౧

సీ. అశ్వంబునకు హరివ్యాఘ్రిసైరిభములు కరటికి శార్దూలతురగహరులు
మేఁకకుఁగరిపుండరీకహర్యక్షంబు లురగంబునకుఁ బిల్లియును నకులము
మార్జారమునకు సింహవ్యాఘ్రశునకంబు లాఖువునకు బిడాలాహిబభ్రు
లర్వగోకాసరసైరిభాళికిఁ గేసరిద్వీపులు పులికి హస్తిద్వివంబుఁ
తే. గుక్క లేటికి సింగంబు గోల్పులియును, బభ్రుకపులకు శునకడింభంబు నరులు
గట్టికి నమున మృగరాజుఁ బట్టునట్టి, జంతువులు లేవు దానిచే సమయఁగాని.
క. ఇభరాజభయనివారణ, ప్రభుతారాలింగమును బ్రబంధాదిమవ
ర్ణభలింగంబును గలసియు, శుభదంబులు గాఁగ సుకవి చూడఁగ వలయున్.

లింగనిర్ణయము.

ఆ. ప్రథమయోని పురుషభం బొక్క టైనను, యువతిభంబు మిథునయోగ మైన
నుత్తమంబు స్త్రీభయుగ మైన మధ్యంబు, పురుషభద్వయమునఁ బోరు పుట్టు.
క. నెలఁతలకుఁ బురుషతారలు, తలఁపఁగఁ బురుషులకు యువతితారలునై సం
ధిలునపుడు లింగదోషం, బులు పని లే దనిరి కశ్యపుండును భృగువున్. ౩౧౭

అక్షరనక్షత్రదూరము.

ఆ. కృతిముఖంబువ్రాయిరిక్కకు విధుతార, పదియు మూఁటిమీఁదఁ బాదలునేని
భర్త వర్షశతము బ్రతుకు లోపల నున్న, నల్పకాలమునఁ గృతాంతుఁ గాంచు.

అక్షరరాశికూటము.

క. అక్కజ మగుకబ్బముతొలి, యక్కరపుంజుక్కరాశి యారభ్యముగా
లెక్కింప నధిపురాశికి, నిక్కశుభాశుభము లెఱిఁగి నిలుపఁగవలయున్. ౩౧౮

రాశినిర్ణయము.

తే. క్రమతఁ గావ్యాది నుండునక్షత్రరాశి,నుండి లెక్కింప భూరామయుగశరాద్రి
కరితపనసంఖ్యలను గృతీశ్వరునినామ, రాశి దనరిన నతులసామ్రాజ్య మొదవు.
తే. మేషమునకు వృశ్చికమునుమిథునమునకు,నక్రమునుసింహమునకుమీనంబునహితు
లెనిమిదవయవి శుభదంబు లనుచు వీని,గైకొనుట గూడదనిచెప్పెఁగశ్యపుండు.
తే. విదితముగ రెండు నాలు తొమ్మిదియుఁ బదియుఁ
బదునొకండు నై పదిరాశి పరఁగునేని
నిర్ధనంబుఁ గళత్రహానియు నపత్య
నాశనంబు దుఃఖంబు దైన్యంబుఁగలుగు. ౩౨౦
ఆ. కన్యకాకుళీరకార్పిజలగ్రహ, వృషతిమింగిలంబు లెంచునపుడు
షష్ఠరాసు లైన జాయకు దీర్ఘాయు, వనుచు నక్షపాదుఁ డానతిచ్చె. ౩౨౧

తే. రాశి యొక్కటి రెండు తారకలు నైన,రాముగతిఁ గృతిపతి శత్రురాజినడఁచు
రిక్క యొకటియు రాసులురెండు నైన,రిపులచేఁ గృతిపతిసంహరింపఁబడును.
క. మును చూపించినరాసులు, గనుఁగొన నేకాధిపత్యఖఘమైత్రము లొం
దినఁ దద్దోషము లెల్లను, జను నని నారదుఁడు సెప్పె సంహితలోనన్. ౩౨౩

## అక్షరగ్రహకూటము.

ఆ. కర్తృరాశి పతికిఁ గావ్యాదివర్ణము, రాశి కీశుఁ డైన గ్రహమునకును
సూఁడు గలుగఁ జెప్పవాఁడు కాలయముండు,గానికవివరుండు గాఁచుపతికి.
క. ధరణీసుతభృగుబుధశశి, సరసిజహితసౌమ్యకవిరసాభవసుమనో
గురుమందమంగుజీవులు, తిరముగ మేషాదిరాశ్యధిపతులు వరుసన్. ౩౨౪
వ. మఱియు నొక్కవిధంబు. ౩౨౫
చ. హరిపతి హేళి, కర్కివరుఁ డంబుజశత్రుఁ డజాళిభర్త గ
హ్వరికనయుఁడు, యుగ్మవనితాధిపుఁ డిందుసుతుండు, చాపమ
త్స్యరమణుఁ డింద్రమంత్రి వృషతౌలివిభుం డుశనుఁడు, నక్రపు
ష్కరధరరాశివల్లభుఁడు సారసబంధుకుమారుఁ డచ్యుతా. ౩౨౬
క. జ్యోతిశ్శాస్త్రము గా దని, మాతృకలకు భైరవుండు మఱియొకచందం
బై తనరఁ జెప్పె గ్రహసం, ఘాతము రాశిపతి దక్క గ్రహ మొరుఁ డగునే.
తే. అధిపతులకంటె గణముల కర్తములకు, గ్రహములే బలవంతు లామహిమఁగాదె
యడుగుదాఁకినఁగశిభానుఁడలిగిమూఁడు,గడియలకుఁదొల్లిశిలపాడిగాఁగఁదిట్టె.

## గ్రహమైత్రీనిర్ణయము.

సీ. భానున కాప్తులు భౌమేజ్యసోములు శత్రులు భృగుపుత్రశనులు, శశికి
సఖులు బుధార్కులు శత్రుఁడొక్కఁడును లేఁడు,కుజునకుఁజుట్టలు గురురవీందు
లరి రౌహిణేయుఁడు,హరిణాంకసుతునకు హితులు భార్గవమంద లీను తండ్రి,
గురునకుఁ జెలులు భాస్కరచంద్రకుజులువైరులుకావ్యసౌమ్యులు,బలిగురునకు
తే. బంధులినతనయజ్ఞులు పరులు మిహిర, తుహినకిరణులు శనికి విందులు కవిజ్ఞు
లహితు లారార్కతారేశు లందఱకును, సములు తక్కినహరిదచారు లెల్ల.
క. సమమిత్రము లైనను భ, ద్రము నేలుం బతికి సుహృదరాతిగ్రహముల్
సమకూడిన భయ మొదవును, సమశాత్రవు లైనఁ గీడు చాల ఘటించున్.
తే. ఈశుఁ డొకఁ డైన నిద్దఱి కిష్ట మైన, మంచిది సమత్వ మైనను మధ్యమంబు
వైర మైనను వర్జింప వలయుఁ గాని,తగదు నేకొన నఃదెఁ బితామహుండు.
తే. రవియుతుఁడునీచగతుఁడుపరాజితుండు, సహితరాశిస్థితుండునైయప్పుడుండు
గ్రహము వర్ణంబు గణము ను గావ్యమునకు, నాదినుండిన శేవు శుభాశుభములు.

తే. శారదాదర్పణంబున జ్యౌతిషంబుఁ, బట్టి గ్రహమైత్రిమాత్రంబువలుకఁబడియె
దానిఁ గని విస్తరించితి తద్విధంబ, భైరవాదులు తెనుఁగునఁ బనికిరాలి. ౩౩౪

## కృత్త్యాదివర్ణద్వయ యోగఫలంబు.

ఆ. గరిమ యోనిలింగ గణతారకాచూర, రాశిషేటతత్త్వ కాళబీజ
చక్రకూటములు విచారించి కావ్యాది, వర్ణయుగము నిలుప వలయు సుకవి.

తే. ఆదిలిపి కన్యయనుద్వితీయాక్షరంబు, పలియుఁగాఁ జేసెయీ రెండువర్ణములకు
నిపుణు చెప్పినకూటంబు లెల్ల నరసి, కూర్చినప్రబంధము నిలింపకుజము పలికె.

క. మొదలను సంయుక్తార్ణము, గదిసిన నీరెంటికిని సకలకూటంబుల్
పదిలముగఁ జూడ వలయును, బదరక యామీఁదిలిపికిఁ బని లేదు హరీ. ౩౩౭

క. క్రిందను జడ్డక్కరములు, సెందనిలిపు లాది నున్న సిద్ధముగాఁ జూ
డం దగుఁ గూటము లెల్లను, బొందుగఁ బ్రథమద్వితీయములకు ముకుందా.

తే. త్రిదశనుత యోని లింగంబు మొదలు గాఁగ
నాలు మును జెప్పఁబడి యుండు నవలిషేట
కాంతికూటము మొదలుగాఁ గ్రమత మూఁడు
దెలియఁ బలికెద నీకుఁ జేటలెల్ల గాఁగ. ౩౩౯

## గ్రహకాంతికూటము.

క. మొన నున్నమాతృకాద్యము, మునకు న్గణయుగ్మమునకు మును జెప్పినచా
ప్పన నైన ఖేచరంబుల, తమకాంతులవలనఁ దెలియఁ దగుఁ దత్ఫలముల్. ౩౪౦

## గ్రహవర్ణంబులు.

క. రవిభౌములు రక్తాంగులు, కవిజైవాతృకులు ధవళకాయులు సోమో
ద్భవగురులు పీతగాత్రులు, దివాకరసుతుండు నీలదేహుం డరయన్. ౩౪౧

తే. పాండుపీతాంగు లెల్ల శుభగ్రహములు
రక్తమేచకతనులు క్రూరగ్రహములు
పద్మహితుఁగూడి శశియును బాపియగును
క్రూరసంగతి బుధుఁడును క్రూరుఁ డగును. ౩౪౨

తే. రెండును ఖలగ్రహములైన మృత్యు వగును
సౌమ్యుఁడు నొకండు నైనను శర్మ మగును
పాపశుభఖేచరము లైన బవర మగును
శోభనక్రూరు లైనను శోక మగును. ౩౪౩

ఆ. నృపునినామమునకుఁ గ్రిందివంకను మీఁది, వంకయును నుండువర్ణములకు
గణములకును పాపఖచరంబులై యున్నఁ, జెడకయుండువాఁడు శివుఁడొ హరియొ.

క. కమలాప్రమదాప్రియకా, వ్యముఖంబున నుండు రెండు వ్రాలకు నగుపీ
జము లుక్తక్రమమున మి, త్రము లైనను బతికి శుభము వార్కోను టరుదే.

## బీజమైత్రీ నిర్ణయము.

తే. చదలు గాడ్పులమంగల జగతి పుడమి, సరస నేలయు నీరును జలముమీఁద
మిత్తియు నిప్పును నిప్పును జిచ్చుచేంత,నుదకమును గృతిముఖమున నున్నమైత్రి.
ఆ. కీలిమీఁదిగాలి కృతిముఖంబున నిల్చి, యేటిలోనఁ బొత్తు మెల్లఁ గాల్చు
గాలిమీఁదికీలి కర్తమందిర మెల్ల, నిర్దహించు నాలుసెలలలోన. 384

## అరివర్ణశోధనచక్రకూటము.

క. నిక్కము మొనలిపి రెండవ, యక్కరమున కరిగృహంబునం దుండినయా
చిక్కురుకబ్బం బొనయనిఁ, జిక్కు వడఁగఁ జేయుఁ జగలుచే రణభూమిన్.

## ప్రశస్తకూటంబులు.

తే. మిత్తిసుమల కాలు ధారుణీపతులకైదు
వైశ్యులకునాల్గు శూద్రాంత్యవర్ణజులకు
మూఁడురెండును శుభకరంబులయియున్నఁ
జాలునని యొసంహితలోనశౌనకుండు.

తే. విప్రులకు గ్రహమైత్ర్య మర్వీపతులకు, గణవిధము వైశ్యులకు రాశిగణనశూద్ర
నీచులకు యోనితార లిన్నింటిలోనఁ, గడుఁబ్రశస్తంబు లిది వృద్ధగర్గమతము.
క. కూటము లెఱుఁగవు మాలో, సాటికిఁ బద్యములు చెప్పి చదివెద విది బల్
చేటు సుమీ యని పెద్దలు, నేటుచునఁ గుకవి కడుఁగినిసె జగడించుచున్. 385

## సంయుతాక్షర విశేషము.

సీ. క్షారహరిద్రారజంబులు గూడఁగఁ దమశుభ్రపీతవర్ణములు విడిచి
రక్తవర్ణంబు లై రాణించుచాడ్పున నశుభప్రదంబు లైనట్టివ్రాలు
జగతిపై సంయుతాక్షరము లై కనుపట్టి నిజదుష్టఫలము లన్నియును బూని
సకలసంపత్ప్రదాయకము లై తనరారు పంచదారయు నానవాలు గలసి
తే. తొంటికంటెన మిగులమాధుర్యరుచుల,నొప్పగ తిక్షలిపులు సంయుతములగుచు
నధికమంగళకరము లై యమరుననుచుఁ, బ్రమథపతిమాతృకానిధానమునఁ జెప్పె.

## శ్రీకారప్రభావము.

తే. వేదముల కెల్ల నోంకార మాది యైన, కరణిఁ గృతులకు నెల్లశ్రీకార మాది
గానఁ గవివరు లెల్లను దానిఁ దక్కనితరవర్ణంబు లిడరు సత్కృతుల మొదల.

క. ఎంతయు శ్రీకారము లా, ద్యంతంబుల నుంచి లేఖ లంపిన నగు న
త్యాంతంబు గార్యసిద్ధి ము, గాంతక కావ్యాదిఁ గూర్ప నరుదె శుభంబుల్.

క. పదపడి శ్రీకారము కృతి, మొదల నిలిచి దోషపుంజము నడంచి శుభం
బొదవించుఁ బరుస మినుమును, గదిసి సువర్ణంబు సేయకరణిక్ ధరణిక్.

క. శుభదేవతాత్రయంబును, శుభఖచరత్రయము గలిగి శుభవాచక మై
యభినుతి గాంచినకతమున, శుభములు శ్రీకారమునను జొప్పడు టరుదే.

వ. దీనితాత్పర్యము శవర్ణంబును రేఫము ఈకారస్వరమును ఈమూఁడును గూడఁగా శ్రీకార మయ్యెను. అందులో శవర్ణంబునకు ఈకారంబునకు నధిదేవత లక్ష్మీదేవి రేఫమున కగ్నిదేవుఁడు గావున "శ్రియ మిచ్ఛే ద్ధుతాశనాత్" అని పురాణవచనము గలుగుటం జేసి అతఁడును లక్ష్మీప్రదుండు గాన మూఁడువర్ణములకును శుభదేవత లైరి. మొదలిశవర్ణమునకు గ్రహము గురుఁడు రేఫమునకు ఈ యనుస్వరమునకును శుక్రుఁ డొక్కఁడే కావున మూఁటికిని శుభగ్రహములే యయ్యెను. "కమలా శ్రీ ర్హరిప్రియా" అని లక్ష్మీనామ మగుటం జేసి శుభవాచక మయినది అది గానఁ గృతిముఖమునందుఁ బ్రయోగించిన శ్రీకారమువలన శుభము గలుగుట యాశ్చర్యము గాదు నిశ్చయమే యనుట. ౩౫౪

సీ. మొదలిశాలుభవోష్మములకు నభోదీజరారవగతి మహాప్రాణములును
దిగువ రేఫమునకుఁ దిర్యగ్గమనదాహఫల వీతిహోత్రాధిపత్యములును
గనుఁగొన నారెంటికిని మర్త్యదానవగణబృహస్పతి శుక్రఖచరములును
బ్రథమాక్షరమునకుఁ బలికిని వైశ్యచాపములు జకుల గోవ్యాఘ్రయోనిభములు

తే. నగుకతఁబున శ్రీ యనునక్షరమున, నిండి యుండుదోషంబు లిన్నియు నెఱింగి
సంయుతంబనియును శుభశబ్దమనియు, నదియనిలిపె నన్నయ భారతాదియందు.

## కృతిముఖ ప్రశస్తంబులు.

మూ. సూ:—శుభవర్ణాశ్శుభశబ్దా యే చశుభగణా స్త ఏవ కావ్యాదౌ గ్రాహ్యాః.

తే. అమరవాచకములు మంగళార్థవాచ, కములు నైనశబ్దములు కావ్యముల మొదల
నిలిచిదుర్వర్ణదోషము ల్బాలఁగఁద్రోచ్చిక ర్తకునుభ ర్తకును భావుకంబుఁ జేయు.

క. శ్రీవాణీకీర్తిసతీ, జైవాతృకహర్షమేఘసాగరధరణీ
భావుక సిరోగాయు, ర్గావాఖ్యానములు శుభకరము లాది నిడక్. ౩౬౦

క. మోదంబున సత్కవి ప్రతి, పాదింపఁగ వలయు శుభముఁ బడయుట కై కా
వ్యాదిని వరునకు నాశీ, ర్వాద మయిన దేవతాభివాదన మైనన్. ౩౬౧

క. గాయకపుకవులు కొందఱు, నాయకకల్యాణగుణగణము లొండె నభీ
ష్టాయతవస్తువు లొండెను, బాయక కీర్తింపుదురు ప్రబంధము మొదలన్. ౩౬౨

వ. అమరవాచకంబులకు నేకావళియందు "ప్రాలేయాచల కన్యకా" యనియును, కల్పితకల్పవల్లియందు, "హేరంబ మవలంబే" యనియును, రామాయణమునందు "రాముని శుభచరితమ్ములు" అనియును, మంగళార్థవాచకంబులకు శ్యామలాదండకంబునందు "జయమాతఙ్గతనయే" యనియును, త్రిస్థలీ దండకమునందు "విజయనగర హేమకూటంబునన్నిల్చి" యనియును, ఆశీర్వాదంబునకుఁ గృష్ణవిజయంబునందు "పాయా దపాయా" త్తనియును, సాహసాంకంబునందు "అవ్యాత్సవో" యనియును, దేవతాభివాదనంబునకు భప్పన్నఁబునందు "ప్రణమ్య లోకకర్తార" మనియును, నాయకగుణంబులకు నైషధమునందు "సువర్ణదణ్డైకసితాతపత్రితజ్వలత్ప్రతాపావళికీర్తిమణ్డల" యనియును, అభీష్టవస్తువులకు వృత్తరత్నాకరమునందు "సుఖసన్తానసిద్ధ్యర్థ" మనియును, లక్ష్యంబులు గలిగి యుండును. ౩౬౩

తే. క్లీబలింగశబ్దంబులు కృతికి మొదలఁ, గూర్ప నాయకుధన మెల్లఁ గొల్ల వోవు
సరవి స్త్రీలింగ పుల్లింగశబ్దము లిడ, సంపదలు వైభవంబులు చాలఁ గలుగు.

క. అతిశుభపదయుగాంత, ర్గత మై పతి పేరు కృతిని గనుపట్టిన నే
తిరి వజ్రపంజరాంత, ర్గతుమాడ్కి నభేద్యుఁ డగు నరాతుల కెల్లన్. ౩౬౪

## తత్తత్ స్థానప్రయోగనిషిద్ధాక్షరంబులు.

మూ. సూ:—పుగాస్త్రరసగిరిరుద్రేష్వక్షచటతపామాత్రృకానింద్యాః.

క. ఆదిస్వరమును బ్రథమై, కాదశవస్త్వార్ణములు కకారాదులలో
నాదట దంత్యోష్ఠ్యము లిడ, రాము పురశర ర్తుగిరిహరస్థానములన్. ౩౬౫

క. మూఁడవతావున మొదలిటి, మూఁడుసరళవర్ణములును మూఁడవస్వరమున్
మూఁడవయాష్టాక్షరమును, గూడదు కదియింప నెట్టికూళకు నైనన్. ౩౬౬

తే. వ్యంజనాహ్వయమున నాస్వవ్రాలలోన, షోడశాక్షర మాఱవచోట నిలిపి
మచ్చరంబునఁ దనుఁ జంపవచ్చినట్టి, చెడుగునకు నైనఁ బద్యంబు నుడుగ వలదు.

సీ. గడియలోపల మూఁడుగంద్రికలై త్రాడు ధరఁ గూలఁ దిట్టె మేధావిభట్టు
కినిసి యొక్కమహార్తమున బ్రహ్మదండిముం డెల్ల హుళ్ళఁగఁ దిట్టె వుల్లభుఁడు
మూఁడునాడికలకు ముట్టడి వై చినమాకని భీమన మడియఁ దిట్టె
సకలాముసకుఁ జెలు వంతయు నింకఁగఁ దిట్టెను బడబాగ్నిభట్టసుకవి

తే. వాసర త్రయమునకుఁ జాపంగఁ దిట్టె, శ్రీనగము దోఁచుతుక్కని శేషమంత్రి
తురగచోరకుఁ బడఁ దిట్టెఁ దిరుమలయ్య, పద్యగతమష్టవర్ణ ప్రభావములను.

వీరలు చెప్పినలక్ష్యంబు లెవ్వియనిన: —మేధావిభట్టు ఆఱవచోటఁ దకారమునిలిపి గడియకుఁ దాటిచెట్టు విఱుగఁ దిట్టినచాటుధార:—

క. సాళువపెదతిమ్మమహీ, పాలవరుఁడు వీఁడె వచ్చెఁ బద్యము వ్రాయన్
గేలను లే దా కాకటియుఁ, జాళవ ముత్తునియ లగుచు ధరపైఁ బడుమా. ౩౨౦

ప్రౌఢకవిమల్లనమూఁడవచోట అకారమునునిలిపి రెండుగడియలకు బ్రహ్మదండిచెట్టుముండ్లు రాలఁ దిట్టినచాటుధార:—

క. గుఱియన్న నృపతిఁ బొడఁగన, నడుమంగాఁ గొండపల్లినగరిపడమటం
గుడియెడమ మడవ గాడిన, చెడుముండులు బ్రహ్మదండి చెట్టున డుల్లున్.

వేములవాడభీమకవిపదునొకండవచోట హకారంబునిలిపిమూఁడుగడియలకు రామగిరిదుర్గమునను త్తికదిగినమూర నిజావఁదిట్టినచాటుధార.

ఉ. చక్కఁదనంబుదీవి యగుసాహిణిమారఁడు మారుకైవడిన్
బొక్కి పడం గలఁడను చలము స్థలముం గలయీచలుక్యపుం
జొక్కనృపాలుఁ డుగ్రుఁ డయి చూడ్కుల మంటలు రాలఁ జూచినన్
మిక్కిలి రాజశేఖరునిమీఁదికి వచ్చిన రిత్త వోవు నే. ౩౨౨

బడబానలభట్టు ఏడవచోటఁ డకారం బిడి త్రిపురాంతకమునుండి శ్రీశైలమునకుం బోయెడు తెరువునం దెలుఁగురాయఁడు గట్టించిన చెఱువు నీళ్లన్నియు నాలుగుగడియలకు నింకి పోవునటులఁ దిట్టినచాటుధార: —

క. బడబానలభట్టారకు, కుడిచేయంగరము గవికి గొబ్బున నర్ఘ్యం
బిడువేళ నూపి నీలోఁ, బడియెఁ దటాకంబ నీవిఁ బాయుము వేగన్. ౩౨౩

ఏలూరిమంత్రి మైదవచోటఁ గకారమునిలిపి శ్రీశైలముందోఁచిన తుక్కరుసును మూఁడుదినములకుం జావ దిట్టినచాటుధార:—

చ. మును పొకకేల రావణుఁడు మోదమున న్రజతాద్రి యెత్తినం
తనె హరుఁ డప్పుడే తనపదంబున నొక్కి నుదం బడంచెఁ గా
వనమయగారి తుక్కసచివా యల శ్రీగిరి గడ్డపారలన్
గనలుచుఁ ద్రవ్వి సర్వమును గైకొనునీ కిపు డాతఁ డోపఁడే. ౩౨౪

రెల్లూరి తిరుమలయ్య ఆఱవచోటం దకారంబు నిలిపి తనగుట్టు మును దొంగిలించిన శ్రీపతిరాజు పోతరాజును నేడుదినములకుంజావఁ దిట్టిన చాటుధార:—

చ. హయ మది సీత పోతవసుధాధిపుఁ డారయ రావణుండు ని
శ్చయముగ నేను రాఘవుఁడ సహ్యజ వారిధి మారుఁ డంజనా
ప్రియతనయుండు లచ్చన విభీషణుఁ డాగుకిమెట్ట లంక నా
జయమును బోతరక్కసునిచావును నేడవనాఁడు సూడుఁడీ. 325

వ. మఱియును గొన్ని యుదాహరణంబులు
ఎడవల్లివర్వాతన్న పంచమస్థానంబునను
హకారముఁ గూర్చి చెప్పినపద్యము:—

క. అంగజసంహారుం డగు, సంగరభీముండు ప్రళయసమయోగ్రుం డై
యింగలపుఁగంటఁ జూచిన, బంగరుకామయ్య మేను భస్మం బయ్యెన్. 326

పింగళిరామరాజు పంచమస్థానంబునఁ గకారంబును షష్ఠస్థానంబునం జకారంబును గూర్చి చెప్పినపద్యము:—

ఉ. పింగళి యేకచక్రపురి పెంపుగ నందు వసించి యున్న యా
తింగెడికొండఁడే బకుఁడు తథ్యము మానవులార వానిబా
ధం గడ ముట్టఁ జేసె మను ధర్మజతమ్ముఁడు భీముఁ డిప్పు డీ
యెంగిలిముచ్చుఁ జంపుటకు నీశ్వరు వేఁడుఁడు భీముఁ డయ్యెడిన్. 327

తెనాలిరామకృష్ణుఁడు పంచమస్థానంబునఁగకారంబునుసప్తమంబు నండకారంబును గూర్చి చెప్పినపద్యము:—

క. బసవనకుఁ బుట్టినప్పుడె, పసరము గోవిందరాజు పసరం బైనం
గస వేటికిఁ దినఁ డనఁగాఁ, గసవుం దిను శత్రులాజిఁ గదిసినవేళన్. 328

రంగరాజులింగయ తృతీయస్థానమునందుఁ గకారముం గూర్చి గూఢముగాఁ దిట్టిన చాటుధార పద్యము:—

క. రవికోటిధామమయ మై, నవకాంచనయుతము నగుచు నానాఁటి బొగిన్
భువిని శివాన్వితే మగు సీభవనము జూపల్లిలింగ భవగుణసంగా. 329

తే. ఆదిపర్వంబుమొదలిపద్యంబునందు, సప్తమస్థానమున శబ్దశాసనుండు
జమిపియక్కరమును విశేషము దలంచి, పాకకొలికెఁ జవర్గంబుసయనుదక్షిం

## దోషపరిభావము.

క. ఇప్పటినియమము లన్నియు, నొప్పఁగఁ గావ్యంబుమొదల నొకపద్యము దాఁ
జెప్పినను జాలు నవతలఁ, దప్పిన దోషంబు లేదు దర్పకజనకా. ౩౬౧

క. గట్టిగ దోషము తెలుఁగక, తిట్టిన నది దీవన యగు దీవించినచోఁ
ది ట్టగు నది దెలిసియు మఱి, తిట్టిన దీవించినను బలికి నిక్క మగుక్. ౩౬౨

క. గుడ్డి యగునెద్దు జొన్నను, బడ్డపగిది లక్షణంబుపథ మెఱుఁగనియా
యొడ్డె కవిత్వముఁ జెప్పిన, నడ్డం బై బుధు లదల్ప నది యే మగునో. ౩౬౩

## గుణావగుణబాహుళ్యవిశేషంబులు.

తే. ఇపుడు చెప్పినదోషంబు లెల్ల మాని, గుణములన్నియుఁగలుగఁగఁగూర్పనగునె
ప్రస్ఫ కైనను స్వల్పదోషంబు నధిక,గుణము లగు నేని దానిఁజేకొనఁగవలయు.

క. ఇల సద్గుణనికరములో, పల నొకదోషం బడంగుఁ బదియాఱిమృతాం
శులలోన నొకకళంకము, జలజారికి నెన్నఁ బడనిచందమున హరీ. ౩౬౫

తే. విఫలము సకంటకంబును విషధరాశ్ర
యంబు వక్రంబు పంకభవంబు నైన
మొగలి పరిమళమున యోగ్య మగుతెఱఁగున
సద్గుణంబొక్కటియ దోషసమితిఁ జెలుచు. ౩౬౬

క. తెలియఁగ నీశుభలక్షణ, ములు కురుకురుకవులకావ్యముల లేవు సుమీ
తొలుత మహాకవివర్యులు, పలికినసత్కృతులఁ దక్కఁ బన్నగశయనా. ౩౬౭

## మాతృకార్చనావిధానము.

చమత్కారచన్ద్రికాయామ్:—

శ్లో. అకారాదిక్షకారాన్తవర్ణాః స్యుర్మాతృకాహ్వయాః,
సాహిత్యరత్నాకరే.

శ్లో. ప్రభూ నుద్దిశ్య పద్యం వా ప్రబన్ధం వా కదాచన,
న వక్తవ్యం న వక్తవ్యం మాతృకాపూజనం వినా.

లక్షణదీపికాయామ్.

శ్లో. నాయకేన ప్రయుక్త స్సన్ దన్తధావనపూర్వకమ్,
పుణ్యానిర్మలతోయేన మఙ్గళస్నాన మాచరేత్.
శుచిర్ధౌతామ్బరధరో గన్ధమాల్యై రలఙ్కృతః,
పూజాగృహం వ్రజే న్మాన్యో గీతవాద్యాదినిస్స్వనైః.

శుభాసనే సుఖాసీనః ప్రాఙ్ముఖో న్యాసపూర్వకమ్,
విప్రాదిమాతృకా స్తత్తద్వర్ణద్రవ్యైః ప్రపూజయేత్.

ఆ. కవులు మొదల మాతృకాపూజసలుపక, కావ్య మొండెఁజాటుకావ్యమొండెఁ
జెప్పరేని తమకుఁ దప్పఁగుఁ బలికినిఁ, బోని వచ్చుఁ గృతియు నడఁగి పోవు. ౩౬౭

సీ. ప్లక్షకాష్ఠంబునఁ బలుదోమి మంగళస్నాతుఁడై శుభ్రవస్త్రములు కట్టి
మలయజకర్దమం బలఁది భూషణములు మైఁ దాల్చి కుసుమదామములు చుట్టి
కవిలాక్షణికలేఖకగ్రంథవాచకశాబ్దికతార్కికసహితముగను
గానతతానర్ఘఘనసుషిరస్వనంబులు సర్వదిక్కుల భోరుకలుగ

తే. వచ్చి దక్షిణపాదపూర్వకముగాఁగ, మాని మై మాతృకార్చనమందిరంబుఁ
జొచ్చి పూర్వాభిముఖముగా సుకవివరుఁ డు, చిత్రకంబళమున సుఖాసీనుఁడగుచు.

శ్లో. విఘ్నరాజ నమ స్తుభ్యం లమ్బోదర గజానన,
నిర్విఘ్నం కురు మే దేవ సర్వకార్యేషు సర్వదా.

క. ఈమంత్రంబున మున్నుగ, సామజముఖు నేకదంతుఁ జామరకర్ణున్
ధూమధ్వజుఁ బ్రమథగణ, స్వామిని బూజించి సుకవి సమధికభక్తిన్. ౩౬౮

సీ. జ్యోతిర్విదుక్తముహూర్తకాలంబునఁ బ్రస్థపంచకమాత్రశాలిశాలి
తండులంబులను హస్తద్వయవిస్తారసమచతురశ్రస్థండిలంబు
గావించి నాల్గుచౌకపుటిండ్లు రచియించి వామదేవునిమూలగీమునందు
విప్రమాతృకలను వీతిహోత్రునితావుమందిరంబున రాజమాతృకలను

ఆ. దనుజుచాయభవనమున వైశ్యమాతృకలను సమీరభాగమునను గలుగు
సదనమునను శూద్రజాతిమాతృకలను, వరుస దప్పకుండ వ్రాయ వలయు. ౩౬౯

మాతృకానిర్ణయము.

శారదాదర్పణే:—

శ్లో. స్వరాః కచటవర్గా శ్చ ధరణీసురమాతృకాః,
తపవర్గా సమా స్తస్థా బాహుసమ్భవమాతృకాః.
యవా శాదిహకార స్త వర్ణాశ్చోరవ్యమాతృకాః,
దంత్యౌ చ జౌ గురు రలా జఘన్య భవమాతృకాః.

అ ఆ, ఇ ఈ, ఉ ఊ, ఋ ౠ, ఌ ౡ, ఏ ఐ, ఓ ఔ, అం అః, ఈ స్వరములు పదియాఱును క ఖ గ ఘ ఙ, చ ఛ జ ఝ ఞ, ట ఠ డ ఢ ణ, అను కచటవర్గాక్షరములు పదునేనునుంగూడ ముప్పదియొకటియు విప్రమాతృకలు. ఇవి యీశాన్యమూలయింట వ్రాయవలసినవి. త థ ద ధ న, ప ఫ బ భ మ, యీ

తపవర్గాక్షరములు పదియును అంతస్సములలోన సరియక్షరములైన రేఫలకారము లు రెండును గూడఁగాఁ బండ్రెండును రాజమాతృకలు, ఇవి యాగ్నేయదిక్కున నుంప వలసినది. యవర్ణవవర్ణములు రెండు శ ష స హ లు నాల్గును గూడనాఱు ను వైశ్యమాతృకలు ఇవి నిరృతిభాగమున గలిపి యుంప వలసినది. దంత్య చజలు రెండును ళకారళకారములు రెండును గూడ నాలుగును శూద్రమాతృకలు ఇవి వాయవ్యకోణమున లిఖించునది.

సీ. ఆస్వర మవుదల యా ఫాల మిద్వయి శ్రవణయుగ్మం బుకారములు రెండు
గన్నులు ఋత్వయుగంబు చెక్కులు లృవర్ణద్వంద్వ ముభయదంతచ్ఛదములు
వక్త్రములో భుజములు నక్రతమాత్రంబులు కక్షములు సున్న లలితగళము
పటువిసర్గము లుద్భవసూచకంబులు కచవర్గములు పాణికరరుహములు

తే. టామ లైదును గూడఁ బృష్ఠము చతుర్థ, వర్గ ముదరంబు పంచమవర్గజములు
జఘన మంతస్థలిపులు సూక్ష్మములు నంఘ్రు, లేవసూ మణి కట్టివాగ్దేవిఁగొలుతు.

క. అని వారిజాతసంభవు, వనితకుఁ బ్రణమిల్లి సుకవివరుఁ డీపద్యం
బునఁ జెప్పినట్లు న్యాసము, తనకుడికక్ష మొదలుగాఁ బదపఁ జేయ నగుఁగా.

న్యాసప్రకారము.

. అం శిరసి, ఆం లలాటే, ఇం దక్షిణకర్ణే, ఈం వామకర్ణే, ఉం దక్షిణనేత్రే, ఊం వామనేత్రే, ఋం దక్షిణకపోలే, ౠం వామకపోలే, ఌం ఊర్ధ్వోష్ఠే, ౡం అధరోష్ఠే, ఏం దక్షిణభుజే, ఓం వామభుజే, ఐం దక్షిణకక్షే, ఔం వామకక్షే, అం గళే, అః దక్షిణోత్తర స్తనాగ్రయోః, కం ఖం గం ఘం ఙం దక్షిణహస్తాఙ్గుళిషు, చం ఛం జం ఝం ఞం వామహస్తాఙ్గుళిషు, టం ఠం డం ఢం ణం పృష్ఠే, తం థం దం ధం నం ఉదరే, పం ఫం బం భం మం జఘనే, యం రం లం వం దక్షిణపాదే, శం షం సం హం వామపాదే విన్యసేత్.

విప్రమాతృకాపూజామన్త్రః విధిప్రదీపికాయామ్.

శ్లో. శ్వేతమాల్యామ్బరధరాం శ్వేతరత్నవిభూషితామ్,
శ్వేతాబ్జవాసినీం విప్రమాతృకాం పూజయామ్యహమ్,
అనేనవాగీశ్వరీధ్యానముక్తంతల్లక్షణంమన్త్రరహస్యేద్రష్టవ్యమ్.

వ. అకారము మొదలు ముప్పదియొక్కమాతృకలను నీమంత్రముచేత వేఱువేఱఁ బూజించునది. ౩౯౪

సీ. వెలిపట్టుపుట్టంబు మలయజగంధంబు మౌక్తికామలవజ్రమయము లైన
భూషణంబులు దెల్లపువ్వులు కర్పూరధూళిధూపంబు మధూకతైల
నీరాజనంబు ఖర్జూరపాత్రంబు సమన్వితశర్కరామసృణఫేన
దుగ్ధాన్నమును భక్తితో సమర్పణ చేసి శ్వేతాబ్జకర్ణికావిష్టరస్థఁ

తే. దారకాకుందమందారధవళదేహఁ, బుస్తకసువర్ణవల్లకీహస్త విప్ర
మాతృకనుగవిశాస్త్రోక్తమార్గమునను, గొలువఁజతురవచోలబ్ధిగలుగుటరుదె.

రాజమాతృకార్చనమన్త్రః కవిగజాఙ్కుశే:—

శ్లో. రక్తమాల్యామ్బరధరాం రక్తరత్న విభూషితామ్,
రక్తాబ్జవాసినీం రాజమాతృకాం పూజయామ్యహమ్.
అనేన వశ్యముఖీధ్యాన ముక్తమ్.
తల్లక్షణం ప్రపఞ్చసారే ద్రష్టవ్యమ్.

వ. ఈమంత్రముచేతఁ బంద్రెండుమాతృకలను బూజించునది. ౩౯౬

సీ. జిలుగుచెంపరుకావిచీరయుఁ గుంకుమగంధంబు పద్మరాగప్రవాళ
ఖచితంబు లగుపరిష్కారంబులును గెంపువన్నియ గలపసుపుపూవిరులు
ప్రస్తుతాల క్తధూపంబులు తిలబీజతైలదీపికయును దామ్రచషక
పూరితగోఘృతాహారంబు భక్తితో నర్పించి రక్తతోయజనివిష్టఁ

తే. గోకనదనిభలోహితఁ గోమలాంగిఁ, బ్రసవబాణేక్షుకోదండపాణి రాజ
మాతృకనుగవిశాస్త్రోక్తమార్గమునను, గొలువఁజతురవచోలబ్ధిగలుగుటరుదె.

వైశ్యజాతిమాతృకారాధనమన్త్రః:—

శ్లో. పీతమాల్యామ్బరధరాం పీతరత్న విభూషితామ్,
పీతాబ్జవాసినీం వైశ్యమాతృకాం పూజయామ్యహమ్.
అనేన సిద్ధలక్ష్మీధ్యాన ముక్తమ్.
తల్లక్షణం మన్త్రార్ణవే ద్రష్టవ్యమ్.

వ. ప్రతిమాతృకారాధనము నీమంత్రము చదువుచును జేయునది. ౩౯౭

సీ. ఆతతబహుమాల్యపీతకౌశేయముల్ నవహరిద్రాలేపనంబు పుష్య
రాగగారుత్మత రత్నకీలితమండనంబులు పచ్చగొన్నెలసరులు
సాంద్రసౌరభహరిచందనధూపంబు బస్తాజ్యసహితదీపంబు దీర్ఘ
ఘటపరిపూరితక్షౌద్రోపహారంబుఁగడు భక్తి నర్పించి కనకనలిన

తే. కర్ణికాపీఠికాసీన గౌరగాత్రి, వనజకుట్మలాన్వితకర ద్వంద్వ వైశ్య
మాతృకనుగవిశాస్త్రోక్తమార్గమునను, గొలువఁ జతురవచోలబ్ధిగలుగుటరుదె.

శూద్రమాతృకారాధనమన్త్రః.

శ్లో. నీలమాల్యామ్బరధరాం నీలరత్నవిభూషితామ్,
నీలాబ్జవాసినీం శూద్ర మాతృకాం పూజయా మ్యహమ్.

అనేనత్వరితాధ్యానముక్తం. తల్లక్షణంమన్త్రదర్పణేద్రష్టవ్యమ్.

వ. శూద్రమాతృకల నన్నిటిని బూజించునపుడీమంత్రమును జెప్పవలసినది. ౧౦౦

సీ. నీలవర్ణదుకూలచేలంబును లవంగమృగమదగంధంబు నగవిరోధి
రత్నవిభూషణరాశియుఁ గృష్ణపుష్పములు కాలాగురుసాలమూల
రచితధూపంబు నేరండబీజస్నేహనీరాజనంబును జారుకాంస్య
మయచషకాస్వితమధ్యనైవేద్యంబు నొసఁగి సద్భక్తి నింపొంది మదిని

తే. శ్యామపద్మనివిష్ట మేచకశరీర, శరఘనుః కాండధృతపంచశాఖ శూద్ర
మాతృకనుగవిశాస్త్రోక్తమార్గమునను, గొలువఁజఱుపవచోలబ్ధి గలుగుటరుదె.

వ. ఇది ప్రబంధోపక్రమం బెంక నాశుధారాకవిత్వమున కెట్లనిన. ౧౦౧

తే. సభలనుసమస్య లొసఁగినసమయమునను, మాతృకాపూజ కవులకేరీతి నబ్బు
నపుడు వాగ్దేవతాధ్యానమాత్రఁజేసి, యాశువుఁజెప్ప నొప్పఁబద్యంబు లెల్ల.

వాగ్దేవతాధ్యానముక్తమ్.

సీ. త్రయివేణి మీమాంస తల వైద్యశాస్త్రంబు నుదురాగమంబు కన్బొమలనడుము
కడపలి ప్రాఁబల్కు కణతలు శ్రోత్రంబు తలుకుఁజెక్కులు నిరుక్తంబు శ్రుతులు
న్యాయంబుచుబుకంబు జ్యోతిషంబక్షులు శిక్ష గంధవహంబు స్మృతిరదములు
కావ్యంబు జిహ్వ వ్యాకరణంబు పెదవులు గీతంబు గళ మలంకృతి కుచంబు

తే. లలపురాణంబు నడు మితిహాస నుక్కు, కల్పముకరద్వయము రతికళ జఘనము
ఛంద మూరులు నాట్యలక్షణము పదము, లైనభూషణి కట్టివాగ్దేవిఁ గొలుతు.

ఆ. అనుచు శారదాంబ నధరనిర్జితబింబ, భ్రమరవేణిఁ బద్మభవునిరాణి
సుకవిరాజకీరసురమహీరుహలతఁ, గొలిచి యాశుకవితఁ గూర్పవలయు. ౧౦౨

ప్రబంధోపక్రమశుభకాలంబులు.

క. పెసనయనమాసపక్షది, వసవారభయోగకరణవర్గవిలగ్నా
భ్రాసరేఖలను లరసి సద, వసరమునను మొదలు సేయ వలయుం గృతికిన్.

తే. సింహమున గురుఁడున్న రాజీవబంధుఁ, డార్ద్రమొదలుగఁబదితారలందు నడువ
జీవకవుల స్తుయమును జెందియున్నఁ, గావ్యసముపక్రమము సేయఁగాదుపరికి.

సీ. అబ్దంబు మొదలిదినాష్టకం బయనర్తుమాసాదులను బంచవాసరములు
కవిబృహస్పతులుగ్రుంకకముంపుఁబొడిచిన పనుకను ముప్పొద్దుమనుయుగాదు
లగుదినములు సంక్రమాదికొండుపగళ్లు గ్రహణంబుతొలునాఁడు కావదహన
మునకు మీఁదను మూఁడుదినములురిక్త్యాదిఘటికాత్రయంబుబుధంబు మొదల.

తే. నాపికాయుగ్మమును విలగ్నమున కావి, వెలసేననవాంశ మొకటియు విడిచిపెట్టి
చిక్కినప్పుడుశుభములుసేయవలయు,ననుచుయవనుఁడుసంహితయందుఁ జెప్పె.

సీ. షష్ఠ్యంతమున నొక్కసంవత్సరము సోయనాంతంబునను బక్ష మయనమునకుఁ
గడపల దివసాష్టకము ఋతుమాసావసానంబునను దివసంబులై దు
రవిశశిగ్రహణాది వివిధమహోత్పాతముల కెల్లఁ దరువాత మూఁడునాళ్లు
సంక్రమాంతమున వాసరము తిథ్యంతంబునందు నాడీత్రితయంబు రిక్క

తే. కొననుబదిగడియలులగ్నమునకుఁదుదిని, గదయుసార్ధనవాంశంబునదలి కావ్య
మునకుఁ దొలుతటిపద్యంబు మొగి రచింప, వలయుసత్కవి తక్కినవానియందు.

క. ఉదగయనంబునఁ జెప్పిన, సదమలకావ్యంబు పతికి సంపద లిచ్చున్
బదపడి యామ్యాయనమున, మొదలుకొనినఁ బ్రాణమునకు మోసముఁ దెచ్చున్.

తే. శ్రావణజ్యేష్ఠకార్తికచైత్రమాఘ, మార్గశీర్షక ఫాల్గునమాధవముల
సకలశుభకర్మములు సల్పఁ జను నటంచుఁ, జెప్పిరి పరాశరాత్రివసిష్ఠమునులు.

తే. నింద్యములు భాద్రపదమను నెలయుశుచియు, సరవిఘుష చైత్రకర్కటశ్రావణములు
నధికమాసంబుఁ బుష్యంబు నాశ్వయుజముఁ, గార్తికాదినేకాదశఘస్రములును.

క. కావ్యమునకు నారంభము, కావ్యుఁడు సితపక్షమునను గావించిన నా
ధివ్యాధులడఁగు విభునకు, ద్రవ్యక్షయ మగుసితేతరంబున నైనన్. ౪౧౩

క. దశమీద్వావశ్యేకా, దశులను బంచమిని విదియతదియల హిమధా
మశశాంకసుతబృహస్పతి, భృగువారములఁ గావ్య మొనరింపఁదగున్. ౪౧౪

తే. ఉభయపక్షములందుఁ ద్రయోదశియును, సప్తమియు దిననాథవాసరము నంత
రాయ మొనరించుఁ గృతిసమారంభమునకు, నితరతిథివారములుగూడ వెంచిచూడ

క. విపులను బూర్వాహ్ణంబున, నుపక్రమించిన శుభంబు లొసఁగును గావ్యం
బపరాహ్ణంబున సంధ్యల, క్షపలను దొరకొనిన సాధ్వసం బొనరించున్. ౪౧౫

సీ. నందయు భద్రదినంబును జయయు రిక్తయును బూర్ణయు నసఁ గ్రమపక్ష నైదు
భంగుల దివసముల్ పదియేను నొప్పారు భూమిబీజాక్షరంబులకు నంద
వనబీజలిపుల కెల్లను భద్ర శిఖిబీజరాజికి జయ వాయుబీజములకు
రిక్త నభోబీజరేఖకుం బూర్ణయు నాదిగాఁ బంచసంఖ్యాస్వరములు

తే. చెందు దిన మొక్కటొక్కటి శిశుకుమార, రాజ్యవృద్ధమృతాఖ్యలఁ బ్రమదవిత్త
విజయభయలయదంబులై వీని నెఱుఁగ, వలయుఁ గృతిపతినామాదివర్ణమునను.

క. బాలాదిస్వరములకును, గాలము నాతేసనాడికలు చేసి కృతుల్
వాలాయము నందాముల, మేలగువేళల నుపక్రమింపఁ దగుఁ గృతుల్. ౪౧౬

సీ. పరుస భూజలవహ్నివాయునభ స్తత్త్వములు దంతిగతహ్రాస్త్రభూత నైల
పరిమితఘటికలఁ బగలును రేయును దినమున కినుమాఱు దిరుగుచుండు
నా రేసుభానుక్షవారంబులను ధరాంభోగ్ని వాతము లాది యగుఁ గ్రమమున
గురుశుక్రమందవాసరముల నాకాశతత్త్వంబు మొదలుగాఁ దనరు నైదు.

తే. కావ్యములఁ దత్త్వమున నుపక్రమము సేయ, ధనము దకతత్త్వమున సుఖము నలతత్త్వ
మున భయంబు మరుత్తత్త్వమున గదా ర్తి, గగనతత్త్వంబున మృతంబు గలుగుఁ బలికి

సీ. నాడికాత్రయము వినాడికా పింశతిమాత్రకాలములఁ గ్రమంబులోడ
సత్త్వరజస్తమస్సంజ్ఞల వేళలు త్రివిధంబులై పద్మరిపు పురేజ్య
దినముల సత్త్వాఖ్యయను భౌమభృగువారముల రజోవేళయు జలజమిత్ర
బుధమందవాసరంబులఁ దమోవేళయు నాదిగా సూర్యోదయమున నుండి

తే. పదియు నెనిమిది మాఱు ప్రతిదినంబుఁ, దిరుగుఁ గావున నివియెల్లఁ దెలిసి కవులు
భర్తృరాశికి మైత్రి చొప్పడని వేళఁ, జెప్పుదురు కబ్బములు వానిఁ జెలువు చూచుకు.

తే. సత్త్వపరిపంథులు కుళీరచాపమీన, కన్యలు రజోభయాతులు కార్పివృషభ
మేషతులలు తమోరులు మిథునసింహ, ఘటమృగంబులు చుట్టలు కడమ లెల్ల.

తే. వైష్ణవత్రయమునను బూర్వత్రయమున, మిత్రపూసాశ్వినుల భాస్కరత్రయమున
ధాతృమైత్ర్యనిశాచరతారకలను, గావ్యసముపక్రమముఁ జేయఁగలుగు శుభము.

తే. వజ్రశూలవ్యతీపాతవైధృతులను, గండపరిఘాతిగండవిష్కంభములను
బదియు మూఁడవదానను బ్రతుకు నాస, సేయువారు శుభంబులు చేయఁబోరు.

క. బవ మొదలగు నాలింటను, గవి కబ్బ ముపక్రమింప ఘనతరవిభవం
బవు భద్రాముల నేనిటఁ, దివిరి మొదలు సేయ దొడ్డ తెవులు జనించుఁ. ౪౩౪

తే. వ్యగ్రపలస్తలు క్రాంతయోగావమోగదుర్ముహూర్తములును వ్యాజ్యదోషములును
దుష్టచంద్రోపబలములు వొరలునపుడు, కృతికి దొరకానునట్టి దుర్గతియుఁ గలఁడె

తే. తనకు భర్తకు నష్టమ ద్వాదశారి, జన్మములు గాని శుభ ఖేటసదనములను
మొదలు సేయఁగఁదగుఁ గబ్బమున కుగ్రహము, లష్టమంబున లేకుండ నరసి సుకవి.

తే. పాపులాఱింట మూఁటను బదునొకొంట, సౌమ్యులు ధరాగ్ని గళిదిశాజలజగర్భ
మునిగృహంబుల నుండంగ మొదలు కొనినఁ, గబ్బములు గడతేఱు విఘ్నములు లేక.

క. బుధుఁ డినుఁ గూడని వేళల, బుధదినమున బుధవిలగ్నమున బుధదృష్టిన్
బుధహోరను గావ్యములకు, బుధవర్యు లుపక్రమింపఁ బూనుదు రెపుడున్.

## సారస్వతౌషధంబులు.

తే. బ్రాహ్మి బోడతరంబు పిప్పలియు వసయు, శుంఠియు సమంబులుగఁ జూచి చూర్ణఁ జేసి
ప్రతిదినము శేపకడ సగపాలు తేనె, గలిపి రూకెత్తు దినిన సూక్తులు ఘటించు.

వ. బ్రాహ్మి యన మండూక బ్రహ్మి పేరు.

సీ. కరకకాయల మీఁదఁ గలుగు బబ్బరయును పిప్పలిమూలంబు తిప్పతీఁగ
బ్రాహ్మియు శుంఠియు బానంచిపి త్రనమ్ములు నపామార్గమ్ము మొదలివేళ్లు
వాయువిళంగంబు లాయష్టిమధుకంబు సన్న పిప్పలియు నచ్చపు సముద్ర
పొడవి త్రనంబులు బోడతరంబును వలమాఱితుంగముస్తలును వసయు

తే. సమములుగఁ జూచి పొడిచేసి సంతతంబు, బ్రాద్దునను లేచి నేతితో ముద్దఁ జేసి
కర్షమాత్రంబు భక్షింపఁ గలిగెనేని, గడియ కొకపద్యశతకంబు నుడువ నేరుదె.

సీ. చెంగల్వకోష్ఠును బిలుతపిప్పలియును మంచియోమపుఁబాట్లు మ్రానిపసపు
మైపూఁతపసపును మధుకంబు సైంధవలవణంబు చిత్రమూలంబుబరదు
జీలకఱ్ఱయు శుద్ధి చేసినశుంఠియు సమభాగములు గాఁగ సంతరించి
చూర్ణంబు గావించి శుభ్రపటంబుపై రాచి యాక్రిందను రాలినట్టి

తే. పొడుమునూతనఘటములో నిడిప్రభాతసమయమునఁ బ్రత్యహంబునాజ్యమునమె
వేసరకచిన్నమెత్తుసేవించునరునినాలుకను గాపురంబుండునలువచెలువ. [దపి

కందద్వయరుగ్మవతీకమలవిలసితగర్భకాంచపదవృత్తము.

ద్వారవతీనాథా సదు దారా, తరుణధవళకరధరనుతనామా
మారమణీధామా సుకుమారా, మరుదధిపతిరిపుమదగిరిశంబా
సారసనేత్రా సత్యవిచారా, శరరుహభవముఖసకలసురేశా
శూరకులా తేజోజితసూరా, సురవరమణినిభసురుచిరదేహా. ౪౩౨

గర్భప్రథమకందము.

క. ద్వారవతీనాథా సదు, దారా తరుణధవళకరధరనుతనామా
మారమణీధామా సుకు, మారా మరుదధిపతిరిపుమదగిరిశంబా. ౪౩౩

ద్వితీయకందము.

క. సారసనేత్రా సత్యవి, చారా శరరుహభవముఖసకలసురేశా
శూరకులా తేజోజిత, సూరా సురవరమణినిభసురుచిరదేహా. ౪౩౪

గర్భరుగ్మవతీవృత్తము.

ద్వారవతీనాథా సదుదారా, మారమణీధామా సుకుమారా
సారసనేత్రా సత్యవిచారా, శూరకులా తేజోజితసూరా. ౪౩౫

గర్భకమలవిలసితవృత్తము.

తరుణధవళకరధరనుతనామా, మరుదధిపతిరిపుమదగిరిశంబా
శరరుహభవముఖసకలసురేశా, సురవరమణినిభసురుచిరదేహా. ౪౩౬

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్రభారద్వాజగోత్రకామెపల్లిపురమందిరనందనందన చరణారవిందవందనాభిలాషమనీష ప్రాభవ వెంగనార్యతనూభవ విద్యావిశేషసురాచార్య కాకునూర్యప్ప కవివిరచితంబైన యాంధ్రశబ్దచింతామణియను వ్యాకరణసూత్రంబులను వర్ణసంజ్ఞలును వర్ణవృత్తిస్థానంబులును శుద్ధాంధ్రకలిపివిలేఖనక్రమంబులును బంచాశద్వర్ణవర్ణయంబును బ్రాకృతోనాక్షరపరిగణనయు నాంధ్రభాషావర్ణసంఖ్యయుఁ దత్తద్వర్ణభేదంబులును గావ్యాదిగ్రాహ్యవర్ణంబులును నాయకాక్షరకూటంబులును గృత్యాదివర్ణద్వయయోగఫలంబులును సంయుతాక్షరవిశేషంబును శ్రీకారప్రభావంబును గృతిముఖప్రశస్తంబులును దత్తత్స్థానప్రయోగనిషిద్ధాక్షరంబులును దోషప్రభావంబును గుణావగుణచాతుర్య బలంబును మాతృకార్చనావిధానంబును శుభకాలంబులును సారస్వతోపఘంబులునుగలవర్ణపరిచ్ఛేదంబను ద్వితీయాశ్వాసము. ౪౩౭



శ్రీ ర స్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# అప్పకవీయము.

## తృతీయాశ్వాసము.



శ్రీశైలభ్రమరాంబా
ధీశేశానీవిదిఙ్మహీతలవిలస
త్కాశీసమతం గెడనగ
రీశమనాశానివేశ రిపుజననాశా.

క. అవధారు శబ్దశాసనుఁ, డవనిఁ గలియుగమున కాది నారాజమహేం
ద్రవరంబునఁ జెప్పినయాం, ధ్రవచోవ్యాకరణసూత్రతతిఁ దెనిఁగింతున్. ౨

క. ఇమ్ముగ వర్ణపరిచ్ఛే, దమ్మునఁ జెప్పంగఁబడియెఁ దగ నేకశ్లో
కమ్ముగ ముఖ్యసళిప్రా, సమ్ములు సంక్షేపములుగ సామజవరదా. ౩

మూ. సూ—ఆద్యో వళి ర్ద్వితీయో వర్ణః ప్రాసోఽత్ర పాదపాదేషు,
స్వస్వచరణేషు పూర్వః ప్రాస స్సర్వేషు చైక ఏవస్యాత్.

వ. ఈశ్లోకం బొక్కటి యొకసూత్రం బయ్యె నది యెల్ల నింక వివరించెదను. ౪

క. చరణచరణమున కాద్య, క్షరములు వళు లయ్యె నవియె క్రమ్మఱఁ దత్త
చ్చరణములలోనఁ జెప్పిన, యిరవులఁ బొందింప వలయు నెల్లకృతులలోన్. ౫

తే. విరతి,విశ్రాంతి,విశ్రామ,విశ్రమములు,క్రాంతి,విరమణ,విరమ,విరామ,యతులు
ననఁగ నివి తొమ్మిదియువళి కాఖ్యలయ్యె, భవ్యసత్త్రఫలా యామ్యభాగగేహ.

క. భీమన పది చెప్పె నన్నె, తామాత్యుఁడు చేసె వెనుక యతు లిరువది నా
ల్గామీఁదఁ గొండఱు కవి, గ్రామణు లిరువదియు నేడు గావించి రొగిన్. ౬

ఆ. పూర్వకవులలక్ష్యములు గూర్చి సత్కవి, జనసమూలవు నటంచు సమ్మతింప
విశ్రమంబు లేను, విరచింతు నాలుగు, పదులమీఁద నొకటి విదితముగను. ౭

యతిభేదములు.

క. స్వరయతులు వ్యంజనాక్షర, విరతు లుభయవళులు ప్రాసవిశ్రాంతులు నాఁ
బరికింప నాల్గుదెఱఁగుల, విరమణములు వఱలుచుండు విహగతురంగా. ౯

అందు స్వరవళు లెట్టి వనిన.

తే. రసను స్వరమైత్రివళులు స్వరప్రధాన, వళులు లుప్తవిసర్గకస్వరవళులును
ఋవళి, ఋత్వసంబంధంబు ఋత్వసామ్య, వృద్ధులన స్వరవళు లేడువిధములయ్యె.

౧. స్వరమైత్రివళులు.

తే. అద్వయమునకు వక్రతవద్వయంబు, నిద్వయమునకు ఋయుగంబు నెద్వయంబు
నుద్వయమునకు నంత్యవక్రద్వయంబుఁ, జెల్లుస్వరమైత్రివళు లన శేషశయన.

అకారయతులు.

ఆ. అబ్జపత్రనేత్ర యార్తావనచరిత్ర, యాతతాయిజైత్ర యైంద్రమిత్ర
యైందవప్రగోత్ర యార్వశేయస్తోత్ర, యనుచుఁ జెప్ప నొప్పు యతులు కృష్ణ.

ఇత్వవళులు.

ఆ. ఇందువంశసోమ యీశ్వరీనుతనామ, ఋద్ధితాంగధామ ఋషభభీమ
ఋక్షజాభిరామ యెటులైన మాభామ, యెడఁగటాక్ష మంచిమేలుమనఁగ.

ఉద్విరానుము.

ఆ. ఉరగరాజశాయి యూర్ధ్వవిష్టపదాయి, యూర్జితోరుకీర్తియొడలి కార్తి
యొడవ కుంజఁ బ్రోచి యోలి దాసునిఁ గాచి, చేరికసకశిశుఁ జీరి తనఁగ.

౨. స్వరప్రధానవళులు.

క. తెలిసి పదాంతగతాక్షర, ములతోఁ బైశబ్దములకు మొదలఁ గలుగున
చ్చులు గూర్చినసంధులక, న్వల స్వరము లెనిలుచ నుభయవళులను దక్క౯.

తే. అతులగుణధామ భానువంశాబ్ధిసోమ, యినతనూభవమిత్ర లంకేశజైత్ర
ఉరుగుణకలాప శకలీకృతోగ్రచాప, నాఁగ నిట్లు స్వరప్రధానవళు లొప్పు. ౧౬

3. లుప్తవిసర్గకస్వరవళులు.

తే. దైవభాష నదంతసాంతములమీఁద, నత్తు మొదలను గలశబ్ద మతుకువేళ
నపుడు నోత్వంబునకుఁ జెల్లు నయహాలిపులు, జగతి లుప్తవిసర్గకస్వరవళు లన.

తే. అంబుదశ్యామ తవ కింకరో హ మనఁగ, యామినీచరగర్వతమోర్క యనఁగ
హరిసుతుండును నీవు నన్యోన్యమిత్రు, లయిప్రవర్తింతు రనఁగలక్ష్యంబు లయ్యె.

మహిషన్నందనశతకమునందు:—

శా. కోపాటోపము గుప్పిగంతులు నిజాకుంకీభవచ్చార్యశే
ఖాపాండిత్య మయారె నీకును నమస్కారంబు లంకాపురీ
పాపగ్రంథికులాంగనాకుచతటీపైతాపతద్గ్రాహిబా
హాపాటచ్చర రామదాస తవ దాసోహ మ్మహిషన్నందనా. ౧౯

సుభద్రాపరిణయమునందు:—

శా. తా సైరింప కపర్ణ యుండఁగ భవద్గర్భంబునం దాల్చి తే
జోసహ్యు ఙ్ఞ శరజన్ముఁ గాంచి యలనీహారక్ష్మాభృత్కుమా
రీసాపత్న్యము గన్న మోహపుపురంధ్రీరత్నము న్నీవ కా
దే సర్వజ్ఞన కేల నిన్నుఁ దలపై నెక్కించుకో జాహ్నవీ. ౨౦

ఉద్యోగపర్వమునందు:—

ఉ. దైన్యము దక్కి మాశ యుచితంబుగఁ బాండునృపాలుపాలు రా
జన్యవరుండు ధర్మజుఁడు సన్మతి వేఁడెడి నన్న లోకసా
మాన్యవిధిం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చికొంద మ
న్యోన్యవిరుద్ధభాషణము లాడినఁ దత్ఫల మాతఁ డందెడిన్. ౨౧

౮. ఋవళి.

క. ఇదై ర్యత్వంబులఁ గలయక, ఋత్వంబును ఋవళి యనఁగ రేఫముతో మి
త్రత్వంబు నెఱపు నెట్టిమ, హత్త్వమొ యట్ల నగుఁ గాదులం దున్నపుడున్.

క. రతివల్లభజనక ఖని, ర్జితకనకవిలోచనాఖ్య ఋగ్యజురాది
శ్రుతిచయగోచర వాహీ, కృతఖేచరకులలలామ రిపుజనభీమా. ౨౩

సభాపర్వమునందు సీసపాదము:—

ఋత్విజుం డని విచారించి పూజించ లే ద్వైపాయనుం దుండ ధర్మయుక్తి. ౨౪

విజయవిలాసమునందు:—

ఉ. ఆణిముఱుంగుముత్తెపుటొయారపుమ్రుగ్గులు రత్నదీపికా
శ్రేణులు ధూపవాసనలు హృద్యనిరంతరవాద్యఘోషము
ల్రాణఁ బొసంగఁ బ్రోలు మిగులంగను విందొనరించు నిత్యక
ల్యాణముఁ బచ్చతోరణము నై జను లందఱు నుల్లసిల్లఁగాన్. ౨౫

౯. ఋత్వసంబంధవళులు.

తే. సారిదిఁగాకుఁగలవట్రుసుడులకెల్ల, ఋత్వమిత్రంబులగునచ్చు లెనయనైదుఁ
జెల్లుహాచులును స్వరమైత్రిఁ జెందునపుడు, నెలయునివిఋత్వసంబంధవళులనంగ.

ఆ. ఇనతనూభవుండు వృషదశ్వసుతు సేసె, బుధుని దీసుతుండు కృష్ణు సేసె
నేమి చెప్ప నపుడు దృఢశక్తిశల్యుండు, హీనబలునిఁ జేసె వృష్ణికులుని. ౨౮

జైమినిభారతమునందు సీసగీతి:—

తే. తండ్రిశిరమునఁ బెనిమిటితరమునందు, వీసమంతయుఁ బుణ్యంబుఁ జేసి యెఱుఁగ
వార్ధకంబున నింకేల వట్టితొడుసు, కృష్ణుదర్శింప కున్న నాకేమి నిక్క. ౨౯

మనుచరిత్రమునందు:—

సీ. తీర్థసంవాసు లేతెంచినారని విన్న నెదురుగా నేగు దవ్వంత రైన
నేగి తత్పదముల కెరఁగి యింటికిఁ దెచ్చుఁ దెచ్చి సద్భక్తి నాతిథ్య మిచ్చు
నిచ్చి యిష్టాన్నసంతృప్తులఁగాఁ జేయుఁ జేసి కూర్చున్నచోఁ జేర వచ్చు
వచ్చి యిద్ధరఁ గల్గువనధిపర్వతసరిత్తీర్థమాహాత్మ్యము ల్దెలియ నడుగు. ౨౯

నృసింహపురాణమున సీసపాదము:—

ఏదేవులీలలై యొసఁగుజగంబులు సృష్టిరక్షాసమాపేక్షఁ బరఁగు ౩౦

ఆముక్తమాల్యదయందు:—

చ. హితులు ఖమగ్రహజ్ఞ బుధబృందకవీంద్రపురోహితుల్ హితా
హితులు ధనార్జనాదినృపకృత్యనియుక్తులు వెండి కేవలా
హితులు దశాదశార్పితసమృద్ధరమాచరణేచ్ఛ తొట నా
హితమును నట్లు కాఁ జతురవృత్తిఁ జరించుట నీతి తేనికిన్. ౩౧

సుభద్రాపరిణయమునందు:—

తే. చెఱకువిలుకానిబారికి వెఱచినీదు, మఱుఁగుఁ జొచ్చితిఁ జేపట్టి మనుపునన్నుఁ
బ్రాణదానంబుకన్నను వ్రతముగలదె, యెఱుఁగవే ధర్మపరుఁడవు నృపకుమార.

ఎడవల్లిపర్వతన్న చాటుధార:—

మ. రణరంగంబున నీశితాసి యరినోరం బూరి గైకొన్నఁ దా
నణుమాత్రంబును వానిపైని దెగ దాహా చిత్ర మూహింపఁగాఁ
దృణమే కాపతె దారికట్టు మొన కట్టిద్వారుణీమండలి
ప్రబణుతప్రాభవ కందనోలిపురగోపాల క్షమావల్లభా. ౩౩

౬. ఋత్వసామ్యవళులు.

తే. వట్రువలుచెందిశపలోనవ్యంజనంబులన్నియనుగూడుఋత్వసామ్యవళులనఁగ
వృష్ణివంశాబ్ధిసోముఁడైపృథివిఁబుట్టి, మృతునిఁగావించెఁగంసునిఁగృష్ణుఁడనఁగ.

విష్ణుచిత్తీయమునందు సీసగీతి:—

తే. తిరుగుమరయారె సురపురి సురల మరిగి, బహుళహలహలభరితకల్హరిగనగర
 నగర పురవర పరివృఢజవనయనన, పృతన భవదసీ ననిఁ దెగి కృష్ణరాయ.

మ. గృహసమ్మార్జనమో జలాహరణమో శృంగారపల్యంకికా
 వహనంబో వనమాలికాకరణమో వాల్లభ్యలభ్యధ్వజ
 గ్రహణంబో వ్యజనాతపత్రధృతియో ద్రాగ్దీపికారోపమో
 నృహరీ వాదము లేల లేరె యితరుల్ నీలీలకుం బాత్రముల్. ౩౫

౭. వృద్ధివళులు.

క. తలకట్టులపై సంస్కృత, ములఁ గదియపదాదివక్రములకు వరుసతో
 నెలకొనువక్రతమంబుల, కెల నుభయముఁ జెల్లుచుండు వృద్ధివళు లనఁగ. ౩౬

తే. ఇభభయవిదార సర్వలోకైకవీర, అఖిలభువనప్రశస్తజైత్రహస్త
 ఉదధిజాశ్రితనతభక్తాఘురక్ష, హతపరానీక నందవ్రజౌక యనఁగ. ౩౭

ఏత్వమునకు విష్ణుచిత్తీయమునందు:—

మ. గురుగుం జెంచలి తుమ్మి లేఁదగిరిసాకుం దింత్రిణీపల్లవో
 త్కరముం గూడఁబొరంటి నూనియలతోఁ గట్టావికుట్టావిగో
 గిరము ల్మెక్కి తమిం బసు ల్పొలము వోఁ గ్రేపుల్ మెయి న్నాకి మేఁ
 కెరువుంగుంపటిమంచ మెక్కి రి ప్రభుత్వైకాప్తి రె డ్లజ్జడిన్. ౩౮

ఐత్వమునకు విరాటపర్వమునందు:—

ఉ. ఆకమలాక్షిరూపమహిమాతిశయంబు మనోహరంబు భో
 గైకపరాయణు ల్పురుషు లంగజుఁ డప్రతిమానచేష్టిత
 స్వీకృతలోకుఁ డట్లగుటఁ జేటు పురంబునవారి కెప్పుడున్
 గా కెటు లుండు నిట్టియవగాఢపుపొత్తు మనంగ వచ్చునే. ౩౯

ఓకారమునకు భాస్కరరామాయణమునందు:—

శా. నీకంఠార్పితకాలపాశము శిరోనిర్ఘాతపాతంబు లం
 కాకస్సంచయకాళరాత్రి గళబద్ధోదగ్రకాలాహి క
 న్యా కారాగతమృత్యు వీజనకకన్య న్వేగ నొప్పించిలో
 కైకత్రాణుని రామునిం గనుము నీకీబుద్ధి గా కుండినన్. ౪౦

ఔకారమున కయ్యలరాజురామభద్రునిచాటుధార:—

క. రాజమనోజా విద్యా, భోజా దీనార్థి కల్పభూజా రిపుసం
 ఘౌజా వైభవవిజితవి, భౌజా రవితేజ గుత్తియప్పలరాజా. ౪౧

ఇవి యేఁబది స్వరయతిభేదంబులు.

వ్యంజనాక్షరవిరతు లెట్టి వనిన.

సీ. క్రమమునఁ బ్రాణివర్గజబిందు తిద్భవవ్యాజవిశేష సమాహ్వయములు
మహి ననుస్వారసంబంధాను నాసికాక్షరము విభక్తి మకారయతులు
మొగి నవర్ణవిరామములు ఋజుప్రత్యేకభిన్నైకతరము లభేదతరతు
లోలి నభేదవర్గోష్మవిశ్రాంతులు సరససంయుక్తవిశ్రామములును
తే. గరిమ సంలోష్మసంధివికల్పసంధి, విరమములు నాఁగ వ్యంజనాక్షరవిరతులు
నిఖిలసుకవిప్రయోగము ల్నెమకి చూడ, నేకవింశతిభేదంబు లెఱుఁగ వలయు.

ప్రాణివిరామము.

తే. ప్రాణములు నాఁగ స్వరసమాహ్వయము లయ్యె
నవికలిమిఁ జేసి హల్లులు ప్రాణులయ్యెఁ
బొల్లుహల్లుల నచ్చులు పొందఁ గునికిఁ
బ్రాణు లని పల్కఁ గూడదు వాని నెందు. ౪౩

తే. వ్యంజనంబులు స్వరమైత్రి వలనఁ దమకుఁ, దాము ప్రాణివిరామాభిధానములను
జెంది మూఁడు తెఱంగులై చెల్లుచుండు, వానిఁ దెలుఁగక కృతిసేయవలను గాదు.
క. చెలులు తలకట్టు లాఘా, పులు నైత్వౌత్వములు మిత్రములు గుడిగవయుక్
సులిగవయా నేత్వయుగమును, బెలు వగుచుట్టములు ద్వివిధశృంగౌత్వమ్ముల్.
సీ. కలశాబ్ధిగంభీర కాంచనాచలధీర కాకోదరగ నైన కైటభారి
కైలాసపతిమిత్ర కౌశికస్తుతిపాత్ర కిల్బిషాద్రిసురేంద్ర కీర్తిసాంద్ర
కీలాలరుహనాభ కృష్ణజీమూతాభ కృతవర్మతో నేగి కెలకు లాగి
కొరలి చైద్యుఁడు సూడఁ గేకయు ల్గొనియాడఁ గుండినేశుని పట్టిఁ గూడ ముట్టి
తే. కూర్మి వలకేలసంగంపుఁ గొండమల్లెఁ, గొని శతాంగంబుపైనుంచి కోర్కి మించి
ద్వారకకు వచ్చు నీ వైభవంబుఁ బొగడ, శక్యమే యనఁ గాకు లక్ష్యంబు లయ్యె.

వర్గయతులు.

ఆ. శబ్దసూత్రములను జగతి నేకస్థాన, సంభవంబు లగుచు సంధివేళఁ
గలసవర్ణసంజ్ఞఁ దలపోసి యతులకుఁ, గూర్ప వచ్చు మఱియుఁ గొన్నికృతుల.
క. తమతమయను నాసికవ, ర్ణములు విడిచి వెనుకలిపులు నాల్గును దమలోఁ
దమకు నర లేక నిలిచిన, నమరాహితదమన వర్గయతు లనఁ బరఁగుక్. ౪౮
ఆ. కంఠిమధ్య గేహ ఖండితారిసమూహ, ఖంజనాభదేహ గానమోహ
గరుడపక్షివాహ ఘనవాహవిస్నేహ, భర్గనుత యనిన వర్గయతులు. ౪౯
వ. తక్కిన నాలుగువర్గములను నీరీతినే యని తెలిసికొనునది. ౫౦

## బిందుయతులు.

క. పనిఁ బూని నిలుపఁ దమకము, యనునాసికములకు బిందుయతులను వెనుకన్
గనుపట్టు నాల్గులిపులను, ఘనుసున్నలుపాసి తమకుఁ బిఱుఁదఁ గదియుచోన్.

తే. జ్ఞానవేద్యాయ తప్తకాంచనవిభూష, ణాయ మేచకవర్ణకంఠప్రియాయ
నగధరాయసమాస్తసౌందర్యవిజిత, మనసిజాతాయ గోపతింభాయ యనఁగ.

## తద్భవవ్యాజవిశ్రమములు.

సీ. విజ్ఞానమునకు భావింప విన్నాణంబు విజ్ఞాపమునకు విన్నపంబు
సంజ్ఞకు సన్న యజ్ఞమునకు జన్నంబు నాజ్ఞప్తి క్రాసతి యాజ్ఞ కాన
యని యిట్లు సంస్కృతవ్యవహారమధ్యావసానంబుల ద్వితీయసరళమునకు
నడుగునఁ గలతాలుజానునాసికములు తద్భవంబున ప్రతత్వంబు గాంచి

తే. వెలయుటను దద్భవవ్యాజవిశ్రమమున, జరగి నణలకు రెంటికి జ్ఞా తనర్చు
జ్ఞానిచేతోంబుజాతశోణకర యనఁగ, జ్ఞాతివిద్వేషినృపనాశనకర యనఁగ. ౫౩

గణితమునందుఁ బావులూరి మల్లన్న:—

ఉ. శ్రీనిధి యైనశివ్వనను జిష్ణుసమున్ మఱి సూర్యదేవునిన్
ధీనిధిఁ బోలనార్యులను దేజమునన్ రవితుల్యు లైన యా
సూనుల నల్వురం బడసె సూరిజనస్తుతసత్యభావతీ
జ్ఞానులఁ బద్మగర్భవదనంబులు నాల్గుగఁ బోలువారిలోన్. ౫౪

## విశేషవళులు.

తే. ప్రౌఢకవులుకొందఱుజ్ఞకారంబునకును, బ్రథమవర్గంబులోలియక్షరములునాల్గు
నిడుదురుప్రబంధములనాక్క యెడవిశేష, వళులనుచుసోమయాజులువాడుకతన

శాంతిపర్వమునందు:—

క. జ్ఞానము కేవలకృప న, జ్ఞానికి నుపదేశవిధిఁ బ్రకాశము సేయం
గా నది సకలధరిత్రీ, దానంబునకంటె నధికతరఫలద మగున్. ౫౫

## అనుస్వారసంబంధయతులు.

ఆ. ఆదిపూర్ణయతము లైటతవర్గాత్మ, రములు తుదను గలుగువ్రాలు వర్ణఁ
బొసఁగు నాకటిటి కాకటిభుని ననుస్వారసం, బంధయతులనాఁ బ్రబంధములను.

మనుచరిత్రమునందు:—

శా. శీలంబుం గులము స్శమంబు దమముం జెల్వంబు లేఁబ్రాయమున్
బోలం జూచి యితండు పాత్రుఁ డని యే పూన్చినన్ దీవపాలుఁ

సాలగ్రామము మున్నగాఁ గొనఁడు మాన్యక్షేత్రము ల్పెక్కుచం
దాలం బందు నొకప్పుడుం దలుఁగ దింటం బాడియుం బంటయున్. ౫౮

రావిపాటితిప్పరాజుచాటుధార:—

మ. సరిపేసై రిపు దేల భాస్కరులు భాషానాథపుత్రా వసుం
ధరయం దొక్కఁడు మంత్రి యయ్యె సినకొండ గ్రామయామాత్యభా
స్కరుఁడో యౌ నయిన్ సహస్రకరశాఖ ల్లేవ దే యున్న వే
తిరమై దానము సేయుచో రిపుల హేరి స్వేదియుచో వ్రాయుచో. ౫౯

ఆముక్తమాల్యదయందు:—

మ. దవఘూమంపుదముంబులోఁ దపరసద్రవ్యంబు పంకేజబాం
ధవభానుప్రతతుల్ హరింపఁగుయి వెంట స్వేల్లిఘూన్యోరుకూ
పవితానంబులఁ జూడఁజూడఁ బడమిం బాటిల్లి పై విప్పలై
యవసం బంచల నాడఁగా నెగసె వాత్యాళి ప్రజచ్ఛక్రముల్. ౬౦

అనునాసికాక్షరయతులు.

తే. ఆలద్రుమంబునకనుమధ్యమానునాసి, కమునకును జెల్లు ననునాసికయతు లనఁగ
డాపలను బూర్ణములు గల్గుటతథదథలును, దథదథలుపగ్రమంబున దానవారి. ౬౧

క. మనుసంతతిమండన భం, డననిర్జితకాగ్రవీర్యనరనాయకఖం,
డన పత్రిస్యందననం, దన చందనచక్రవారణలసత్కీర్తీ. ౬౨

కిష్కింధాకాండమునందు:—

క. బలవంతుఁ డైనవాలికిఁ, దలఁకుచుఁ గిష్కింధ వెడలి త్వరతో నలుచి
క్కులకుం బాటి మహీమం, డల మెల్లను జూచినాఁడ నాఁడు నరేంద్రా. ౬౩

రాజశేఖరచరిత్రమునందు:—

మ. కలమాన్నంబు ఘృతంబుఁ బాయసము శాకవ్రాతముల్ పిండివం
టలుఁ బా ల్తేనియ జున్ను వెన్న యిడి యానాలుక్కెర ల్చక్కెరల్
ఫలము ల్పానకము ల్రసాయనము లంబళ్ళారుఁబెం డ్లూరుఁగా
యలు బజ్జు ల్దధిపిండఖండములు నం దావిర్భవించె న్వెసన్. ౬౪

పరమయోగివిలాసమునందు సీసపాదము:—

నిగమచోరకుని ఖండించినయలఁతయో యబ్ధిలో గిరి మోచినట్టియలఁతొ. ౬౫

చిత్రభారతమునందు:—

తే. నకులసహదేవులార భండనపటిష్ఠు, లార సౌందర్యలక్ష్మీకుమారులార
పోయితిరె మీరు నేఁడునాపొందువిడిచి, యను చువిలపించు చునలుదిక్కులాలకించు.

హరిశ్చంద్రోపాఖ్యానమునందు సీసపాదము:—

పల్లవారుణజటాపటలభారముతోడ నవ్యపలాశదండంబుతోడ. ౧౭

ముపవిభక్తియతులు.

తే. పున్నపుంసకతత్సమంబులకడపలఁ
దత్సమానాంధ్రదేశ్యశబ్దములతుదలఁ
గదిసినమకారశృంగములఁ గావ్యములను
బొసఁగుమువిభక్తియతు లనఁ బుధులకు. ౧౮

తే. పుష్కరము సూక్ష్మమధ్యమముగ నొనర్చె
ఫుల్లపంకేరుహము వక్త్రముగ నొనర్చె
బొండుమల్లెలు దరహాసముగ నొనర్చె
భోజనృపనందనకు నిక్కముగ నజుండు. ౧౯

ఆదిపర్వమునందు:—

క. ఎట్టివిశిష్టకులంబునఁ, బుట్టిన సదసద్వివేకములు గలిగినఁ దాఁ
గట్టినకర్మఫలంబులు, నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్. ౨౦

ముకారయతులు.

క. హెచ్చరికను బుధులకు, నచ్చపుమాకొమ్ము లే మహాకవు లాదిన్
మెచ్చులుగ నిలిపి రచ్చట, నచ్చటను ముకారయతు లటంచును గృతులన్. ౨౧

వసంతవిలాసమునందు:—

క. అత్తఱి విటనాగరికులు, చిత్తమున వసంతకేళి చిగురొత్తంగా
మొత్తములు గట్టి తెచ్చిరి, ముత్తెపుఝల్లరులతోడిబుఱ్ఱటకొమ్ముల్. ౨౨

శ్రీరంగమాహాత్మ్యమునందు:—

చ. పరిచరుఁ గాఁగ నేలె నిరపాయచరిత్రుని చాపశాసన
స్ఫురదురునీతిపాత్రుని సముజ్జ్వలమేరుసమానగాత్రునిన్
బరమపవిత్రునిన్ మునిసుపర్వవరస్తుతిపాత్రుని న్ననో
హరఫలశేముషీకబళితాంబుజమిత్రుని వాయుపుత్రునిన్. ౨౩

హరిశ్చంద్రోపాఖ్యానంబున ద్విపదము:—

ముందు మీ కెఱిఁగిన భూతలాధీశు, లందు రాజ్యంబుఁ బోనాడి క్రమ్మఱను. ౨౪

మవర్ణవిరామములు.

సీ. మర్దితదైత్యసంయమిమనోజ్ఞాదిత్య మహితమేఘాభ సంతతశుభ
మాయాశ్రవర్తి సంలబ్ధనిర్మలకీర్తిమణిహార సురవశంవదహార

మందరధైర్య వంశనినాదచాతుర్య మాఘూప యువతిపుంషండరూప
మంబులస్వాంత కంసధరావరక్రకాంత స్మరహరారాధ్య సింహనిభమధ్య.

తే. యనుచుఁ జరమానునాసికంబునకు నిట్లు గ్రాలుఁ గృతుల మవర్ణవిరామముఁన
దండిసున్నలు దాపల నుండెనేని, పెలుచ నంతస్థములు నూష్మములును గృష్ణ.

భీమనచాటుధార:—

చ. గరళపుముద్ద లోహ మవగాఢమహాశనికోట్లు సమ్మెటల్
హరునయనాగ్ని కొల్మి యురగాధిపుకోఅలు పట్టుకార్లు ది
క్కరటిశిరంబు దాయి లయకాలుఁడు కమ్మరి వైరివీరసం
హరణగుణాఢ్యరాముఁ డసమానుభీమనఖడ్గసృష్టికిన్. ౭౬

అనంతునిఛందమునందు:—

తే. యరలవలు శషసహలును నాదిబిందు, యుతములై మకారవిరామయుక్తిఁ దనరు
మారుతాత్మజుఁడరిదిసంయమియనంగ, మదనజనకుఁడు దనుజసంహారుఁడనఁగ.

బుజుయతులు.

తే. మొదలియంతస్థవర్ణంబుతుదిని బొదలు, నూష్మమును బుజుసంజ్ఞనా చేకటికాకటి
యతు లగునపారశూరసంహారయనఁగ, హరముఖార్చితపాదభోయజ యనంగ.

ప్రత్యేకయతులు

తే. ఉత్తరపదాద్యలిపిలోపమొదవకున్న, తటిని బ్రత్యేకయతినాఁగఁ దనరుచుండు
నరయ శార్ఙ్గంబు హరిచేతియదియునాఁగ, దివ్యచాపంబు శూలిచేతిదియనంగ.

భిన్నయతులు.

తే. గుడుసుకైఁ గ్రియనను మనాగుమసు వచ్చి, భిన్నయతియగు రానిచోఁ జెలువుమియగు
నెదను లచ్చిని హరి ధరియించె ననఁగ, రిపుల నెల్లను బోర హరించె ననఁగ.

విజయవిలాసమునందు:—

ఉ. చిత్తజుఁ దల్లి తూపు మొనఁ జేసినఁ జేయఁగ నిమ్మ మై ధ్వజం
బెత్తిన నెత్తనిమ్ము పచియించెదఁ గల్గినమాట గట్టిగా
నత్తరళాయతేక్షణకటాక్షవిలాసరసప్రవాహముల్
కుత్తుకబంటి తామరలకుం దలమున్కలు గండుమీలకున్. ౮౧

ఉ. చెట్టతనంబునన్ జనకుజీవన మంతయు వెల్లి పుచ్చి లోఁ
బుట్టినయాపెయి ల్వెలిది పుట్టినబిడ్డనికిం బగైన నీ
యిట్టినిశాటకృత్యమున కెవ్వఁడు రోయక సమ్మతించు నీ
పెట్టిప్రదోషవేళ జనియించినవాఁడవొ గాక చంద్రమః. ౮౨

ఆగమము రానందులకు శ్రీరంగమాహాత్మ్యమునందు:—

ఉ. గ్రందపుఁగొండనెత్తములఁ గందువమేలిమిమీఁదియిండ్లలోఁ
గెందలిరాకుపాన్పున సుఖించి నితాంతరతిశ్రమంబునుం
జెందినచెంచుగుబ్బెతలచెక్కులఁ జిమ్ముఁ జవాదివాసనల్
విందులు సేయుచు న్మెలఁగు వేఁకువఁ గోమలగంధవాహముల్. ౨౩

ఏకతరయతులు.

తే. మహిని రేఫాక్షరంబును మఱి శకారాంగ
నామకఅకారమును సవర్ణంబు లయ్యెఁ
గావ్యములయందు నొకటి కొక్కటి గలయుక
దమఱఁ దామయి యగు నేకతరయతు లన. ౨౪

ఆ. రార బాలకృష్ణ రచ్చలగిమిఁ గూడి, తారఁగ యనుచు నిన్ను నవ్వఁబెట్టు
వాండ్రయిండ్ల కేగి వా డేల దెచ్చెద, వనిన నేకతరము లై పొసంగు. ౨౫

అభేదవిరతులు.

తే. వేదముఖమున వబయో రభేదయనుట, వలన వబ లొక్కటొక్కటి నిలుచువిరతి
కవని లవలకు లళలకు నట్ల కలిమిఁ, జేసి తమలోన నివియును జెల్లుచుండు.

ఆ. వసుమతీకళత్ర బకజైత్ర గానక, లాలసత్కలాపడంబ గోప
లలితదేహ పింగళప్రదక్షిణగేహ, యన నభేదవిరతు లప్రమేయ. ౨౬

ఆదిపర్వమునందు:—

చ. నుతజలపూరితంబు లగునూతులు నూటికంటె సూనృత
వ్రత యొకబావి మేలు మఱి బావులు నూటికంటె నొక్కస
త్క్రతు వది మేలు తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు త
త్సుతశతకంబుకంటె నొకసూనృతవాక్యము మేలు చూడఁగన్. ౨౭

ఆరణ్యపర్వమునందు:—

చ. ప్రతిబలదర్పభంజనుఁడు పార్థుఁడు దారుణబాణవర్షము
న్నతి నతిధీరుఁ డై కిరిసినం బరముండు మహాంబువృష్టి ప
ర్వతము గ్రహించునట్లు తనబాహుల వాని గ్రహించి పోర స
క్షతతనుఁ డయ్యె వాని నతిగర్వితుఁ బార్థుఁడు చూచి యాత్మలోన్. ౨౮

భీమనచాటుధార:—

చ. విసరుహగర్భుగ్రాఁతయును విష్ణుచక్రము వజ్రివజ్రముల్
దెసలను రాముబాణము యుధిష్ఠిరుకోపముఁ గాలుదండమున్

మసకపుపాముకాటును గుమారునిశక్తియు మానిరోష మర్క
బసవసిరాతుశూలమును బండితవాక్యము రిత్త వోవునే. ౯౦

చ. బిసరుహగర్భబ్రాంతియును విష్ణునిచక్రము వజ్రివజ్రమున్
దశరథసూను బాణమును ధర్మజుకోపము మౌనిశాపమున్
మసకపుపాముకాటును గుమారునిశక్తియుఁ గాలదండమున్
బశుపతికంటిమంటయును బండితవాక్యము రిత్త వోవునే. ౯౧

చమత్కారమంజరియందు:—

ఉ. బంగరుమప్పటంబు వలెవాటుగ నొప్ప హసన్ముఖాబ్జుఁడై
రింగున నారిఁ గోల నమరించి తటాలునఁ ద్రుంచె నాథను
శ్శృంగుఁడు గోప యౌవత భుజంగుఁడు మోచితసంగుఁడుం గృపా
పాంగుఁడు దృప్తదర్పబలభంజనయంత్రము మత్స్యయంత్రమున్. ౯౨

తే. పెద్దశాకును దనకు నభేద మగుట, లళలకు నభేద మట్లన కలుగుకతన
డిళినిమాఁడవసరళంబుయతులఁబ్రాస, ములనులఘ్వలఘులకారములకునిలుచు.

అనంతుని ఛందమునందు:—

క. కాకుస్థయతి యగు నితఁ, డే కడలక జలధిఁ బవ్వళించె ననఁగఁ బ్ర
శ్నాకలితదీక్షమున నితఁ, డే కవ్వడిరథముఁ గడిపె నిమ్మల ననఁగన్. ౯౩

లళలకు నాదిపర్వమునందు:—

చ. అలసత నొరఁగాఁ దరుణి యమ్మృగపుంగవుబ్రోల నున్నయా
మిళితసుగంధబంధురసమీరవశంబునఁ దూలి ఫాలపై
వలు వెడల న్బయల్పడియె వర్ధకుచంబులుఁ గవుయుగ్మమున్
లలితకృశోదరంబుఁ దనత్రివళీయుతరోమరాజియున్. ౯౪

ఉత్తరరామాయణమునందు:—

శా. చేసేతం బృథివీశు లందుకొనఁగా శ్రీప్రణ్యాలోయుంబునన్
జేసె న్నజ్జనమం గుటుంబున హసించెన్ బల్లవోర్వీశును
ల్లాసం బై తగ ఫాలలోచనములీలం గట్టెఁ గావేరి వే
లాసాధ్యాఖిలదిఙ్ముఖుండు కలికాళక్ష్మావిభుం డల్పుఁడే. ౯౫

పారిజాతాపహరణమునందు:—

మ. అలినీలాలక నీవు నీపతి రహస్యక్రీడ వర్తించునే
శ లతాంతాయుధసంగరంబునకు నుల్లాసంబు గల్పించును

జ్వలదీపాంకుర మై రతిశ్రమతనూసంజాతధారాళఘ
ర్మలవంబుల్ దొలఁగింపఁగా సురటి నై రంజిల్లు నిచ్చారతిన్. ౯౭

అభేదవర్గయతులు.

క. తన కరతేసిబకారం, బునకు స్వవర్గజము లైనమొదలిలిపులరెం
టను బైలిపి నొకటను వా, యనువ్రాయి యభేదవర్గయతి నా నెనయున్. ౯౮

ఆదిపర్వమునందు:—

ఉ. ప్రల్లదుఁ డైనయొక్కకులపాంసనుచేసినదానఁ దత్కులం
బెల్లను దూషితం బగుట యేమి యపూర్వము కావున న్మహీ
వల్లభ తక్షకాధము నెపంబున సర్పము లెల్ల నగ్నిలోఁ
ద్రెళ్లఁగ సర్పయాగ మతిధీయుత సేయుము విప్రసమ్మతిన్. ౯౯

క. ఉరగకళేబర మలసాం, తరమునఁ బడి వ్రేలుచునికిఁ దలఁపక యచల
స్థిరుఁ డై పరమధ్యానో, పరతేంద్రియవృత్తినున్నవాని శమీకున్. ౧౦౦

ఆరణ్యపర్వమునందు:—

క. కోరి యనేకయుగంబు ల, పారతపోయుక్తు లైనవారికిఁ బడయన్
దూరము నీసభ మేదిని, కారుణ్యమునంతకంటెఁ గష్టద వ్రేదన్. ౧౦౧

ఫకారమునకు సాంబోపాఖ్యానమునందు:—

క. మురసంహరునాటోప, స్ఫురణమ్మునకున్ సదాశివుం డైన రణ
స్థిర నిలువఁ గలఁడె బాణా, సురునకుఁ దోడుపడ వచ్చి పొలయుటవినరే.

ఆదిపర్వమునందు:—

మత్తకోకిల. ధీరు లీధృతరాష్ట్రపాండు లతిప్రశ స్తగుణు ల్ప్రసి
ద్ధోరుకీర్తులు నాకు నిద్దఱు నొక్కరూప తలంపఁగా
వీరు వా రనునట్టిబుద్ధివిభేద మెన్నఁడు లేదు గాం
ధారిపుత్రశతంబునందుఁ బృథాతనూజులయందునున్. ౧౦౩

తే. అంత్యవర్ణంబుఁ బాసియూష్మాక్షరంబు,లూష్మవిశ్రాంతులనఁ జెల్లునొకటికొకటి
శతమఘోపలభూసానుమంగ యనఁగ,మద్జయుతవేణునాదప్రసంగ యనఁగ.

క. హయ లత్వమునకు శషసలు, నయవర్గన చఛజఝులకు నలి మధ్యమవ
ర్గయు తానునాసికము సి, శ్చయముగ ద్రుతమునకుఁ జెల్లు సరసవళులనన్.

తే. హరిహయాదిసురాధ్యక్షు యంబుజాక్షు,యతిజనమనోంబుజవిహార యఘువిదార
నరకదైత్యవిరోధి ఘృణాపయోధి, యనఁగ సరసాఖ్యవళ్యుదాహరణము లగు.

తే. శకటదానవసంహారి చక్రధారి, షట్పదశ్యామమూర్తి స్వేచ్ఛాప్రవర్తి

స్వర్ణపటపరిధాయిభుజంగశాయి, కరుణనన్నుఁ బ్రోవుమనసయ్యె సరసపళులు.

ఆ. ఒకటి రెండు జడ్డ లుండెడువర్ణంబు, విశ్రమస్థలమున వెలసె నేని
యవల దాని కెద్ది యైన సంయుక్తవి, శ్రామసంజ్ఞచేఁ బొసంగుచుండు.

తే. క్ష్మాధరం బాతపత్త్రంబుగా ధరించె, క్ష్మాకుమారుని బోరను సంహరించె
క్ష్మారుహంబునకై నిలింపపతి నొంచెఁ, జక్రి యనిన సంయుక్తవిశ్రామములగు.

క. ఏకపదంబున విరతు ల, నేకంబులు గలిగి యుండు నేని పదాదిం
జేకొన్నలిపియె యన్నిటఁ, బ్రాకటముగ నిలుచు సీసపదములఁ దక్కన్. ౧౧౦

ఆ. ఒక్కపదములోనఁ జెక్కువిశ్రమములు, జరుగుచోట మొదల జడ్డ లున్న
నడుగువెడలుదనుకనంచొక్కటియె కాన్పియుండఁ దాకటనదియు నాకటనిదియు.

జయభద్రరగడ:—

క్ష్మాపుత్రికాలోల కమనీయగుణజాల, ఘననీల యనిచెప్పఁగా బహువిరతులొప్పు
క్ష్మాపాలకలలామ కంధిగర్వవిరామ, సంగ్రామభీమ యనమహిని రెంటికేఁ దప్పు.

తే. ఒంటియడుగున బహుయతులుండునపుడు, నడుమనాక దానజమిలివర్ణంబుగదియ
సందుఁ జరణాదికి సవర్ణ మయ్యెనేద్ది, దానికయ నిల్చు విరతి ముందరనుగృతుల.

విజయమంగళరగడ:—

వైరిమదకమఃపతంగ స్వజనపోషి తాంతరంగ
వ్రజవధూభుజంగ యనఁగ వలయుఁ జెక్కువడులయెడల
వారితక్షమాకుమార ద్వారకాపురీవిహార
వ్యాససన్నుతప్రచార యనఁగఁ దప్పకడకు వెడల. ౧౧౪

అంత్యోష్మసంధియతి. పాణినీయసూత్రము.

ఝయో హో న్యతరస్యామ్:—

వృ. ఝయః పరస్య హస్య పూర్వసవర్ణో వా స్యాత్. వాక్ హరిః, ఘోషవత్త్వాదిగుణవతో హస్య వర్గచతుర్థః పూర్వస్సవర్ణస్స్యాత్. వాగ్ఘరిః.

సీ. కైరవకామదుఘ్ఘరవాహకవికుంఠ హైరణ్యగర్భవాగ్ఘరిసబృంద
డిండీరభోగిరాడ్ఢిమశైలకైలాసహరిధవళాంబురుడ్ఢరినివాస
దేవాశ్వసురసరిద్ధీరముక్తాకాశహరిచందనైణభృద్ధాత్రీదినిశ
పారదప్రాక్కకుబ్భస్త్రికంబుక్షీరహలధరశారదాభ్రయపటీర

తే. పాండుసత్కీర్తియని యిట్లు వర్గహల్లు, పొల్లులకుఁ బైహకారంబు పొందునపుడు
గంధబంధన యంత్యోష్మసంధిపిరమ, ణాఖ్యచే దాని కెయ్యేది యైనఁ జెల్లు.

## వికల్పసంధి విరమణము పాణినీయసూత్రము.

యరో నునాసికే నునాసికో వా:—

వృ. యరః పదాన్తస్యానునాసికే పరే అనునాసికో వా స్యాత్. ఏతన్మురారిః,
ఏతద్మురారిః, మయటి నిత్యమ్ వాచ్యమ్, చిన్మయః,

తే. వ్యాకరణసూత్రముల సంధు లతుకునపుడు, రెండువిధములరూపంబులుండ సేని
వసుధ నయ్యక్షరముల కవ్వల వికల్ప,సంధివిరమణ మన రెండుసాగుచుండు.

తే. నందసుకుమార గూఢపాన్మదవిహార, దళితశిశుపాల గోత్రభిన్మణినీల
నాగపర్యంకశాయి సన్మార్గయాయి, ధాతృనుతనామ యోగిహృన్మధ్యధామ.

ఆదిపురాణమునందు:—

మ. ఒకనాఁ డిందుధరుండుఁ బార్వతియు లీలోద్యానకేళీసరి
న్నికటానేకవనప్రదేశముల నైలేయేంద్రకన్యాప్సరో
నికురుంబంబులు పారిజాతకుసుమానీకంబు పైఁ జల్ల ద
ర్పకబాణంబుల సెల్ల సెల్ల యగుసౌభాగ్యంబు శోభిల్లఁగాన్. ౧౧౭

మనుచరిత్రమునందు:—

మ. అకలంకామధసత్త్వముం దెలియ మాయాద్వారకావంతికా
శికురుక్షేత్రగయాప్రయాగముల నే సేవింప కుద్దండగం
డకవేదండవరాహవాహరిపుఖడ్గవ్యాఘ్ర మిన్మించుకొం
డకు రాఁ జెల్లునె బుద్ధిఖాద్యజనితోన్మాద ల్గదా శ్రోత్రియుల్. ౧౧౮

తే. హలధరానుజ మయటినిత్య మ్మటంచుఁ,బలుకువాక్యంబుచే మయపదముగూడు
నప్పు డనునాసికంబె నిత్యమయి నిల్చు, నలినలోచనుమేను చిన్మయ మనంగ.

ఇవి వ్యంజనాత్మకవిరతిభేదంబులు.

ఇఁక నుభయవళు లెట్టివనిన వివరించెద.

సీ. సర్వేశ యుష్మదస్మచ్ఛబ్దయుతులును బరమాపవిరతులు ప్రాదియతులు
వెండి నిత్యసమాసవిశ్రాంతిదేశ్యనిత్యసమాసనిత్యాభిధానములును
రాగమసంధివిభాగనామకఖండపంచమీవికృతివిభక్తియతులు
కాకుస్వరప్లుతాక్షరయుగవిశ్రామములు నన నుభయాఖ్యవెలయువళులు

తే. క్రమత శబ్దానుశాసనప్రభృతిపూర్వ, కవిజనంబులకృతుల లక్ష్యములకలిమిఁ
బదియురెండువిధంబులై పరఁగుచుండుఁ,దద్విధంబులు దెలియంగఁదగుము కంద.

క. తుది నస్మద్యుష్మత్పద, యతు లనఁ గావ్యముల యుష్మదస్మచ్ఛబ్ద
ద్వితయమునకుఁ బైఁ బ్రాణము, లతికిన నుభయంబుఁ జెల్లు నభయవిహారా.

సాంబోపాఖ్యానమునందు:—

క. చతురాననసందన దీ, వ్యతపోధనవర్య యుష్మదాగమనమునఁ
గృతకృత్యుఁడ నైతిని నే, నతిపావన మయ్యె నస్మదన్వయ మెల్లన్. ౧౭౩

అథర్వణాచార్యుల విరాటపర్వమునందు:—

ఆ. ధర్మతనయ యుష్మదాజ్ఞానిగళమని, బద్ధ మగుచుఁ జిక్కువడియెఁ గాక
విజయమత్తగజము విడివడ్డచో నడ్డ, పాటు గలదె విష్టపత్రయమున. ౧౭౪

ఆదిపర్వమునందు:—

క. ప్రస్తుతఫణిసత్రభయ, త్రస్తాస్తుల మైనయస్త్రదాదుల కెల్లన్
స్వస్త్రి యని పలుక నవసర, మస్తీకున కయ్యె నిప్పు డంబుజనేత్రా. ౧౭౫

పరరూపవిరతి వ్యాకరణసూత్రము.

అచో న్త్యాది టిః:—

వృ. అన్త్యాచ్ ప్రభృతిశబ్దస్టిసంజ్ఞ స్స్యాత్. శకన్ధ్వాదిషు చే. పరరూపంవాచ్యమ్.

శ్లో. శకన్ధు రథ కర్కన్ధూః కుద్దాలో లక్తపర్కటీ,
లాఙ్గలీషా హలీషా చ మనీషా చ పతఞ్జలిః.
కుత్కీలోష్ణీషమఞ్జీరమ స్తిష్కకులటాదయః,
తథా వృకన్ధుసీమన్తౌ శకన్ధ్వాదిగణే స్మృతాః.

శకానాం దేశానా మన్ధుః కూపః శకన్ధుః, శకంధు వనఁగా, శకదేశముం దున్నబావి, కర్కస్యాన్ధుః, కర్కన్ధుః కర్కన్ధూర్బదరీ కోలీత్యమరః, కర్కంధు వనఁగా రేఁగుచెట్టు, కం శిరః, ఉష్ణవీర్యత్వా దుద్దాలయతీతి కుద్దాలః, కుం భూమి ముద్దాలయతీతి వా, దళ విశరణే, ఉ దిత్యుపసర్గః. కుద్దాలో బహువారక ఇత్యమరః. కుద్దాల మనఁగా విరిగిచెట్టు, పాద మలతీ త్యలక్తః, అల భూషణే యావో లక్తో ద్రుమామయ ఇత్యమరః, అలక్త మనఁగా లత్తుకపేరు, పర్చ్యతే పరస్పరం స్పృశ్యత ఇతి పర్కటీ, పృచిసంసర్గే. ప్లక్షో జటీ పర్కటీ స్యాదిత్యమరః. పర్కటి యనఁగా జువ్విచెట్టు, లాఙ్గలస్యేషా లాఙ్గలీషా. ఈషా లాఙ్గలదణ్డస్స్యా దిత్యమరః. హలస్యేషా హలీషా, ఈరెండును, ఏడికోలపేళ్లు. మనస ఈషా లాఙ్గలదణ్డవ త్సంబద్ధా మనీషా. బుద్ధిర్మనీషా ధిషణేత్యమరః. మనీష యనఁగా బుద్ధిపేరు. పతత్ అఞ్జలిః పతఞ్జలిః. పతఞ్జలి యనఁగా వ్యాకరణమునకు మహాభాష్యము చేసిననాగముపేరు. కోర్భూమే కుత్కీల, కుత్కీలః. అగకు

త్కీలజీమూత సానుమన్నగపర్వతా ఇత్యమరః. కుత్కీల మనఁగా గట్టుపేరు, ఉష్ణస్య ఈషః, ఉష్ణీషః. ఉష్ణీష శ్శిరోవేష్టకిరీటయో రితి నానార్థే. ఉష్ణీష మనఁగా దలపాగ పేరు, మఞ్జు రుచ్యం శీరయతీతి మఞ్జీరః ఈర స్వనే. మఞ్జీరో నూపురోస్త్రియా మిత్యమరః. మఁజీరమనఁగాఁ గాలిగజ్జె, మస్తం శిర ఇష్యతి ప్రాప్నోతీతి మస్తిష్కం, ఇష గతౌ. తిలకం క్లోమమస్తిష్క మిత్యమరః, మస్తిష్క మనఁగాఁ దలమెదడుపేరు, కులం విటకుల మటతీతి కులటా, అట గతౌ. అసతీ కులటేత్వరీత్యమరః. కులట యనఁగా లంజపేరు. ఆదిశబ్దముచేత వేదండసారంగములు మొదలైనవి మఱికొన్ని గలవు, వేదః సామవేదః అణ్డః జననకారణం యస్యసః వేదణ్డః, సామోద్భవ ఇతి ప్రసిద్ధిః. సామజ స్సిన్ధురోపి స ఇత్యమరః వేదండ మనఁగా నేనుఁగుపేరు. సారా ణ్యఙ్గాని యస్య సః సారఙ్గః. సారఙ్గ శ్చాతకే భృఙ్గే కురఙ్గే చ మతఙ్గజ ఇత్యమరః. సారంగ మనఁగాఁ జాతకాదులపేరు, వృకస్య అన్ధుః వృకన్ధుః వృకంధువనఁగా వృకదేశమందున్న బావి పేరు, సీమస్య అన్తః సీమన్తం సీమంత మనఁగాఁ బాపటపేరు. ఇవి శకంధుశబ్దము మొదలుగాఁ గలవి గావున శకంధ్వాదిగణ మనఁబడును.

క. విరళికి వ్యాకరణమనను, వరరుచిచేఁ జెప్పఁబడినవాక్యమువలనన్
బరరూపము నిత్యంబై, పరఁగుశకంధ్వాదులకు నుభయము జెల్లున్. ౧౨౬

వేదండశబ్దమునకు నాదిపర్వమునందు:—

మత్తకోకిల. దండితాహితవీర సూరినిధాన దానవినోద కో
దండపార్థ పరాక్రమప్రియధామ దిక్పరిపూరితా
ఖండపాండుయశోనిధీ పరగండభైరవ వైరివే
దండమండలచండతుండవిదారణాసిభుజార్గళా. ౧౨౭

భీష్మపర్వమునందు:—

ఉ. పాండునృపాలనందనులు పావని మున్నుగ నేచి యప్డు భీ
ష్ముండు గడంకమై నడచుచోటికిఁ జక్కటిగాఁగఁ ద్రోచి యొం
డొండ గడంగి సేన తమయుబ్బున నుబ్బగ నన్యసైన్యవే
దండముఖాంగము ల్తృణవితానముఁగాఁ గొని నిర్వికారులై. ౧౨౮

సారంగశబ్దమునకుఁ జంద్రికాపరిణయమునందు:—

ఉ. జంగమరోహణాద్రిసదృశంబులు తత్పురిఁ గల్గుభద్రసా
రంగవరేణ్యము ల్పయికి హస్తము లించుక సాఁచి యవ్వియ
ద్గాంగఝరంబు పీల్చి మఱి తద్వమథుప్రకరంబు దప్పి. వా
యంగ నాసంగు చంగున నిజాఖ్య వహించిన జాతకాళికిన్. ౧౨౯

ద్రోణపర్వమునందు:—

ఉ. అంగదనాథుమ్రింగినవృకావలి దన్వేసఁ జుట్టుకొన్న స
ర్వాంగములుం జలింప వెగడందుచు దిక్కులు చూచుచున్నసా
రంగియ పోలె నుండెఁ గురురాజభవత్సుతుసేన భీష్ము నా
జిం గబళించి పాండవులు జృంభితవిక్రమలీలఁ బొల్చుటన్. ౧౩౦

ప్రాదియతులు ఉపసర్గలు.

శ్లో. ప్ర పర ప్రతి ప ర్య త్య ధ్య భ్యవానూప సం స్వప.
ని వి ని ర్దు రుద ప్యాఙిత్యుపసర్గా స్తు వింశతిః.

ప్ర, పర, ప్రతి, పరి, అతి, అధి, అభి,అవ,అను,ఉప,సమ్,సు,అప,ని,వి, నిర్, దుర్, ఉత్, అపి, ఆఙ్, ఇవి యిరువదియును నుపసర్గలు.

వ. ప్రకారోపసర్గం బాది యగుటం జేసి ప్రాదు లనంబడును. ౧౩౧

తే. ఆంధ్రమునకుఁ జేరనిపరాజవులు మూఁడు, గాక తక్కినయుపసర్గకములతలల స్వరములతికినవాని కవ్వలను నిలుచు,నచ్చయినవాల్లయినఁ బ్రాదియతియనంగ.

తే. అబ్జయోని రజోగుణప్రాప్తిఁ దనరుఁ, బద్మనాభుఁడుసాత్త్వికప్రాప్తిఁదనరు రజతగిరిమందిరుఁడుతమఃప్రాప్తిఁడనరు,ననఁగనిభ్భంగిఁబ్రాదులకమరుయతులు.

వ. కడమయుపసర్గముల కన్నిటికిని నిటునలె నేరెంచునుం జెల్లు ననితెలిసికొనునది.

నిత్యసమాసాఖండయతి.

తే. ఒక్కసమసనమున శబ్దయుగముగూడి,పదము లేర్పాటుగాఁ గానఁ బడనిప్రాణ సంధులకు నిత్యసమసనక్రాంతులను న, ఖండవిశ్రమములు నన రెండుఁ జెల్లు.

క. లోకంబునఁ గర్ణాటవ, నౌకోద్వీపాంతరీపనాస్తిపదార్థా
నేకాన్యోన్యజనార్దన, నాకాదులు నిత్యసమసనము లండ్రు బుధుల్. ౧౩౬

వ. ఆదిశబ్దముచేత మందారనారికేళశబ్దాదులు మఱియు ననేకములు గలవు ౧౩౭

కర్ణాటశబ్దమునకు రామాయణమునందు:—

శా. లాటీచందనచర్చ చోళమహిళాలావణ్యసామగ్రి క
ర్ణాటీశీతకళాసరస్వతి కళింగాంతఃపురీమల్లికా
వాటీమంజరి గౌళవామనయనావక్షోజహారాళి యై
పాటింపం దగు నీదుకీర్తి రథినీపాలాగ్రణీ సాహిణీ. ౧౩౮

శ్రీనాథునివీథినాటకమునందు:—

మ. కుసుమం బద్దినచీరకొంగు వొలయం గ్రొవ్వాడుపాలిండ్లపై
ద్రిసరంబుల్వొలుపార వేణి యవటూదేశంబుపై రాయఁగాఁ

బస నెవ్వాఁడో యొకండు రాత్రి రతులం బల్గాసి గావించిన
న్వసివాళ్వాడుచు వచ్చుచున్నయది కర్ణాటాంగనం గంటిరే. ౧౩౯

వ. వనాకశ్శబ్దమునకు వనే కాననే, ఓకః స్థాన మస్యేతివనౌకాః. ౧౪౦

అధర్వణాచార్యుల విరాటపర్వమునందు:—

క. శ్రీకంఠుఁ డెదురునపుడు వ, నౌకోధ్వజ మింద్రసుకట మర్జునకురగా
సేకము దివ్యశతాంగము, నాకవ్వడి కబ్బియున్న నతఁ డే మగునో. ౧౪౧

వ. దానియందు.'

క. ఆకర్ణదురాలాపము, లాకర్ణింపఁగ నసహ్యమై ద్రోణునితో
నాకనదీసుతుఁ డనియె వ, నౌకోధ్వజ మెఱుఁగ వచ్చునరుఁ జూపి తగన్.

ద్వీపశబ్దమునకుఁ గావ్యాలంకారచూడామణియందు:—

ఉ. ద్వీపులఁ ద్రుంచువిశ్వజగతీపతి యాత్తమశక్తిబాంబవ
ద్వీపమునందు గోవులకు నిమ్మగఁ జేయుటయుం బ్రసన్నులై
గోపతిధేను వవ్విభునకుం దనవైభవ మిచ్చెఁ గాక యే
భూపతు లీవదాన్యగుణబుద్ధిఁ బ్రసిద్ధి వహింతు రుర్వరన్. ౧౪౩

నైషధమునందు సీసపాదము:—

వితతనవద్వయద్వీపనానాజయశ్రీవధూటీసమాశ్లిష్టభుజుఁడు. ౧౪౪

వ. అంతరీపప్రతీపశబ్దములకును నిటువలెనే. ౧౪౫

నాస్తిపదమునకు శృంగారషష్ఠమునందు సీసగీతి:—

తే. తల్లియును దండ్రి దైవంబు తలఁపగురుఁడ
కాఁడె యితఁ డేమి చేసినఁ గనలఁదగునె
నాస్తికాధమయోగి యన్యాయవృత్తి
"నాస్తి తత్త్వం గురోః పర" మ్మనఁగ వినవె. ౧౪౬

విష్ణుచిత్తీయమునందు:—

శా. ఆనిస్తానిధిగేహసీమ నడురే యాలించిన న్శ్రోత్రియు నెం
తే నాగేంద్రశయానుపుణ్యకథలుం దివ్యప్రబంధానుసం
ధానధ్వానము "నాస్తి శాకబహుళతా, నాస్త్యుష్ణతా, నాస్త్యపూ
పో, నాస్త్యోదనసౌష్ఠవం చ, కృపయా భోక్తవ్య" మన్పల్కులున్. ౧౪౭

పదార్థశబ్దమునకు సాంబవిలాసమునందు:—

తే. హాళికి నెదు రేగి సకలపదార్థములు ను, పాయసము వెట్టి నేముద్దుపట్టితోఁడ

జాంబవంతునిదౌహిత్రు శౌరిపుత్రు,సాంబు నొప్పించి బ్రతికించు సకలజనుల.

భాస్కరశతకమునందు:—

ఉ. దత్తత లేనియింటికిఁ బదార్థము చేతొకచోటనుండి వే
లక్షలు వచ్చెనేనియుఁ బలాయన మై చనుఁ గల్ల గాదు ప్ర
త్యక్షము వాగుల న్వఱద లన్నియు వచ్చిన నీరు నిల్చునే
యక్షయ మైనగండి దెగినట్టితటాకములోన భాస్కరా. ౧౪౯

అనేకశబ్దమునకు విష్ణుచిత్తీయమునందు:—

క. తనయులు తొమ్మిది యఁట పదు, గనమం డ్రఁట మోచువా రనేకపకిటికూ
ర్మనగాహు లేటిలావరు, లవితావకబాహు వొకటి యవని భరించెన్. ౧౫౦

కాళహస్తిమాహాత్మ్యమునందు:—

ఉ. తాను గుమారజంగమసుధాకరమౌళియుఁ గూడి మాడి యిం
పైనరతిప్రసంగముల నర్ధనిమీలితనేత్రపద్మముల్
మానిని చుంబనం బలర మాటలసొక్కులు వీడి వీడిపో
నీనికవుంగిలింతలు ననేకవిలాసములుం జెలంగఁగాన్. ౧౫౧

కర్ణపర్వమునందు:—

ఉ. మ్రొగ్గెడువాహనంబులును మాములు వాడఁగ వాహనంబులన్
డిగ్గి తొలంగుసైనికులు నేలకుఁ గప్పుచొప్పు చొప్పడన్
దగ్గుసిడంబులుంగులముఁ దన్నుఁ దలంచి యెదిర్చి యొంటిమై
మ్రగ్గెడువారు నై కురుధరావరుసైన్యము రూపు మాయఁగాన్. ౧౫౨

ఆముక్తమాల్యదయందు:—

చ. మలఁచి పయోజకోశములమాడ్కి నొనర్చినపద్మరాగపుం
గలశపుబెట్టెడాల్పొమిడికంబులతో నపరంజిమోడుబి
ల్లల నలవైజయంతముఁ జలంబున గెల్వఁగ దంశితంబు లై
నిలిచినయట్లు మాడువు లనేకము లుల్లసిలుం బురంబునన్. ౧౫౩

వ. అనాద్యనంతానంగానూరుశబ్దములు మొదలైననఞ్సమాసముల కన్నిటికి నిటు
వలెనే రెండును జెప్ప వచ్చును. ౧౫౪

అన్యోన్యశబ్దమునకు గావ్యాలంకారచూడామణియందు:—

ఉ. ధన్యుఁడు విశ్వభూవిభుఁడు ధారుణి నేలఁగ భూజనంబు ల
న్యోన్యహితత్వసంపదల నొందిరి దంపతు లింపు నింప న

న్యోన్యసుఖానుకూలతల నోమిరి విప్రులు వేల్పుపిండు న
న్యోన్యసుపుష్టితుష్టికుశలాదుల నొందిరి నాఁడునాఁటికిన్. ౧౫౫

జనార్దనశబ్దమునకు సాంబవిలాసమునందు:—

వ. జనా నర్దయతి సుఖయతీతి జనార్దనః అర్దగతౌ యాచనే చ. ని. విష్వక్సేనో జనార్దన ఇత్యమరః.

చ. శరధిసుతాకళత్ర నవసారసనేత్ర బలాంత కాదిని
ర్జరనుతనామ పాతకవిరామ విహంగమయాన చారుక
ర్బురపరిధాన పాండవవిరోధివిభంజన నిర్మలాత్మ కా
యరుచిజితాభ్రభంజన జనార్దన కైటభదైత్యమర్దనా. ౧౫౬

ఆరణ్యపర్వమునందు:—

చ. నగినగిమేనియా న్వివు జనార్దన యెన్నఁడు బొంకు వల్కు మ
ల్యగణితవిక్రమోరుబలధైర్యసమగ్రుల మెల్లభంగిఁ గా
లగతి దొలంగఁ ద్రోవఁగ దళం బగునే యగుఁ గాక నీకు మె
చ్చుగ నిదె ప్రాణ మిచ్చెదము ప్రుక్కము చావున కాత్మ నేమియున్. ౧౫౭

వ. నాకశబ్దమునకు న విద్యతే అకం దుఃఖ మత్రేతి నాకః. ని. స్వ రవ్యయం స్వర్గనాక త్రిదివత్రిదశాలయా ఇత్యమరః.

గౌరరాజు చాటుధార:—

ఉ. ప్రాకటదర్పతన్ సకలరాయని లక్కనృపాలు నాజిలోఁ
డాఁకువిరోధిసైన్యము మదం బొదవ న్వరియింప వచ్చుచో
నాకస మెల్లఁ గ్రమ్ముకొను నంచితదివ్యవిమానసంచర
న్నాకవిలాసినీచరణహంసకఘూరిఘుణంఘుణధ్వనుల్. ౧౫౮

విరాటపర్వమునందు:—

క. మును వెఱతు నేయ మీరలు, నను నేసినఁ గాని యనుడు నాకేశసుతున్
ధనురాచార్యుఁడు డెబ్బది, సునిశితబాణముల నేసెఁ జూపఱు వొగడన్.

కావ్యాలంకారచూడామణియందు:—

క. నీకరవాలముపాలై, నాకంబున కేగి రాజి నారాయణ యా
భూకాంతు లెట్టిచనవో, నాకవిటోత్తములఁ దూల నడఁతురు కడిమిన్. ౧౬౦

వ. నఞ్ సమాసశబ్దము లెన్ని యున్నను నన్నిటికిని నిటువలె నేయని తెలిసికొనునది.

విశ్వామిత్రశబ్దమునకు రంగనాథునిరామాయణమునందు ద్విపదము.

ఎక్కడా గురుఁడని యొఱుఁగనిసిక్కు, నక్కటా గురుఁడు విశ్వామిత్రుఁడయ్యె.

రామాయణమునందు:—

మ. హరకోదండవిఖండనుండు జనకక్ష్మాధీశజామాత భా
స్కరవంశాగ్రణి జానకీప్రియుఁడు విశ్వామిత్రయాగాహితా
సురసంహారి విరాధకాలుఁడు ఖరాసుధ్వంసి మారీచసం
హరుఁ డన్యాశ్రమదాపరాఙ్ముఖుఁ డయోధ్యానాయకుం డాదటన్. ౧౬౩

ఆపోశనశబ్దమునకుఁ జమత్కారరామాయణమునందు:—

క. ఓశశిముఖి లోపాము, ద్రేశుఁడు కలశభవుఁ డుండు నీట నతఁడు తపో
రాశి మహాత్ముఁడు మును పా, పోశనముగఁ గొనియె సాగరాంబువు లెల్లన్.

శృంగారషష్ఠమునందు సీసగీతి:—

తత్తరమున నాపోశన మెత్తఁబోయి, భూసురుం డెత్తు నుత్తరాపోశనంబు. ౧౬౪

స్వాంతశబ్దమునకు శృంగారనైషధమునందు:—

గీ. అధికరోషకషాయితస్వాంతుఁ డైన, నరపతికి విన్న వింపను నాయవస్థ
పైత్యదోషోదయంబునఁ బరుస నైన, జిహ్వకుఁ బంచదారయుఁ జేఁదుగాదె.

విరాటపర్వమునందు:—

ఉ. స్వాంతము హాహుగర్వఘనసంతమసాంధముగాఁగ శంక యా,
వంతయు లేక కీచకుఁ డహంకృతి ముంగలినాగమంటపా
భ్యంతరసీమఁ జొచ్చి దరియం జని యారసి సెజ్జఁ గాంచి య
త్యంతముదావహుం బగుడు నందు రయంబునఁ గేలు సాఁపఁగాన్. ౧౬౬

ఏకాంతశబ్దమునకుఁ బారిజాతాపహరణమునందు:—

ఉ. అంతట నొక్కనాఁడు ధవళాంబుజనేత్రుఁడు వచ్చి రుక్మిణీ
కాంతగృహంబులోన శశికాంతశిలామయవేదిమీఁద నే
కాంతమునందుఁ గొందఱు మృగాయతనేత్రలు గొల్వ జూద మ
త్యంతవినోదకేళిమయి నాడుచు నుండఁగ నచ్యుతంబుగాన్. ౧౬౭

ఆదిపర్వమునందు:—

తే. కామసుఖసంగములకు నేకాంతగృహము,పావిచిపొలిచియు ధర్మార్థములకు నాదియ
యాస్పదం బన వర్గత్రయానురమ్య, లైనజనులకెంతయు నాప్యునప్పరంబు.

వ. సిద్ధాంత రాద్ధాంత లతాంత ప్రాంత నిశాంతాదిశబ్దముల కన్నిటికిని నిటువలెనే రెండును నడుచును. ౧౬౮

వ. నారాయణశబ్దమునకు నారాః ఆపః అయనం స్థాన మస్య నారాయణః.

ఆదిపర్వమునందు:—

ఉ. పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు దానును ధరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁ డేకృతి కిష్టుఁడు సహా
ధ్యాయుఁడు నైనవాఁ డభిమతంబుగఁ దో డయి నిర్వహింపఁగాన్. ౧౪౦

వాతాయనశబ్దమునకుఁ జారుదేష్ణచరిత్రమునందు:—

గీ. అచ్చరలునందనంబునఁ దెచ్చుకొనుసు, రాగసుమములుహర్మ్యవాతాయనముల
చెంతఁ గాలూఁదితప్పరస్త్రీలకొసఁగి, వేఁడికొనిపోవుదురుకప్రహీడియములు.

విరాటపర్వమునందు సీసపాదము:—

తరుణులుఁ బతులు వాతాయనమ్ముల నల్లములకలై వేఁబోక మలయపవను.

ఉపాయనశబ్దమునకు సుదక్షిణాపరిణయమునందు:—

చ. వలఁ బడి యున్న జక్కవకవం బురణించుచు సన్నపైటలో
పల బిగిసుబ్బపోయి కనుపండువు సేయఁగ మోడ్పుచేతు లొ
దలను ఘటించి క్రొమ్మెక్కడి పదుపడి మెల్లన డాయఁ బోయి తొ
య్యలి విరిబంతి దోయిట నుపాయన మాయన కిచ్చి యిట్లనున్. ౧౪౩

అష్టమహిషీకల్యాణమునందు ద్విపదము:—

ఇంతులమేల్బంతియిడినసేవంతి, బంతి చేదోయి నుపాయన మిచ్చి. ౧౪౪

రసాయనశబ్దమునకు ననంతునిఛందమునందు:—

ఆ. నా స్త్రియనక మహి ననంతసంపదలు నా, రాయణుం డొసంగు రమ్య మగుర
సాయనంబు బుధుల కలఁ డన నిత్యసమాసయతులు రెంటి నంటి యుండు.

జైమినిభారతమునందు:—

గీ. మట్టిమాత్రంబు పిల్లలమట్టిపేరు, పేరువలెఁగాదు శారదాపీఠకంబు
వారిలోపలఁ బినవీరువాక్యసరణి, సరసులకు నెల్లఁ గర్ణరసాయనంబు. ౧౪౬

రామాయణశబ్దమునకు రాఘవపాండవీయమునందు:—

ఉ. ఏమొద నర్థగౌరవసమృద్ధియు శబ్దవిశుద్ధియుం దిరం
బై యనవద్యతం బరఁగ సంగ్రహచస్థితి భారతంబు రా
మాయణమున్ రచించినమహాత్ముల నాత్మఁ దలంచెదన్ జగ
ద్గేయుల నన్నపార్యునిని దిక్కన నెఱ్ఱన భాస్కరాఖ్యునిన్. ౧౪౭

జైమినిభారతమునందు:—

తే. పౌనిజల్పిత మైనరామాయణంబు, స్వరనయగ్రామమూర్ఛనాసరణు లెఱిఁగి

గానశక్తుల మెఱసి సాక్షాత్కరింపఁ, బాడి రాలాపములఁ ద్రిప్పి ప్తములు మెట్ట.

వ. పరాయణ, పలాయన, బాదరాయణ, సాంఖ్యాయన, శాకటాయన, కాత్యాయన, వాత్స్యాయన, బోధాయన, దక్షిణోత్తరాయణాదిశబ్దములకును నిటువలెనే రెండును గలవు. ౧౭౯

మార్తాండశబ్దమునకు శృంగారషష్ఠమునందు సీసగీతి:—

తే. వలవదు భయంబు వారెంతవార లైన, నట్టివారలు మన కగ్గ మైనవారు
వారునిరయంబునకుఁగాఁపువచ్చువార,లనుచుబుద్ధిగఁ జెప్పెమార్తాండసుతుఁడు.

ద్రోణపర్వమునందు:—

మ. ధరణీచక్రము దిర్దిరం దిరిగె మార్తాండుండు కుంఠీభవ
త్కిరణుం డయ్యె దిశావితానము వడంకె న్నిన్నపర్చె న్మహీ
ధరసంతానము లోలి గ్రక్కదలె నుద్భ్రాంతంబు లై యంబుధుల్
పొరలె న్గట్టులమీఁద బెట్టుపిడుగుల్ మ్రోసె న్నితాంతధ్వనిన్. ౧౮౧

వ. బ్రహ్మకపాదిశబ్దములకును నిటువలెనే యచ్చును హల్లును జెప్పఁదగును. ౧౮౨

ఉపసర్గసంధికిఁ జంద్రికాపరిణయమునందు:—

ఉ. అంతట రుక్మబాహువసుధాధిపనందన యొక్కనాఁడు శు
ద్ధాంతగృహంబు వెల్వడి విహారరతిం జనుదెంచె నెచ్చెలుల్
చెంతలఁ గొల్వఁ జంచదళికింజితరంజితకుంజమంజుల
ప్రాంతగళత్ఫలాసవరతాంగజఘోటికిఁ బుష్పవాటికిన్. ౧౮౩

కవిజనాశ్రయమునందు:—

ఉ. మానుగ విప్రమాతృరసమంచిత మై స్వర మూఁదినం దదీ
యానుగుణాక్షరంబు కొని యైనను జెప్పఁగ నొప్పు నీక్రియన్
భానుసహస్రభాసి నృపభాధిపుఁ డన్నటు లర్థయుక్తమై
పూనినచో నఖండవళి పొల్పగు నాదికవిప్రణీత మై. ౧౮౪

వ. ద్వారశబ్దమునకు, ద్వే అరే పార్శ్వే యస్య తత్ ద్వారమ్ పృషోదరాదీనియథోపదిష్ట మితిసూత్రేణ ద్విశబ్దా న్తస్య అకారాదేశః.

ఉ. వారక వారకామినులవర్తులచారుకుచోపగూహముల్
గోరక కోరకోల్లసితకుంజములం జిగురాకుపానుపుల్
చేరక చేరకేరళకళింగకుళింగనరేంద్రమందిర
ద్వారవిహారు లై సిరుల నందక నందకపాణిఁ గొల్వరో. ౧౮౫

హల్లులకు నుత్తరరామాయణమునందు:—

ఉ. వారలు వారిభూరిపరివారముతోడ విమాన మెక్కి శాఁ
గా రఘునందనుం డరిగి కాంచనతోరణచిత్రితోన్నత
ద్వారనికాయ మైననిజపట్టణ ముత్సుకవృత్తిఁ జొచ్చెఁ దిం
డారుముదంబున న్భరతునాకృతి బాలిశవృత్తిఁ గ్రాలఁగాన్. ౧౪౭

వ. కుమారవ దాచరితా శక్తిః కుమారాయితశక్తిః కుమారాయితయా శక్త్యా శాలత ఇతి కుమారాయితశక్తిశాలీ కుమారసమానపరాక్రమవా నిత్యర్థః.

ఆదిపర్వమునందు:—

ఉ. ఆయమ గర్వము న్విడిచి యన్యపతు ల్పని సేయ నిట్లు గాం
గేయభుజాశ్రయంబున నికృత్తవిరోధిసమాజుఁ డై కుమా
రాయితశక్తిశాలి ధృతరాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండ న
త్యాయతకీర్తితోఁ దనకు హస్తిపురం బది రాజధానిగాన్. ౧౪౮

వ. భద్రవ దాచరితా మూర్తి ర్యస్య తత్ భద్రాయితమూర్తిః శోభనమూర్తిమ దితియావత్, అయ మపి క్యజ్ ప్రత్యయాన్తః.

విరాటపర్వమునందు:—

ఉ. శ్రీ యన గౌరి నాఁ బరఁగుచెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తి యై హరిహరం బగురూపము దాల్చి "విష్ణురూ
పాయ నమ శ్శివాయ" యని పల్కెడుభక్తజనంబువై దిక
ధ్యాయిత కిచ్చ మెచ్చుపరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్. ౧౪౯

వ. ఈ రెండుపద్యములయందు నన్నయ తిక్కన కుమారభద్రశబ్దములు క్యజ్ ప్రత్యయాంతములు చేసి సంయుక్త విశ్రామంబులుగాఁ బ్రయోగించిరి, అది గానఁ గొందఱు రెండుశబ్దములమీఁదను, అకారము లున్నవి నిత్యసమాసవిశ్రాంతు లని భ్రమింతురు. శబ్దసూత్రమువలన వానికే దీర్ఘములు వచ్చినవి గాని యందులో నత్తులు లేవు. ౧౫౦

## దేశ్యనిత్యసమాసవిశ్రాంతులు.

తే. శబ్దశాసనముఖ కవీశ్వరకృత ప్ర, బంధములలక్ష్యములఁ గనుపట్టుకతన
దేశ్యనిత్యసమాససంధికిఁ బొసంగు, వడి స్వరం బైన వ్యంజనవర్ణ మైన. ౧౫౧

క. రూపఱఁ జెంపఱఁ జెల్లఱ, నేపఱచుట గ్రిక్కిఱియుట నిఁ గ్రచ్చఱయం
జూపఱి యుక్కఱి మొదలుగ, జ్ఞాపకి దేశీయనిత్యసమసనపదముల్. ౧౫౨

వ. కొందఱు నీనిపై రే దేశ్యాఖండము లందురు. ౧౫౩

అనంతునిఛందమునందు:—

తే. అఱ యనంగను బోవుట కర్థ మైన, సంధి నిత్యసమాసో క్తి జరుగు రెంట
నసురవీరుల నెల్ల నుక్కఱ వధించె, భానుకులుఁడు రావణుని నేపఱిచె ననఁగ.

ఆరణ్యపర్వమునందు:—

క. ఎఱకలు గలకులశైలము, లెఱుఁగున మైరయము మెఱయ దివికి నెగసి వి
ట్టులు ఋజలధరమ్మక్రియ ను, క్కఱఁ దద్వనమెల్ల సద్రున నార్చుచుఁ గడిమిన్.

యుద్ధకాండమునందు:—

చ. ఎఱిఁగిమెఱిఁగి మున్నతఁడ మె గ్గొనరించినదానికై కచా
చెఱఁ గొని వచ్చితిం బిడప సీత వృథాకథ లింక నేల పెం
పఱ బ్రతు కింత తీయనె ఖరాదులచావున కేమి చింత నీ
మఱఁదలిబన్న షేపగిది మానిని యీసదు సంధిఁ జేసినన్. ౧౯౬

వాసిష్ఠరామాయణమునందు:—

ఉత్సాహ. మఱియుఁ జెక్కుయోనులందు మహితచిత్రగతులఁ బెం
పఱ జనించి దుఃఖభాజ నై చరించి పెంచియున్
వఱలుచుప్రవరుఁడయ్యెంట వాసుదేవుఁ డనఁగఁ దా
నెఱుక గలిగి పుట్టె వేల్పు లేటితీరభూములన్. ౧౯౭

విరాటపర్వమునందు:—

చ. చిఱునగ వొప్ప గాండివము చెచ్చెర సజ్యముఁ జేసి సేన లు
క్కఱ రథసంబుమై నడచఁ గవ్వడి ద్రోణియు నీడఁ బోక య
త్తఱిఁ దఱుమంగ నస్త్రములు దండడి దాక్కని మందుచుండెఁ జి
చ్చఱపిడుగు ల్వడిం దొరఁ గుచాడ్పున నంబరవీథి నుగ్ర మై. ౧౯౮

లక్షణసారసంగ్రహమునందు:—

చ. ఎఱుఁగవు గాక భోగముల కెల్లను నెచ్చెలి జవ్వనంబు ని
త్తఱి నుడి వోవ కుండ నుచితంబుగ జక్కవదోయిఁ బోలి క్రి
క్కిఱిసిన చిన్ని చన్నుఁగవ యిం పెసలారఁగ నాదుచిత్తము
న్వఱలుసరోవరంబున నవారణకేళి యొనర్పు కోమలీ. ౧౯౯

ఆరణ్యపర్వమునందు:—

చ. ఎఱిఁగితి నిన్ను నేను విబుధేంద్రుఁడ వీవు జగత్త్రయంబు గ్ర
చ్చఱ భవదీయరక్షణమునం దెవెలుంగుచునుండు నట్టిని

న్నలుపుగ నేను వేఁడుకొన నొప్పను గార్య మెఱింగి నన్ను న
క్కఱపడి నీవు వేఁడు టిది కర్జము నిర్జితదైత్య చెప్పుమా. ౨౦౦

ఉద్యోగపర్వమునందు:—

చ. తఱి యగునంతకు న్నిపునదగ్రత సైఁచుట నీతి నీవు నా
కఱపినయట్లు సేయుము తగం జని యాతనిఁ గాంచి నన్ను నె
త్తెఱఁగున నైనఁ బొందఁగ మదిం గలదేనియు నింత యేల క్ర
చ్చఱ మునివర్గవాహనుఁడవై చనుదెమ్మను మంతఁ దీఱెడున్. ౨౦౧

ఉ. నన్నయముఖ్యసత్కవిజనంబుల కావ్యములందు లేఖకుల్
గొన్నియఁ బాఠకాధములు గొన్నియుఁ బోకడఁ బెట్టి తక్కువై
యున్నెడఁ గాంచి జానపదు లోడక దిద్దినతప్పుత్రోవ లె
ల్ల న్నిజ మంచుఁ గైకొనిన లక్షణవేత్తలు సన్నుతింతురే. ౨౦౨

వ. అది యెట్లనిన సులక్షణసారంబునందు లింగము గుంటతిమ్మన వ్రాసిన యప్రశ
స్తంబు లగులక్ష్యంబులకు నాశ్చర్యంబు నొంది బహుపుస్తకంబులు నిరీక్షించి
వాని నెల్లను బ్రక్షిప్తంబులుగా నెఱింగినవాఁడనై లక్షణవంతంబు లగుపురాతన
కవిప్రోక్తంబులు వివరించెద. ౨౦౩

ఆదిపర్వమునందు:—

క. నావచనమున నపత్యము, గావించుము నీవు గొంతి కడు నెయ్యమునన్
నీవగచినయాయర్థము, నా వె మనంబునఁ దలంతు సుందరి యెపుడున్.

ఉద్యోగపర్వమునందు:—

క. తమతండ్రిభంగి నీకును, సముచితముగ భక్తిఁ జేసి సజ్జననుతమా
ర్గమునను జరియింపంగా, నమలమతీ కన్నకొడుకుల ట్లరయఁ జనున్. ౨౦౫

అనుశాసనికపర్వమునందు:—

క. అతిథి నినుఁ గోరె నేనియు, మతిఁ గింకిరిపడక యోలమాస పడక నీ
పతనికిఁ బ్రియంబు సలుపుము, సతికిం బతిపనుపు సేయఁ జను నెల్లెడలన్.

రామాయణమునందు:—

ఉ. అన్నవు తండ్రియట్ల విను మంథియ కా వటమీఁద రాజ వే
మన్నఁ గొఱంత లేము మణిహారము లాదిగఁ జెక్కుకానుక
ల్మన్నగ సీత నిచ్చి జనలోకపతిం గని మమ్ముఁ బ్రోవు మీ
సన్నపుఁ గార్యము ల్వలదు సంధియ మే లటు గాక తక్కినన్. ౨౦౭

యుద్ధకాండమునందు:—

ఉ. ఓకపివీరులార సుగుణోదధి శ్రీరఘురాము సర్వలో
కైకశరణ్యునిం గొలువ నిప్పుడు వచ్చితి నొండు గాదు నా
రాక మహాపరాధి యగురావణుతమ్ముఁడ నే విభీషణా
ఖ్యాకుఁడ మీరు నాసదివు లర్కకులాగ్రణితోడఁ జెప్పరే. ౨౦౮

దేవకీనందనశతకమునందు:—

మ. చతురంభోధిపరీతభూవలయరాజన్యాలికోటీరరం
జితమాణిక్యవిరాజితచ్ఛరణరాజీవుండు ధర్మాత్మజుం
డతికార్పణ్యముతోడ మత్స్యపతిఁ జా నాసింపఁడే తావకా
యతకారుణ్యము గల్గునంతకును గృష్ణా దేవకీనందనా. ౨౦౯

ఆరణ్యకాండమునందు:—

చ. ఉరమున రెండు గన్నులు పృథూదరదేశమునందు నోరు ప్ర
స్ఫురితభుజద్వయంబును సముజ్జ్వలమన్నతభావముం గరం
బరుదుగ నుగ్రమైనవికృతాకృతితోడ నశేషసత్త్వసం
హరుఁ డగుచున్నవాని దివిజారిఁ గబంధుని గాంచి రచ్చటన్. ౨౧౦

ఉద్యోగపర్వమునందు:—

చ. అని మది నిశ్చయించి తగ నందఱఁ బిల్వఁగఁ బంచి వారితో
ననిచినమాటలాడి వినయంబునఁ బ్రార్థన చేసి మీరు మా
కొనరిన సైన్యము ల్పదునాకొంటికిఁ బ్రాభవ మాచరింపఁ జొ
చ్చిన సకలంబు నొప్ప నభిషేకముఁ గైకొనుఁ డుత్సవంబునన్. ౨౧౧

వ. దీనిమూఁడవపాదంబునందుఁ బదునాకొంటికి నని యున్నచోట సంధిగూర్చి
స్వరప్రధానపడిగాను సోమయాజులు ప్రయోగించినారు, ఇది తెలియక కొం
దఱు మూఢులు దేశ్యనిత్యసమాసపడి యని యనుకొందురు. ౨౧౨

నిత్యయతులు.

క. ఏని యనునాంధ్రశబ్దము, తో నదికెలపూర్వపదము తుదివ్రాయికి న
చ్చైనను వ్యంజనవర్ణం, బైన రచింపుదురు నిత్యయతు లనుచుఁ గవుల్. ౨౧౩

శేషధర్మములయందు:—

క. మెట్టఁడు నారకమార్గం, బెట్టిమహాక్రూరకర్ముఁ డేనియుఁ దుద ని
ట్టట్టనక నెమ్మనంబున, నెట్టన హరిఁ దలఁపు గలిగెనేని మహాత్మా. ౨౧౪

రాగమసంధివళులు.

తే. ఆలనుపదంబు మొదలను రాగమంబు, వచ్చు సంధికి నుభయంబు వళికిఁ జెల్లు
నతివ జవరాలు శాలింతరాలు ముద్దు, రాలు ధర్మాత్మురా లన రాజసారి. ౨౧౫

మనుచరిత్రమునందు:—

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపం బిడి పల్కరించు లా
గింతియ కాక నీ వెఱుఁగవే మును వచ్చిన త్రోవ చొప్పు నీ
కింత భయంబు లేక డుగ నెల్లిద మైతిమె మాట లేటికిన్. ౨౧౬

చారుధేష్ణచరిత్రమునందు:—

క. ఈలలన వేలుపుంజవ, రాలో యచ్చరయొ కిన్నరవధూమణియో
వ్యాళాంగనయో కాకీ, భూలోక స్త్రీల కిట్టిపొంకము గలదే. ౨౧౭

విభాగవళులు.

క. తులసీభూమణ సంఖ్యకుఁ, దెలుఁగునఁ బరిమాణసంజ్ఞ దేటపఱచు ప
ట్టులనేసి యనుపదమునకు, నలరు విభాగవడి యనఁగ నచ్చును హల్లున్. ౨౧౮

కాశీఖండమునందు:—

తే. అప్పటికి నియ్యకొంటఁ గా కంబుజాక్షి, బుషులపాలిటి వే యింతలేసి పనులు
కొడుకఁ గాఁబోతు నాఁబోతుఁ గుమ్ములాడ, నడిమి యాఁ బెయ్య దెసవచ్చె నాకుఁజాడ.

కావ్యచింతామణియందు:—

ఆ. కృష్ణుఁ డిచ్చు నాలుగేసి చీరలు కూర్మి, నింతులకును నాలుగేసి మణులు
తీవతోడ దోసెడేసి మాడలు కడు, నింపెసంగ గంపెడేసి సొమ్ము. ౨౨౦

నామాఖండవిశ్రమములు.

ఆ. అప్ప యయ్య యన్న యర సవ్వ యక్క, యాయి యనుపదంబు లదుకు సంధు
లుభయమునకుఁ జెల్లుచుండు నామాఖండ, వళు లనంగ నూఁదఁబడక రైన.

అప్ప యనుటకు నందితిమ్మన:—

క. ఇప్పటి దాతల సరిగాఁ, జెప్పకురా భట్టు కర్ణ శిబి ఖేచరులన్
జెప్పనము మూర్తి ఘనుని వెం, కప్పను దానమున నిర్భయంబున సభలన్. ౨౨౨

హుళక్కిభాస్కరుని చాటుధార:—

క. అప్పు లిడునతఁడు ఘనుఁడా, యప్పు డొసఁగి మరలఁ జెందునాతఁడు రాజా
చెప్పఁగవలె సాహిణిమా, రప్పను దానమున ఘనుఁడు రాజు నటించున్. ౨౨౩

అన్న లనుటకు పొట్టూరిగోపన:—

క. అన్నలుఁడు రూపమున సిరి, యన్న కళాయుక్తి భరతునన్న కరుణచే
నన్నసముద్రపుపెదచి, న్నన్నకుమారుండు వెంగళామాత్యుఁ డిలన్. ౨౨౪

మన తెనాలిరామలింగమ్మ:—

క. చిన్నన్న ద్విపద కెలుఁగును, బన్నుగఁ బెదతిరుమలయ్య పదమున కెలుఁగు
న్మిన్నంది మొరసె నరసిం, గన్న కవిత్వంబు పద్యగద్యశ్రేణిన్. ౨౨౫

తేలఁబలుకుటకు విక్రమార్కచరిత్రమునందు:—

చ. అనఘుఁడు సింగ నార్యునకు నబ్బయ గోపయమంత్రి చిక్కనా
రనయును గల్గి రాత్మజులు రాములు మువ్వురు దోఁచినట్లు పెం
పున వెలయంగ నబ్బయకుఁ బుత్రులు పుట్టిరి రామరాజుఁ గే
సనయును బాచిరాజు గుణసంగుఁడు లింగనయుం గ్రమంబునన్. ౨౨౬

ఊఁదఁబడక యున్నందులకు ననంతునిఛందమునందు:—

తే. ఒరుల న ష్మయ్య యనుచోట నూఁదఁబడక
ద్వివిధ మగుఁ బ్రభునామాంతవిరమణంబు
మహి నయోధ్యకు రాజు రామయ యనంగ
నతనిపట్టంపుదేవి సీతమ యనంగ.

రుక్మాంగదచరిత్రమునందు ద్విపదము:—

శ్రీకర గుణసాంద్ర చిరయశోరుంద్ర, ఆకారచంద్ర రామయ భాస్కరేంద్ర.

అరుసు అనుటకు నాంధ్రకవితాపితామహుఁడు:—

క. చేపట్టిన ధ్రువు లగుదురు, కోపించిన రంభఁ గూడుకొందురు జగతిన్
స్థాపింపఁ బాడవఁ జాలని, యాపండలు సాల్వకోనమరుసున కెనయే. ౨౨౭

పలకలూరిగోపన:—

ఆ. గొలకొండమలక గోవుల భక్షించుఁ, గొండవీటివిప్రకులము నెల్ల
బాచమరుసు చేరి భక్షించుచున్నాఁడు, మలక మేలొ బాచమరుసు మేలొ.

అమ్మ యనుటకు నీవనిపెద్దిరాజు రామరాజుచాటుధార:—

క. ఇమ్మహిలో మహనీయగు, నమ్మల నీసాటి గలరె నానావిధచే
శమ్ముల శ్రీరామునిసీ, తమ్మా మాయమ్మ నిత్యహస్తము లిమ్మా. ౨౩౦

క. ఇమ్మా మదభీష్టంబులు, కొమ్మా మాగ్రొమ్మొక్కు లెల్లగురుమతితో మా
యమ్మా రఘునందనుసీ, తమ్మా సౌభాగ్యసిద్ధిదాయిని వమ్మా. ౨౩౨

అక్కయనుటకుఁజాటుధార:—

క. ఇక్కలియుగశక్తులలోఁ, లెక్కింపకు భట్టశంక లేక ధరిత్రిన్
మిక్కిలి విమలేశునియం, బక్కకు సరివేల్పు గలదె యవనీస్థలిలోన్. ౨౩౩

క. చొక్కపు శ్రీగిరినిలయుని, మక్కువ మదిలోఁ దలంచి మనుజులఁ బ్రోవన్
దిక్కయి నిల్చినమాయం, బక్కకు సరిగలదె సకలభాగ్యస్ఫురణన్. ౨౩౪

ఆయి యనుటకు రాచపూడి వెంకటయ్య చాటుధార:—

క. వ్యాయామజనితమాయో, పాయసమస్తాఘములు నివారణ మగు దు
స్సాయంబు పూత మగు గం, గాయిని బొడగన్నఁ దాన మాడినమాత్రన్.

వణుకూరిగుర్వరాజు శమంతకమణిచరిత్రమునందు:—

ఉ. కాయవచోమనఃస్థలనకల్పితదోషము లెల్లఁ బాయఁగా
నాయెడలోన నిత్యము సనాతనధర్మముఁ బూని నిర్మలం
బాయక కొల్తు రామనరపాలనిరంతరసౌఖ్యదాయి సీ
తాయి సమస్తశోభనవిభాయి మహాఫలసిద్ధిదాయిఁగన్. ౨౩౬

పంచమీవిభక్తివిరామము.

ఆ. తత్సమంబుఁ జేయుతఱిని బంచమి నన్న, నంటె నను విభక్తులనుకుసంధి
ములఁగుఁ గృతులఁ బంచమీవిభక్తివిరామ, మనఁగ నచ్చునకును హల్లునకును.

చమత్కారరామాయణమునందు:—

క. నిన్నుఁ జెఱఁ గొన్నహైహయు, కన్నన్ దోర్వీర్య మెక్కుడగు భార్గవు పై
ల న్నిర్జించినరాముని, కన్నను శూరుఁడు ముజ్జగంబులఁ గలఁడే. ౨౩౭

ఆదిపర్వమునందు:—

చ. వితతమఖప్రయోగవిధివిత్తము లుత్తమధీయుతు ల్జగ
న్నుతసుమహాతపోధను లనుగ్రహనిగ్రహశక్తియుక్తు లే
క్రతువున ఋత్విజుల్కమలగర్భసమానులు పూర్వదిక్పతి
క్రతువున యాజకోత్తములకన్నఁ బ్రసిద్ధులు సర్వవిద్యలన్. ౨౩౮

కాకుస్వరవళులు.

క. పలుకులపలఁ గలప్రాలకు, వల నగుచోఁ బ్లుతము నిలిపి వానికి రెండున్
వళులుగఁ జెప్పినఁ గావ్యం, బుల నది కాకుస్వరంబుఁ బ్లుతవళియ నగున్.

ఆ. ఏకమాత్రహ్రస్వమినుమడించిన దీర్ఘ, మయ్యె మూఁడుమాత్రలయినఁ బ్లుతము
భీతిశోకతర్కగీతమారాహ్వాన, సంశయార్థములను జరుగుఁ బ్లుతము. ౨౩౯

భాస్కరునిరామాయణమునందు:—

ఉ. ఏ జనకాత్మజ న్నశరథేశ్వరుకోడల రాముభార్యఁ జం
డోజనులార యడ్డపడరో సురలార సురారి కొంచు నం
భోజదళాక్షి శైలవనభూములు దాఁటుచు భీతి నేగుచో
నీజలరాశిఁ జూచి మది నెంత దలంకెనొ యేమి సేయుదున్. ౨౪౨

మనుచరిత్రమునందు:—

ఉ. ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటిఁ జరించె దోట లే
కెవ్వనభూమి భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవఁ దప్పితిం
గ్రొవ్వున నిన్నగాగ్రమునకుం జనుదెంచి పురంబుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ జెప్పఁ గదవే తెరువేది శుభంబు నీ కగున్. ౨౪౩

శ్లోకప్లుతమునకు రామాయణమునందు:—

శా. అన్నా లక్ష్మణ నిన్నుఁ బుణ్యనిధి నే నజ్ఞాననై పల్కితి
న్నన్నా పాపము వచ్చి ముట్టుకొనియె న్నాపాలిదైవంబవై
యున్నీచుం బరిమార్చ వేగఁ బలు కేవే నన్ను రక్షింపు మీ
యన్నం గ్రక్కునఁ జీకవే యరుగవే యత్యుగ్ర శీఘ్రంబునన్. ౨౪౪

తర్కప్లుతమునకు హరిశ్చంద్రోపాఖ్యానమునందు:—

శా. ఓరీ రాజకులాధమా నృపులు లేరో వేట రారో మద
క్రూరాభీలమృగావళిం దునుమరో ఘోరాటవుల్ లేవొ నా
యారామంబుఁ గలంచి జంతుతతి మాయం జేసి యస్మత్కుమా
రీరత్నంబులు వేఁడ వచ్చినను వారి న్నొంచినా వేమిరా. ౨౪౫

శాంతిపర్వమునందు:—

మ. అనుమానింపక తోడఁబుట్టులనె కాదా తున్మి తూఁటాడె నెం
దును గ్రొన్నెత్తురు లేలు లై పఱవ నిం ద్రుం డుగ్రతన్ దైత్యులన్
మును లవ్వీరు భజింపరో క్రతువులామోదంబుతో నమ్మహా
త్మునిఁ జేయింపరొ యూర్ధ్వలోక మది కాదో నాక మూహింపుమా. ౨౪౬

రంగనాథునిరామాయణమునందు ద్విపదము:—

అట్టినామీఁద నీవా యలిగెదవు, పట్టి చెట్టులు వాపి పాఱ వైచెదను. ౨౪౭

అనుశాసనికపర్వమునందు:—

ఉ. అసరనాయకుం డొకమహాధ్వర మింతయు వేడ్కఁ జేయఁగాఁ
బూని మహీసురావలికిఁ బూజ యొనర్పఁగ, దాను బ్రాహ్మణుం

ధైనయమారఁగా ననలుఁ డాతనిపాలికి వచ్చి నాకు నీ
వే నృప నీదుపుత్త్రిఁ గృప నేర్పడ దానముగాఁగ నావుడుక్. ౨౪౮

దూరాహ్వానప్లుతము:—

తే. ఆదితేయార్చితాంఘ్రిపద్మా యనంగ, ద్వారకాపురమధ్యసద్మా యనంగ
నసురకులవైరినీరులారా యనంగ, రసికచిత్తాబ్జవాసులారా యనంగ. ౨౪౯

కళాపూర్ణోదయమునందు:—

మ. అకటా యే మని దూరువాన నిను నాథా వేఁగుజా మయ్యెఁ బొం
దికగాఁ బాదము లొత్త ర మ్మనుట గానీ యొంటి యేమో కదా
నికటక్షోణికిఁ జేర ర మ్మనుట గానీ కొంత నెయ్యంపుపూ
నికతోఁ గన్నుల విచ్చి చూచుటయు గానీ లే దొకింతేనియుక్. ౨౫౦

సంశయప్లుతము:—

ఆ. హరి యనంగ నాతఁడా నిన్నుఁ గంసు న, డంచెఁ గృష్ణుఁ డీతఁడా యశోద
కెంతభాగ్య మబ్బె నీబోటి నాబోటి, నేలఁత కట్లు గలుగునే తలుప. ౨౫౧

రామాభ్యుదయమునందుసుగంధివృత్తము:—

అంగనాలలాముఁగానవాలతాకుడుంగమా
తంగమాభుజంగమాపతంగమాకురంగమా,
లుంగమాలవంగమాతులుంగమాధవీనట
ద్భృంగమావనీరమాకరీరమాసమీరమా.

విజయసేనమునందు:—

ఉ. వల్లభుఁ డేగు దుర్లభుఁడు వానిదెసం దగు లూఁది యిమ్మెయిన్
దల్లడ మందె దేల యుచితస్థితికి న్ననుఁ బాపఁ జూపినన్
దల్లియు బంధులోకమును దండ్రియు నే మనువా రెఱింగి రే
నుల్లమ యిట్లు నీకుఁ దగునో తగదో పరికించి చూడుమా. ౨౫౩

రామాయణమునందు:—

క. జనకజకు సుమిత్త్రాసనం, దనునకుఁ బ్రణమిల్లి సముచితస్థితి వర్యా
సనమున నుండఁగ రఘుపతి, యనుజన్ముని జూచి సేమమా జనపతికిన్. ౨౫౪

ప్లుతయుగవిశ్రాంతములు.

క. తా మేవర్ణము లైనను, క్ష్మామండలమునను బ్రాణమైత్రి గలిగినన్
దామోదర ప్లుతయుగవి, శ్రామము లనఁగాఁ బ్లుతాక్షరద్వయ మమరున్.

వజ్రపంజరశతకమునందు:—

ఉ. శ్రీగజగామినీమణిని సీతనుగా నిరపాయిఁగాఁ ద్రిలో
కీగృహమేధిఁగా గురుఁడకేతనుఁగా భవరోగవైద్యుఁగా
నాగురువాన నిన్నె మది నమ్మితి వేలొకవేల్పుఁ గొల్వ నీ
వేగతి కావవే రఘుపతీ శరణాగతవజ్రపంజరా. ౨౪౬

వ. ఈపద్యమునాకంద(ము)ను నుభయవళిభేదంబు లింకం బ్రాసయతు లెట్టి వనిన. ౨౪౭

గీ. గీతముల సీసములను సంగీతములను, విరతి విడనాడి యొక్కొక్కచరణమునను
రెంటికిని బ్రాసవర్ణంబు నంటఁ బలుకఁ, బ్రాసవిశ్రాంతు లండ్రు కబ్బములవారు.

ఆ. దేవకీకుమార గోవర్ధనోద్ధార, తోయజాక్ష పాండవేయపక్ష
ఘననవీనీలగాత్ర మునిజనస్తుతిపాత్ర, యదుకులాబ్ధిసోమ కదనభీమ. ౨౪౮

## అగ్రాహ్యవిరామంబులు.

ఆ. వికటకవులు కొన్నివింతలు గల్పించి, కవిజనాశ్రయమునఁ గలిపినారు
వానిఁ జైకొనంగ వల దప్రయుక్తంబు, లేల సెప్ప భీమఁ డెఱిఁగియెఱిఁగి.

వ. అవి యెవ్వి యనిన. ౨౫౧

క. వెలయుఁ గకారాదులు భూ, తలమున జైద్రైవవళులు దా మగు ననుచుం
బలనామదనుఁడు రేచన, నలినభవసఖుండు గుణవతంసుం డనఁగన్. ౨౫౨

వ. ఈపద్యములోఁ జెప్పినయయిదునక్షరములయందును మొదలివర్ణములు నాల్గింటికి
వర్గవళ్లగునుఁ జెల్లుబడి యవి యన్నియు దాపలఁ బూర్ణబిందువు లేకుండిన
ననునాసికములకుం జెల్లవు. అబిందువు లున్నచో బిందుయతులు గనుక నవి
చెల్లును. ఈభేదము చెప్పనందుచేత నీపద్య మగ్రాహ్యము. ౨౫౩

## అగ్రాహ్యసంబంధవళులు.

క. దడలకు భేదము లెంచక, వడిఁయును బ్రాసంబు నిలుప వచ్చును గృతులం
దది యె ట్లన్నను శ్రీహరి, దొడిబడి దానవులఁ జంప డులి యాయె ననన్.

వ. ఈచెప్పిన దడలకుం బదాదినున్న చతుర్థవర్గసరళ మాదేశ మైవచ్చు నప్పు డా
దేశయతిగాఁ జెప్ప వచ్చు నదియుఁ గాక యీరెంటికిని దాపలింది సైఅసు
న్నలున్నప్పు డను స్వారసంబంధయతులు గనుక నటువలెను జెప్పవచ్చునని గ
లుగఁ జెప్పలేదు గాన నిది సమ్మతి గాదు. ౨౫౪

## అగ్రాహ్యవర్ణచతుష్టయపదంబు.

క. యగలవ లనుసీనాల్గును, వరుసం దమలోన వళ్లు రయమునఁ జెల్లన్
భరశషసహవర్ణంబులు, సరవి నాకటి కొకటి చెల్లు హరినిభ రేచా. ౨౫౫

వ. ఈ మొదలను జెప్పినయరలవలకు నాగ్గిటికిని జెల్లుబడి గాదు శషసహలతోపల
ను దొలుతటివి మూఁడును నూష్మవిశ్రాంతులు గనుకఁ జెల్లును వానికి హకారము
చెల్లదు. ఇవి తెలియక చెప్పినకతంబున నివియు నగ్రాహ్యంబు లయ్యె.

అగ్రామ్యభేదవర్గయుతులు.

క. ధరఁ బఫబభమాత్రరములు, పమవతి నీయేనుగూడ వాతోఁ జెల్లున్
సరి సంభావన వడి యన, మరుదీమము లేవ కీరవాణి యనంగన్.        ౨౮౭

వ. పంచమవర్గాక్షరములై దింటిలోనువబలక భేదయతిగానఁ బ్రథమద్వితీయచతుర్థ
వర్ణములువకారమునకునభేదవర్గయుతులుగాననవినిలుచును చుకారమునడవదు. ఇది
విచారింపక చెప్పినాఁడు గాన నిదియు నయుక్త మని తెలిసికొనునది. ౨౮౮

తే. భరితభువ నార్ణవంబుతోఁ బ్రంత సరిమో, రమ్యఫణిరాజరాజుతో లక్క సరియె
లలితవీణారవంబులో ధక్క సరిమొ, యనఁగఁ జెల్లునభేదాఖ్య నమరువళ్లు.

వ. ఈమూఁటిలోపలను భకార వకారములకు నభేదవర్గరతి గనుకఁ బ్రయోగిం
ప వచ్చును, లవర్ణ ఢవర్ణములకు నభేదవర్గయుతులును గావు గావునఁ బ్రయో
గింప రాదు రేఫమునకును లకారమునకును గ్రాహ్యంబు గాదు వానికిని లక్షణ
విలాసమువారు తెలియకకొన్ని యుదాహరణంబులు వ్రాసినారు, అవియును
విపరించెద.                                                   ౨౭౧

శృంగారనైషధమునందు:—

క. కైలాటరాయ యభినవ, లీలామకరాంక చంద్రరేఖాంకురచూ
డాలంకారపదాంబుజ, హాలింగితసుఖితనిర్మలాంతఃకరణా.            ౨౭౨

రామాయణమునందు:—

క. జానవసుందరు లత్తఱి, జానకి నలదలముమీఁద సన్మద మొదవన్
గా నిలుప శారదాభ్రవి, లీనత నేపారుచంద్రరేఖయ పోలెన్.          ౨౭౩

వ. సంస్కృతమునందు రేఖాలేఖాశబ్దములు రెండును గలవు గాన నీరెండు పద్య
ములయందును జెప్పినరేఖాశబ్దము మొదలివి తృతీయాంతస్థ మని యెఱుఁగునది.

హరిశ్చంద్రునికథయందు ద్విపదము:—

చీఁకటి విరియించుఁ జిఱునవ్వు పసిఁడి, రేకులతో నెదిరించుచెక్కులును.

వ. కొఁదటు రేకులతో మురాళించుచెక్కులును అని చదువుదురు అది వ్రాఁతత
ప్పుగాని కవిహృదయము గాదు.                                     ౨౭౪

వసుచరిత్రమునందు:—

శా. ఓలంబాలక ఘోల ఘోల యన నో లో లంచు మేలంబునన్
లో లంబాలక ఘూర్ణ గ్రుంకి విసన ల్లు ల్లున్న తూఁటాడి కెం

గేలం బూని తటాలున న్నెగసె నక్షీణాంబునాథాంబుజా
క్షీలోకంబు జయించి వాలయశః శ్రీఁ దెచ్చుచందంబునన్. ౨౭౮

వ. ఈపద్యము రెండవచరణము మొదలను లోలంబాలకయనికవిహృదయము. ఇది గానకకాండ "ఇన్దిన్దిర శ్చఞ్చరీకో రోలంబో బంభరోపి చ" అని యున్నదని రోలంబాలక యని చదువుదురు. ఇట్లని రామరాజ భూషణకవితలంపు గాదు.

క. నణ లనురెండక్కరములు, కును వడి ప్రాసంబుఁ బెట్టుకొన వచ్చుఁ గృతిన్
వినుర ల౨ల కట్ల పెట్టం, జను లళల కభేద మరయ సర్వజ్ఞ నిధీ. ౨౭౯

వ. ఈచెప్పినమాఁటలోపలను మొదలం జెప్పిననణలకునుసరసవడిని కడను జెప్పిన లళలకభేదవిరతియుఁ గనుక నీరెండును గూర్పవచ్చును నడుమను జెప్పినరలల కు "రయోస్తునిత్యంస్యాత్" అని శబ్దశాసనసూత్రముకలిమిం జేసి యేకతరయ కు లగుటనుం గూర్పరాదు అట్లు గాన నీపద్యమును బ్రశస్తము గాదు. ౨౮౦

వ. ఇవి నలువది యొక్కటియు యతిభేదంబు లింకఁ బ్రాసస్వభావం బెట్టి దనిన.

మూ. సూ:—ద్వితీయో వర్ణః ప్రాసో త్రపాదపాదేషు, కించ ప్రా
సస్సర్వేషు చైక ఏవ స్యాత్.

తే. ప్రథమపాదద్వితీయాక్షరంబు ప్రాస, మయ్యెఁబదపద్యములనడుగడుగునందు
నదియు రెండవవర్ణ మై యమరు సీస, గీతదండకమంజరీకృతులఁ దక్క. ౨౮౨

## ప్రాసపూర్వాక్షరనిర్ణయము.

క. గురులఘువులలో నైన్యేది, మురహర తొలిచరణమునకు మొదల నిలుచు ని
ద్ధర నాళ్లై నిమ ప్రాసా, క్షరములఁ బూర్వమున నదియ కదియింపనగున్. ౨౮౩

ఆ. దానపారిజాత వాసవావరజాత, ఘనఘనాఘనాంగ దనుజగర్వ
భంగ యనుచునిట్లుప్రాసాదులను గూర్పఁ, వలయు నొక్కభంగిఁ బ్రాలు కృతుల.

ఆ. క్రింద జడ్డలును బిలుంద బిందువులును, నూఁది ప్రాసములకు నుండ నేని,
హ్రస్వ మొకటి నిడుదయక్కరం బొక్కటి, వానిమొదల నిలుప వచ్చు నెందు.

ఆ. పక్షిరాజపత్ర రాక్షసతృణదాత్ర, దంతిభయవిరామ శాంతిధామ
యింద్రనీలమూర్తి సాంద్రపాండురకీర్తి, యనఁగఁ బ్రాసమాతృకాదులొప్పు.

ఆ. వేదవేద్య యసమవృత్తపాదములను, బ్రాసనియమరహితపాదములను
వలసినట్లు మొదలిబ్రాలు సెప్పఁగ నొప్పు, నొక్కదానగురువు నొకటలఘువు.

## స్వస్థానార్ధసమవృత్తోపజాతివృత్తము.

క్షమాకళత్రుఁడు వనజాతనేత్రుఁడు, గామేపలీకుం ద్విజగత్ప్రకాశుఁడు
దమాలనీలు స్సుభువారశీలుఁడు, హేమాక్షవైరి న్భజియింతు శౌరిన్.

ఆ. వారిజాతగర్భవామదేవసహస్ర, నయనముఖ్యపుణ్యనామ యనుచుఁ
బ్రాసనియతి లేనిసీసాదిపదములు, మొదల రెండు నిట్లు గదియుచుండు. ౨౭౯

పాసాక్షరస్వరమైత్రి.

తే. ప్రాసముల కెల్లఁ దుల్యాక్షరంబు లైనఁ
జాలు స్వరభేద మైన దోషంబు లేదు
చరణములకడఁ గూర్చుప్రాసముల కెల్ల
నన్నియు సమస్వరంబులై యమరవలయు. ౨౮౦

ఆ. సరసిజాతనేత్ర దురితగుల్మలవిత్ర, హరితనూజమిత్ర గరుడపత్రి
ధారుణీకళత్ర నీరదాసితగాత్ర, యనుచుఁ గూర్ప వచ్చు నచ్చు లెల్ల. ౨౮౧

క. దురితద్విపహర్యక్షా, నరకమురాసురవిపక్ష నాళీకాక్షా
శరధిసుతాలయవక్షా, కరినాయకరక్ష హరముఖసురాధ్యక్షా. ౨౮౨

తే. వట్రువ యుద్విత్వమును గలవ్యంజనంబు, ప్రాసమైయుండు నెడఁ బెఱప్రాసములకు
వ్యంజనంబు సమాక్షరం బైనఁ జాలు, వానిపై నేస్వరం బైనఁ బూన వచ్చు.

ఆ. సకియ పూర్వజన్మసుకృతఫలంబునఁ, గాక తనువిభాసిరాకృతాభ్ర
నిక్కృపాపయోధ దక్కఁగఁగఁ గొనుటకుఁ, దరమె భోజసుతకుఁ దక్క నన్యఁగ.

కర్ణపర్వమునందు:—

క. చావరు నావ్వరు పాండవు, లేవురు నని నీవు సెప్ప నిప్పలుకులు దుః
ఖావేశకరము లై చే, తోవృత్తిఁ గరంపఁ జొచ్చె దుర్భరభంగిన్. ౨౮౩

కవికర్ణరసాయనమునందు:—

మ. అమరీవిభ్రమిరీతిలోలనయనాహస్తాబ్జదోధూయమా
నమణీదండకచామరాగ్రపవమానాస్పందనాందోళన
క్రమశోభాన్నపకుంతలప్రకర మత్కర్షార్హ మయ్యెం దదీ
యమృదుస్పర్శసుఖోన్నతిం బరవశంబై తూఁగుచందంబునన్. ౨౮౪

క. విరమము స్వరప్రధానము, ధరఁ బ్రాసము వ్యంజనప్రధానము నగుటన్
స్వర సంధిఁ జెందునవుడును, బ్రచురంబుగ వల్లు దాన ప్రాసము లయ్యెన్.

క. అనలు వెట్టిన నిలువకఁ, దా నూరక యలిగి యాసుదంతిని జేరన్
దానవసంహరుఁ డేక్రియ, చే నింకఁ జనుదెంచు నాకుఁ జెప్పవె యనఁగన్.

ప్రాసభేదంబులు.

సీ. అర్ధబిందుసమాహ్వయముఁ బూర్ణబిందుఖండాఖండములు సంయుతాక్షరంబు
ధర సంయుతాసంయుతము రేఫయుతలఘుద్విత్వవికల్పము ల్వెస సుఖయము

ననునాసికప్రాసమును బ్రాసమైత్రియుఁ బ్రాసవైరంబు స్వవర్గజంబు
బుప్రాసలఘుయకారప్రాసములు నభేదంబును సంధిగతంబు ననఁగఁ
తే. బదియు నేడుదెఱంగులఁ బరిఢవిల్లుఁ, బ్రాసములు పూర్వసుకవిప్రబంధములను
గ్రమత లక్షణలక్ష్యయుక్తంబుగాఁగఁ, దేటపఱచెద వాని నిశాటదమన. ౨౯౯

సమప్రాసములు.

తే. పూర్వమున నర్ధమైనను బూర్ణమైన, దిగువ జడ్డక్కరం బైనఁ దగిలి మొదలి
ప్రాస ముండినయెడ సమప్రాస మనఁగఁ, బిదప నన్నియు నట్లనఁగ దియవలయు.

సమప్రాసములం దర్ధబిందుప్రాసము.

ఆ. పేఁకఁ బఙ్క్తిముఖుని డాఁకి కోసలవల్ల, భుఁడు జలాసురాంతకుఁడు సెలంగ
నవనిఁ గూల్చె ననుట నర్ధబిందుప్రాస, మిట్లు గూర్పవలయు నెల్లకడల. ౩౦౧

పూర్ణబిందుప్రాసము.

క. పొందింప వలయు నెల్లెడ, బృందావనచారి పూర్ణబిందుప్రాసం
బిందీవరాక్షి క్ష్మక, నందనఁ జేకొనయె నందనందనుఁ డనఁగన్. ౩౦౨

ఖండాఖండప్రాసములు.

క. నిడుపులు నరసున్నలు దమ, కెడమను గలకచటతపల కెలఁ బ్రాసములై
పొడరును నిర్బిందువులొ, క్కెడ ఖండాఖండసంజ్ఞ నినశశినయనా. ౩౦౩

ఆదిపర్వమునందు:—

క. పేఁకఁ బఱతెంచి నల్గడఁ, దాఁకినఁ గడు నలిగి ఘోరతరశరహతి న
మ్మూఁకలు విరియఁగ నర్జునుఁ, డాకరమున నేసె నుగ్రుఁ డై రణభూమిన్.

విరాటపర్వమునందు:—

క. నాకొఱఁత దీర్చి వచ్చితి, నీకొఱఁతయు యింక సూతుని నైగఁ జూడ
న్లోకము వంచింపఁగఁ దగు, చీఁకటి కే యొదవె నేమి సేయుదొ చెపుమా.

ద్రోణపర్వమునందు సీసపాదము:—

మూఁకలు విరియించి పేఁక* నాచార్యాదియోధుల కెల్లను నాక్కడెసను. ౩౦౪

రుక్మాంగదచరిత్రమునందు:—

ఉ. ఓకరుణాకలాప వికచోత్పలలోచన యిప్పు డియ్యెడన్
గాకులు చంప కుండ ననుఁ గైకొని కాచిననీకృపాగుణం
బే కలిగె న్వసింపఁ దగునే తొలిపుట్టువునందు భర్తపైఁ
గాఁకలు సేసినట్టిఘనకల్మషము ల్విను నీకుఁ జెప్పెదన్. ౩౦౫

ఆదిపర్వమునందు మత్తకోకిల:—

తీఁగయుయ్యెల నూగుఁ జల్లనితియ్యమామిడిమోకలం
డాఁగుఁ బువ్వులతేనెసోనలఁ దారుఁ గేతకిఁ జేరుఁ బు
న్నాగపూగమహాగవీథుల నాట్యము ల్పచరించు నా
భోగనాగలతాగృహంబుల భోగము ల్గనువేడుకన్. ౩౦౯

రామాయణమునందు ద్విపదము:—

మ్రూఁగి చరించునమ్మొకరితుమ్మెదలు, బా గొప్పఁ గొప్పనఁ బరఁగినదాని.

వరాహపురాణమునందు:—

క. అచింతామణి ముని తన, పేఁచ మసఁచుదాఁక నీక పృథులోభముచే
దాఁచుకొనుఁ గాక నాచే, నీచే నిఁక మోసపోవు నే నరనాథా. ౩౧౦

ఉద్యోగపర్వమునందు:—

క. మీటుగతి రథికులను నాక, నాటికి వేవుర వధింతు నరుశరములు నో
నాటి పడవైచునంతకు, వేఁటాడెదఁ బ్రతిబలంబువీరుల నెల్లన్. ౩౧౧

ఆ. బోఁటి యొకతె పెండ్లిపాట పాడఁగఁ జొచ్చె, నాఁప రానివిరహతాపమునను
చేరుగూర్చి తాను పెండ్లికూఁతురు గాఁగ, గోత్రధరుఁడు పెండ్లికొడుకుగాఁగ.

ఆదిపర్వమునందు:—

క. ఆసన్నగముఖ్యులఁ దన, పేఁపునఁ బెట్టుకొని పఱచి విపినములు మహా
ద్వీపములు గిరులు సకలది, శాపాలపురములుఁ జూచెఁ జని వారలకున్. ౩౧౩

సంయుతాక్షరప్రాసము.

తే. సంయుతాక్షరప్రాసమై జగతి వెలయు, గర్గుఁ దర్పించుదైవంబు భర్గుఁడనఁగఁ
భక్ష్మలేపుణకా నతిసూక్ష్మ మనఁగఁ, జంద్రవంశ్యుఁడు భోగదేవేంద్రుఁ డనఁగ.

సంయుతాసంయుతప్రాసము.

తే. రలలు తమక్రింద జడ్డ లైఁ గ్రాలువ్రాలు, ప్రాసవర్ణంబు లై వానిఁబాసియైనఁ
గూడియైనను చెలియడుగులనునిలుచు, సంయుతాసంయుతప్రాససంజ్ఞఁ దనరి.

తే. పాఁడిద్రచ్చఁగనిమ్మనాతంద్రికృష్ణ, వేఁడుకొనియెదపంచాఁకఁబండ్లు దినుము
మండగపుచేష్టలుమనోటిగాంద్రతనము, మెండుగాఁజొచ్చెనీకుసైదేండ్లకనఁగ.

రేఫశ్లిష్టమునకు నాదిపర్వమునందు:—

ఉ. క్షత్త్రియవంశ్యు లై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్త్రియవైశ్యశూద్రు లనఁగాఁ దగునాలుగుజాతుల స్స్వచా
రిత్రముఁ దప్ప కుండఁగఁ బరిక్షితు కాచినయట్లు రామమాం
ధాతృరఘుక్షితీశులు మొదంబునఁ గానిరె యేయుగంబునన్. ౩౧౪

వ. మాంధాతృశబ్దము ఋకారాంతము గనుకఁ దకారముక్రింద నున్నది వట్రువసు
డిగాని ఱకారవడి గాదు అంటులకు. ౩౧౭

కవికర్ణరసాయనమునందు సీసగీతి:—

తే. దానగుణశాలి భూసముద్ధరణదక్షుఁ
డనిశమఘదీక్షితుండు మత్తారిహరిణ
విహృతినిరతుఁడు యువనాశ్వ* విభుసుతుండు
ఘనుఁడుమాంధాతనృపుఁడైన కాలమందు. ౩౧౮

సోమునిహరివంశమునందు:—

శా. నాతో మార్కొన లేరు నిర్జరపురీనాగేంద్రబృందారకా
రాతుల్మున్నుగ దేవసంఘములు పోర న్ధీరసంగ్రామకుం
డీత్రైలోక్యమునందుఁ గల్గఁడు రణం బెచ్చోట లేకుండఁ గాఁ
జేతుల్వేయు పృథ్వాభరం బగుచు వచ్చె న్నేవ యీమేనికిన్. ౩౨౦

దేవీవిజయమునందు:—

తే. వాక్త్రినేత్రాంగనాశచీశక్రులధిక, సంభ్రమంబునఁ గుంభనికుంభదైత్య
హంత్రిఁబూజింపుచురుత్రయీమంత్రములను, స్తోత్రములుచేసిమంగళారాత్రికలిడి.

పద్మపురాణమునందు:—

క. శ్రీకరచక్రాంకితులగు, లోకులు శుద్ధులును బుణ్యులును నగుదురు వా
రీక్రియలు లేక యుండిన, బ్రాకృతులనఁ బతితులనఁగఁబడుదురు జగతిన్.

లకారశ్లిష్టమునకు రాఘవపాండవీయమున:—

శా. లోకత్రాణరతిం దదాదిమమహీలోకప్రవేశోత్కభా
షాక్లృప్తప్రథమద్వితీయపదగుంజన్మంజుమంజీరగ
ర్జాకల్పామలరామభారతకథాసర్గంబుల న్నించు వా
ల్మీకివ్యాసులఁ గొల్చెదం దదుభయశ్లేషార్థసంసిద్ధికిన్. ౩౨౩

రేఫయుతప్రాసము.

ఆ. సుడులు తెలుగులందుఁ బొడమ వాక్రైవడి, వ్రాలు కొమ్ముఱకారవడులుగాన
రేఫయుతసమాఖ్యఁగృతులఁబ్రాసములగు, సొరిదిఁదమకుఁదాము సుడులఁబాసి.

క. సంగ్రామరంగమునఁ జెలు, చం గ్రుమ్మలు మన్నసాల్వజగతీవరుమే
నం గ్రుచ్చిపార నాటెం, చెం గ్రూరాస్త్రములు నాల్గు శ్రీకృష్ణుఁ డొగిన్.

క. ఈక్రార పలుకునకు మొదలై క్రాలుచుఁ దేలి ప్రాస మగుఁ దనతనకే
శ్రీక్రొమ్ముడిసౌందర్యము, వాక్రువ్వం దరమె యురగపతునకు నైనన్. ౩౨౬

### లఘుద్విత్వప్రాసము.

తే. భువి లఘుద్విత్వసంజ్ఞికంబు లయి కొన్ని
యూఁదఁ బడనిక్రారలతోడ నొకటి కొకటి
ప్రాసముల కగుఁ దమలోనఁ బత్రయుగము
విద్రుచె వినతాత్మజుఁడు దిక్కు లద్రువ ననఁగ. ౩౨౪

### వికల్పప్రాసములు.

తే. పంచవర్గంబులను గనుపట్టునట్టి
పొల్లులనునాసికాక్షరంబులను గదిసి
తమమపంచమములుఁ దృతీయములునగుచు
నమరుఁ బ్రాసంబులకు వికల్పావ్యయముల. ౩౨౫

తే. ప్రాప్నగసమానధృతి సుధారుఙ్నిభాస్యాంబ్రసజ్నిచయసక్తకంఠ దావాగ్నిపాయి
దిఙ్మహితకీర్తి యర్జునయుగ్మభేదీ, వాఙ్మనోహారనుత యసదృఙ్మహాత్మ. ౩౨౬

### ఉభయప్రాసము.

ఆ. ధాత్రిఁ బాణినీయసూత్రములను దృష్టి, యూష్మమును ద్రుతంబు నొక్కచోటఁ
గ్రమతపాక్షరమును ణకారము నైప్రాసములకు నుభయసంజ్ఞఁ బొసఁగు రెండు.

త్రైశంకవోపాఖ్యానమునందు:—

క. ఝషకేతుద్వేషునకుఁ గి, ల్బిషపర్వతవృషున కమృతవిషనిధిజామా
త్రిషునకుఋషిపూజితునకు, విషమాక్షున కింద్రముఖదివిజపక్షునకున్. ౧౩౧

సాంబవిలాసమునందు:—

క. వసుధాకళత్రునకు సా, రసదళనేత్రునకు మరుదరాతిమదతమో
విసరాంబుజమిత్రునకు, న్విషమశిలీముఖసహస్రనిభగాత్రునకున్. ౩౩౨

తే. ప్రాణములఁ బాపి నాహవక్షోణియందుఁ
బ్రాణవల్లభఁ గొని చన్నదానవేంద్రుఁ
దమ్ముఁడును దాను గీశజాతమ్ములోడ
శరధి బంధించి దాఁటె దాశరథి యనఁగ. ౩౩౩

ఉద్యోగపర్వమునందు:—

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణశల్యులున్
బాణము లాసుయోధనునిపాలివ యంద్రు నిజానుజన్ము ల
క్షీణపరాక్రము ల్సుతు లజేయులు బాహ్లికసోమదత్తులా
స్థాణువ నైన నోడరు వశంబె జయింపఁగ వారి నేరికిన్. ౩౩౪

కాళహస్తిమాహాత్మ్యమునందు:—

మ. ప్రణతుల్ సేయుచుఁ గాంచెఁ గుంభజుఁడు లోపాముద్రతోఁ గూడి ద
క్షిణకైలాసము నంబికాహరకృతశ్రీపాదుకాన్యాసమున్
మణిమంత్రౌషధవాసము న్భవమహామాయావిపర్యాసమున్
గణనాతీతనటీవిలాసము సమగ్రశ్రీసముల్లాసమున్. 335

కాశీఖండమునందు:—

క. త్రిణయనునిరాణివాసము, నణిమాద్యైశ్వర్యవితరణామరతరువున్
మణికర్ణిక ముక్తివధూ, మణికర్ణికఁ దలఁచె మౌని మానసవీథిన్. 336

రామాయణమునందు:—

చ. రణమున నుగ్రసాయకపరంపర భానుకులంబ రామల
క్ష్మణము జగంబ వానరముగా విలుసేఁతను మచ్చుజావిజృం
భణమును జూపి తంద్రిమదిఁ బట్టినచింత దొలంగఁ బెట్టి శూ
ర్పణఖకు సిగ్గు వాటిలినబన్నము నీఁగుము నే నవశ్యమున్. 337

మధుసేవనమునందు:—

క. పో నుద్యోగముఁ జేసిన, ప్రాణంబా యింక నీకుఁ బాథేయం బీ
మానినిమందస్మితమధు, రాననచంద్రికలు గ్రోలి యరుగుము పిదపన్. 338

శృంగారషష్ఠమునందు:—

క. అనుటయుఁ గృష్ణద్వైపా, యనతనయుం డిట్టులనియె నవహితమతి యై
విను మతిగుహ్యము నారా, యణకవచము భక్తవాంఛితార్థప్రదమున్. 339

ఆరణ్యపర్వమునందు:—ఇదిపొరపాటు. ''త్రినయన'' అగును. వృ. సూ.

చ. కనకగిరిం బ్రదక్షిణముగా శశిభాస్కరతారకాగణం
బనవరతంబు ద్రిమ్మరు మహామునిసప్తకమండలంబుతో
ననఘ తదీయశైలశిఖరాగ్రమునందుఁ బయోరుహాసన
త్రిణయనవిష్ణు లుండుదురు దేవగణంబులు గొల్చుచుండఁగన్. 340

అనునాసికప్రాసము.

గీ. తమకుఁ దామ ద్విత్వంబు లై తనరువియుఁ
బూర్ణబిందులు దాపలఁ బొరయనవియుఁ
గలసి యనునాసికప్రాసము లనుకీర
నమ లమరుఁ గావ్యములయందు దమకుఁ దామ. 341

క. మిన్నేలు పాడమున ధాత్ర న్నాభిని గుసుమశరు నుదం గాంచినసీ
సాన్నిధ్యము దొరకుటకై, సన్నుతి సేయుదును నిన్ను సనకాద్యులజా. 342

క. తమ్ములను మల్లికాకుసు, మమ్ముల మరువాదిపత్రమాలికలను భ
క్తి మ్మురసంహరుపుఆజలు, సమ్మదమున సలుపఁ గలుగు సకలార్థంబుల్.

## ప్రాసమైత్రిప్రాసము.

తే. గట్టిబిందువుమీఁదిబకారమునకు, జమిలిమాప్రాసమైత్రి నా జరుగుచుండుఁ
గమ్మతావులు వెదచల్లునంబుజములు, శంబరారాతిచేతివాలమ్ము లనఁగ. ౩౮౬

## ప్రాసవైరము.

తే. కబ్బములు రేఫమునకు అకారమునకు మైత్రిగలుగమిఁ గవిశిఖామణులుప్రాస
వైర మనుచును గలుపరువానినెందుఁ, గూర్తురా రెండునెఱుఁగ కకుకవిజనులు.

## స్వవర్గజప్రాసము.

తే. గ్రంథమంథశబ్దంబులఁ గలద్వితీయ, వర్ణములు రెండునున ఘోషవర్ణము లగు
నైననిజవర్గభవచతుర్థాక్షరములఁ, గలియఁ బ్రాసంబులనుస్వవర్గజములనఁగ.

వ. శ్రన్థగ్రన్థసన్దర్భే యనుధాతువువలనను శాబ్దప్రవీణయో ర్గ్రన్థఃఅని నా
మలింగాను శాసనమునందు నానార్థవర్గములోపలను థవర్గ ద్వితీయాంతముల
యందే అమరసింహుఁడు చెప్పుటచేతను గ్రంథిశబ్దము తనయందు రెండవ
ద్రాయి తవర్గమునందు ద్వితీయాక్షర మైనను ప్రాసములయందుఁ జతుర్థాక్ష
రములకు మహాకవిప్రయోగములు గలుగుటం జేసి చెల్లును. ౩౮౭

ఆరణ్యపర్వమునందు:—

ఉ. అంధకవృష్ణిభోజకుకురాన్వయభూపతు లెల్ల నీదెసఁ
బాంధవసౌహృదప్రణయభక్తివిశేషము లొప్ప నీమనో
గ్రంథి యడంగఁ జేయునెసకంబునఁ బూనినవారు లోభమో
హాంధులు ధార్తరాష్ట్రులు నయమ్మ మియి న్మన కర్వి యిత్తురే. ౩౮౮

విరాటపర్వమునందు:—

ఉ. బాంధవశాత్రవా కలితభావభవా భవపాశబంధసం
బంధవిరామకామపరిపక్వవివేకనిరూఢభక్తహృ
ద్గ్రంథివిభేదనా పరమకారుణికా పరిమాణదూర దుః
ఖేంధనపావకాయితసమీక్షణశైత్యమహాఋభుతాత్మకా. ౩౮౯

వ. మంథ విలోడనే యనుధాతువు కవికల్పద్రుమమునందుఁ దవర్గద్వితీయాంత ధా
తువులలోను బరిగణిత మైనది గనుక మంథరశబ్దములోని రెండవవ్రాయి తవ
ర్గమునందు ద్వితీయాక్షర మైనను ప్రాసములపట్లను బూర్వకవిప్రయోగములు
గలుగుటచేతను జతుర్థవర్ణములకుఁ జెప్ప వచ్చును. ౩౯౦

ద్రోణపర్వమునందు:—

క. సింధురము మదోద్రేకమ, దాంధం బై వచ్చునోజ నాచార్యునిపై
గంధవహసుతుఁడు గవయఁగ, మంథరగతి నెవ్వఁ డాఁగుమనయోధులలోన్.

ఆముక్తమాల్యదయందు:—

ఉ. కంధరనీలవర్ణ మధుకైటభనాగసువర్ణ యోగిహృ
ద్గ్రంథివిభేదకోత్థభోగివనితాస్వనవచ్ఛ్వసనస్రవచ్ఛర
త్సింధువసన్నిశాపతిరసస్రుతిమగ్నపయోధివీచికా
మంథరకేళికాధర సమాశ్రితసజ్జ్యశిరోధసోదరా. 351

వ. బుధ ఆవగమనే అనుధాతువునలనను బుధశబ్దములోని రెండవవ్రాయి తవర్గ మునందుఁ జతుర్థాక్షర మైనను వ్రాసినచో పట్లను బూర్వకవిప్రయోగములు క లుగుటచేతను తృతీయవర్ణమునకుఁ జెప్ప వచ్చును సుధాశబ్దము మొద లైనవా నికిని నిటువలెనే యని తెలిసికొనునది. 353

ఆదిపర్వమునందు:—

ఉ. కాదన కిట్టిపాటియపకారము తక్షకుఁ డేకవిప్రసం
బోధనఁ జేసి చేసె నృపపుంగవ నీవు ననేకభూసురా
పాదితసర్పయాగమున భస్మము సేయుము తక్షకాదికా
కోదరసంహతిన్ హుతవహాగ్రమహాగ్రశిఖాచయంబులన్. 354

నృసింహపురాణమునందు:—

క. వేదము లాదిగఁ గలయ, ష్టాదశవిద్యలకు నీవ స్రష్టవు తత్త
ద్బోధకులును భవదాజ్ఞా, పాదకులు సమస్తధర్మపాలనచతురా. 355

విరాటపర్వమునందు:—

క. మొద మొదవ రమ్యహర్మ్యమ్ము, తుది నిలువున నిష్టసఖులతోడ విహారా
స్పద మగునెలవున మలఁగెడు, సుధేష్ణ తజ్జాలకములఁ జూచెం బ్రీతిన్.

ద్రోణపర్వమునందు:—

క. మిధ్యాద్రిపోలె నాప్రతి, వింధ్యాచలితోగ్రమూర్తి వెలయ నిలిచి గ
ర్వాంధ్య మలరఁగను దీప్తా, సంధ్యాభ్రము లక్కుమారవరుపైఁ జలుఁకెన్.

విరాటపర్వమునందు:—

ఉ. ఎండకు వాన కోర్చి తనయిల్లు ప్రవాసపుచోటనాకనా
కొండ నలంగుచు న్నిసురకుం దటి దప్పెను దప్పి వుట్టె నా

క్కుండను నెట్లకో యనకఁ గార్యము గల్గినవేళ నేలినా
తండొకచాయఁ జూపినను దత్పరతం బని సేయ టొప్పగున్. ౩౫౯

## ఋప్రాసము.

తే. స్వరము లెల్లను బ్రకృతిభావంబులందు, రావెనుక వ్రాలయగుఋస్వరంబొకండు
తగుయణాదేశమున రేఫ మగుటఁ జేసె, ప్రాసముల కట్లు యగు వళి పట్లగాదు.

క. ధారుణి ఋప్రాస మనం, గా రేఫాక్షరమునకు ఋకారము చెల్లున్
నారికి నై నాకకుజం, బాఋభుపతిఁ గెలిచి తెచ్చె నచ్యుతుఁ డనఁగన్.

ఆరణ్యపర్వమునందు:—

క. ఆఋషిపుత్త్రుఁడు గట్టిన, చీరలు మృదులములు నవ్యశిష్టములు మనో
హరులు నాతనిపృథుకటి, ధారంబున నొక్కకనకపట్టము వ్రేలున్. ౩౬౧

## లఘుయకారప్రాసము.

తే. ప్రకృతిభావంబుఁ జెందినప్రాణములకు
మొదలియంతస్థములు ప్రాసములకు నిలుచు
నలమలలు లేక లఘుయకారాహ్వయములు
నాయజునితండ్రి ఫణిరాజశాయి యనఁగ.

కళాపూర్ణోదయమునందు:—

ఉ. ఏయెడ నెన్నఁడుం గననియింపులు గుల్కెడుగద్గదస్వనం
బాయత మైనకౌతుకము నద్భుతము న్మొలపింప నెయ్య దె
ద్దీ యిది చాలఁ గ్రొత్త బళి యింకొకమాటిఁక నొక్కమాటటం
చాయలినీలవేణి నలకాధిపసూనుఁడు వేఁడె వేఁడినన్. ౩౬౩

## అభేదప్రాసము.

తే. రేఫమునకుఁ బైనుండుమాతృకకుఁ బెద్ద, లాయభేదాహ్వయప్రాస మైయెసంగు
ఖలజనవిపక్ష జలరుహదళనిభాక్ష, కాళియోరగమదదమనకేళి యనఁగ. ౩౬౪

రాజశేఖరునిచరిత్రమునందు:—

శా. కేళీకాంచనసౌధవీథికలచక్కిన్ దొట్లలోఁ బెట్టి యో
ప్రాలేయాచలకన్యకాధవకృపాపారంగతా నిద్ర వో
వే లావణ్యపయోనిధీ యనుచు నావిర్భూతమోదంబులో
జోలల్పాడుదు రక్కుమారకునకున్ శుద్ధాంతకాంతామణుల్. ౩౬౫

రామాభ్యుదయమునందు:—

ఉ. పాలును నీరు నేలుపలుపంగలమావుల వేదవీధి వా
హ్యాళి యొనర్చు నేయలికులాలక తా సితవర్ణ యయ్యు నే
బాల సువర్ణదేహమున భాసిలు నానలుమోములేల్పుప్రో
యాలు ప్రవీణ మామకమహాకృతినాథుఁ గృతార్థుఁ జేయుతన్. ౩౬౯

తే. పెద్దలాకును దనకు నభేద మగుట, లశలకు నభేద మట్లును గలుగుకతన
ఝిశినిమాఁడవసరళలబయులుఁ బ్రాస, ములనులఘ్వలఘులకారములకు నిలుచు.

పరిభావతీపరిణయమునందు:—

క. జలనిధి యను తెరమఱుఁగటు, వెడలి నిలిచినట్టియాటవెలఁదియపోలెన్
గడు నింపులు గులుకుచుఁ దన, రెసు నీపురలక్ష్మి యవధరించితె యధిపా.

ఉద్యోగపర్వమునందు:—

క. కొడుకులు దమ్ములు గుఱ్ఱపు, దళములు కరిఘటలు భటరథవ్రాతములుం
బుడమిచలింపఁగ ద్రుపదుఁడు, గడువేడుకఁ దోడుసూపెఁ గౌంతేయులకున్.

భీష్మపర్వము:—

క. కొడుకులు దమ్ములు గుఱ్ఱఁపు, దళములు పెక్కైనబలవితానము తగుమై
నడిపించుచు మెలపున సం, గడములతో నడుచు శకుని కడు నొప్పారెన్.

శృంగారనైషధమునందు:—

చ. చిలుకలు గూయనో చెవులు చిల్లులు వోవఁగ నంచు నెన్నఁడు
న్వెడలఁడు నందనోపవనవీథులకై యట మాళిభాగని
ర్మలశశిరేఖ చేయునపరాధమునక్క గజదైత్యశాసనుం
గొలువఁడు పాకశాసనుఁడు కోవలి నీదెసఁ గూర్కి యొట్టినో

కూర్మపురాణమునందుఁ దోటకవృత్తము:—

తాలిమి చూలినతాపసపత్నుల్, క్రీడమనంబున వీక్షించి బాలున్
లోలమదాలసలోచనపఙ్క్తుల్, బాలఁ దలిర్చిరి శంకరులీలన్. ౩౭౦

సంధిగతప్రాసము.

తే. సంధిఁ గూడినవ్రాలు ప్రాసంబు లైన, నవియె సంధిగతాఖ్యల నమరుచుండు
దివిజు లాశ్చర్య మొంద శౌరి వడవైచె, జెంగి పోనీక మధురలోనం గరి నన.

శల్యపర్వమునందు:—

క. కవదొనలును గాండీవము, నవల నిడం బనుపు మంద రరదము డిగు మే
ను * విడప డిగియెద శుభకర, మవు నిప్పిధ మిట్లు సేయు మనుడు నతండున్.

ఇవి యన్నియుఁ గలయఁగూడిన సర్వసమవృత్తసంఖ్య యగును.

## ఉక్తాప్రభృతిచ్ఛందోజాత వృత్తసంఖ్యావివేకము.

ప్రథమచ్ఛందం బగునుక్త మొదలుకొని చతుర్థచ్ఛందమువద్దికి నీలాగుఛందములయందుఁ బుట్టినసమవృత్తము లన్నియు నెన్నియాయె నని యడుగ సరిచెప్పెడువిధము.

## నాలవఛందమువృత్తసంఖ్య.




పదునాఱుసమవృత్తములు పుట్టెను.

ఈవృత్తసంఖ్య యినుమడింప ముప్పదిరెండయ్యె నందులో రెండువృచ్చిన ముప్పదిగాన నుక్తనుండి ప్రతిష్ఠవద్దికి నాలుగుఛందములయందును ౩౦ సమవృత్తములు పుట్టె ననునది. ఏఛందమువద్దికడిగిన నిటువలెనే చూచునది. వెరసువేసి కూడినను సరే. ౧౫౯

## సర్వవృత్తసంఖ్య.

ఇరువదియాఱుఛందములయందు నెన్నిసమవృత్తములు పుట్టెనన సరిచెప్పెడు విధము. ఈయుత్కృతిచ్ఛందమువృత్తసంఖ్య మునుపటివలె ద్విగుణించి రెండుతివిచి పైచిన ౧౩౪౨౧౭౭౨౬ అయ్యెఁ గాన నిరువదాఱుఛందములయం దిన్నిసమవృత్తములు పుట్టెనని చెప్పనవి వెరసువేసి కూడిననుసరి. ౧౬౦

## వృత్తప్రస్తారవిధము.

నాలవఛందం బగుప్రతిష్ఠయందుఁ బుట్టినసమవృత్తంబుల కేయేగణంబు లని యడుగ సరిచెప్పెడువిధము.



౧ మగము
౨ యగము
౩ రగము
౪ సగము
౫ తగము
౬ జగము
౭ భగము
౮ నగము



౯ మలఘువు
౧౦ యలము
౧౧ రలము
౧౨ సలము
౧౩ తలము
౧౪ జలము
౧౫ భలము
౧౬ నలము

ఇవియన్నియు నష్టాంతులుగాఁ జేసి యాయాబంతి సమవృత్తమునకు నాయాగణంబులననవి నాలుగుపాదములకును నాగణములే యని చెప్పనది. ఏఛందమునను నిటువలెనే వ్రాయనది.

## ద్విగుణప్రిస్తారలేఖనక్రిమము.

### మూఁడవఛందమునకుఁ బ్రస్తారద్విగుణము.

| | | | |
|---|---|---|---|
| UUU మగణము | ౧ | UUU మగణము | ౧ |
| \|UU యగణము | ౨ | \|UU యగణము | ౨ |
| U\|U రగణము | ౩ | U\|U రగణము | ౩ |
| \|\|U సగణము | ౪ | \|\|U సగణము | ౪ |
| UU\| తగణము | ౫ | UU\| తగణము | ౫ |
| \|U\| జగణము | ౬ | \|U\| జగణము | ౬ |
| U\|\| భగణము | ౭ | U\|\| భగణము | ౭ |
| \|\|\| నగణము | ౮ | \|\|\| నగణము | ౮ |

ఈమూఁడవఛందము నాలనయదిగాఁ బ్రస్తరించువిధము. ఒకప్రతికడ గురువులు లఘువులును వ్రాయునవి.ఏచందమున కడిగినను నిటువలెనే వ్రాయనది.




## నష్టవృత్తప్రిస్తారము.

ఆఱవఛందమున నలువదినాలవసమవృత్తమునకు నేయేగణము లనియడుగ సరిచెప్పెడువిధము వారు నలువదినాలనదియడిగిరి గనుక సరిలెక్కగాన నవి యర్థించి లఘువుపెట్టునది నిలిచినయిరువదిరెండును సరిగాన నవి యర్థించి లఘు వుంచునది చిక్కినపదునొకొండును బేసిగనుక మఱియొకటి కలయఁగూడి పండ్రెండు చేసి యర్థించి గురువు పెట్టునది మిగిలినయాఱును సరిగాన నవి యర్థించి లఘువు పెట్టునది. ఉన్నమూఁడును బేసిగనుక మఱియొకటిగూర్చి నాల్గుచేసి యవి యర్థించి గురువు పెట్టునది కడమ రెండును సరిగనుక నవి యర్థించి లఘువు పెట్టునది వారాఱవఛందమున కడిగిరి గనుక గురులఘువు లాఱయినఁ జాలింపవలయు. ఏవృత్తమడిగినను నిటువలెనే సరిచెప్పవలయును.

౧౬

## ఆఱవఛందమునకుఁ బ్రస్తారము.

| | | | |
|---|---|---|---|
| ∪ ∪ ∪ ∪ ∪ ∪ | ౧ | ∪ I I ∪ I ∪ | ౨౩ |
| I ∪ ∪ ∪ ∪ ∪ | ౨ | I I I I ∪ I ∪ | ౨౪ |
| ∪ I ∪ ∪ ∪ ∪ | ౩ | ∪ ∪ ∪ I I I | ౨౫ |
| I I ∪ ∪ ∪ ∪ | ౪ | I ∪ ∪ I I ∪ | ౨౬ |
| ∪ ∪ I ∪ ∪ ∪ | ౫ | ∪ I ∪ I I ∪ | ౨౭ |
| I ∪ I ∪ ∪ ∪ | ౬ | I I ∪ I I ∪ | ౨౮ |
| ∪ I I ∪ ∪ ∪ | ౭ | ∪ ∪ I I I ∪ | ౨౯ |
| I I I ∪ ∪ ∪ | ౮ | I ∪ I I I ∪ | ౩౦ |
| ∪ ∪ ∪ I ∪ ∪ | ౯ | ∪ I I I I ∪ | ౩౧ |
| I ∪ ∪ I ∪ ∪ | ౧౦ | I I I I I I ∪ | ౩౨ |
| ∪ I ∪ I ∪ ∪ | ౧౧ | ∪ ∪ ∪ ∪ ∪ I | ౩౩ |
| I I ∪ I ∪ ∪ | ౧౨ | I ∪ ∪ ∪ ∪ I | ౩౪ |
| ∪ ∪ I I ∪ ∪ | ౧౩ | ∪ I ∪ ∪ ∪ I | ౩౫ |
| I ∪ I I ∪ ∪ | ౧౪ | I I ∪ ∪ ∪ I | ౩౬ |
| ∪ I I I ∪ ∪ | ౧౫ | ∪ ∪ I ∪ ∪ I | ౩౭ |
| I I I I ∪ ∪ | ౧౬ | I ∪ I ∪ ∪ I | ౩౮ |
| ∪ ∪ ∪ ∪ I ∪ | ౧౭ | ∪ I I ∪ ∪ I | ౩౯ |
| I ∪ ∪ ∪ I ∪ | ౧౮ | I I I ∪ ∪ I | ౪౦ |
| ∪ I ∪ ∪ I ∪ | ౧౯ | ∪ ∪ ∪ I ∪ I | ౪౧ |
| I I ∪ ∪ I ∪ | ౨౦ | I ∪ ∪ I ∪ I | ౪౨ |
| ∪ ∪ I ∪ I ∪ | ౨౧ | ∪ I ∪ I ∪ I | ౪౩ |
| I ∪ I ∪ I ∪ | ౨౨ | I I ∪ I ∪ I | ౪౪ |

ప్రస్తరించినను సగణజగణములే యాయెను.

### ఉద్దిష్టవృత్తనిర్ణయము.

∪ ∪ I ∪ ∪ I ∪

౧ ౩ ౬

౧ ౨ ౪ ౮ ౬ ౨ ౪

౪
౩౨
౩౬
౧
౩౭

ఇది యెన్నవఛందమునఁ బుట్టినది. ఆఛందమునను దెన్నవసమవృత్తమని య డుగసరిచెప్పెడువిధము. వారు వ్రాసినగురులఘువులక్రిందినవరుసవెంబడిని ఏకా దిద్విగుణితముగా వ్రాసినలెక్కలలో లఘువులక్రిందిలెక్కలన్నియు వెరుసువేసి వా నిక్రింద మఱొకటిపెట్టి కలయఁగూడ ముప్పదియేడయ్యెఁ గాన నన్నవసమవృత్తము నునది వారు పైచినగురులఘువులు లెక్కింప నేడు ఆయెనుగనుక నేడవఛందము నను బుట్టినది యనునది. ౧౬౪

## సప్తమచ్ఛందః ప్రస్తారము.

| సంఖ్య | ప్రస్తారము |
|---|---|
| ౧ | U U U U U U U |
| ౨ | I U U U U U U |
| ౩ | U I U U U U U |
| ౪ | I I U U U U U |
| ౫ | U U I U U U U |
| ౬ | U I I U U U U |
| ౭ | I I I U U U U |
| ౮ | U U U I U U U |
| ౯ | I U U I U U U |
| ౧౦ | U I U I U U U |
| ౧౧ | I I U I U U U |
| ౧౨ | U U I I U U U |
| ౧౩ | I U I I U U U |
| ౧౪ | U I I I U U U |
| ౧౫ | I I I I U U U |
| ౧౬ | U U U U I U U |
| ౧౭ | I U U U I U U |
| ౧౮ | U I U U I U U |

| ప్రస్తారము | సంఖ్య |
|---|---|
| I I U U I U U | ౧౯ |
| U U I U I U U | ౨౦ |
| I U I U I U U | ౨౧ |
| U I I U I U U | ౨౨ |
| I I I U I U U | ౨౩ |
| U U U I I U U | ౨౪ |
| I U U I I U U | ౨౫ |
| U I U I I U U | ౨౬ |
| I I U I I U U | ౨౭ |
| U U I I I U U | ౨౮ |
| I U I I I U U | ౨౯ |
| U I I I I U U | ౩౦ |
| I I I I I U U | ౩౧ |
| U U U U U I U | ౩౨ |
| I U U U U I U | ౩౩ |
| U I U U U I U | ౩౪ |
| I I U U U I U | ౩౫ |
| U U I U U I U | ౩౬ |

ప్రస్తరించినను రెండుతగణములు నొకగురువునాయెను.

## మేరుచక్రోద్ధారణము.

నాలవ ఛందమున నెన్నెసిలఘువుల వృత్తము లెన్నెన్ని పుట్టెననఁగా సరిచె ప్పెడువిధము వీశివీధి యొక్కొక్కఛందము గనుక నీచక్రమునకు నాలుగడ్డచాళ్లు గాననాలవఛందముపర్యంతమాయెను దీని నాలుగవబంతి చూచి చెప్పునది.




నాలవబంతిమొదలింటి వొకటియు సర్వగురువృత్తము, రెండవయింటినాలుగును నొంటిలఘువృత్తములు. మూఁడవయింటియాఱును రెండేసిలఘువులవృత్తములు. నాలవయింటి నాలుగును మూఁడేసిలఘువులవృత్తములు. కడపలియింటివొక్కటియు నాలుగులఘువులసర్వలఘువులవృత్తము. ౧౬౬

శకటచక్రోద్ధారణము.

ప్రతిష్ఠాఛందమునందు నెన్నేసిలఘువులవృత్తము లెన్నవగునెన్నవయవి యనియడుగ సరి చెప్పెడువిధము. ౧౬౭




ఈచక్రమునందు మీఁదియింటి వొకటియు నాలుగుగురువులసర్వగురువృత్తము రెండవయడ్డవీథి నున్న ౨ వది ౩ వది ౫ వది ౯ వదియు నొంటిలఘు వృత్తములు ౩ వ చాలువనున్న ౪ వది ౭ వది ౧౩ వది ౬ వది ౧౧ వది ౧౦ వదియు రెండేసిలఘువులవి నాలుగవబంతి నున్న ౮ వది ౧౫ వది ౧౪ వది ౧౨ వదిమూఁడేసిలఘువులవృత్తములు కడపటి ౧౬ వది యొక్కటియు నాలుగులఘువుల సర్వలఘువృత్తము. ౧౬౮

## పద్యలక్ష్యోపయోగిసంజ్ఞలు.

ఉక్తాఛందం బాద్యక్షరంబుననుండి యొంటొంటికి వచ్చునక్షరంబు షడ్వింశాక్షరపర్యంతంబుగా జరుగు నంచు నుక్తకుఁ బ్రతిపాద మేకాక్షరం బౌను. ౧౬౯

| | ఛందస్సంజ్ఞలు, | వృత్తసంఖ్యలు. |
|---|---|---|
| ౧ | శ్రీవృత్తము | ౧ |
| ౨ | స్త్రీవృత్తము | ౨ |
| ౩ | నారీవృత్తము | ౩ |
| | మృగీ | ౪ |
| | వినయ | ౫ |
| ౪ | కన్యా | ౬ |
| | క్రీడా | ౭ |
| | సుకాంతి | ౮ |
| | బింబ | ౯ |
| ౫ | ప్రీతి | ౧౦ |
| | ప్రగుణా | ౧౧ |
| | సతీ | ౧౨ |
| | పఙ్క్తి | ౧౩ |
| | నందా | ౧౪ |
| | అంబుజ | ౧౫ |
| ౬ | సావిత్రీ | ౧౬ |
| | విచిత్ర | ౧౭ |
| | తనుమధ్యా | ౧౮ |
| | చంద్రవదనా | ౧౯ |
| | శశివదనా | ౨౦ |
| | సురలతా | ౨౧ |
| | వసుధా | ౨౨ |
| | వసుమతీ | ౨౩ |
| ౭ | లోలా | ౨౪ |
| | హంసమాలా | ౨౫ |
| | మదరేఖా | ౨౬ |
| | కుమారలలితా | ౨౭ |
| | సరసిజ | ౨౮ |
| | విభూతి | ౨౯ |
| | మధుమతీ | ౩౦ |
| | మదనవిలసిత | ౩౧ |
| ౮ | విద్యున్మాలా | ౩౨ |
| | వితాన | ౩౩ |
| | విమాన | ౩౪ |
| | సింహరేఖా | ౩౫ |
| | చిత్రపద | ౩౬ |
| | హంసరుత | ౩౭ |
| | నారాచ | ౩౮ |
| | ప్రమాణికా | ౩౯ |
| | నాగర | ౪౦ |
| | మాణవక | ౪౧ |
| | సమానీ | ౪౨ |
| ౯ | భుజగశిశురుత | ౪౩ |
| | ఉత్సుక | ౪౪ |
| | భద్రకర | ౪౫ |
| | హలముఖీ | ౪౬ |
| ౧౦ | పణవ | ౪౭ |
| | మయూరసారి<br>దీనిపేరే మయూరభాషిణి | ౪౮ |
| | రసాలివృత్తము | ౪౯ |
| | రుక్మవతీ | ౫౦ |
| | చంపకమాలీ | ౫౧ |
| | మణిరంగ | ౫౨ |
| | మత్తా<br>దీనిపేరే హంసశ్రేణి | ౫౩ |
| | కౌముదీ | ౫౪ |
| | భోగివిలసిత<br>దీనిపేరే విలసిత | ౫౫ |

| | | |
|---|---|---|
| | మనోరమా | ౫౬ |
| | శుద్ధవిరాటీ | ౫౭ |
| | నందినీ | ౫౮ |
| | పఙ్క్తి | ౫౯ |
| ౧౧ | ఇంద్రవజ్ర | ౬౦ |
| | ఉపేంద్రవజ్రా | ౬౧ |
| | ఉపస్థిత | ౬౨ |
| | దోధక | ౬౩ |
| | రథోద్ధత } దీపికేరే పరాంతిక | ౬౪ |
| | భద్రక | ౬౫ |
| | స్వాగత | ౬౬ |
| | కాంతి | ౬౭ |
| | శ్యేనీ | ౬౮ |
| | వాతోర్మి | ౬౯ |
| | కలితాంత } దీపికేరేగీతాలంబన | ౭౦ |
| | శాలినీవృత్తము | ౭౧ |
| | సుముఖీ | ౭౨ |
| | భ్రమరవిలసిత | ౭౩ |
| | వృత్తా | ౭౪ |
| | పృథ్వీ | ౭౫ |
| | వృంతా | ౭౬ |
| | మౌక్తికమాలా | ౭౭ |
| | ఉపస్థిత | ౭౮ |
| | శిఖండిరుత | ౭౯ |
| | స్త్రీ | ౮౦ |
| | ఏకరూపా | ౮౧ |
| | చంద్రికా | ౮౨ |
| ౧౨ | స్రగ్విణీ | ౮౩ |
| | భుజంగప్రయాత | ౮౪ |
| | తోటక | ౮౫ |
| | జలధరమాలా | ౮౬ |

| | | |
|---|---|---|
| | వంశస్థ | ౮౭ |
| | ఇంద్రవంశ | ౮౮ |
| | ద్రుతవిలంబిత | ౮౯ |
| | తోదక | ౯౦ |
| | తామరస | ౯౧ |
| | ప్రియంవదా | ౯౨ |
| | ప్రమితాక్షర | ౯౩ |
| | జలోద్ధతగతి | ౯౪ |
| | విశ్వదేవీ | ౯౫ |
| | చంద్రవర్త్మ | ౯౬ |
| | ప్రహేయ | ౯౭ |
| | ప్రముదితవదనా | ౯౮ |
| | కుసుమవిచిత్ర | ౯౯ |
| | మణిమాలా | ౧౦౦ |
| | మేఘవిలసిత | ౧౦౧ |
| ౧౩ | మత్తమయూర | ౧౦౨ |
| | ప్రహర్షిణీ | ౧౦౩ |
| | ప్రభాత | ౧౦౪ |
| | జలద | ౧౦౫ |
| | మంజుభాషిణీ | ౧౦౬ |
| | రుచిర | ౧౦౭ |
| | క్షమా | ౧౦౮ |
| | క్షపా | ౧౦౯ |
| | చంచరీకావలీ | ౧౧౦ |
| | మత్తహంసినీ | ౧౧౧ |
| | సుమంగలీ | ౧౧౨ |
| ౧౪ | వనమయూర | ౧౧౩ |
| | వసంతతిలకా, సింహోన్నత, ఔద్ధర్షిణీ, శోభావతీ, మధుమాధవీ } | ౧౧౪ |
| | భూనుత | ౧౧౫ |

| | | | | |
|---|---|---|---|---|
| | పద్మనాభ | ౧౬౯ | ౨౫ బంధుర | ౧౭౫ |
| | మత్తాక్రీడా | ౧౭౦ | భాస్కరవిలసిత | ౧౭౬ |
| ౨౪ | సరసిజ | ౧౭౧ | ధరణీధరగతి | ౧౭౭ |
| | క్రౌంచపద | ౧౭౨ | ౨౬ భుజంగవిజృంభితా | ౧౭౮ |
| | తన్వీ | ౧౭౩ | వరాహ | ౧౭౯ |
| | అష్టమూర్తి | ౧౭౪ | మంగళమహాశ్రీ | ౧౮౦ |

క. యతిగణనామస్తోత్రము, వితతంబుగ సలిపి గురుల వినుతించి తగన్
యతిగణనామయుతంబులు, పతగధ్వజ తేటపఱుతుఁ బద్యవిధంబుల్. ౧౮౦

క. సమవిషమవృత్తములకు, సముద్రము లనంగఁ దనరి షడ్వింశతిభే
దము లై వేదములకుఁ దా, దములై ఛందంబులొప్పి దము లగు వసుధన్. ౧౮౧

తే. జగతిసమవృత్తమన్న ఛందమునను, సంభవమునొందు నన్నియక్షరములమరఁ
బద. దమునకు హెచ్చునుగొనువలేక, గణములనునాక్కభంగినిగానఁబడును.

ఆ. ఒంటికాలఁ గొంద ఱుండఁ జేసిరి పాద, యాగముతోడ గొంద ఱుండఁ జేసి
రేను సకలవృత్తవృషముల నడిపింతు, నాల్గుపాదముల జనంబువొగడ. ౧౮౩

క. ఒకకాలను రెండడుగులఁ, బ్రకటంబుగ గ్రంథవిస్తరభయంబునఁ బూ
ర్వకవులవలెఁ జెప్పిన లే, ఖకుఁ డొకలిపి వ్రాయఁ దప్పఁ గనఁ దర మగునే.

క. నేను రచించినవృత్తవి, తానములో నాకట రెంటఁ దప్ప డిన వి
ద్యాగతులు కడమపదముల, లో నారసి యతులు గణములును దెలియఁదగున్.

తే. అడుగులకువర్ణములుగొంచెమగుటఁ జేసి, యందుకుక్తాప్రభృతినవచ్ఛందములను
బాడమువృత్తములకు నెల్లవడులులేవు, నాల్గుపదములఁ బ్రాసముల్నడచుఁగాని.

క. గురులఘుగణసంజ్ఞలయు, క్షరములు దీర్ఘంబు లైనఁ జను నవి రెండై
పరువడి సంయుక్తము లై, పరఁగిన నవి రెండు నెన్నఁబడు వెంబడి గాన్.

వ. ప్రథమచ్ఛందం బగునుక్తయందుఁ బ్రతిపాదంబునకు నొక్కొక్కయక్షరం బై రెండువృత్తంబులు వుట్టె నందు శ్రీయనువృత్తము. ౧౮౭

శ్రీవృత్తము

శ్రీ
గో
పా
లా
⏑ గ

పాదంబునకు రెండేసి యక్షరంబులై నాల్గు వృత్తంబులు వుట్టె నందు స్త్రీ వృత్తము......స్త్రీనా
గాసీ
క్ష్మానిం
⏑ ⏑ గను బూనుక్

ద్వితీయచ్ఛందం బగునత్యుక్తయందుఁ బ్రతి

తృతీయచ్ఛందం బగు మధ్యయందుఁ బ్రతి

పాదంబునకుమూఁడేసియక్షరంబులై యెనిమిది వృత్తంబులు పుట్టె నందు నారీవృత్తము

శ్రీనాథుఁ
నే నెంతుఁ
మా నాప్పం
గా నాదిఁ

UUU నగణము

అందు మృగీవృత్తము

భూమిలో
రా మహీ
ద్ధాము పూఁ
దా మృగిఁ

U I U రగణము
ఇది మూఁడవది

అందు వినయవృత్తము

వినయాం
బనఁగాఁ
జను సా
సనఘా

II U సగణము
ఇది నాలవది

చతుర్థచ్ఛందం బగుప్రతిష్ఠయందుఁ బ్రతి పాదంబునకు నాలుగేసియక్షరంబులై పదియాఱు వృత్తంబులు పుట్టెనందు కన్యావృత్తము

భావింప న్మా
గావా త్రిగ
న్యావృత్తం బీ
కేవ న్బల్కన్

UUU మ U గ
ఇది మొదటిది

అందు క్రీడావృత్తము

యగల్ చెప్పం

దగు క్రీడన్
నగోద్ధర్తా
జగద్భర్తా

I UU య U గ
ఇది రెండవయది

అందు సుకాంతివృత్తము

జకారముం
గకారముం
సుకాంతికిన్
శుకస్తుతా

I U I జ U గ
ఇది యాఱవది

అందు బింబ మనువృత్తము

ఇమ్మహిలోఁ
గ్రమ్మ భగల్
బింబమనం
గంబుధరా

U II భ U గ
ఇది యేడవది

పంచమచ్ఛందంబగుసుప్రతిష్ఠయందుఁ బ్రతిపాదంబునకున్నైదేసియక్షరంబులు ముప్పదిరెండువృత్తంబులు పుట్టెనందు, ప్రీతివృత్తము

ప్రీతిఁ బ్రేషా
స్వీతగద్వంద్వం
బై తగుఁ దైత్యా
రాతి వర్ణింపన్

U U U U U గగ
ఇది మూఁడవవృత్తము

అందు ప్రగుణావృత్తము

ప్రగుణాఖ్యం బా
స్సగుఁ జెప్పంగా
సగగాసక్తిన్
నిగమస్తుత్యా

॥ స ॥ గగము-ఇది ౮వది
అందు సతీవృత్తము
క్షితిం జగాసం
గతిందనర్చున్
గతీసువృత్తం
బతిప్రసిద్ధా
। ॥ గగము-ఇది ౭ వది
అందు పఙ్క్తివృత్తము
ఏకభకారం
బేకగగంబుల్
శ్రీకొను బఙ్క్తిన్
శ్రీకమలాక్షా
॥ భ గగము ఇది ౭ వది
దీనిపేరే సుదతీవృత్తము
అందు నందావృత్తము
దేవస్తుత నం
దావృత్తమునన్
తేవ న్నిలుపం
గా వచ్చుఁ దవల్
। త । వగణము ఇవి ౧౩వది
అందు నంబుజవృత్తము
ఇమ్ముల భకా
రమ్ము లగయు
క్తిం బరఁగుఁ దా
నంబుజమునన్
॥ భ । లగము-ఇవి ౧౫వది
వ. వద్ధ చ్ఛందం బగుగాయత్రియం దుఁ బ్రతిపాదంబునకు నాఱేసి యక్షరం బు లై యఱువదినాల్గు వృత్తంబులువుట్టె నందు సావిత్రీవృత్తమ్ము
గోవిందస్తోత్రంబుల్
దైవారు న్మాయ న్నిక్
సావిత్రీవృత్తంబుల్
గావింపంగా నొప్పున్

మ ఘ
ఇది మొదటిది
అందు విచిత్రవృత్తము
తనర్చె స్వచిత్రం
బనంగా యయా ప్తిన్
ఘనశ్యామగాత్రా
మునిస్తోత్రపాత్రా
। య । య ఇది ౧౦ వది
అందుఁ దనుమధ్యావృత్తము
కామేశలివాసున్
మే మెంతు మనంగన్
స్వామీ తనుమధ్యన్
భూమిన్ దయ లొప్పన్
। త । యగణముఇది ౧౩
అందుఁ జంద్రవదనావృత్తము
చంద్రాననదన్ దే
వేంద్రాదినుతా ని
స్తంద్ర తభయంబుల్
సాంద్రముగఁ జెప్పన్
॥ భ । య-ఇది౧౫ వది
అందు శశివదనావృత్తము
శశివదనాఖ్యన్
విశదము లయ్యెన్
దిశల నయంబుల్
దశముఖవైరీ
। । । న । య, ఇవి ౧౬వది
సురలతావృత్తము
మురహరుఁ దేవే
గురుకుచ నాగా
ధరణి నయంబుల్
సురలత నొప్పున్
।।స। య-ఇవి౧౭వది
అందు వసుధావృత్తము
వసుదేవసుతున్
బొగడింపు మనన్

వసుధాహ్వయ మిం
పెసఁగుఁ గసగలన్
॥ U స। U స - ఇది ౨౭వది
అందు వసుమతీవృత్తము
బృందావనవిహా
రిం దర్శించెద నం
దందు న్వసుమతిం
బొందింతురు తసల్
UU। త।। U స - ఇది ౨౮వది
వ. సప్తమస్థ్థం బగునక్షిక్కునందుఁ బ్రతిపాదంబునకు నేడేసి యక్షరంబులైనూటయిరువది యెనిమిది వృత్తములుపుట్టె నందు లోలావృత్తము.

ధరిత్రీసుతారాతిన్
సరోజాతపత్రాక్షున్
హరిన్ యోగిలన్ లోన్
గరం బొప్ప వర్ణింతున్
।UU య।UU యU గ ఇది ౧౦
అందు హంసమాలావృత్తము
సరగంబుల్ రచింపన్
బరఁగున్ హంసమాలా
నరసింహావతారా
సువిద్వేద్యోదారా.

।। U స U। U ర U గ ఇది ౨౦ వది.

అందు మదరేఖావృత్తము.

గోపాలాఖ్యుఁడు నిచ్చల్, మాపాలం గలఁ డంచున్
రూపింప న్మసగంబుల్, దీపించు న్మదరేఖన్.

UUU మ।। U స U గ ఇది ౨౯ వది.

అందుఁ గుమారలలితావృత్తము.

సుమాయుధనిభాంగా, రమాహృదయనాథా
కుమారలలితావృత్తమొప్పు జసగాప్తిన్.

।U। జ. ।। U స U గ ఇది ౩౦ వది.

అందు సరసిజవృత్తము.

కోరి సరసిజం బిం, పారు భసగయుక్తిన్
నారదనుతిపాత్రా, నీరదనిభగాత్రా.

U।। భ U స U గ ఇది ౩౧ వది.

అందు విభూతివృత్తము.

ఇమ్మహీవ్రజంబులం, దమ్ము న్నరం గకారముల్
గ్రమ్మి యుండునట్టివృత్త మ్మదా విభూతి యౌ.

U।U ర।U। జ U గ ఇది ౩౨ వది.

అందు మధుమతీవృత్తము.

కుధరవైరికడన్, విధుఁడు దాశరథుడున్
మధుమతి న్నవము, న్మథశరీర హరీ.

| | | న U | | భ U గ ఇవి ౫౬ వది.

అందు మదనవిలసితవృత్తము.

పదపడి ననగల్, గదసి వెలసినన్
మదనవిలసితం, బది యమతిలకా.

| | | న | | | U గ ఇవి ౬౪ వది.

వ. అష్టమచ్ఛందం బగు ననుష్టుప్పునందుఁ బ్రతిపాదంబునకు నెనిమిదేసి యక్షరం
బులై యిన్నూటయేఁబదాఱు వృత్తంబులు పుట్టె నందు.

విద్యున్మాలావృత్తము.

శ్రీదేవీధాత్రీప్రాణేశా, యాదిత్యజ్యోత్స్నాదిస్తుత్యా
వేదోద్ధర్తా విద్యున్మాలం, బా ద్రై మాగా ప్రాప్తిం బొల్చున్.

U U U మ U U U మ U U గగము ఇదీ మొదటిది.

అందు వితానవృత్తము.

క్షితి జ్జగాయుక్తంబైనన్, వితానవృత్తం బైయొప్పున్
పితామహాద్యాదిత్యప్ర, స్తుతప్రభావా సర్వేశా.

| U | జ U U U మ U U గగను ఇది ౬ వది.

అందు విమానవృత్తము.

క్షమన్ జతాంతస్థగాయు, క్తమై రచింపం బొసంగున్
విమాన మంభోరుహాక్షా, రథాంగనావాసవక్షా.

| U | జ U U | త U U గగము ఇవి ౩౮ వది.

అందు సింహరేఖావృత్తము.

ద్వారకాపురీవిహారా, మేరుధీరపంచబాణా
కార సింహరేఖకుం జెం, పారు రేఫజల్ గగంబుల్.

U | U ర | U | జ U U గగము ఇది ౮౩ వది.

అందుఁ జిత్రపదవృత్తము.

చిత్రపదం బగువృత్తం, బత్రిమునిస్తుతశౌరీ

స్తోత్రము సేయఁగ నొప్పన్, ధాత్రిని భాగగయుక్తిన్.

∪ || భ ∪ || భ ∪ ∪ గగము ఇది ౫౫ వది.

అందు హంసరుతవృత్తము.

శ్రీవత్సాంకితరువక్షా, దేవా హంసరుత మెందన్
భావింప న్మనగగాప్తిన్, గావింపం దగు ధరిత్రిన్.

∪ ∪ ∪ మ | | | న ∪ ∪ గగము ఇది ౫౭ వది.

అందు నారాచవృత్తము.

క్షీరాబ్ధిఁ న్యకాపతిన్, నారాయణుం బ్రవంబులన్
దోరంబుగా నుతించినన్, నారాచవృత్తమై చనున్.

∪ ∪ | త ∪ | ∪ ర | ∪ వగణము ఇది ౭౫ వది.

అందు నాగరవృత్తము.

బాగమరన్ భరేఫసం, యోగలగంబుల న్మహా
యోగినుతు న్వినంబడున్, నాగరనామవృత్తమై.

∪ || భ ∪ | ∪ ర | ∪ వగణము ఇది ౮౩ వది.

అందు మాణవకవృత్తము.

శోణమయాభ్రప్రవిభా, బాణసుపర్వారిహరా
వేణుధరా భత్వములన్, మాణవకం బై తనరున్.

∪ || భ ∪ ∪ | త | ∪ వగణము ఇది ౧౦౩ వది.

అందు సమానీవృత్తము.

నారదాదిమౌనివర్యుల్, చేరి శౌరిఁ గొల్తు రన్
గోరి రేఫముం జవముల్, ధారుణి న్సమాని కగున్.

∪ | ∪ ర | ∪ | జ | ∪ నగణము ఇది ౧౦౭ వది.

వ. నవమచ్ఛందంబగుబృహతియందుఁ బ్రతిపాదంబునకుఁ దొమ్మిదేసి యక్షరంబులై యేనూటపండ్రెండు వృత్తంబులు పుట్టె నందు.

భుజంగశిశురుతవృత్తము.

నిజమున ననయు లొప్పన్, భుజగశిశురుత మయ్యెన్
సుజనవినుతచరిత్రా, వృజినతృణఘనదాత్రా.

| | | న | | | న | ∪ ∪ యగణము ఇది ౧౨౮ వది.

## అందు దుత్పుకవృత్తము.

వాసవముఖ్యసురస్తుతా, దాసమనోంబుజషట్పదా
వాసిగ ఘారము లొందినన్, భాసిలునుత్పుకవృత్తముల్.

భ భ భ రగణము ఇది ౧౨౩ వది.

## అందు భద్రకవృత్తము.

క్షుద్రవేయశయనా సను, స్క్రద్రదైత్యమదభంజనా
రుద్రమిత్ర రన రేఫముల్, భద్రకంబునకు భాసిలున్.

ర న ర రగణము ఇది ౧౨౭ వది.

## అందు హాలముఖీవృత్తము.

కింకరీకృతసురవరా, పంకజాతదళనయనా
పొంక మా రనసగణముల్, శంక లేక హాలముఖికిన్.

ర న స గణము ఇది ౨౪౧ వది.

ఆ. పఙ్క్తినుండి వృత్తపఙ్క్తికిన్నవర్గాయి, వడియటంచుఁ జెప్పఁబడియెనిచట
సంస్కృతంబునందుఁ జనుఁబడవిచ్ఛేద, మదుగుమొదలివర్ణమగుఁదెనుఁగున.

క. ధర గణితశాస్త్రసంజ్ఞల, శరరసగిరివంతినిధదిశాశంకరధా
స్కరవిశ్వమునుదిక్కోర్వీ, శ్వరనామములు యతివర్ణసంఖ్యారంబుల్.

వ. దశమచ్ఛందం బగుపఙ్క్తియందుఁ బ్రతిపాదంబునకుఁ బదేసియక్షరంబులై వే
యు నిరువదినాల్గువృత్తములు పుట్టె.

## అందుఁ బణవవృత్తము.

ఉర్వివ్యన్వగ యుతపాదంబుల్, పర్వస్వద్యుతిఁ బణవంబయ్యెన్
గీర్వాణాహితగిరినాకేశా, సర్వేశా రవిశతసంకాశా.

మ న య గ ఇది ౧౨౧ వది.

## మాయూరసారివృత్తము.

వెక్కసించెశైల విశ్రమంబు, ల్పొక్కి రేఫజంబులు నగంబుల్
చక్కఁగా మయూరసారి కొప్పున్, నిక్కమంబుజాతనేత్ర శౌరీ.

ర జ ర గ ఇది ౧౩౧వది.

దీనికి రేచుయూరభాషిణీవృత్తము.

## రసాలివృత్తము.

గోత్రవిశ్రమము గూడి భక్తిన్, ధాత్రి రేఫనగణంబు లాప్తైఁ

బోత్రిరూప రగణంను లసాలిం, జిత్రభంగి నుతిసేయనిన్నూర్.

U I U ర I I I న U I U ర U గ ఇది ౧౨౭ వది.

## రుగ్మవతీవృత్తము.

అంగయుతిం బొందై భమస ల్వ, ర్వ్యం గురుయు క్తిం బ్రరుగ్మవతి స్స
త్యాంగనక్రై తేడా సురశాఖిం, బొంగుచు గోపీపుత్రుఁ డనంగా.

U II భ U U U మ II U స U గ ఇది ౧౯౯ వది

## చంపకమాలీవృత్తము.

భూమిధరక్రాంతు ల్పొలుపార, బ్రేమ భమంబు ల్గొని సగంబుల్
దామ నుతించు న్నందసుతు న్భ, వామకరాంకుం జంపకమాలిన్.

U II భ U U U మ II U స U గ ఇది ౧౯౯ వది.

## మణిరంగవృత్తము.

అంగనామణుల్గయుతుల్గా, సంగ మెచ్చ రసా గురుయు క్తిన్
బొంగుచు న్యమపుంగవు వేడ్క, రంగ గుణమణిరంగ మనంగాన్.

U I U ర II U స II U స U గ ఇది ౨౧౫ వది.

## మత్తావృత్తము.

శైలిక్రాంతి న్మభసగ లోలిం, గ్రాల న్మత్తాఖ్యను గనుపట్టున్
జాలించె న్యాదసపతి యాపాం, జాలి గౌరవ్యులసభ నాఁగన్.

U U U మ U I భ II U స U గ. ఇది ౨౪౧ వది.

## దీనికే రేహంసశ్రేణీవృత్తము.

## అందుఁ గౌముదీవృత్తము.

మునిసుతా కౌముదీవృత్త మొ, ప్పను నతాగంబుల న్వద్యతిన్
దునిమెఁ బౌలస్త్య భూపుత్రిక్ర, కినుక రాముఁ క్షితీశుం డనన్.

I I I న U U I త U U I త U గ ఇది ౨౯౬ వది.

## అందు భోగివిలసితవృత్తము.

సాగ భసములున్ జగంబులున్, బాగగు నగవిశ్రమంబులన్
భోగివిలసితంబుఁ జెప్పఁగా, సాగరతనయాసమన్వితా.

U II భ II U స I U I జ U గ ఇది ౩౪౧ వది.

దీనికే రేవిలసితవృత్తము.

అందు మనోరమావృత్తము.

నసజగంబులన్మనోరమల్, సరవి శైలవిశ్రమంబులన్
దురితదూరు సింధుజాపతిన్, సొరిది సన్నుతించు నేతయున్.

।।। న ‿ । ‿ ర । ‿ । జ ‿ గ ఇది ౩౮౪ వది.

అందు శుద్ధవిరాటీవృత్తము.

చాలొప్ప న్మసజ ల్గకారసుక్, గ్రాలున్ శుద్ధవిరాటి పద్యతిన్
నీలాంగా రమణీయశోభవా, నాళీకాసననందనస్తుతా.

‿‿‿ మ ।। ‿ స । ‿ । జ ‿ గ ఇది ౩౮౫ వది.

అందు నందినీవృత్తము.

శ్రీరమణా నిర్జితదానవా, సారసపత్రేక్షణ పద్యతిన్
సారె భతంబుల్జగము ల్గుసన్, ధీరులు చే నందిని నాఁ జనున్.

‿ ।। భ ‿‿ । త । ‿ । జ ‿ గ ఇది ౩౮౬ వది.

అందుఁ బర్హిణీవృత్తము.

గ్రావనిరామము గా విబుధుల్, భావజతంత్రవిశాఖగురుల్
గా వినుతించిన కావ్యములు, న్వావిరిఁ బర్హిణియౌనం బరఁగున్.

‿ ।। భ ‿ ।। భ ‿ ।। భ ‿ గ ఇది ౪౩౭ వది.

వ. ఏకాదశక్షరంబగు త్రిష్టుప్ఛందంబునందుఁ బ్రతిపాదంబునకు బదునొకండేసి యక్షరంబులై ౪౦౪౮ వృత్తంబులు పుట్టెనందు.

ఇంద్రవజ్రావృత్తము.

ఇంతుల్సదా పాదములింద్రవజ్రల్, స్వాంతంబున న్మోహము సంధిలంగన్
దంతావళశ్రాంతి సితా జకార, ప్రాంతంబునం గద్వయ మంద మందన్.

‿‿ । త ‿‿ । త । ‿ । జ ‿‿ గగను ఇది ౩౫౮ వది.

అందు నుపేంద్రవజ్రావృత్తము.

కృపాచరాడు ల్జతజల్గగంబుల్, గ్రపూర్ణమై దంతివిరామ మొప్పన్
ద్విపాధిపత్రాత నుతింపఁ జేరై, యుపేంద్రవజ్రావ్యలయు న్ధరిత్రిన్.

। ‿ । జ ‿‿ । త । ‿ । జ ‿‿ గగము. ఇది ౩౫౯ వది.

అందు నుపస్థితవృత్తము.

భక్తుల్ల్మిమీఁద నుపస్థితం బా, సక్తి స్వరతు ల్యరిసంఖ్య సాగన్

సూక్తుల్గొని చెప్పఁగఁ జోదఁజాగా, యుక్తంబగు మంజులవాణి యనుచుండున్.

UU | త | U | జ | U | జ UU గగము. ఇది ౩౬౫ వది.

అందు దోదకవృత్తము.

తోరపువేడుక దోదక మందున్, భూరివిరామము భూధరసంజ్ఞం

జారువ భాభగగాన్విత మైలన్, శ్రీరమణా విరచింప నెసంగున్.

U | | భ U | | భ | | U | | భ UU గగము. ఇది ౪౩౯ వది.

అందు రథోద్ధతవృత్తము.

అంది రేఫనరవాప్తి నొప్ప గోవింద భూమిధరవిశ్రమంబులన్

జెందె గబ్బములఁ జిత్రభంగిఁ జెన్నొందు నంతయు రథోద్ధతం బిలన్.

U | U ర | | | న U | U ర | U లగము. ఇది ౬౯౯ వది.

దీనిపేరే పరాంతకవృత్తము.

అందు భద్రకవృత్తము.

నరకదమన నారవంబులన్, సరగఁ గుధర సమ్మితంబులై

విరతులమర వేడ్కఁ జెప్పినం, బరఁగుఁ గృతుల భద్రకంబిలన్.

| | | న | | | న U | U ర | U లగము. ఇది ౭౦౪ వది.

అందు స్వాగతవృత్తము.

స్వాగతంబు దగు శైలవిరామం, బై గజేంద్రవరదా రనభంబుల్

పై గురుద్వయము భాసిలఁ జెప్పన్, యోగిమానసపయోజవిలోలా.

U | U ర | | | న U | | భ UU గగము. ఇది ౪౪౩ వది.

అందుఁ శాంతివృత్తము.

శ్రాంతులగ్నిసంఖ్యను రాజిలఁగా, సంతోషముతోడఁ దాఁజాలగముల్

చింతింపఁ బదంబుల జెందు రమా, కాంతాహృదయేశ్వర కాంతియగున్.

UU | త | U | జ | U | జ | U లగము. ఇది ౮౭౭ వది.

అందు శ్యేనీవృత్తము.

మానితాద్రివిశ్రమంబుఁ బూనఁగా, శ్యేనికి న్రజల్వయి న్రవంబులున్

గాని యొండు గూర్పఁ గాదు రుక్మిణీ, ప్రాణనాథ శామ్మెపల్లిమందిరా.

U | U ర | U | జ U | U ర | U వగణము. ఇది ౬౮౩ వది

అందు వాతోర్మివృత్తము.

ఆమోదం బొప్పఁగ వ్యాసాదికవుల్, భూమిభ్రత్క్రాంతులు పొంగారమహీ

భామాప్రాణేశకమ్రభంబుల్ తవలుర్, దా మీవాతోర్మిని, దాపింపు రోగిర్.

U U U మ U ॥ భ U U । త । U వ. ఇది ౧౧౭ వది.

## కలితాంతవృత్తము.

సామోద్భవవిశ్రమ సంయుతమై, వేమాఱు తజాలగ విస్తృతమై
దామోదరదేవుకథ ల్పలుకన్, భూమిం గలితాంతము పూర్ణ మగున్.

U U । త । U । జ । U । జ । U లగము. ఇది ౭౭౭ వది.

దీనికే గీతాలంబనము.

## శాలీనీవృత్తము.

ధీరశ్రేష్ఠు స్సన్నుతింపం గవీంద్రా, ధారం బై ధాత్రిన్ తాగాగణాప్తిన్
దోరంబై భూభృద్యతుల్ సంఘటింపన్, నీరేజాక్షా శాలినీవృత్తమొప్పున్.

U U U మ U U । త U U । త U U గగము. ఇది ౨౭౫ వది.

## సుమ ఖీవృత్తము.

ఖగపతివాహ కపర్దినుతా, మృగపతిమధ్య హితారిహరా
నగవిరమం బొనయంగ నజా, లగములచే జెలఁగు స్సుముఖిల్.

। । । న । U । జ । U । జ । U లగము ఇది ౧౨౦౦ వది.

## భ్రమరవిలసితవృత్తము:

ఏ యుంగ్రింబారయిమగణభస, ల్యా యొక్కం డవ్వలను సలకొనన్
మాయాతీతా భ్రమరవిలసితం, బై యొప్పం దర్కయనుల నలుచున్.

U U U మ U ॥ భ । । । న U వగణము. ఇది ౧౯౨ వది.

## వృత్తావృత్తము.

అనయమను వేదాంగంబు లెప్పన్, దనుజహర నస్తంబు ల్గగంబుల్
కొనఁగొని ధరాభృద్విశ్రమంబుల్, దనరునది వృత్తావృత్తమంచున్.

। । । న । । U స U U । త U U గగము. ఇది ౭౭౭ వది.

## పృథ్వీవృత్తము.

నలినభవనుత నాజలగం, బులు గంయతులం బొందుపడం
బెలుపఁ బలికినఁ బృథ్వీ యనన్, జెలయు నొక సమవృత్తమిలన్.

। । । న । । । న । U । జ । U లగము ఇది ౧౧౨౦ వది.

## వృంతావృత్తము.

నగణయుగము సగణంబు బొందుకన్, గగ మొకటియు జతగాఁ గూడన్

ఖగవిరమములను గల్పింపఁగ, దగుఁ గవులకు వసుధన్వ్యంతల్.

I I I న I I I న I U స U U గగము. ఇది [illegible] వది.

### మౌక్తికమాలావృత్తము.

భక్తజనత్రాత భతనగాసం, యుక్తము లై మౌనియతియుతుల్ సు
వ్యక్తము లై సూక్తు లమరఁ జెప్పన్, మౌక్తికమాలాక్రమము లెసంగున్.

U I I భ U U I త I I I న U U గగము. ఇది ౭౫౯ వది.

### ఉపస్థితవృత్తము, లేక శిఖండివిరుతవృత్తము.

ఉపస్థితమునం జొప్పారుచుండున్, దపస్విపరతు ల్దాకం జకారం
బుపై సతగణం బుల్లద్వయంబున్, గపిధ్వజసఖా కామేపలీశా.

I U I జ I I U స U U I త U U గగము.ఇది ౭౫౬వది.

దీనిపేరే శ్రీవృత్తము.

### ఏకరూపావృత్తము.

ఏపారు గావ్యముల నేకరూపల్, తన్మపుత్రీశుఁ మభజ గాగణంబుల్
ప్రాపించు గుంజరవిరామ మొప్పన్, బాపంబుల్ వాయుటకుఁ బ్రస్తుతింపన్.

U U U మ U I I భ I U I జ U U గగము.ఇది ౩౬౯వది.

### చంద్రికావృత్తము.

అగవరఘన నారీవాస్విశం, బుగఁ గృతులను జెప్పఁ బొందికై
తగ నినినినమంబు దారఁగాఁ, జగతిని నొగ డొందుఁ జంద్రికల్.

I I I న I I I న U I U ర I U లగము.ఇది ౭౦౪ వది.

వ. ద్వాదశచ్ఛందం బగుజగతియందుఁ బ్రతిపాదంబునకుఁ బంద్రెండేసియక్షరంబు
లై ౪౦౯౬ వృత్తంబులు పుట్టె నందు.

### స్రగ్విణీవృత్తము.

కామెపల్లిమహాగ్రామమధ్యంబునన్, భూమిదేవోత్తము ల్పూజసేయంగ నా
స్వామియున్నాఁడనన్ స్రగ్విణిన్ శైలభృ, త్రామయు క్షిపజత్పుష్పఁబగున్ రేఫముల్

U I U ర U I U ర U I U ర U I U ర.ఇది ౧౧౭౧వది.

### భుజంగప్రయాతము.

భజింపన్ సదా కామెపల్లీనివాసున్, బ్రజశ్రీనిటున్ యాదవశ్రేష్ఠు నంచున్
భుజంగప్రయాతాఖ్యముల్నాల్గుయూలన్, గజవ్రాతవిశ్రాంతిగాఁ జెప్పనొప్పన్.

U U య I U U య I U U య I U U య. ఇది ౧౩౬౫వది.

## ప్రమితాక్షరవృత్తము.

ప్రమితాక్షరం బగురుఁ, బద్మజవి, శ్రమ మొప్పమీఱ సజ సాయుత మై
యమునానదీతటవిహార పృథా, ప్రమదాకుమారసఖ భద్రయశా.

IIUస IUIజ IIUస IIUస. ఇది౧౭౪౦వది.

## జలోద్ధతగతివృత్తము.

జలోద్ధతగతిం దిశాగజయతిన్, మెలంగు జసజా సజల్ మెచ్చగ జసల్
ఫలానుభవ కామోపల్లిసిల యూ, ఖలాంబుదసమీర కామజనకా.

IUIజ IIUస IUIజ IIUస. ఇది ౧౭౪౧వది.

## విశ్వదేవీవృత్తము.

శ్రీవత్సాంకా పద్మనాభారిశ్రీకళత్రా, దేవేంద్రస్తోత్రా విశ్వదేవీసమాఖ్యం జెప్పన్
జైవిప్పొంపు న్మాయాగాగావాప్తి దిక్సం, ఖ్యావిశ్రామంబుల్ చోద్యమై యుండఁ

UUUమ UUUమ IUUయ IUUయ. ఇది౧౬౬౬వది.

## చంద్రవర్త్మవృత్తము.

ఇంద్రవంద్య జగదీశ ఘనయశ, స్సాంద్ర కామపలిసద్మ యమవరా
చంద్రవర్త్మ యగు శైలవిరతి ని, స్తంద్ర మై రనభ సంబు లమరినన్.

UIUర IIIన UIIభ IIUస. ఇది ౧౫౭౭వది.

## ప్రహేయవృత్తము.

కరివరమణముల్ గానామయంబుల్, బరఁగ నిలుపఁ జూపట్టుం బ్రహేయం
బురగశయన భోజోర్వీశపుత్రీ, వర పరమకృపావారాశి కృష్ణా.

IIIన IIIన UUUమ IUUయ. ఇది ౧౬౫౬వది.

## ప్రముదితవదనావృత్తము.

మమత నిభవిరామముల్ గూడఁగా, బమిలినరములన్ సదా చెన్నగున్
బ్రముదితవదనల్ రమానాయకా, సుమశరజనకా సుపర్వస్తుతా.

IIIన IIIన UIUర UIUర. ఇది ౧౮౩౭వది.

## కుసుమవిచిత్రవృత్తము.

కుతలములోనం గుసుమవిచిత్రం, బతిశుభదం బై యగయతులన్నం
దతనయ మొప్పన్ నయ లినుమాత్రై, సతతము విద్వజ్జనులు నుతింపన్.

IIIన IUUయ IIIన IUUయ. ఇది ౯౭౬వది.

### మణిమాలావృత్తము.

కామేపలినామ । గ్రామస్థలవాసా, స్వామీ తయకార । ద్వంద్వంబు పొసంగన్
వేమారులమహీభృ। ద్విశ్రాంతులతోడన్, భూమండలిఁ గూర్పం। బొల్చున్మణిమాలల్.

UU|త|UUయUU|త|UUయ. ఇది ౭౮౧వది.

### మేఘవిలసితము.

కాళిందీముఖ । కమలమధుకరా, నాళీకాసన । నతరసచిరతు
ల్గ్రోల న్మేఘుని । లసితముపసరు, న్వాలాయంబు మ । ననసగణములన్.

UUUమ|||న|||న||Uస. ఇది ౫౧౨వది.

వ. త్రయోదశచ్ఛందం బగునతిజగతియందుఁ బ్రతిపాదంబునకుఁ బదుమూఁడేసి
యక్షరంబులై యెనిమిదివేల నూటతొంబదిరెండు వృత్తములు పుట్టె నందు.

### మత్తమయూరవృత్తము.

శ్రీగోపాలా తంగెడ । సీమావనిగేహా, వాగీశాదిస్వర్గి। వాసస్తుతిపాత్రా (దన్
యోగిధ్యేయా మత్తమ। యూరంబునకొప్పన్, నాగశ్రాంతుల్మత్యగ। ణంబుల్సగమొం

UUUమUU|త|UUయ||Uస Uగ. ఇది ౧౬౩౩వది.

### ప్రహర్షిణీవృత్తము.

ధీరుల్ సింధురవిర। తిజ్ఞమనజగంబుల్, సారెంబాదములను। సంఘటించుచుండన్
గ్రూరారిప్రహరున। కుఁబ్రహర్షణుల్పెం, పారంజెప్ప కరుమ। హామదంబుతోడన్.

UUUమ| | |న|U|జU|Uర Uగ. ఇది ౧౮౦౧వది.

### ప్రభాతవృత్తము.

మొనసినభారగ। ముల్ ప్రభాతవృత్తం, బునకుమదేనస। మూహవిశ్రమంబుల్
దనరఁగ నిల్చుఁ బృ। దాకురాజతల్పా, కనకమయాంశుక। కామెపల్లివాసా.

|||న|U|జ|U|జU|Uర Uగ. ఇది ౧౩౯౨వది.

### జలదవృత్తము

బంగరుచుంగుపచ్చడమ । పైఁ గలయా, తంగెడదేశవాసు జల। దంబులచే
తంగడుసన్నుతింపునవ। శారయతిన్, బొంగుచుసారెభర్నభగ। ముల్ గదియన్.

U||భU|Uర|||నU||భUగ. ఇది ౩౪౮౩వది.

### మంజుభాషిణీవృత్తము.

ఉరగాపగాదిహరి । సర్వరాలయా, కరుణాసముద్రపుర। గర్వభంజనా

యిరవొందుచుండుసజ లిబ్బడింపఁబల్కరుగా స్త్రిధాత్రియతి మంజుభాషిణుల్

||‿|స|‿|జ||‿|స|‿|జ‿|గ. ఇది ౧౭౯౫౧వది.

## రుచిరవృత్తము.

గదాధరుఁ జభసజ గంబులన్ గవుల్, సదాశివతాపహయతి సాగుచుండఁగా
ముదంబుతోడ రుచిర మ్రుచింతు రిట్లుదారభక్తిఁ గృతుల సుర్వశాస్త్రలిన్.

|‿|జ|‿||భ||‿|స|‿|జ‿|గము. ఇది ౨౨౦౫౨వది.

## క్షమావృత్తము.

క్రమమునసభవి శ్రాంతినాతాగయు, క్షమగసుకవిస ద్యంబులూహించినక్ష
మను లనఁ బరఁగుం గంజపత్రేక్షణా, సుమశరజనకా శూరవంశోత్తమా.

|||న|||న‿‿|త‿‿|త‿|గ. ఇది ౨౩౬౩౨వది. దీని
పేరే ఉపావృత్తము.

## చంచరీకావళి.

కంబుగ్రీవాసత్యా కామినీప్రాణనాథా, బింబోష్ఠామారాగ లేర్చిభూభృద్యతుల్గాం
చంబాదంత్రి ధాత్రిం జంచరీకావళీనా, మంబాంచుంగావ్యశ్రీమానినీభూమణంబై.

‿‿‿మ‿‿‿మ‿|‿ర‿|‿ర‿గ. ఇది ౧౧౧౯౫వది.

## మత్తహంసినీవృత్తము.

మనోహరాకార మధుదైత్యసంహరా, వినాయకారూఢ విబుధేంద్రవందితా
జనార్దనా జత్స జగుపల్ కుభృద్యతిన్, దనర్చుఁబద్యంబు దగుమత్తహంసినిన్.

|‿|జ‿‿|త|‿|స|‿|జ‿గ. ఇది ౨౨౫౫౦ వది.

## సుమంగలి.

సౌరివిక్ర ధరిత్రిని సుమంగలివృత్తం, బరయంగ సామజ యతిన్ సజసాగల్
తిర మొంద నొప్ప విధపూజితపాదా, బురుహద్వయా ఖర మురాసురవైరీ.

||‿|స|‿|జ||‿|స||‿|స‿|గ ఇది ౫౮౨౦ వది.

వ. చతుర్దశచ్ఛందం బగుశక్వరియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునాలుగేసి యక్షరంబులై ౧౬౩౮౪ వృత్తములు పుట్టె నందు.

## వనమయూరము.

శ్రీకర రథరాధిధర జిష్ణునుత పుణ్యశ్లోక భజసన్నగగలుల్ ద్రుహిణసంఖ్యన్
పోఁకల రమంబుగను చున్వనమయూరా, ఖ్యాకమనువృత్తమిలనంబమగుచుండున్

‿||భ|‿|జ||‿|స|||న‿‿గగము ఇది ౩౭౨౩ వది.

## అందు వసంతతిలకావృత్తము.

శ్రీమేదినీరమణ! సింధుతరంగరంగ, ద్ధామాహితల్ప విన, తాసుతవాహ రాధా
కామా వసంతతిలకం బగు తభజాగగంబుల్, సామ ప్రభూతయతి సాగిధరం జెలంగున్.
U U I త U I I భ I U I జ I U I జ U U గగము ఇది౮వ వడి.
దీనికి పేరే సింహోన్నతము, ఉద్ధర్షిణి, శోభావతి, మధుమాధవి.

## భూనుతవృత్తము.

మున్మురించి రనభాగగముల్ దశవిశ్రాంతంబు భూనుతమునందున మానితమర్త్యా
జాంబనత్యధిప కేశవ సారసనేత్రా, కంబునందకగదాధర ఖండితసాళ్వా.
I U I ర I I I న U I I భ U I I భ U U గగము ఇది౧౦వ వడి.

## అందు సుందరీవృత్తము.

సూరిజనప్రకరంబు సుందరి నెన్నఁగా, భారసవంబులు రత్నభాసితవిశ్రమా
ధారముగాఁ దనరారుఁ దార్క్ష్యతురంగమా, శౌరి ముకుంద మునీంద్ర సన్నుత కేశవా.
U I I భ U I I భ U I U ర I I U స U వగణము ఇది౧౦వ వడి.

## ప్రహరణకలిత.

పనిగొను నెప్పుడు ప్రహరణకలితన్, ననభనవలు మంతదగ విరమమున్
ఘననిభఘువ విగ్రహ బకమురమ, ర్దన మధునరక ప్రహరణకలితా.
I I I న I I I న U I I భ I I I న I U వగణము. ఇది౮వ వడి.

## నవనందినీవృత్తము.

నవనందినిన్ సజగణస్నగగ లారన్, నవవిశ్రమంబును దనర్చెలు వోప్పన్
నవనీతచోరకుజ నార్దనను పేంద్రన్, భవహారు నెంతురు సభాసదులు భక్తిన్.
I I U స I U I జ I I U స I I I న U U గగము. ఇది౧౦వ వడి.

## అందు నపరాజితము.

ననరసలగ లొందిన న్నవవిశ్రమం, బును గలిగి కవీంద్రభూషిత మై జనా
ర్దన నిగమసుగోచ రా యపరాజితం, బనఁగఁ దనరు శ్రావ్య మైననవారిజన్.
I I I న I I I న U I U ర I I U స U వగణము. ఇది౧౦వ వడి.

## అందు నసంబాధ.

వాలాయంబున్ సత్కవిజనములు వాక్రువ్వన్
వాలారున్ గోవింద వరద ధ్రువవాత్సల్యా

కాళిందీప్రాణేశ మతనసగ • గప్రాప్తిఁ
బాలాఖ్యస్వద్విశ్రమమునను సౌ • సంబాధల్.

U U U మ U U త । । । న । । U స U U గగము. ఇవి ౧౦౧౧౬వది.

## అందుఁగమలవిలసితవృత్తము.

క్రమమున ననననగగగమలు గూడన్, గమలవిలసితము • కమలజవిశ్రా
మము జగతిని నగు, మహితచరిత్రా, కమలదళనయన • కడుఁ బొగడొందన్.

। । । న । । । న । । । న । । । న U U గగము. ఇది ౮౦౭౨వది.

వ. పంచదశచ్ఛందంబగునతిశక్వరియందుఁ బ్రతిపాదంబునకుఁ బదియే నేసియక్షరంబులై ౩౨౭౬౮ వృత్తంబులు పుట్టె నందు.

## మాలినీవృత్తము.

కనకకశిపుహర్త • గానలోలుఁ డభాంగుఁ
డనుజహరణదక్షుఁడు • ధర్మమార్గానుసారిన్
మనసిజగురు నెంతున్ • మాలినీవృత్త మందున్
ననమయయగణంబుల్ • నందివిశ్రాంతి గూడన్.

। । । న । । । న U U U మ । U U య । U U య - నదిఁటయతి. ౪౬౭౨వది.

## అందును కేసరము.

సురుచిరధర్మమూల మగు • సొంపు మీఱు నా, గిరిధర నాభిపంకజుఁడు • కేసరంబువై
ఖరి నజభ జము ల్గదియుఁ • గల్పనంబునన్, గిరిశవిరామసంగతి సు, కేసరంబునన్.

। । । న । U । జ U । । భ । U । జ U । U ర - ౧౧డింట యతి. ఇది ౧౨౨౦౩ దీని పేరేభద్రకము.

## అందు మనోజ్ఞ.

అజమృడవాసవసంత • తార్చితపాదుఁడు
కజయుగళుఁడు హరి నిల్వు • కారు మనోజ్ఞ నా
బుజ నగుపృత్తమునందుఁ • బ్రీతి నుతింపఁగా
ననజజభరంబులు వొల్చు • నచ్చిన దిగ్యతిన్.

। । । న । U । జ । U । జ U । । భ U । U ర. ఇది ౧౩౨౬౧వది. యతి ౧౧.

## అందు మణిభూషణము.

పిలతమైనమణిభూషణ • వృత్తమునందు న
త్యంతమోదమున నెన్నుడు • నద్దశవిశ్రమా

క్రాంత మయ్యు రసధారలఁ । గంజదళాక్షుఁ గం
సాంతకు న్నరకసంహరు । నార్యసమూహము ల్.

U | U ర ||| న U || భ U || భ U | U ర. ఇవి ౧౩౩౨౬ వది.

## అందు సుగంధి యనువృత్తము.

రంబు జంబు రంబు జంబు, రంబు చెన్ను మీఱఁగాఁ
దొమ్మిదింట విశ్రమంబు । తోర మై సుగంధికిన్
గ్రమ్మఁగా నుతింప నొప్పుఁ । గానలోలుఁ డచ్యుతుం
డంబుజాక్షుఁ డాదిదేవు । డక్షరాఖ్యుఁ డెప్పుడున్.

U | U ర | U | జ U | U ర | U | జ U | U ర. ఇది ౧౩౯౮౫ వది.

దీనిపేరే శాలినీవృత్తమును చామరవృత్తమును, ప్రశాంతివృత్తమును.

## అందు నిలావృత్తము.

గజవిశ్రమంబునఁ । గనలు నిలవ నఁగా, సజనాస లుండను సకలకవికృత మై
భుజగాశనధ్వజు । భుజగపతిశయనున్, వ్రజసుందరీముఖ । వనజహితుఁ బొగడన్.

|| U స | U | జ | | | న | | | న || U స. ఇది ౧౪౯౭౩ నది.

## చంద్రరేఖా వృత్తము.

మస్తోభక్రాంతిచే రమ్యం బౌ మహిం జంద్రరేఖా
వృత్తం బౌ మ్రమ్యయంబుల్, వేడ్కన్ హృషీకేశుఁ బార్థ
సూత్తు న్నారాయణు న్విశ్వామిత్రయాగారి దైత్య
చ్ఛేత్త న్దానార్ద్రులక్ష్మీ, చిత్తాబ్జవాసు న్నుతింపన్.

UUU మ U | U ర UUU మ | UUU య | UUU య. ఇది ౮౬౭౮ వది.

## నలినీవృత్తము.

ససనాసగలచే దశకవిశ్రమయుక్తతచేఁ, బొసఁగన్నలినీమణికం, బుసదర్శనహ
స్తసరోరుహువామనుఁ గేశవు శౌరిని జన్, వసుదేవనృపాలతనూభవుఁ బాడుదురా

|| U స || U స || U స || U స || U స. ఇది ౧౩౧౦౭౨ వది.

## అందు నలసగతివృత్తము.

అలసగతి నాఁ జనుస భాంతరముసందు, న్విలసదవతారయతి నిండిన సభ్యల్
గలయ శకటాసురవిఘాతను విశిష్టున్, బలుమఱుఁ గ శేశ్వరులు ప్రాగ్నలు సేయన్

||| న | | U స ||| న U | భ | UUU య ఇది ౫౬౪౭ వది.

### అందు మణిగణనికరము.

మణిగణనికరమనఁ దగు లఘుగురు వై, మణివిరమణ మయి, మధుమథను జహర్షు
ఫణిపతిశయను నేఁ బ్రణుతింతు నరకు, ఘృణిమదయాతనిభుని బాగ డఁచనర్హు.

। । ।న। । ।న। । ।న। । ।న। । ‿ స. ఇది గాలిపాతి వది.

వ. షోడశాక్షరచ్ఛందం బగు నష్టి యందుఁ బ్రతిపాదంబునకుఁ బదునారేసి యక్షరంబులై యొప్పు వృత్తములు పుట్టె నందు.

### ప్రియకాంతావృత్తము.

అమరులు భృత్యులు తనయ వి, యద్గంగ ధరిత్రి
కమలలు పెండ్లాములు రవి, కంజారులు గన్నుల్
శమితతృణావర్తన కని, చాటుం బ్రియకాంతా
ఖ్యము శివసంఖ్యావిరమణ, మై న్యస్యసగం బై.

। । ।న। ‿ ‿య। । ।న। ‿ ‿య। । ‿స ‿గ. ఇది గుణకాలతి వది.

### అందుఁ బంచచామరము.

జరద్రజజంబులుఁ గమం బొ, సంగి తొమ్మిదింటపై
విరామ మొంది సత్కవుల్, విస్తరంబు సేయఁగాఁ
బరాత్పరుండు మాధవుండు, పంచచామరంబునన్
బరూఢగుప్తవసంబులందుఁ, బాడ నొప్పు ధాత్రిలోన్.

। ‿ ।జ ‿ । ‿ర। ‿ ।జ ‿ । ‿ర। ‿ ।జ ‿గ. ఇది గాలివ వది.

### అందుఁ బద్మకము.

నభజజాగగణయుక్తిఁ బ్రె, నాకివిరామక
ప్రభవ మై కృతుల నొప్పును, బద్మక మంద మై
ప్రభుఁడు నక్రమును ద్రుంచి న, రక్షితుఁ జేయు సా
మభవపద్మకముచాడ్పున, మానిత మై ధరన్.

।।।న ‿ ।।భ। ‿ ।జ। ‿ ।జ। ‿ ।జ ‿గ. ఇది గాలిపాతి వది.

### అందుఁ జంద్రశ్రీవృత్తము.

శుమం జంద్రశ్రీ తోయమనసర, గ ల్పొందు విశ్రా
మము న్సంబంధించు న్నరహరి ర, మాది త్తచోరా
శమీయామ్యాగారా శమసహ, జానాథకృష్ణా
ప్రశస్తశ్రీకవ్యాదక్షణదళన, రాధాభుజంగా.

। ‿ ‿య ‿ ‿ ‿మ।।।న।। ‿స ‿ । ‿ర ‿ ‿గ. ఇది గాలిపాతి వది.

అందు మేదినీవృత్తము, దీనిపేరే వాణియు.

వృడయతి నభజరగములు, మేదినీసమాఖ్యన్
దడబడుచుండఁగాఁ జనరు, దాన్జి పద్మనాభా
జడనిధితల్ప నందసుత, సాళ్వరాట్కృతాంతా
కడు హితభక్తి నీకు నతి, గావు మయ్య దేవా.

।।।న।ఽ।జ।ఽ।।భ।ఽ।జ।ఽ।ఽ।ర।ఽ।గ.ఇది౩౫౦౩వది.

అందు ఫలసదనవృత్తము.

నననన సగములుదానరఁగదశవిశ్రాంతిని ఫలసదనము లౌతశయ మగుచొప్పన్
మునిజనములహృదయములఁబొలుచువానిన్, గొనబుగిను దమోదవఁగొలిచెదను

।।।న।।।న।।।న।।।న।ఽ।స।ఽ।గ,ఇదిగూ౦౧౩వది. (టం ఘక.

అందు నశ్వగతివృత్తము.

అందము లైనభకారము, లైదును గాంతను నై
పొంది పదింట విరామముఁ, బూనినయశ్వగతిం
గందసమానమహోన్నత, గాత్రుని శౌరిని గో
విందునిఁ బ్రస్తుతి సేయఁగ, వేడుక యయ్యెఁ జుమీ.

ఽ।।భ।ఽ।।భ।ఽ।।భ।ఽ।।భ।ఽ।।భ।ఽ గ ఇది ౭౪౯౭౮ వది.

అందు మదనదర్పణము.

చారుమదనదర్పణంబు భ, స్జరగ్గనుద్గుణా
మారవిహతవిశ్రమంబున, న్మహిం జెలంగు నా
భీరుల యమునాతటంబునం, బ్రియంబుఁ జేసి యా
ధీరవరుఁడు గూడె నంచు భ, క్తి సన్నుతింపఁగా.

ఽ।।భ।।ఽ।స।ఽ।జ।ఽ।ఽ।ర।ఽ।జ।ఽ।గ ఇది ౨౫౦౯౮ వది.

అందు గజవిలసిత వృత్తము.

బాలసరోజనాభ, వరద తనుమిళితజ, బాల దిగంబరా సహస్రముఖకరలం
బాలకమంగళావ హగజవిలసితమున, స్తాలుపగేహనాన, గములునిభ బరమైన.

ఽ।భ।ఽ।ఽ।ర।।।న।।।న।।।న।ఽ।గ ఇది ౩౭౪౫౬వది.

వ. స ప్తదశచ్ఛందం బగునత్యష్టియందుఁ బ్రతిపాదంబునకుఁ బదియే డేసి యక్షరం
బులై ౧౩౧౦౭౨ వృత్తంబులు పుట్టినందు.

### శిఖరిణీ వృత్తము.

భజింతు న్నిత్యంబు న్మునిజనసదా, ప్రాగ్వసపరుఁ
గజేంద్రారిధ్వంసిం గృతకలలనా, గ్రావునజరుఁ
ద్విజశ్రేష్ఠుల్ మెచ్చ న్యమనస భవల్, విశ్వవిరతి
ప్రజాతాహ్లాదం బై శిఖరిణి యనా, భాసుర మగుఁ.

I U U య U U U మ III న II U స U II భ I U వగణము. ఇది [illegible]

### అందుఁ బృథ్వీవృత్తము.

జసల్ జసయవంబు లుష్ణకర, సంఖ్యవిశ్రాంతులుఁ
బాసంగి కవిపుంగవుల్ పలుక, భూమిలోఁ బృథ్వి నా
నసంశయ మగుం గిలెందలన, యామనోవల్లభా
ప్రసన్నవదనాంబుజా ధృతశ, రశ్వధా మాధవా.

I U II జ II U స I U I జ II U స I U U య I U వగణము [illegible]

### అందు హరిణి.

హరిణి యను వృత్తం బొప్పు న్నాభస్థ, రాత్తవిరామ మై
సరి నసమ రేఫస్వం బై షోడ, శప్రమదాసహా
ప్రసరమణుఁ దృణావర్తక్రవ్యాద, సంహరు మస్తకో
పరిరుచిరపింఛా చూడుం బీత, వస్త్రు నుతింపఁగా.

III న II U స U U U మ U I U ర II U స I U వగణము ఇది [illegible]

### అందు నర్కుట వృత్తము.

### దీనిపేరే కోకిలకాకము.

కొలిచెద నాదిదేవుపద, కోకనదంబులు నేఁ
దొలఁచెదఁ దొంటిశాముసఁగు, దుష్పడుపాపములం
దలఁచెద నామధేయ మతి, తత్పరత న్నభజా
వలఁ దగునర్కుటంబునకు, భర్గవిరామములన్.

III న I U I జ U II భ I U I జ I U I జ I U వగణము ఇది [illegible] వది

### అందు మందాక్రాంతావృత్తము.

మందాక్రాంత న్గిరిశవిరతుల్, మ్రభ్నతాగాగణంబుల్
పొందె న్నాందీపునివలన సం, పూర్ణవిద్యాచయంబుల్

క్రమందించే న్దారుణరణమునం • శౌండ్రసాళ్వాదులం జే
యందెం జేరెం డపుకులకు నం • దాత్మజుం డంచుఁ జెప్పన్

UUU మ UII భ III న UUI త UUI త UU గగము ఇది [illegible] వది.

అందుఁ బాలాశదళ వృత్తము.

దీనిపేరే త్వరితగతియు.

అదనదనున హరినుతు • లవుర ధరఁ బాలా
శదళ మనఁ దనరుఁ గవి • జనులు వచియింపన్
బదునాకఁ డగునెడ యతి • పదిలమునఁ జేరన్
గదియ నగణములయిదు • గగము తుద నొందన్.

III న III న III న III న III న UU గగము ఇది [illegible] వది.

అందువంశపత్త్రపతితవృత్తము.

బాగుగఁ జెప్ప నొప్పు వసుధన్ • భరనభనలగల్
సాగి పినాకివిక్రమమునన్ • సభలనుఁ గుమరై
రాగిలువంశపత్త్రపతిత • క్రమమున నరకు
న్నాగతనంబుసం దుని మనం • దతనయుఁ డనినన్.

UII భ UIU ర III న UII భ III న IU వ ఇది [illegible] వది.

అందుఁ జంపకకేసరి యనువృత్తము.

సనకాదియోగినుతు • జాంబవతీప్రియు నిర్వికా
ల్పు నమేయు నక్షరు విభు న్యమళార్జునభంజనున్
వనమాలిఁ గృష్ణుమురభంజను నెంతురు వాగిజా
సనవిశ్రమంబు సజ • సాస్వలు చంపకకేసరిన్.

IIU స IUI జ IIU స IIU స IIU స IU వ ఇది [illegible] వది.

వ. అష్టాదశఛ్ఛందం బగుధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునెనిమిదియక్షరంబు
లై [illegible] వృత్తములు పుట్టె నందు.

మత్తకోకిల.

ఉత్తమిల్లు మహేశవిశ్రమ • మార్యసమ్మతి నొప్పఁగా
సత్తుగా రసజాభరేఫలు • చాకళింపుచు నొందఁగా
మత్తకోకిలవృత్తపద్ధతి • మక్కువం బొనరింపఁగా
హత్తి పూజ యొనర్ప వచ్చు జ • నార్దనాహ్వయు నెప్పుడున్.

UIU ర IIU స IUI జ IUI జ UII భ UIU ర ఇది [illegible] వది.

అందుఁ గుసుమితలతావేల్లిత.

వేమా తెన్నంగాఁ గుసుమితలతా॰వేల్లిత న్మత్నయాయల్
శ్రీమార్గండశ్రాంతియుఁ గుదిరినం, బెన్ను మీఁదు న్ధరిత్రిన్
గామేపల్లీశుం గనకవసనుం, గంజనేత్రున్ శుభాంగున్
గోమద్బాలుం గాలయవనహరుం ॰ గుంజరేంద్రార్తినాశున్.

ᑌᑌᑌమ ᑌᑌ। త।।।న।ᑌᑌయ।ᑌᑌయ।ᑌᑌయ ఇది ౧౦౭౫౬ వది.

అందు నిశావృత్తము.

ప్రబలు నిశను నార॰ రారంబుల న్రత్నశ్రాంతియున్
గబళితదవపావ ॰ కాపూతనాజీవితాహరి కృ
ష్ణ బలసహజ పాహి ॰ జాతాపహరా యదుశ్రేష్ఠ దే
వబలదమనవంద్య ॰ బహ్వావ్త వార్షేయ సైనేయకా.

।।।న।।।న ᑌ।ᑌర ᑌ।ᑌర ᑌ।ᑌర ᑌ।ᑌర ఇది ౬౨౩౮౭౩ వది.

అందు హారనర్తనవృత్తము.

దీనికిఁ దొమ్మిదింట నాటింట యతులు.

దావపావకభాదిమా ॰ ధన దాశార్హా దనుజాంతకా
దేవకీప్రియనందనా ॰ దివిషద్వంద్యా ॰ ధ్రువసన్నుతా
భావగోచర విశ్వరూ॰ప దగు న్వ్రాక్రు॰ వ్వ నవర్తుసం
ఖ్యావిరామమురేఫస, జ్యభరేఫంబుల్, హారనర్తనన్.

ᑌ।ᑌర।।ᑌస।ᑌ।జ।ᑌᑌయᑌ।।భᑌ।ᑌర ఇది ౧౭౭౩౦ వది.

రెండవపాదమున యతిభంగము.

అందు తోమ్మాహారము.

బాహుబాహిని దమలో॰ భ్రాతల్ దొడ్డ॰పగలఁ బోరాడం
గా హంవీరుఁ డగుబుద్ధు॰ శాసనానుజ॰గతిఁ గూలంగా
నాహా యేసినసరపా॰ లా రత్నేషు, యతులు పొందంగా
తోమ్మాహారంబు మనయుత॰న్నంబుల్ చెంది॰ మనును నందంబై.

ᑌᑌᑌమ।।।న।ᑌᑌయᑌᑌ।త।।।నᑌᑌᑌమ
ఇది ౭౩౦౪౦ వది. తొమ్మిదింట నైదింట యతులు.

వ. ఏకోనవింశతిచ్ఛందం బగునతిధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ బందొమ్మిదేసియ
క్షరంబు లై ౫౨౪౨౮౮ వృత్తములు పుట్టెనందు.

### శార్దూలవిక్రీడితము.

దీనికిఁ బదుమూఁడింట యతి.

నీరేజాంచితలోచనాయ హరయే, నీలాంబుదాంగాయ మా
యారాత్రించరఖండనాయ విభవే, హర్యక్షనక్షత్రియ తా
ర్క్ష్యారూఢాయ యటంచుఁ గూర్తురు నిరీహావిశ్వవిశ్రాంతి వి
స్తారింప న్మసజస్తతంబులు గను, న్శార్దూలవిక్రీడితన్.

UUU మ॥ U స। U। జ॥ U స UU। త UU। త U గను
ఇది ౧౪౯౩౩౬ వది.

### అందుఁ దరళ.

జలజలోచనుఁ గైటభాంతకు, శంఖచక్రగదాధరున్
గలశజాదిమునీంద్రసేవితుఁ, గాళియాంతకు నచ్యుతున్
బలుకుచోఁ దరళంబు లందుల, భానువిశ్రమపద్ధతిన్
గలియ నభ్రసజాగముల్ సమకట్టి చెప్పుదురుత్తముల్.

I I I న U॥ భ U। U ర॥ U స। U।జ। U।జ U గను. ఇది ౧౪౦౬౦౩౧ వది.

### అందు మేఘవిస్ఫూర్జితము.

పదుమూఁటయతి.

క్షమాలక్ష్మీనాథున్ విమలవరదున్, జాహ్నవీజాతపాదున్
సమామ్నాయస్తుత్యున్ గరుడతురగున్, సామజప్రాణదాతన్
మిముం దాఁ జేర్కొన్న న్సభలఁ దనరు న్మేఘవిస్ఫూర్జితంబుల్
విమర్శం గూర్పన్ యమ్నసరరగము ల్విశ్వవిశ్రాంతిచేతన్.

I UU య UUU మ I I I న I I U స U। U ర U। U ర U
గ ఇది ౮౫౭౮౧౩౬ వది.

### అందుఁ జంద్రకళ.

దీనికిఁ బదునొకంట యతి.

తానకంబుగఁ జంద్రకళావృత్తంబు కవు ల్విరచించినన్
వీనులార మనోజ్ఞపదంబుల్ పేర్చి కపద్విరామమె
కాన వచ్చి రసస్తజజంబుల్ గంబు పనర్చి కళింపజా
మానినీరమణా సవగాధా మానితరత్నములం దగున్.

U। U స। U స। U స UU। త। U।జ। U।జ U గ. ఇది ౧౬౭౧౬౬ వది.

## అందు భూతిలకము.

భారసజాగగణంబులుం బఱ । వంగ భానువిరామవి
స్ఫారత భూతిలకంబు పాండవ । పక్ష దైవతవృత్త మిం
పార ధరిత్రికిఁదెచ్చినట్టిమ । హాత్మ యంచుఁ గవీశ్వరుల్
చారుపదంబులు గూర్చి చెప్పిన । శ్రావ్య మౌ వినువారికిన్.

◡ ।భ ◡ ।భ ◡ । ◡ ।ర॥ ◡ ।స। ◡ ।జ। ◡ ।జ ◡ ।గము ఇది ౧౬౯౯౭౭ వది

## అందుఁ గవికంఠభూషణము.

నవరత్నవిశ్రమము । నన్ సజసాసజగంబులన్ గవుల్
గవికంఠభూషణము । గా రచియింతురు మాటిమాటికి
శ్రవణిల్లుకబ్బమున । నందకపాణి నుపేంద్రు రుక్మిణీ
ధవు సత్యభామధవుఁ । దత్పరులై నమహాత్ము లట్లుగాన్.

॥ ◡ ।స। ◡ ।జ॥ ◡ ।స॥ ◡ ।స॥ ◡ ।స। ◡ ।జ ◡ ।గ ఇది ౩౭౪౦౧౯ వది.

వ. వింశతిచ్ఛందం బగుకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదేసియక్షరంబులై
౧౦౪౮౫౭౬ వృత్తములు పుట్టెనందు.

## మత్తేభ విక్రీడిత.

మనువిశ్రాంతిని సభ్రనమ్యవములన్ । మత్తేభవిక్రీడితా
హ్వానువృత్తంబు చెలంగె మాననతులా । రా పీఁచె యేఁచె భ
క్తిని గాత్యాయనిఁ గొల్చు నాఁడు యమునా । తీరంబునం బొంది వే
డ్కను మాచీరలు దోఁచుకొన్న పెడవొం । గంజూచినారా యనన్॥

॥ ◡ ।స ◡ ॥భ ◡ । ◡ ।ర।।।న ◡ ◡ ◡ ।మ। ◡ ◡ ।య ◡ ।వగణము.
పదునాలవయింట యతి ఇది ౩౦౭౬౭౯ వది.

## అందు నుత్పలమాల.

పేరిన నేయిదుగ్ధములు । పెర్గును మీఁగడయు న్సదా ప్రభా
గారము సొచ్చి త్రాగి పెస । గంతులు వైచుమురారినెంచఁ గా
ధారుణి రూఢికెక్కు నవ । తాగవిరామముచే లసద్భరన్
భారలగంబులుం గలయఁ బల్కిన నుత్పలమాల చెన్నగున్. (వది.

◡ ।భ ◡ । ◡ ।ర।।న ◡ ॥భ ◡ ॥భ ◡ ॥ ◡ ।ర। ◡ ।లగము ఇది ౩౯౯౭౯౬

## అందు నంబురుహవృత్తము.

చారుతమాలదళాసితవర్ణునిఁ । జక్రహస్తసనాథను
స్థారితకంససముఖ్యకిలిపాలకు । నందనందను నవ్యయున్

సూరకులోద్భవుఁ డైటభభేదిని • జోలి చేసి నుతింప భా
భారసమంబులు విశ్వవిరామముఁ • బల్కు నంబురుహంబగుక్.

◡।భ ◡॥భ ◡।భ ◡।భ ◡। ◡ర॥ ◡స। ◡వగణము పదుమూఁట
యతి ఇది ౩౭౨౧౫౦ వది.

అందు ఖచరప్లుతము.

యమునలోఁ జొర నోడిననానా • ప్రాకృతజంతువులం బ్రమో
దమునఁ బ్రోచుటకై కలఁచంగా • దర్పమునం జనుదెంచి ఘో
రముగఁ జుట్టినకాళియు సంహా • రం బొనరించినకృష్ణ య
ర్యమవిరామముతోడ నభామ్న • స్వ ల్వేలయన్ ఖచరప్లుతన్.

॥న ◡॥భ ◡।భ ◡ ◡ ◡మ॥ ◡స। ◡స। ◡వ,   పండ్రెండిఁట
యతి ఇది ౩౭౩౧౬౫ వది. (నాల్గవపాదమున యతి భంగము.)

అందుఁ బ్రభాకలిత.

వళి పదుమూఁడవయక్షరంబుగ • వాసి కెక్కు నభాభరే
ఫలు సలగంబు లమర్చి సాంపాద • మం బ్రభాకలితాఖ్యమై
చెలువగువృత్తమునంచు సత్కవి • శేఖరు ల్వినుతింతు రా
జలనిధిమీఁదను జన్వళించిన • జాంబవత్యధిపాలుక్.

।।।న। ◡।జ। ◡।జ ◡॥భ ◡। ◡ర॥ ◡స। ◡గము ఇది ౩౪౬౫౦౩ వది.

వ. ఏకవింశతిచ్ఛందంబగు ప్రకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదియొక్క య
క్షరంబులై ౨౦౯౭౧౫౨ వృత్తంబులు పుట్టె నందు.

చంపకమాల.

చపలమనీషతోడ నాక • సంయమి వే మొల పెట్టుచుండఁగాఁ
గృపను దదీయపుత్త్రిఁ బ్రతి • కించిన మేటివిభుండ వంచు నక్
సపరిగణంబుతో నజభ • జాజలురేఫయుఁ గూర్చి సత్కవుల్
త్రిపురవిభేదనాఖ్యవిర • తిం దగఁ జంపకమాలఁ గొల్తు రా.

।।।న। ◡।జ ◡॥భ। ◡।జ। ◡।జ। ◡।జ ◡।ర. ఇది ౪౯౯౯౩౮౬ వది.
పదునొకంట యతి.

అందు వనమంజరి.

మనువిరతు ల్నజజాజభర ల్వన • మంజరిం గవిశేఖరుల్
దనరఁగ నాజయుఁడు న్విజయుం డను • ద్వారపాలకు లీశ్వరు
న్సనకమునిశాపము ధాత్రి నిశాటులు • నంగఁ బుట్టి సుపర్వులన్

జెనకినవాం(డ్రను జంపినకోలన్న॰ సింహుని స్వనుతింతు రా.

||న| U |జ| U |జ| U |జ| U |జ U ||భ U | U ర. ఇది ౭౫౭౪౯౯౩ వది. పదునాలుగింట యతి.

## అందు లాటీవిటము.

సగణంబులు నాల్గిట మత్యలవిశ్వే(శాంతి న్లాటీవిటవృత్తం

బగు నంచుఁ గవీం(ద్రులు గొల్తురు స॰ వ్యక్రీవి న్యాచించి యథేచ్ఛం

దగునేర్పున మూఁడు పదంబులుగాఁ॰ దై్రలోక్యంబు ల్గొల్వఁగ శూరుల్

వొగలం బలిదానవుఁ (ద్రొక్కినయా॰ పొట్టిం దిట్ట న్వామనుఁ గృష్ణుక్.

|| U స| U స| U స|| U స U U U మ U U | త| U U య. ఇది ౯౦౦౦౦ వది. పదుమూఁట యతి.

## అందు మణిమాల.

అజహవ్యయోదధిఘృతంబు॰ లమ్ముచు మురారిఁ బాడి రెలమిక్

వజ్రఁగాఁ దనీయచరణాత్త॰ నవ్యహృదయారవింద లగుచు

న్వ్రజసుందరీజనము లొక్క॰ నాఁడు మణిమాలయందుఁ బొసఁగ

న్నిజము త్రివారము సముంబి॰ నాకివిరమంబు పొందు దనరక్.

| U స| U |జ| U స| U |జ| U స| U |జ|| U స. ఇది ౯౬౪౩౯౬ వది. పదునొకంట యతి.

## అందుఁ గరిబృంహితము.

మూఁడు భనములు రేఫమును బదు॰ మూఁట విరతియు సొంపుగాఁ

గూడుకొనఁ గరిబృంహితము సమ॰కూర్చి వసుమతి మండలా

పీడ మనుకరిబృంహితరవము॰ పెల్లుగఁ బలుకుచుండఁగాఁ

గోడిగపుచిననాఁడు శకటునిఁ॰ గూల్చినహరి నుతించెదక్.

U |భ||న U |భ||న U |భ|||న U | U ర ఇది ౭౮౩౩౭౦ వది.

## అందుఁ గనకలత.

జవమున భగభగ యనుచు(న॰ జజనములఁ బొదవినం

దవశిఖి నుడిపినమధుమర॰ నరకదమన యని చె

లవముగఁ బలుమఱు నిరువది॰ లఘువులు గను పదుమూఁ

డవయెడ విరతిఁ బొసఁగిన చొడఁ గడరుఁ గనకలతక్.

|||న|||న|||న|||న|||న|||న|| U స ఇది ౧౦౪౮౫౭౬౮ వది.

వ. ద్వావింశచ్ఛందం బగునాకృతియందుఁ బ్రతిపాదంబున కిరువదిరెండేసి యక్షరంబులై ౪౧౯౪౩౦౪ వృత్తములు పుట్టె.

అందు మహాస్రగ్ధర.

స్తతనస్రాగ ల్విరించా • ప్తవిరతులు మహా • స్రగ్ధరం జెప్ప నొప్పుఁ
గ్రతువిఘ్నం బావహిల్లం • బ్రమదమున వ్రజ • వ్రాతదక్షాన్న మెల్లన్
హుతభృద్వ్యాపంబున న్మ్రే • క్కిన రుష నమరా • గ్రేసరుం డంప బుబ్బుఁ
ధృతిమై బాల్యానఁ గుర్వం • గిరి కరుణతో • ధేనువర్గాద్రి మోఁచెన్.

ఇది ౪౧౯౪౨౦౬ వది. తొమ్మిదింట యెనిమిదింట యతులు.

అందు భద్రకము,

భంబు రనత్రయంబు గను నొంది • భానుయతి భద్రకంబు దనరున్
బంబినవిల్లుగోల కరయుగ్మ • పాదములఁ బట్టి యాఁడి పశువ
ర్గంబు నరణ్యమధ్యమధరిత్రిఁ • గాచుసమయంబున న్యమునతీ
రంబున గొల్లలం గలసి యోగి • రంబు దినెఁ గృష్ణుఁ డంచుఁ బలుకన్.

నగ ఇది ౧౫౩౩౫౧౨వది. పదురెండింటయతి.

అందు మానిని.

రాజిలు సప్తభము ల్గము విశ్వవి • రామము మానినియందు భర
ద్వాజముఖప్రముఖీశ్వరు లందఱు • దైత్యగురున్ భృగువాక్యమునన్
రా జలనాయకతల్పుని దైవత • రాజసజప్రముగొల్తురు వి
భ్రాజితమోక్షము చేకుఱఁ బూర్వ • రాత్తలి నంచు వచించుటచేన్.

భ భ భ భ భ భ భ గ ఇది ౧౯౫౪౭౪౪ వది పదుమూఁట యతి.

అందు విచికిలిత.

ప్రవిలసనసమసమునను బద • పడి జలనిధినడుమ స
న్నవనములు గడుపున నిడుఁగ • భుజగపతిశయనముపై
నవిరళమతిఁ గుసుకువరహుఁ • డని విచికిలితేఁ బదమూఁ
డవమొదవది యిరువదియొక • లఘువు గము బలుక నగున్.

న న న న న న న గ ఇది ౨౦౯౭౧౫౨వది.

## అందుఁ దురగము.

ననననసజజగలు తిశివిరమ • ణం బగు న్దురగంబునక్
గనలుచు నగరమునుపయి విడిసిన • గాంచి తా నాకరుం డెదు
ర్కొని దవులకుఁ గొని చని గిరిగుహఁ • గూర్కునామచికుందుచే
తను యవనునిఁ బొరిగొని తని వసు • థ న్గణింతురు భూసురుల్.

॥న॥న॥న॥న॥◡।స।◡।జ।◡।జ◡।గ ఇది ౩౧౮౭౦౭౮౮పది.
పదేనింట యతి.

## అందు మద్రకము.

ఆధ్వమునందు నడ్డ మయి వా • హనాకృతి నున్నబకాసురు మహా
సాధ్వసదు న్వరిజాగ్భకవినా • శనతను వక్త్రముఁ జొచ్చి సురలు
బ్రాధ్యగు లై నుతింపఁగఁ దవీ • యదేహము వెల్లినఁ గృష్ణునుతి న
క్రధ్వజమద్విరామము భర • న్రసానగలుం దగుమద్రకమునన్.

◡॥భ◡।◡।ర॥న◡।◡।ర॥◡।స॥◡।స॥న◡ గ ఇది.
౧౮౮౩౦౮ పది. పదునాకంట యతి.

వ. త్రయోవింశతిచ్ఛందం బగు వికృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదిమూఁడే
సి యక్షరంబు లై ౮౩౮౮౬౮ వృత్తంబులు పుట్టెనందు.

## కవిరాజ విరాజితము.

కలయఁగ నాక్కన • కారము నాలుగ • కారములు న్వము • గాటముగా
వలరినచో ద్వికర • దాచలశైలము • లై త్రివిరామము • లంది నిర
గళకవిరాజవి • రాజితవృత్తము • రాణ జనార్దన రమ్యకథా
వళులఁ గవీశులు • వర్ణన సేయఁగ • వ్రాలు నజవ్రసము • వాఁ విరిగన్.

॥న।◡।జ।◡।జ।◡।జ।◡।జ।◡।జ।◡।జ।◡వగణము. ఎని
మిదింట నేడింట నేడింట యతులు ౩౪౯౪౦౩ పది.

## అం దశ్వలలిత.

సలలితవిశ్వవిశ్రమము నశ్చ • జ భ్భజభవంబు లశ్వలలితన్
జెలువుగఁ గూర్చి సత్కవులు తల్లి • చిన్నిసమయంబునందున నులూ
ఖలమునఁ గట్టి వైచినను నీచ్చ • క న్దరలి మద్దిచెట్లు ధరణిం
గలపినకృష్ణుఁ గీర్తనము సేయఁ • గాఁ దనరు సర్వకాలము ధరన్.

॥న।◡।జ◡॥భ।◡।జ◡।భ।◡।జ◡।భ।◡ వగ. ఇది
౩౮౬౧౪౨౩ పది. పదుమూఁట యతి.

అందుఁ బద్మనాభము.

వేమాఱు నప్పద్మనాభుంబున నీశ్వ, విశ్రాంతియు నత్యుత్తమంబు లగఁగుంబుఁ
గోమారుగా దేవరాత్రించరుల్ ఖీర, కూపారమధ్యంబున నీఁవుమీఁదఁ
బ్రావుంగ మంథాచలం బోపికం గచ్ఛ, పస్వామి యైమోచెనేకృష్ణుఁడంచుఁ
గామించి విద్వాంసు లెల్ల న్వచింపంగఁ, గ్రాలు స్థిరిత్రి నదా మానితంబై.

UU|త UU|త UU|త UU|త UU|త UU|త
UU|త UU గగము పదుమూఁట యతి, ఇది ౧౧౧౦౧౧౭౨ వది.

అందు మత్తాక్రీడ.

మత్తాక్రీడఖ్యం బెం పారు। న్మమతననననవ। మహిత మగుచు ర
త్నాత్రబ్రహ్మక్రాంతు ల్గ్రిం ద్రై యమరగ రణముఁ। నధికబలు మదో
న్మత్తుం జాణూరక్రవ్యాదు। న్మధురసదుఁడు బెడ। మరలి పిడికిటన్
సత్తాహాత్రుం డుర్విం గూల్చె। న్సకలదివిజులు, సమతను బొగడన్.

UUU మ UUUU మ UU|త||న||న||న||న| U వ ఇది ౩౮౦౩౬
వది తొమ్మిదింట తొమ్మిదింట యతులు.

వ. చతుర్వింశతిచ్ఛందం బగుసంకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదినాలుగేసి
యక్షరంబులై ౧౬౭౭౭౨౧౬ వృత్తంబులు పుట్టినందు.

సరసిజము.

సంబంధించు న్మత్యులు నానా। సలు దశనిధియతి, సరసిజమునకున్
గంభీర న్బృందాటవిలోనం। గవిసేనానినసుర। కరువలిదనుజున్
శంకాళీలంబై తగుముష్టిం। జదిపినయదుపతి। స్తవములు ననురా
గంభీర న్నోల్లఁగఁ ద్రాంచాత్యవివరు లభినుతిఁ, గనిపుడు రవసన్.

UUU మ UU|త| UU య |||న|||న|||న|||న|| U స ఇది
౩౩౭౨౧౮౮వది. పదింట తొమ్మిదింట యతులు.

అందుఁ గ్రౌంచపదము.

పంచమకేశుం డిచ్చినభాస్వద్వరమున మనమున। బనరము గోరన్
వంచనతో బాణాసురుహ స్త్రవ్రజములు దరిగెను। నడిహరి యంచు
న్బ్రౌంచితలీల న్శంకరనంది,ప్రకటితవిరతులు,భమసభ నాన్యల్
క్రౌంచపదీవృత్తమ్మునఁ జెన్నారఁగఁ బలుకుదు రిలఁ। గవివరు లెల్లన్.

U'భ UUU మ| U స U భ|||న|||న|||న| UU య ఇది ౮౯౯౩౮
౭౦వది. పదునాకంటఁ దొమ్మిదింట యతులు.

### అందుఁ దన్వి యనువృత్తము.

చూడలతోఁ గాపకలను గుహాలోఁ, బొంగిలిదాఁచినవిధి నదలించెన్
గూఁటుక తత్రూపను లయి పసులుం, గోపవధూటులు మురిపము నొందన్
వాడి వినోదంబులు సలిపి నగోఁ, పాలుఁ డటంచును ఘతనసభాన్యల్
దాడి గొన స్వశ్వపిరమణములోఁ, దన్విని జెప్పఁగఁ దనరుఁ గవీంద్రుల్.

U| భ UU |త|||స|| Uస U|భ U| భ|||న|UU య. ఇవి ౨౦౮౭౬౬౬వది. పదమూఁట యతి.

### అం దష్టమూర్తి.

శ్రీకృష్ణుం గనకవస్త్రుం, జితతృణావర్తదైత్యుఁ స్సితకశేశయనాభున్
వైకుంఠు న్వరదు బృందా, వనచరు న్వాసుదేవుఁ న్వసుమతీయుం బరముం బ
ద్మాకాంతు న్నిధినిధానుఁ, మలవిరామంబులొప్పఁ న్మనతసర్వజయంబుల్
సోకం జెప్పమరు విద్వాంసు లిలలోఁ నష్టమూర్తిఁ న్సుప్రతిభు ల్కృతచర్యుల్.

UUU మ|||న UU |త|| Uస U| U ర U |భ| U|జ| UU య. ఇవి ౩౬౧౮౪౯౦వది తొమ్మిదింటఁ దొమ్మిదింట యతులు.

వ. పంచవింశతిచ్ఛందం బగు నతికృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదియైదేసియ
క్షరంబులై ౩౩౫౫౪౪౩౨వృత్తంబులు వుట్టె నందు.

### బంధురవృత్తము.

సారివి సననన సభభభగములతోఁ, షోడశసంఖ్యవిరామములోఁ
బదపడి వినదిననును బుధజనులిఁ, బంధురవృత్తమునందు నుతిం
తురు హిమకరకుసుమము నాసటను గఁ న్నన్ఫణిపాగయుఁ దాల్చినయా
దొరజడలనడుమసిలి వినకెలుపుఁ, దూకొనుప్రంతకఁ దంఘ్రియనన్.

|||స|||న|||న|||న||| Uస U|భ U|భ U|భ Uగ ఇది ౨౮౭౩౪౨౩౫వది.

### అందు భాస్కరవిలసితము.

చెల్లెలి విజయున కిచ్చినవానిం, జేకొడుపృథుకములు దినినవానిన్
గొల్లతలను వలపించినవానిం, గొల్లకుఁ గొడుకనఁ బరఁగినవానిన్
మల్లుర రణమునఁ జంపినవానిఁ, న్నన్నయభసనసగలు పదమూఁటన్
బల్లిద మగువిరమంబు దలిర్పఁ న్భాస్కరవిలసితములు గొనియాడున్.

U|భ||న| U|జ| UUయ U|భ||న||న| Uస Uగ ఇది ౩౬౧౩౧౧వది.

### అందు ధరణిధరగతి.

వసునమలు గనుమ వసువసుయతులొప్ప నగు ధరణిధరగతిన్
గస రాదని సుడికరువలిపగిదిం గదిసి యదుశిశుచయముతో
మసలునైన మురమథన నినుఁ గొని మది నలరుచును జెగసి యా
కసమున కెగయఁగ శకటదనుజుఁ గ్రుమ్మఁ గలిపిరి వని పలుకన్.

||న||న||న||స||న||స||న||న U గ ఇది [illegible] వది. ఎనిమిదింట నెనిమిదింటయతులు.

వ. షడ్వింశతిచ్ఛందం బనునుత్కృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదాఱేసియక్షరంబు [illegible] వృత్తంబులు పుట్టె నందు.

### భుజంగ విజృంభితము.

వ్రాలు వ్రత్నేశానక్రాంతుల్పాపహ మమతననరసలవల్ భుజంగవిజృంభితన్
గాళిందీతోయం బెండ్లాడన్ స్వరదనుజుఁ దునిమెను శిఖావలాంచితపింఛమున్
మాకందాత్సేస్పందిం బ్రోచెన్ న్నందికిరథముఁ గడపె మద్దిచెట్టులఁ గూలిచెన్
దాలంబుల్గూల్చె స్వేకన్మార్గుల బ్రమయఁగను మురళి వాలిచెన్ సువిభుండనన్.

U U U మ U U U మ U U త||న||న||న U | U గ| U స| U
వగణము. తొమ్మిదింటఁ బదునాకంట యతులు. ఇది [illegible] వది.

### వరాహవృత్తము.

రాజిల్లు న్దశకుధరశరతులు మగణగసనసగగలు వరాహాఖ్యన్
జేజే లందఱు పొగడ నుతిఁ దని తలఁచి భృగువు పలుకఁగ నిత్యంబున్
తేజశ్రీ పెరుఁగఁగ మదిదృఢముగ నిశితమురుచుఁ గొలిచిరి దాశార్హున్
రాజీవాక్షుని నరహరి గవిజులవరు రఘుపతి బలసహజుం గృష్ణున్.

U U U మ||న||న||న||న||న||న| U స U U గగ ఇది [illegible] వది. పదింట నేడింట యతులు.

### మంగళమహాశ్రీ యనువృత్తము.

పొత్తులె కైవాయుటను భోరుసమయంబునను బొంగుచుఁ గుమూద్వహాలనెల్లన్
దుత్తుమురు సేయఁగ గుమర్చును మనీష నదిసుప్పసమరావనిఁ గిరీటి
తుత్తకు భజస్నభజ సానగలు మన్యజుల క్రాంతులును మంగళమహాశ్రీ
వృత్తములఁ జెన్నలర నిచ్చిరి సువాసినులు నిం పెసఁగ మంగళమహార్తుల్.

U భ| U జ| U స||న U ||భ| U |జ U స|| న U U గగము.
తొమ్మిదింట తొమ్మిదింట యతులు, ఇది [illegible] వది.

క. పొందుగ నిరువదియాఱగు, ఛందములం దుదయమైన సమవృత్తము లా
నందమునఁ గవులు పొగడెదు, కందువల వచించినాఁడఁ గామేపలీశా.

వ. ఇది సమవృత్తలక్షణంబు లింక ముఖ్యగౌణవృత్తలక్షణంబు దెలింగించెద. ౧౭౦

ముఖ్యగౌణవృత్తలక్షణము.

సీ. సమవృత్తపఙ్క్తిఁ స్వస్థానార్ధసమములు స్వస్థానవిషమాఖ్యలు ననఁ బరియును
బృథివిపై సమవృత్తభేదంబు లీమూఁటి కక్షరంబులు సమంబన్నిఁ గాని
నిదివృత్తముఖ్యంబులై చనఁ బరస్థానార్ధసమవృత్తములు పరస్థానవిషమ
సంజ్ఞలఁ బద్యములు సర్వపరస్థానవిషమంబులును నిట్టి విషమవృత్త
భేదములు నీనినాలుగుపాదములను, సమముగాఁ జూపవు వర్ణసంఖ్య లెచ్చు
కడమలై యుండు నీమూఁటి గౌణవృత్త, పద్యములటంచు శ్రీకామ కల్లినిలయ

సమవృత్తవివేకము.

గీ. జగతిసమవృత్తమెన్న ఛందమునను, సంభవమునొందెనన్ని యక్షరములమరఁ
బదపదంబున హెచ్చునుగాదు వగాక, ప్రాసములు విరామంబులుఁ బరిఢవిల్ల.

స్వస్థానార్ధసమవివేకము.

ఆ. అక్షరములు సమములయ్యె స్వస్థానార్ధ, సమములందు నాల్గుచరణములను
విషమపదము లొక్కవిధము గణంబులు, సమపదంబు లొక్క సరిగణములు.

క. సగ మొక్కవిధంబునఁ జెల, సగ మొక్క తెఱగు గాఁగ సమకూర్పఁ దగఁ దా
జగతి నాకకా లోకకరణి, నాగి మూఁడుపదంబు లొక్క యోజందనరున్.

తే. సాధువిఖ్యాతగ్రంథసంఘాత మెల్ల, వెదకి సకలోపజాతులు విశ్వలక్షణిఁ
గాళిదాసుఁడు రఘువంశకావ్యమునను, జెలఁగ రెండవసర్గలోఁ జెప్పినాఁడు.

వ. అటు గాన స్వస్థానార్ధసమవృత్తంబులం దుపజాతి యనువృత్తము. ౧౭౧

ఉపజాతివృత్తము.

ఈపాటితో చేసులనింద్రవజ్రం, బుపేంద్రవజ్రాహ్వయ మగ్వీసర్లం
దాపించినంతం గరుణాసముద్రా, జపిష్ఠలోలా యుపజాతి యయ్యెన్. ౧౭౨

వ. ఇది పదునాకండవ త్రిష్టుప్ఛందంబునందలి యింద్రవజ్రాఛాయను బేసిపాదము
లును నుపేంద్రవజ్రాఛాయను సరిపాదములును నడుచును. ౧౭౩

మఱియు సమోపజాతి.

కాపింఛనీలాంగుఁ బృందాకుతల్పున్, గోపాలబాలు ద్రవికోటితేజున్
గృపాసముద్రు న్మతియించెద న్ముక్త్యపాప్తిఁ గాంక్షించి సమోపజాతిన్.

వ. ఇంద్రవజ్రాఛాయను మొదలిరెండు పాదములను నుపేంద్రవజ్రాఛాయను గడమ రెండుపాదములను నడుచును. ౧౯౦

## మఱియు వ్యత్యస్తసమోపజాతి.

తపంబుచేఁ గొల్చుని శాస్త్రతాతన్, గపాలికోదండని ఖండనాఖ్యన్
గోపీభుజంగున్ ధృతిఁ గొల్తు సన్నుత్యుపాయ వ్యత్యస్తసమోపజాతిన్.

వ. ఇది యుపేంద్రవజ్రాఛాయను మొదలిరెండు పాదములను నింద్రవజ్రాఛాయను గడమ రెండుపాదములను నడుచును. ౧౯౨

## మఱియు వైపరీత్యోపజాతి

రాజల్లగంబొంటజుఁ దజ్జగింబుల్, గజిక్కున మ్రొక్కనుఁ గంటుఁ జేయన్
వ్రజాంగనావల్లభుఁ వైపరీత్యో, పజాతివృత్తంబునఁ బ్రాంజెలంగున్. ౧౯౩

వ. ఇది యింద్రవజ్రాఛాయను మొదలిచరణమున నుపేంద్రవజ్రాఛాయను గడమమూఁడుచరణములను నడుచును. దీనిపేరే వారాంగిని మఱియు నీవృత్తను నసే యింద్రవజ్రాచాయనేదైన నొకచరణమును నుపేంద్రవజ్రాఛాయను గడమ మూఁడు చరణములును జెప్పినను దప్పలేదు. ౧౯౪

## మఱియు నుపచిత్ర.

భిదురంబిసనాపలు చేసులన్, గాదిలి భాగ్యగంబులు సర్లన్
గుబురై రసిక స్తుతిఁ గూడినన్, శ్రీదయితా యుపచిత్ర చెలంగున్. ౧౯౫

వ. ఇది త్రిష్టుప్ఛందమునందలి వృత్తచ్ఛాయను చేసి పాదములను దోధకవృత్తచ్ఛాయను సరిపాదములను నడుచును. ౧౯౬

## మఱియు నారీనుతము.

పేరెంబు ల్వారోరిఁ జేసి స్మరతాగా, సారంబు సర్లన్ దళజల్లగంబున్
ధీరోదాత్తుల్ సన్నుతింపన్ ధరిత్రిన్, నారీనుతం బయ్యు జనార్దనాఖ్యన్.

వ. ఇది పదునొకొండవ త్రిష్టుప్ఛందస్సునందలి శాలినీవృత్తఛాయను చేసి పాదములను నింద్రవజ్రాఛాయను సరిపాదములను నడుచును. ౧౯౮

## మఱియును నజితపరితాప మనువృత్తము.

జలజాతము చేసుల సజల్ ససలున్, బలుమలున్ సరి సంభ్రమలొందఁగా
జలజోద్భవాబ్జజముఁ జాలయతుల్, దళము లైన యజిత్ తప్రపతాపసూ. ౧౯౯

వ. ఇది పండ్రెండవ జగతీఛ్ఛందస్సునందలి ప్రమితాక్షరావృత్తఛాయను సరిపాదములను ప్రియంవదావృత్తచ్ఛాయను చేసి పాదములను నడుచును. ౨౦౦

మఱియు రతిప్రియము.

చేసి న్నృష్టకగలుఁ జేర్చి సర్గజంబున్, భసల్లుం గదసిన పొవబద్ధమై
యాసామోద్భవచతురాస్యలిశ్రమఖ్యాతిసన్నుతింపఁదగు రతిప్రియంబగన్.

వ. ఇది పదునాఁడవజగతీచ్ఛందస్సునందలి ప్రహర్షిణీవృత్తచ్ఛాయను బేసిపాదములను రుచిరవృత్తచ్ఛాయను సరిపాదములను నడుచును. ౨౦౫

వ. ఇది స్వస్థానార్ధసమవృత్తలక్షణం బింక స్వస్థానవిషమవృత్తంబు లెట్టి వనిన.

స్వస్థానవిషమవృత్తవివేకము.

ఆ. చరణములను వర్ణసంజ్ఞలు దప్పక, నాల్గుపాదములగణములు నాల్గు
విధములై చెలంగువృత్తముల్ స్వస్థాన, విషమవృత్తసంఖ్య వెలయుచుండు.

అందు ధరణి యనువృత్తము.

రసపై సచతుష్కమును రారసలున్, నాసనల్ మాసనల్ నాటినన్మణితా
పసనగరసపపక్వయుతు, గ్రా సౌం పొసు న్వాలాయముగా ధరణుల్.

వ. ఇది జగతీచ్ఛందస్సునందలి తోటకవృత్తచ్ఛాయను మొదటిపాదమునను గడమ మూఁడుచరణములను గవికల్పితమై నడుచును. ౨౦౬

మఱియును వారాంగి.

తాజల్గ యుగ్మంబు జతజ్గగంబుల్, తజాగగంబుల్ మభతల్లగంబుల్
రాజిల్లు నిక్షేంద్రవిరావయుక్తిన్, వాజిగ్రీవాహరి వారాంగి దగున్. ౨౦౭

వ. ఇది యింద్రవజ్రాచ్ఛాయను మొదటిచరణమునను నుపేంద్రవజ్రాచ్ఛాయను రెండవచరణమునను గీతాలంబనవృత్తచ్ఛాయను మూఁడవచరణమునను వాతోర్మివృత్తచ్ఛాయను నాలవచరణమునను నడుచును. ౨౦౮

మఱియు నంగజాస్త్రము.

రంగు భమస్గల్ గ్రాలుమసజ్గల్, పొంగై మస్యగమ్ముల్ జగ్గ టౌ
ప్పంగా నార్తిపగిరివల్లై భే, నంగజాస్త్రవృత్త మందగించున్. ౨౦౯

వ. ఇది రుగ్మవతీచ్ఛాయను మొదటిచరణమునను శుద్ధవిరాట్చ్ఛాయను రెండవచరణమునను పణవచ్ఛాయను మూఁడవచరణమునను మయూరసారిచ్ఛాయను నాల్గవచరణమునను నడుచును. ౨౧౦

మఱియు సదీప్తిఘోషము.

పోలిమైరాసరంబుల్ జతక్రంబులున్, తలంపఁగా యాయయలున్ నతక్రలున్
విలాసాచలాష్టేభవిశ్రాంతిఁ బొందన్, చెలింప నాప్పారు సదీప్తఘోషముల్.

వ. స్రగ్విణీవృత్తచ్ఛాయను మొదలిచరణమునను వంశస్థచ్ఛాయను రెండవచరణమునను భుజంగప్రయాతవృత్తచ్ఛాయను మూడవచరణమునను ఇంద్రవంశచ్ఛాయను నాలవచరణమునను నడుచును ౨౧౨

వ. ఇది స్వస్థానవిషమవృత్తవివేకం బింకఁ బరస్థానార్థసమవృత్తంబు లెఱింగించెద.

## పరస్థానార్థసమవృత్తవివేకము.

క. మానుగ సమాంఘ్రు లొకగతిఁ, బూనిక విషమాంఘ్రు లొకగతిఁ బోలికలేవుదై
హీనాధిక్యములు పర, స్థానార్థసమంబులందు సమవిషమములన్. ౨౧౪

## అందు మనోహరవృత్తము.

కైరవనతజజ్వలు చేసి మొదలన్, సరులన్ సచతుష్కము సాగిన గం
భీరేభవిరామమహావిశ్రమమున్, బెరుఁగంగ మనోహరవృత్తము రా. ౨౧౫

వ. ఇది కవితాంతవృత్తవృత్తచ్ఛాయను బేసిచరణములను దోటకవృత్తచ్ఛాయను సరిచరణముల నడుచును. ౨౧౬

## మఱియుఁ గేతుమతి.

జతచేసుల స్సజనగములన్, భాతి సరిన్ భరేఫనగగంబుల్
యతిశైలసంఖ్య నమరంగా, నాతత కేతుమతి యభిధ మెప్పున్. ౨౧౭

## మఱియు వేగవతి.

సగణత్రయగల్లును బేసిన్, బాగుగ సల్లను భత్రిగగంబుల్
నగవిశ్రమ మొదము నొందన్, వేగవతీనుతవృత్తమునందున్. ౨౧౮

## అందు వియోగిని.

సససల్ గము సాగ బేసులన్, బససభ్రలగముల్ సరిన్
రసశైలవిరామసంగతిన్, బొసఁగు న్వియోగిని భూరమాధిపా. ౨౧౯

## మఱియుఁ బరావళి.

ఓలి రజ్రజటాంతగంబులుంచి బేసులం, దులన్ జరజ్రగఁబులు న్గదున్నడగాఁ
గ్రాలు మన్నిధానదిగ్విరామ మొప్పఁగా, నిలింపరావళీసువృత్తమొప్పు గాంచున్

## మఱియు ధృతమధ్య.

భారిగ బేసుల భాభగగంబుల్, సరుల నజాయలు సాగఁగి మేల
య్యారె శిలోచ్చయ, హ స్త్రీవిరామో, దారత యొప్పును దా ధృతమధ్యన్.

వ. ఇది తోదకవృత్తచ్ఛాయను బేసిచరణములను దోదకవృత్తచ్ఛాయను సరిచరణములను నడుచును. (౪ వ పాదమున ఛందోభంగము) ౨౨౨

వ. ఇదిపరస్థానార్ధసమవృత్తవివేకంబింకఁ బరస్థానవిషమవృత్తవివేకంబెఱింగించెద.

పరస్థానవిషమవృత్తవివేకము.

క. దానవహర యొకచరణం, బైనను రెండడుగులైన నానక్షరగణసం
ధానములను వెలితెలివగు, పూనికఁ బేరు పరదేశవిషమము లయ్యేన్. ౨౨౪

అందు శరభక్రీడ.

ఘనాదిత్యక్రాంతి స్వమనసరగ బ్లాఁడుకాల్లన్
గనద్ధామక్రాంతి స్వభనయుజ గవ్యాంధ్య మొఃదకా
దనర్పంగాఁ బౌరాణికకథల వాశార్ద్ర వాత్రు
వ్య నర్ణం బై చెన్నార వనిశరభక్రీడసంజ్ఞన్. ౨౨౫

వ. ఇది చంద్రశ్రీఛాయను బ్రథమచరణము నను విశాలచ్ఛాయను మూఁడుచరణ
ములను నడుచును. ౨౨౬

మఱియు శ్రీరమణము.

ఆది భమస్థాల్పత్రిన నాత్మై గాదిలి భాభగణంబులు మూఁటన్
బాదుకొఁ గన్నికల్పినచో లక్ష్మీదయితా ధర శ్రీరమణం బౌ. ౨౨౭

వ. ఇది దుగ్ధవస్త్రాయను మొలిచరణమునను దోదక చ్ఛాయను మూఁడుచరణము
లను నడుచును. ౨౨౮

మఱియు రథగమనమనోహరంబు.

గ్రీతీనయుగరల్లగంబులుంబొసంగం బ్రథమతృతీయచతుర్థపాదముల్వచింపన్
విధిదశయతు లొందివింతగానజార్యల్, రథగమనమనోహరంబగున్ ధరిత్రిన్.

వ. ఇదిపరస్థానవిషమవృత్తవివేకంబింకసర్వపరస్థాన విషమవృత్తవివేకంబెట్టిదనిన.

సర్వపరస్థానవిషమవృత్తవివేకము.

క. ఉర్విని నాలుగుపదములఁ, బర్వినగణములను నర్ణ పఙ్క్తిగణనయున్
సర్వము విపరీతం బగు, నిర్వపరస్థానవిషమసంజ్ఞలను హరీ. ౨౩౧

అందు వీణారచనము.

దారిం దయసాగ ల్మతిత ఙ్నభగాలు, న్పాదింటతజన్భసలు భనాజనగంబుల్
జేర స్వణివిగ్రశశిశేఖరవలిచ్, బౌరచన ధరఁ జెలఁగు నునారదవినుతా.

మఱియు నుద్గతము.

అరుదార నుద్ధత మయ్యె, స్కరి సజయలున్ నసజలున్
బారుభనజవలు సజ్జసలున్, ధర మణ్మహీధ్రగజ ధాత్రుయలన్. ౨౩౩

వ. ఇది ప్రభాతచ్ఛాయను మొదటిచరణమునను అపరాజితచ్ఛాయను రెండవచర
ణమునను మాలినీఛాయను మూఁడవచరణమునను నడుచును నాలవచరణము క
వికల్పితము. ౨౩౪

మణిదీపిక.

గురుపితామహముఖ్యులఁ గినిసి ఘోరరణములోఁ
దెరలిచె నరుఁ డని పలుక రత్నదీపిక ల్దనరును న
ఝరనభభ్నభస ల్నానసజ, కారభసలు నభర్సనసనసలు
స్భరసజాగలు భూపతు ల్వీన, ఘానవిశ్రమయుక్తిలోన్. ౨౩౫

ఉ. ఈసమవృత్తరాజి నుదయించువిరామములు న్గణంబులుం
బ్రాసము లెల్లఁ దప్పక నమర్చి వచించిన నైదుకోవ లై
భాసిలు వృత్తపద్యము లపారము లై విషమాహ్వయంబు లై
వాసికి నెక్కు శిష్టజనపాలనదుష్టనిశాటచాలనా. ౨౩౬

వ. ఇది పంచవిధవృత్తవివేకం బింక వైతాళీయజాతివృత్తంబు లెఱింగించెద. ౨౩౭

మ. ప్రకటింతు న్సర దక్షిణాంతికయు నౌపచ్ఛాందసంబుం బ్రవ
ర్తక యాపాతలికాపరాంతికలు వైతాళీయను న్జారుహా
సిక ప్రాచ్యంబు నుదీచ్యవృత్తియనఁగాఁ జెల్వొందువృత్తంబు లిం
దుకులశ్రేష్ఠ యనేకముల్గలుగు నందుం గొన్ని వాక్రుచ్చెదన్. ౨౩౮

క. ఖ్యాతి గనురగణలంబును, వైతాళీయాఖ్యవృత్తి వారనులందున్
బీతాంబరగురువునకు, నీతిగఁ గృతుల న్లఘువులు రెండేసి యగున్. ౨౩౯

అందు దక్షిణాంతిక.

ఉరుసాజగ లుండు జేసులన్, సరులం దూకొను సభ్రనంబులున్
దోర వేడితఁ గొమ్మిదింట రాథరలోఁ జెన్నగు దక్షిణాంతికల్. ౨౪౦

ఔపచ్ఛాందసము.

ఇమిడి సలమ లేడు తొమ్మిదింటన్ సమకూలు న్యతి షడ్లరేఫయంబుల్
సతుల న్యసుల సహరేఫయంబుల్, క్షమలో నౌపచ్ఛాందసంబు మించున్.

ప్రవర్తక.

స్థిర జేసి నుదీచ్యవృత్తియున్, బరఁగు న్సర్లను బ్రాచ్యవృత్తియున్
గిరిమణిముఖకీలితంబుగన్, బరముఁ గొల్వఁ బ్రవర్తకాఖ్య మా. ౨౪౧

ఆపాతలిక.

లము లాలు వలున్భగగంబుల్, లము లెనిమిదిటికడన్భగగంబుల్
క్షమ గిరినవాశ్రాంతులుం దగున్, బ్రమథితముర యాపాతలికాఖ్యల్.

### పరాంతిక.

ఇలవ_క్త్రక•వృత్తరీతితోఁ, బల నైన పాదచ•తుష్టయంబుల౯
బలసినయది• పద్మనాభ చె, న్నలరుంగృతులఁ బ•రాంతికాఖ్యచే. ౨౪౪

### వైతాలీయవృత్తము.

ఋతులఘువులు• రేఫవంబులు౯, భృతవసులఘువులు• రేఫవంబుల౯
జత సమకొన• సారసాక్ష పా, లితశుకవైతా• లీయవృత్తమా ౨౪౫

### చారుహాసిక.

ప్రథమమున నసు• వక్త్రకాఖ్యను, తనుచందంబున• ధాత్రి సత్కవుల్
సమకూర్చిన• శార్ఙ్గకార్ముకా, సమత నొక్కటిఁ జ•చారుహాసికల్. ౨౪౬

### ప్రాచ్యవృత్తి.

తొలి నేపటఁ• దొమ్మిదింట ద్రాం, తులు పదునాలుగు• దూఱు వేసలం
దులఁ బడాఱు•తొంగలించు గ•న్నలరి న్మాధవ• ప్రాచ్యవృత్తి యా. ౨౪౭

### ఉదీచ్యవృత్తి.

తమ కిర వగు• దక్షిణాంతికా, ఖ్యము తేజంబున• నందగించు మే
లిమికృతులఁగ• డింది వేలుపా, లిమురు న్ధాత్రి ను•దీచ్యవృత్తికల్. ౨౪౮

వ. ఇది వైతాలీయజాతివృత్తవివేకం బింక మాలికావృత్తంబు లెఱింగించెద. ౨౪౯

### మాలికావృత్తవివేకము.

తే. మాలికావృత్తములనంగ• మఱియు నైదు, దనరునిరువదియాఱు భఁ• దములమించి
యలయగ్రాహిలయవిభా• తిలయహారి, గదసహజత్రిభంగి యుదండ•కంబులనఁగ

క. ముప్పదితొమ్మిదిమాత్రల, ముప్పదియక్కరములపద• ములయంఘ్రులు నా
ల్గొప్పయతిప్రాసంబులు, గుప్పలయగ్రాహి యనఁగఁ• గోమరొంచు హరీ.

### లయగ్రాహి.

ఇం బడరఁగా భజస• నంబుల తుదన్భజస• నంబులపదంపడి భ•యంబులు లయగ్రా
హింబరఁగు ప్రాసవిర•మంబు నలుమాఱు గుడు• రంబటుక వీశులుతి• రంబుగ వచిం
పఁ౯ సంబరముగా వలసి• తోంబగి లి దానవక• దంబము సహాయముగఁ• బంచి
త్రిదశుల్దు, గ్ధాంబునిధి ద్రచ్చియమృ• తంబు గొనఁ జాలు సమ• యంబు దొరకించి
తిమ•దంబున ముకుందా.

క. ముప్పదితొమ్మిదిమాత్రల, ముప్పదినాల్గు లిపులపద•ములయంఘ్రులు నా ౩౫౨
ల్గొప్ప యతిప్రాసంబులు, గుప్ప లయవిభాతి యనఁగఁ• గోమ రొంచు హరీ.

### లయవిభాతి.

పెనిమిటులు భార్యలును దనయులను గాంచిరట, మనమలర దోడ్తలప్ప మునసలద
శస్యం, ధనుఁడు మతికోసలియుఁ దనకడుపులో పలభు వనములఖిలంబు నిడుకొని
నకొడుకు రన్నా, మునసిన సనద్వయము వెనుకనసగంబులును జొనపియతులుండు
నెడ లనలుమఱు ప్రాసం, బునిలిపి కవీశ్వరులు మునులయవిభాతి నిటు నినువినుతి
సేయుదురు సనజవళనేత్రా. ౨౪౪

క. ముప్పదితొమ్మిదిమాత్రలు, ముప్పదియేడులిపులపద మలయంఘ్రులు నా
ల్గొప్ప యతిప్రాసంబులు, గుప్పిన లయహారి యనఁగ గొమరొందు హరి. ౨౪౫

### లయహారి.

నగణములు పదునాకఁడు సగణమును గురువునిడి మిగులనలుమఱు యతులు వగులుల
యహారిక, చెగడిశతధృతిపరిపారిగతులమె. అయిడినమ రిగిర్ఘుమతను పుంబొదివి
నిగిడిచనియంతక, నిగమములు గొనివెసను జగములద్రువఁబఱ చియొ దిగికడపలి
జలధిము నిఁగినభియాతిక; చెగడుచున్నాడిసికరిచి, తెగఁగొనినతురగగళుఁ డ
గుహరిననఁగ సుకవులగణుతిచెలంగుక. ౨౪౬

క. ఇది నేత్రాంబుఖిలము ము, ప్పదినాలుగువర్ణములను బాదం బగుఁ ద
త్పదచాతుర్థికములచే, నాదవుఁ ద్రిభంగి యనువృత్తముర్వరలోనక. ౨౪౭

### త్రిభంగివృత్తము.

విసునక పలుమఱు రసఁ బ్రతిపదమున, హసగలుమూఁడొకతీ రైమతీ వేఫైమూఁ
డొకతీరై, రసనగణములును, ససభమసగములు, పొసఁగినపద్యతి సంగిన్రరణరంగిం
జెల్లుఁ ద్రిభంగిక, మసలెడు ద్రనముని దుసికిలిమఘరకుఁ గసైకిసమృద్ధశుభాంగిం
దగుసంగింజేరిత్రిభంగిక, వెసమనిచిననవ బిసరుహనయనయ నిసఘలవేద్యాగు
రింతుక వినుతింపుక నిచ్చలుఁ గాఁచుక. ౨౪౮

క. ఇవినియమము లేనివుహా, పథమునఁ గావలసినంత వర్ణాగింపక
గొద లేక నవురుదండక, ముదధీంద్రశయాన తావ కోత్తమనుతులక. ౨౪౯

### దండకము.

విద్వాంసు లెల్లక హకారంబె కాని నకారంబె కాని సకారంబె కానీ వచింపం
దగు న్ముందుగా నిందుఁ గాదేని యాదిం దకారంబు గల్పించి యామీఁద నై
ల్లం దకారంబులే మొదుగా నిచ్చకు న్వచ్చునందాఁక నిర్మించి గుర్వంతమున్ జే
సిన న్దండకం బంద్రుభక్తానుయాయీ భుజంగేంద్రశాయీ పయ స్సక్రదక్ష్యాది
కస్త్రైఖిస్త్రైర్యకల్యతాపింఛగుచ్ఛచ్ఛవిస్వచ్ఛమూర్తీ రపింఛాంచహూ హాసదా పూ

తద్బృందాటవీమధ్యరథ్యా సమారాధ్య తత్త్వార్భకక్రీడ హేమేషణాఖర్వదోర్గర్వసంభూతసర్వోర్వరాభారనిర్వాహకార్ధాంగితిక్రోడ చండప్రభామండితానేకమార్తాండకోటిప్రతీకాశ నానావిధస్తోకలోకేశ వైకుంఠసువేశ ఘోషాంగనాలోల కాదంబినీనీల గోపాలబాలా నమస్తే నమస్తే నమః. ౨౬౦

క. దండిగ నేకపదంబున, నుండెడివిని నాల్గడుగులనుండెడివిని వే
దండావన దండకముల, పిండువు దనరారుఁ జండవృష్ట్యాదికముల్. ౨౬౧

దండకము. ధూర్తుల్నకారంబులు రెంటిపై సప్తరేఫంబులుం గూర్చినం జండవృష్ట్యాఖ్యమయ్యె, న్నకారంబులు రెంటిపై నష్టరేఫంబులుంగూర్ప నర్ణాఖ్యమయ్యె, న్నకారంబులు రెంటిపై తన్నసంఖ్యాకరేఫంబులుంగూర్చినన్నర్ణవంబయ్యె, నోలిన్నకారంబులు రెంటిమీఁద దశఖ్యాతరేఫంబులుం జెప్పినన్ వ్యాళమయ్యె, న్నకారంబులు రెంటిపై రుద్రసంఖ్యాకరేఫంబులు న్నిల్ప జీమూతమయ్యె, న్నకారంబులు రెంటిపై నాప్పపంద్రెండు రేఫంబులుం బెంచి లీలాకరంబయ్యెఁ, బన్నిన్నకారంబులు రెంటిపై మించుపద్మూఁడు రేఫంబులు న్నంతనుద్దామమయ్యె, న్నకారంబులు రెంటిపైఁ బద్నాల్గురేఫంబు స్నంభమన్దండకం బయ్యె, నీరీతిలోడన్నకారంబులు రెంటితర్వాత నేడాదిగాఁ గారకారంబు లొప్పారఁగా నంత్రిమినాక్షరం బెక్కించి కావించినం జండవృష్ట్యాది నానాలసద్దండకంబుల్ ప్రసాధించఁగాకుండ నాల్గింత్రములుం జేయఁగావచ్చు, నీరీతి నేకోనసాహస్రపర్యంతముం గూర్చియిచ్చావిధం జెప్పఁగావచ్చు గాంతంబుగా. రాధికాబాలక్రీడరుక్మిణీమానచోరా సుదంతాసునాథా కళిందాత్మజానాథవాఃకేళి కాసక్త గోపీజనోత్సృష్టవస్త్రాపహారా శుకాస్యోక్తవాక్యామృతాంభోధిచంద్రోదయా సాంద్రదేవా నమస్తే పునస్తేనమః. ౨౬౨

జాత్యుపజాతినామములు.

క. జాతులు నుపజాతులు నన, భూతలమున రెండుగువిధములన్వృత్తంబుల్
జాతులు కందాదులు నుప, జాతులు గీతాదికములు సరసిజనాభా. ౨౬౩

సీ. కందభేదము లాటులు గాక నుత్సాహంబుతరువోజ మధ్యమాక్కరలునైదు
దీపించుమంజరీ ద్విపదత్రిపదచతుష్పదపంచపాదిమట్పదవిధములు
లొప్పిదివిధములతో నాప్పరగడలు కళికలు నుత్కళికలునుగూడ
జాతులు నవవిధగీతంబులును సీసపత్రకంబును నుపజాతులయ్యె
తే. ననుచు నన్నయభట్టుభీమనయుఁ బెద్ద
సనివుఁడును మూర్తి తాతినాజయునంత
మంత్రియునుఁ దిమ్మరాజు నిమ్మాన్నశిక్కఁ జెప్పి
రంపముగఁ బాము చేసిన ఛందములను. ౨౬౪

## జాత్యుపజాతినిరూపణము.

క. గురులఘువులలో నెయ్యది
మురసంహర ప్రథమపాదముఖమున నిలుచున్
ధర నుపజాతులు దక్కఁగఁ
బరఁగ నిలుచు నవియె నాల్గుపదముల మొదలన్. ౨౯౫

మ. ధరణిన్ జాతుల కాదివర్ణ మొకఁడే తప్పంగరా దెల్లెడన్
వారి తజ్జాతిగణంబులైన సరియిట్లట్లైనఁ గావచ్చు సం
దరధారీ యుపజాతులం బ్రథమవర్ణంబు న్యథేచ్ఛంబుగా
నొందిం జెప్పఁగ వచ్చుఁ బ్రాసములు నిల్చున్వళ్లకై యొక్కచోన్. ౨౯౬

క. తెలియఁగ వినుమీ కామే, పలినాథ గ్రామధామ ప్రస్తుతపద్యం
బులు గీతకందసీసా, దులు పరతిగణనియమములతో వివరింతున్. ౨౯౭

క. గురులఘువుల పేరిటియ, క్షరములు నట్టగణనామకములగు లివ్వులున్
సురరిపుగర్వత మోఘా, స్వర దీర్ఘము లైన రెండుగా నెన్నఁదగున్. ౨౯౮

### కందషట్కాభిధానంబులు.

గీ. పరఁగఁ గందము పథ్యయు మరి విపులయుఁ
జపలయును ముఖచపలయు జఘనచపల
యనఁగ గందపద్యంబు లీయాఱువిధము
లఖిలసుకవికృతులలోన నలరుచుండు. ౨౯౯

సీ. నలగగభజసగణంబు లేను నెకాని కందంబునకు నొండు గణము సొరదు
వీటిలోపల నొక మూఁటిచే వడిలేని హీనపాదము ముందుగాఁ గాఁబడును
తరువాత దీర్ఘపాదము పంచగణములఁ దగు దాని మూఁడవ తావునందు
నలజలు దక్కంగ గలయ వామీఁద నేయతి దాఁకు నిజపదాద్యక్షరంబు

తే. తుదిని గాసలు దక్కంగ గదియ దొకటి, కొంచెపదుగుల బేసుల గొప్పకాల
సరుల జగణంబు గూడదు చరణయుగము, భువిని సగమయ్యె రెట్టింపఁ బూర్ణమయ్యె

వ. ఇవి సమస్త ప్రబంధములందుఁ జెప్పెడు సహజకందపద్యలక్షణము. ౩౦౦

### పథ్య.

క. ధరలోఁ బథ్యాకందము, హరి యగు నాఱవదియైన నల మాఱిటిపై
విరతియుఁ గూడఁగ మూఁటను, నెరయుఁ జతుర్గణములు గము నిలిచినచోన్.

### విపుల.

క్షమ బేసికాలు సమపా, దములోఁ జొర శబ్దమొకటి యతనరింపన్
సమధీ పథ్యాకందము, గమనిక విపుల యన నలరు కందమగున్. ౩౦౧

### చపల.

సమపాదములమొదల జగణముం గడయడుగునను ద్విగుణలఘువులపై
సమగణమును యతి యాఱవయువి, ల మహా ముకుందచపలలకు ననురుక్. ౨౭౪

### ముఖచపల.

క. స్థిరఁ జపలాకందమునకై, ఖరిక్ మొదలియడుగు చెప్పఁగఁ గవులు పె
ట్టిరి ముఖచపల యనెడుపే రరిదిగ వైకుంఠ వరద యఘజైత్రా. ౨౭౫

### జఘనచపలాకందము.

క్షమఁ బథ్యరీతిఁ బూర్వార్ధము చపలాకందముక్రియఁ దగు నపరా
ర్ధము జఘనచపలకు మునీంద్రమానసమరాళ దాశార్హా. ౨౭౬

### ఉత్సాహలక్షణము.

ఈహ మీఱ సూర్యగణము లేడు గూర్త మైన ను
త్సాహవృత్త మనఁగఁ గృతులఁ జాగుచుండు సత్కవి
వ్యూహనుతులు గాంచి కృష్ణుఁ డొడిసి కాళ్లు పట్టి పెక్
ద్రోహి చావు మనుచు ఖరునిఁ ద్రోచెఁ గాళ్ల మీఁదుగాక్. ౨౭౭

### తరువోజ.

శతమఖత్రితయంబు జలజాప్తుఁడొకఁడు, శతమఖత్రయిమీఁద జనువిశ్రమంబు
ప్రతిసేయుడుగులో ప్పఁగ రెండుగూర్పఁ, బతిమీఁద నాల్కొక్క పాదమైతనరుఁ
జతురంగ్రఘురీతి జతకూర్చి సుకవి, చతురవాచారూఢి జలజాక్షునుతులఁ
గృతులందుఁ దరువోజ నియోజసేసఁగఁ, గృతకృత్యుఁ డైదెప్పు క్షితినెల్లసభల.

### పంచవిధాక్కరంబు లెట్టివనిన.

క. మధుమథన పురందరధా, మధిచంద్రగణాలిచేత మహామధ్యా
మధురాంతరాల్పపూర్వా, గ్రథితాక్కరలైచు దనరు గ్రంథములందున్. ౨౭౯

### మహాక్కర.

సూరుఁ డొకఁడును మున్నుగాఁ దర్వాత సుత్రాము లేవురు పిలుఁదనాక్క
తారకేశుండు జత యైన నిట్టిస పగణంబు లొక్కపాదంబునకుఁ
జేరు రెండవచోట నాలవచోట జిత్రభానుగణంబు గదియుచుండు
నోరసిలు నాలవగణంబుపై శ్రాంతి యుత్పలాంగ మహాక్కరంబునకు. ౨౮౦

### మధ్యాక్కర.

మునుపుగా బ్రాసంబు గూర్చి మూఁటిపై శరము బునిచ్చి
చన నింద్రయుగళంబుమీఁద జలజాప్తు నొక్కని జేర్చి

యిను మడించిన నాలుగణములు లెనసిన నొక్కపాదంబు
దనర వక్కాణించినంతే దగు నిట్లు మధ్యాక్కరంబు. ౨౭౧

మధురాక్కర.

మురనిశాటేంద్రసంహార, మూటిపై విరతు లుంచి
తరణిశక్రత్రయంబు సు, ధామయూఖునిలోc గూర్చి
వరుసతో నేనుగణముల, పాద మొక్కటి యొనర్చి
దారలc జెప్పిన నొప్పుc గృ, తుల మధురాక్కరంబు. ౨౭౨

అంతరాక్కర.

భానుc డిద్ద ఱాదిత్య, పతులు చంద్రుండు
పూని నాలు గగుచరణ, ములకుc ద్రిగణాంత
మైనవర్ణంబు విరతి, నంతరాక్కరంబు
భానుశీతాంశునేత్ర, పద్మాకళత్ర. ౨౭౩

అల్పాక్కర.

విరమంబు రెంటిపైని స్తరిల్లు, సురపులిద్దఱు నొక్కసోముండు రాc
జరణ మీమూcటిచేసాగియొప్పు, నారపపర్యంక యల్పాక్కరంబు. ౨౭౪

మఱియు మంజరి.

తుద మొదళ్లను నంటి దూcకు శబ్దంబు, వర్జించియతి మాలు ప్రాసంబులిడక
ప్రాసంబులేనిద్విపద నైు చెలంగc, బ్రాసంబుతుదలలమcబదిలంబు చేసి
సాగింపcగాc జాలసత్కవీశ్వరులు, మోదంబు పెంపార భూమిలో పలను
బద్మాక్షు డెపుడుచేపట్టుమంజరుల, చందాన నలరారుజగతిమంజరులు. ౨౭౫

ద్విపద.

సురపతిత్రితయంబు, సూర్యుc డొక్కcడు
విరమంబు రెంటిపై, వెలయు నొక్కటికి
మీటిc దగ నీరెంటి, చే నొప్పు ద్విపద
మితి లేక చెప్పిన, మేలంద్రు కవులు. ౨౭౬

త్రిపద.

లొలుతను నల్వు రిం, ద్రులు రెంట మూcటను
బలభిద్ద్వయంబును రవియు, వళి లేక నలరారుc ద్రిపద. ౨౭౭

చతుష్పద.

జలజాసనవిశ్రమ సంయుత మై, లలి షోడశమిత లఘువులతోడc
గలసి చతుష్పదగతులను ధరలోన, జెలు వగుc జౌపద సేవకసులభా. ౨౭౮

## వితాళచతుష్పద.

భానుయుగముపై నయి నవల నిం, పూనమణిభరతా నాంధిభరలో
జా నలరుఁ జతుష్పదవితాళా, ధ్యానమున వినాయకతురంగా. ౨౮౯

## కర్ణాటచతుష్పద.

మొగిఁ బంచలఘుగణం, బులు నూఁడు రవియుఁ
దగులంగఁ బ్రాసంబు, వాఁక రెంటిపయి
నగును వళికర్ణాట, కాఖ్యాచౌపద కై
సఁగుఁ గృతుల సత్కవుల, సమ్మతముతోడ. ౨౯౦

## పంచపద.

క. ఆది సమవృత్తములలో, నైదంఘ్రుల నెద్దిరైన నార్యులు వలుకన్
బాదుకొని కృతులలోపల, నాదరమునఁ బంచపాది యనఁగా నలరున్. ౨౯౧

ఉ. ధన్య సుశీల యన్వనిత, తత్పరత న్నదియొద్దునందు స
త్కన్యలు సేయుసువ్రతము, తానును వేడుక నాచరించి స
న్మాన్యత గట్టినట్టినవ, మండితతోర మసూయ చేసి పె
ద్పైన్యము నొందె కానలవి, ధాతృకృతంబున సంచరించు కాం
దిన్యమహామునీశ్వరుఁ గ, దింధిగఁ బ్రోచినరుక్మిణీశ్వరా. ౨౯౨

## షట్పద.

ప్రాసము లుద్యద్యతులు వాసవులాఘ్రులపై సుధా దీధితితో నిర్యతి
భాసిల్లఁగాఁ బాదమీసూటితో నాల్గుఁ జేసినకృతులందు షట్పదాఖ్య. ౨౯౩

## నవవిధరగడలు.

వ. మఱియు వైతాళీయభేదంబు లైనరగడ లనేకంబులు గల వందుఁ బ్రసిద్ధంబులై
న హయప్రచారాదినవవిధంబులు ప్రబంధంబుల వర్తిల్లునవి యెయ్యవియనిన.

క. నరసఖ హయప్రచారము, వరుసఁ దురగవల్గనము విజయమంగళమున్
ద్విరదగతి విజయభద్ర మ, ధురహరి హరిణవృషగతులు దొరలుఁ గృతులన్.

క. ఆద్యంతప్రాసంబుల, భేద్యంబులు రెంట రెంటఁ బెనఁచి పదంబుల్
హృద్యంబుగఁ గూర్చిన నన, వద్యంబులు రగడ లెల్లవాలుం గృతులన్. ౨౯౪

క. కాద లేని నైపుణులఁ జా, పదనే నుత్సాహవృత్తపదయుగ్మముచేఁ
దుద నాదిని బ్రాసంబులు, వదలక విరచింప నయ్యెఁ బ్రాజ్ఞులు రగడల్. ౨౯౫

### హయప్రచారము.

ఋతువిరామ మినుసులు నల్వు, రతుక నొక్కయంఘ్రి చెల్వు
దనర హయతతి దార్ఢ్యఁ డంచు, మునుకుకాది మునులు వొగడఁ
జను హయప్రచారరగడ. ౨౯౮

### తురగవల్గనము.

ఇరవుల న్హయప్రచార మినుమడించి కృతులఁ జెప్ప
దురు విచారితాశ్వివరణ తురగవల్గనాఖ్య మొప్పు. ౨౯౯

### విజయమంగళము.

తురగవల్గనములు రెంటితోడ విజయమంగళంబు
భూర్తకంసతూలదహన తుహినహీరసదృశకీర్తి
పరఁగ దుగ్ధసింధుమధ్యభాసురాంతరీపవర్తి
వారివాహసదృశమూర్తి భక్తజనహృదబ్జపూర్తి. ౩౦౦

### ద్విరదగతి.

కర మొప్పఁబంచలఘుగణచతుష్టయముచే
విరమంబు రెంటిపై ద్విరదగతి చేరిచే. ౩౦౧

### విజయభద్రము.

ద్విరదగతి రెట్టింప విజయభద్రము చెల్లు
విదురపూజితపాద వేదసన్నుతనామ
దరచక్రకార్ముకగదాఖడ్గధారణా తాపింఛసమగాత్ర దళితదైత్యస్తోమ. ౩౦౨

### మధురగతి.

నాలుగుమాత్రలు నాటినగణములు, నాలుగు రెంటికి నలి విరమణములు
గలసి మధురగతి కనఁ జను జగణము, తొలఁగిన ధృతకౌస్తుభ కవిరమణము.

### హరిగతి.

నలసభగగములలోపల నేదైన నను నెనిమిది నాల్గిటిపైవిరమము
గలసినహరిగతి చెలువగుఁగృతులం గవివరులౌ నని చెప్పిననియమము.

### హరిణగతి.

నరహరి పవియు నాలుగులములు, కరియతి హరిణగతికి నెళవులు. ౩౦౫

## వృషభగతి.

ఇరువదియొనిమిది లఘువులు పదియేనిట విశ్రాంతియుఁ గూర్చిన
సిరవగు వృషగతి పద్మాక్షపా యిది విను మాదరమున ముదమున. ౩౦౬

## యక్షగానలక్షణము.

సీ. తుద నేడులఘువులు లోఁగించి చదివినఁ ద్రిపుటకు వృషభగతి పదయుగము
లరిఁ గడపల నొక్కలఘువు మానినజంపె మనుద్విరదగతిస పపదయుగము
గురుగురుచ్చెర కుఁ దురగ వల్గనా; హ్వయమేకతాళియ్యామసురగతికి
నఁగ్రఝి కిర్వదివాల్ముగటతాళమున మాత్ర లోలి విశ్రాంతిపాద్నాలుగిఁటఁ
తే. దెలియ నర్థంబు నర్ధచంద్రికలుపీటి, యక్షగాన ప్రబంధంబులకుక వచ్చు
రగిడభేదంబులివి యఁద్రు, రసఁ గవీంద్రు, లశితనిజసేవకస్తోమ యక్షధామ.

## ఉదాహరణలక్షణము.

సీ. సప్తవిభక్తులు సంబోధనంబును గూడ నెన్మిదివిభక్తులు క్రమమునఁ
బతిపేరుదొరలంగ బద్యమొక్కటిఁ జెప్పి రగడభేదములుమార్గములఁగాఁగఁ
గళికలు నెనిమిది దళములు గావించి దానిలో సగము నుత్కళికఁ జేసి
యది యొక్కసమసన బద్యేదుదళము లెన్మిదిఁ గూర్చివానికిఁ మదవిభక్తి
తే. బయలు పటిచి కట్టకడను బద్య మొకటి, పలుకవలయునుసార్వవిభక్తికముగ
నిర్వదా ఉపద్యములందు నిడిన ధాత్రి, నిది యుదాహరణ మటంచు సిద్ధచరిత.
సీ. సంబోధనమునకు సరసాళి జయపతి ప్రథమకు వాణివిరావళియను
తృతి ద్వితీయకు ఝుటకీర్తిమతియుఁ దృతీయకుఁగీర్తి సుభగయునటఁ జతుర్థి
కివి దేవలాభినియను భోగమాలినిపంచమికి నెసంగుపాణియను గ
ళావళి షష్ఠియ లలిత కాంతిమతియు సప్తమికిని ఘూర్ణి, సత్కమలయు
తే. నాదిసూక్తులనామధేయములు వెనుకఁ, బలికినది వేల్పు లష్టవిభక్తులకను
వారుతమశక్తికాలఁచిని వ్రాలుఫలము, లిత్రు నాయకద్వయమునకిందిరేశ.
సీ. సంబుద్ధి గూడలించ్చిన సప్తవిభక్తులు పలికిన భక్తిసద్దలి యనంగ
సంబుద్ధితోఁ గూడ సప్తవిభక్తులు పలుక నొప్పారుబద్దలి యనంగ
సంబుద్ధితోడ విషమవిభక్తులతోడఁ బలికినకృతియు విద్దలి యనఁగ
గళిక లుత్కళికలు గమకింపఁ బలికినకావ్యంబు నుత్ఫుల్లకంబు ననఁగ
తే. సనఁబాటు ప్రబంధంబులందుమిగుల, వాటుకొనిమొప్పచుండు నీనాల్గుదెగలుఁ
గానఁబడు నుదాహరణము గ్లానలోల, కామెపల్లీశ వల్లవీకామ కృష్ణ. ౩౧౦

ఉ. శ్రీవనితాసనాథుఁడు నశ్రితభక్తమనోంబుజుండు వి
శ్వావసుఁ డుగ్రసేనుఁడు వైష్ణవుఁ డజేయుఁ డగణ్యసద్గుణ
ప్రావృతభూషణోజ్జ్వలుఁడు పాపతకోటిమరిచి భద్రదం
తావళనాయకావనుఁడు దారుఁడు కృష్ణుఁడు మమ్ముఁ బ్రోవుతన్. ౩౧౧

కళిక.

మఱియు దేవకీశౌరసేనికు, మారనిర్మలరత్నరాజము
కలుషకటసురల నెల్లఁ దారుణ, కదనధారుణి మనుము తేజము
బలిమి నందనవనములోపలి, పారిజాతము ధరకుఁ దెచ్చెను
గొలఁది మీఱినసమ్మదంబునఁ, గుండలంబులు తల్లి కిచ్చెను
జెలఁగి నరునకు సూతకృత్యము, చేసి కౌరవులఁ బరిమార్చెను
దలఁపు మెలు వనదాసచయములఁ, దగిలి కరుణనిముక్తిఁ జేర్చెను
వెలఁదికోఅకును బాణుచేతులు, వేయు నతిసవిక్రమోగ్రుఁడు
జడదములజిగి దెగఁడునాడలున, బానుమీ తేజసుతుల సమగ్రుఁడు. ౩౧౨

ఉత్కళిక.

కమలనేత్రుసిరాక రోయుచు, యమునయొద్దనుఁ దపము సేయుచు
నున్నకాంతను జూచి రయమున, నున్న సుద్దివచించి ప్రియమున
నరుఁడు గూర్చినమిత్రునానతి, కరము పట్టెడుదానిఁ దానలి
విదళితాసురసార్వభౌముఁడు, యదుకులాంబునిపూర్ణసోముఁడు. ౩౧౩

ఉ. మానవులార రోగములు, మానును లేములు లేవు సంపదల్
బ్బా నగు మిక్కిలి ముల్లోలఁగు, జాలు నఘంబులు మందబుద్ధులై
దీనత నొంద నేటికిని, తిక్కిరభక్తినిఁ గొల్వుఁడీ పరా
ధీనులు గాక మీరు వసు, దేవకుమారకు ముక్తికోసమై. ౩౧౪

కళిక.

మఱియు ప్రేతల నెల్ల, మరుబుకొల్పినవానిఁ
దాళవృక్షము లెల్ల, ధరణిఁ గూల్చినవాని
గాలిరక్కసుఁ జావఁ, గాలఁ ద్రొన్నినవాని
లీలఁ గొల్తుమగడింది, లేమిఁ బాపెడివాని. ౩౧౫

ఉత్కళిక.

మందుపావకుఁ గొల్చి, కాండవాహుని ప్రేల్చి
ఫాణివేశ్వరుఁ గాంచి, పార్థు నక్కడ నుంచి

వారకుఁ డమరింపఁ, జేరఁ దెచ్చినమంచి
యరద మెక్కక పూని, పురికివచ్చినవాని. ౩౧౬

చ. పులసిల నేల మానవుల, పుట్టువు పావన మయ్యె నెప్పుడున్
గళవళ మేల రోగముల, కాలగతిం గడవట్టు నీతిబా
ధలును దరిద్రతావ్యథలు, దవ్వుల కేచను వాంఛితార్థముల్
గలుగు నమేయచేతఁ గమ, లాధవుచే వటపత్రశాయిచేన్. ౩౧౭

కళిక.

మఱియు బ్రహ్మమాయఁ గెల్చి, మసలుమంత్రవాదిచేత
నెఱిఁగి సాంభకునకు వరము, లిచ్చి మెఱయమోదిచేత
మృతతనయుని మరల గురున, కిచ్చినట్టియమృతుచేత
నతులరాసకేళి సలిపి, నట్టియాదినటునిచేతఁ
బిండి రుబ్బునాతిమోము, పెరుగు దుడుచుకొంటెచేత
మంచుచున్న కొరుదిచ్చు, మరిగి త్రావునముకుచేతఁ
నెలుఁగుతోడఁ బోరి మణియు, నింటిఁ గొనినయసురుచేతఁ
వెలయఁ మలసిపూసపేరు, వేసికొనినజోగిచేత. ౩౧౮

ఉత్కళిక.

గట్టిగళరపంజరంబు, గట్టఁ దలఁచి వేగిరంబు
చవుటికడలిచెంతఁ జేరి, పవనతనయుతోడఁ బోరి
తన్నుఁ జేరినంత వచ్చి, చెన్ను గెలుపు నరున కిచ్చి
మహిమ మెఱయుకృష్ణుచేత, మిహిరకోటిదీప్రుచేత, ౩౧౯

శా. ఓలంబాసకు నేకవత్సరములో, నుప్పొంగి పెక్కేఁడులు
న్లీలాకారమునం గొలంకునడుమ, న్నిట్టాదునక్రంబుతోఁ
జాలం గయ్యము చేసి చిక్కినవుడు, స్తంబేరమస్వామికై
కేలం బట్టి నిమిర్చినట్టిహరికై, కృష్ణాంబుభృన్మూర్తికై. ౩౨౦

కళిక.

మఱియునుఁ గౌమోదకియును ఖడ్గము, మణియును శంఖముఁ బట్టినహరికై
మెఱయఁగ విద్యుచ్చేలముఁ దాల్చుక, మెలఁగెడుదధికణపరిదిగ్ధునకై
పెలుచం గదిసినమల్లుర నిరువురఁ, బిడికిటఁ బొడిచినబలుమల్లునకై
వెలయఁగ యమునానదిలోఁ గాళియ, విషధరుఁ దోలినయదుసింహునకై
విజయునిరథసారథి యై గురునృప, భీష్మాదులఁ గెలిచినభూపతికై

గజిగా యవనాధిపు ముచికుందునిఁ, గనుదృష్టినిఁ జంపినశ్రీపతికై
బలుపిడి దేవకితండ్రిని మథురకుఁ, బట్టము గట్టినగోవిందునకై
కేల దాల్చినపైఖరి గోవర్ధన, గిరి మోఁచినమహదానందునకై. ౩౨౧

ఉత్కళిక.

తొలిపుట్టువునోముఫలంబున నే, బలువిడి నగుపేదటికంబున వే
సరి కొండల మందుచుఁ బైనంబై, పురికిం బరమానందమునం బై
కొని యుబ్బుచు వచ్చి కలిమిపనికిం, గని యమకు లొసంగినబాపనికి
గ్గలి మిచ్చినబాలస్నేహునకై, కలుములచే నేలినకృష్ణునకై. ౩౨౨

మ. పురిటింటం బసిబిడ్డచందమున నా, పోవంగ నాఁ డాత్మలో
నురు వొప్ప స్విమదుగ్ధయుగ్మకుచయై, ముద్దాడుచాకాసీగు
ర్త్రైటిఁ గిష్టంబుగఁ బాలు ద్రావుమిషచే, నిర్త్యైనకాలంబునన్
ధరణిం గూల్చిననందపుత్రువలనం, దార్కాణ ధర్మస్థితుల్. ౩౨౩

కళిక.

మఱియు గీతామృతసమగ్రసింధునివలన, వఱలు భవపటుతిమిరవనజబంధునివలన
బొంకు లెయ్యెడలేని భూరిసత్యునివలన, జంకు లెన్నడు లేని సమరసాత్యునివలన
ఖేదము ల్బెడఁబాపు కేళిమర్దనువలన, నాదికారణమూర్తి యగుజనార్దనువలనఁ
గానరానిపదముల గాముపానువువలనఁ, బూని గొల్లాలికిఁ బుట్టుకానుపువలన.

ఉత్కళిక.

తనుఁ బిల్వ మిగులఁ గూర, దిని పాక మింపారఁ
జేసి ద్రౌపదిచేత, నాస దీరఁగ మేఁత
యడిగినమునీశులకు, నిజఁ గల్గుదాసులకుఁ
గల్పించుహరివలనఁ, గల్పస్థాయివలన. ౩౨౪

శా. కారాగారమునుండి వెల్వడి భుజం, గస్వామి సుపత్త్రమై
పై రాఁ దార్క్ష్యుఁ డుండు వాకిళు ల్బిటువన, భ్రస్తోమముల్ మీఱి శ్రీ
సూరోద్భూతి పథం బొసంగఁ దనుఁ గొం, చుం దండ్రి యేతెంచి చె
ల్వారం బల్లను నిల్పఁ బొల్చుహరికి, న్వ్యాలార నేమ్రొక్కెదన్. ౩౨౫

కళిక.

మఱియుఁ జెలియ నెలియ నుఱియు, మధునిఁ గూల్చినట్టిహరికి
నఱిమి తఱిమి పఱిమి నులుము, నక్రుఁ గొల్చినపాతకరికిఁ
గలచి చలచి యలచి పలచుఁ, గపినిఁ జంపినచ్యుతునకు

మఱిగి తిరిగి కఱిగి యొరగు, చుక్కలీడ్చినయమితునకు
సరలి కెరలి వరలి మరలి, సాళ్వుఁ జంపినశూరునకు
గరిను మెరిమె యెరిమి నెరిమి, కామెపల్లిమందిరునకు
నయమునుఁ బ్రియము రయము జయము, నరుని కిడిన కేశవునకు
వ్యయము భయము లయము క్షయము, వైరి కొసఁగుమాధవునకు. ౩౨౭

ఉత్కళిక.

గొల్ల లెల్లఁ దల్లడిల్లఁ, జల్లుజల్లు ఱల్లితాళ్ల
సోనవాన మానపూని, కాన రానికానలోన
నూఁది లోచి నోచి మోఁచి, బ్రోచినట్టివామనునకు. ౩౨౮

మ. పృథులావంతిపరస్వయంవరమున, న్విందానువిందాదిలక్ష్మా
ప్రథనక్షోణిని గెల్చి సద్గుణ సుభ, ద్రన్భద్రఁ దోడ్కొంచు వ
చ్చి ధరాధీశునమజ్జ చేసనవుసా, శ్రీకంబు గృహాభ్యక్తన
ద్విధఁ బెండ్లాడినకృష్ణునందు నిలిపె, న్వీర్యప్రతాపోన్నతుల్. ౩౨౯

కళిక.

మఱియు నుగ్రసేనామాత్యునందు, నెఱి మీఱు లయకాలనిత్యునందు
విదురార్చితపదారవిందునందు, విదళితఘోరారిబృందునందు
నాభీరువస్త్రాపహారునందు, బలిపట్టణద్వారపాలునందు
జలగాదిపకేతనూచ్ఛాయునందు. ౩౩౦

ఉత్కళిక.

సజ్జరాగంబు, రజ్జినాగంబు, కంధియోగంబు, మందరాగంబు
రావుతో నూఁది, ఫీఁపుతో మోఁది, వెలయుహరియందు, జలజాక్షునందు.

ఉ. ధర్మజుఁ డంపినం జరిగి, దంతిపురంబున నాంబికేయుతో
ధర్మముఁ జెప్పి మున్కృతులు, డగ్గఱ శాంతనవాదిసజ్జనుల్
నిర్మలచిత్తు లెన్నఁ గను, నేరుపున న్పసఁ దాల్చినట్టిని
స్సర్వవహాకృతిం దనరు, నాదువనంబున నందనందనా. ౩౩౧

కళిక.

మఱియు జగన్మోహనమాయఁ దల్చివేఁజాల, జిలుమిత ద్రౌపదికిఁ, జీరలిచ్చినకాల
సఖులతో నదిలోనఁ జల్లి గుడిచినబాన, విభునసుండెడలోనవేఁ దపేర్చినలోల
నరుతోనాగలవ్రై నాట్యమాడినసీర, సరకుగాని భీష్మునకైఁ జక్ర మెత్తినశూర
తరిని సద్గుణసుతుల దాపరించినసదయ, పెనిమినాగపురంబు పెక్కలించినవిజయ.

## ఉత్కళిక.

గురుపుష్కరాధేయా, లురుజన్యమున సేయ
శరవహ్ని జయ మెత్తి, యరద మెల్లను నెక్కి
తను గాల్చునెడ పొందు, తనయు లేగురి మడుసు
బ్రతుకఁ జేసినపుణ్య, వితత దీనశరణ్య. 334

శా. నీ వాక్యంబవు నిన్ను నమ్మి కొలుతు, న్నీచే సుఖంబబ్బె నీ
కైవే దండమొనర్తు నీవలననిం, స్తావాప్తి చేకూతెనీ
కే విశ్వాసముఁ జేర్తునింక మదిలో, పెచ్చర్యి నీయందు నా
కైవారంబులు శౌరసేనతనయా, కామేపలీవల్లభా. 335

ఉ. నామన విచ్చగింపుమిటు, నన్నయభట్టకృతాంధ్రశబ్దచిం
తామణికల్పనోక్తికల, నాచతురోపమ లుల్లసిల్ల ని
చ్ఛామతి నర్పణంబుగ నా, సంగితిఁ గామెపలీశ నీకు నై
రామయ మైతగ స్భవము, దాహరణంబు జగత్ప్రసిద్ధిగాన్. 336

వ. సీసంబు లనునవి సమవిషమంబుల రెంపుదెఱంగులయ్యెవానివిశేషంబులెట్టివనిన.

## సీసమాలిక.

యతి నైనఁ బ్రాసంబు నం దైన రెంటితోఁ జెప్పిరేనియు సమ, సీసమగును
నియమము ల్దప్పిపై నిలిచిన సీసంబు లాఱుదెఱంగులై యతిశయిల్లు
నెనిమిదంఘ్రులఁ బ్రాస మెక్కింపవల్లకై సర్వతఃప్రాససీసం బనంగఁ
బ్రాస మాఱంఘ్రులఁ బదిలంబు గావింపనక్కాలిప్రాససీ, సాఖ్య మనఁగ
నాది నేవడినిల్పి రావడేపద మెల్లఁ జేయ నయ్యాదినడి, సీసమనఁగఁ
బదఖండనములయందుఁ బ్రత్యేకయతులుగా స్థిర నవకలివడి, సీస మనఁగఁ
గదురుగా నుత్సాహ తదయంబు గీతంబు చెప్పిన విషమాఖ్య సీసమనఁగఁ
గడ వెల్లలఘువులే కల్పించి రెద్దాన సరవి సర్వలఘుసీ సంబనఁగఁ

తే. సప్తవిధము లివియశబ్ద,శాసనుండు, పంచమామ్నాయభక్తి లోఁబల్కఁగాని
కడమకవు లాఱు సీసము ల్విడిచిపెట్టి, చెలఁగి సమసీసపద్యమే చెప్పినారు.

అందు సీసలక్షణ మెట్టి దనిన.

క. సురపతులాఱ్గురిపై భా, స్కరు లిరువురు గూడనొక్క చరణము పొల్పుం
బరఁగు నవి నాలుగడుగుల, విరమమునపై రెంట రెంటు వెలయఁగ వలయున్.

క. వానిఁ జరణములు నాలుగు, చేసి తుదిని గీత మొకటి చెప్పఁగ నయ్యెన్
సీసము తంగెడజేశవి, భాసురశుభగీతల కామెపలిగోపాలా. 340

## సమసీసము.

బ్రతికించె నెవ్వాఁడు। మృతగురుతనయుని మెలఁత వేఁడిన మెచ్చి। మేలుచేసెఁ
బోషించె నెవ్వాఁడు। పొదివిన దారుణాపద లెల్లఁ దొలఁగించి। పాండుసుతుల
వెడలించె నెవ్వాఁడు। వెడపాపుబావిలో నూసరవెల్లియై। యున్న నృగుని
మర్దించె నెవ్వాఁడు। మౌసలంబున వృష్ణియదుభోజసైన్యాంధకాదినృపుల

తే. ద్రేల్చె నెవ్వాఁడు ఖాండవ। విపిన మెల్ల, జాతవేదోత్థవిలసిత। జ్వాలమీఁద
నతనిఁ గీర్తింతు మదిలోన। ననుదినంబు, నవఁగ నలరారు సమసీస। మఖిలకృతుల.

## సర్వతఃప్రాససీసము.

వేదండవరదుండు। వేధోండగాంగుండు కాదేనశయనుండు। యాదవేంద్రుఁ
డాదిత్యవంద్యుండు। నాదాససులభుండు వేదాంతవేద్యుండు। కాదనీలుఁ
డాదితేయాఁపు డిందు। నాదకళాగీతుఁ డాదిత్యకులజుండు। బాధితారి
మేదినీశ్రీశుండు। భూధరగాత్రుండు శ్రీదమిత్రసఖుండు। ద్వాదశాత్ముఁ

తే. డాదిదేవుఁ డాశ్రితగంధ। మాదనుండు, చేదిసాంభకవైదర్భ। సూదనుండు
మేదురమురళీనాదవి। నోదుఁ డనుచుఁ, జెప్పినను సర్వతఃప్రాస। సీసమగును.

## అక్కిలిప్రాససీసము.

శిక్షించె నెవ్వాఁడు। చేటుకై సభలోనఁ జెడుమాటలాడిన। చేదివిభుని
రక్షించె నెవ్వాఁడు। ద్రోణిబాణముచేతఁ జిక్కకుండఁగఁ బరీక్షిన్నృపాలు
భక్షించె నెవ్వాఁడు। పర్వతాకృతిచేత నాభీరులగ్వించు। నారగింపు
వీక్షించె నెవ్వాఁడు। వేడ్కతో సేవకుల్ బ్రతుకునట్లుగఁ గృపా। పాంగదృష్టి

తే. దాక్షిణాత్యుని సాంభక। ధారుణీశుఁ, జంపె నెవ్వాఁడు పోరులో। సాహసమునఁ
బక్షిరాజతురంగుఁ డెవ్వాఁడనంగఁ, జెలఁగుచుండు వృత్తప్రాస। సీసములిల.

## వడిసీసము.

విజయసారథిఁ గాని। వినుతింపఁగా నొల్లఁ గిరినాయకునిఁ గాని। కీర్తిసేయ
యాదవేంద్రునిఁ గాని। యక్షీనుతింపఁగ నొల్ల మధుసూదనుని గాని। మదిని నిల్పఁ
బద్మనాభునిఁ గాని ప్రణుతింపఁగా నొల్లఁ బాకీనపతిఁ గాని। ప్రస్తుతింప
బాణసంహారుఁ గాని। భజియింపఁగా నొల్లఁ బీతాంబరునిఁ గాని। ప్రీతిఁ దలఁప

తే. నఖిలవేదండపతిఁ గాని। యనుసరింప, ననుచు నినుఁ గూర్చి యనురక్తి। నాత్మ నెప్పుడు
పొగడు సత్కవివ్రజములఁ, బ్రోచితనఁగఁ, దనరు వడిసీసభేదంబు। తాళభేది.

## అవకలివడిసీసము.

సామాజికాహిత। స్తోమంబు సామంబుగా మించి మైత్రికి। నామతింప
నశ్మానధారుణీ। విభులు దానంబుచే నక్కఱ లన్నియుఁ। జక్కఁ జేయ

నతిరుక్మ్యపతుమా॥వతులుభేవంబుచే దినదినక్షీణత్వ॥మునకుఁ జెడఁగఁ
బదిలింపుటుద్దుండు॥లొదిగి దండంబుచేఁ దనయాజ్ఞ యాదల॥నునిచినదువ

తే. సంధియానాదిసాడ్గుణ్య॥ బంధురముగ, నాత్మశక్తిత్రయోపేతుఁ॥డైమురారి
నేల ననురక్తినీతితో॥, నేలెననుచుఁ, జేయ నవకలివడినామ, సీస మగును.

విషమసీసము.

అంచితముగ క్షేమునకు స, హాయ మేగుదెంచి తా
నించు కెదిరి దురము సేయ, నేయునంకుశంబు తా
కించుకొనక కినుకవలనఁ, గెరలి నరకపుత్త్రి మ
ర్దించినట్టిసవ్యసాచి, క్రిరి ఘాటకావలిం

గీ. దోలుకృష్ణ యంచుఁ॥ దోరంపుటుత్సాహ, గీత మొకఁడు మేళ, గిఁపవిషమ
సీస మనఁగ వెలయు॥ శ్రీకామెపల్లిశ, జమ్మిచెంత నున్న॥ చతురవచన. ౩౮౬

సర్వలఘు సీసము.

క. తమ షట్త్రింశల్లఘువులు, త్రిమహేశవిరామము గల॥ దీర్ఘపదచతు
ష్కముపై నాకగీతి మురర, ప్రమథన సర్వలఘుసీస॥ పద్యమునకగుక్. ౩౮౭

సీ. కరివరద పరమకృప॥ ధరణిధర సురవినుత కనకవసన నరహరి॥ గరుడగమన
నళినకరపదనయన॥ దళితఖరదనుజలయ నరసఖ పరగుణనిధి॥ శరధిశయన
పరమపదఁలయహరి॥పరమపురుషప్రకృతికిఁబరుఁడనినినునిగమని॥వహము పలుకు
నిరతమునఁహృదయమున॥నినుఁదలఁతుననమనుపుమనియనఘచరితజల॥దనిభతనుప

తే. సర్వలఘుసీస మీరీతి॥ సకలసుకవి, వరులు చెప్పుదు రిలమీఁద॥ వరుసనెల్ల
వారు మెచ్చంగ సర్వేశ॥ వారిహాతు, కామెపల్లిశ యచ్యుత॥ కామజనక.

క. బలసోదరగీత్యాదితా, ర్యలు నా ల్గార్యాఖ్యగీతు॥ లాటవెలఁదితే
టలురెండు సమము లెత్తుక, మలనాహ్వయ పవడలుపు॥ మంబులు మూఁడుక్

సమగీతి.

తమఁ బథ్యాకఁదముచం, దముస్క్ గెండరలు దెలియఁ॥ దనరింపక్
సమ మనుగీతికృతులలోఁ, గమలాహృదయాబ్జవాస॥ కమలాక్షా. ౩౯౦

ఉద్గీతి.

మొదలిసగము చపలగతిం, బదపగము పథ్యగతిని॥ దొడరంగా
నది యుద్గీతి యనందగు, విదురాక్రూరాదిపరద॥ వేణుధరా. ౩౯౧

### ఉపగీతి.

ధరఁ జపలాకందము పై ఖచి స్సగంబ గౌరన్లుగా పద్యమునే
బరఁగు నుపగీతి పూర్వా, చరవ్రజతమిస్రా మార్తాండా. 351

### ఆర్యాగీతి.

సముదీరితపథ్యాకం, దము కన్నను నొక్కగురువు దాకించినచో
తమ నార్యాగీతి యగు, గ్గమలాప్రాణేశ సహజకందంబదిలో. 353

### సమగీతులందు నాటవెలఁది.

మేలు మే లటంచు మిత్రులు నుగ్గురు, వింతవింత యనుచు విబుధు లిద్ద
అహహాయనుచు సూర్యులయిదుగురును మెచ్చ, నాటవెలఁదిమూఁడ్లనలరు సగము.

### తేటగీతి.

మిత్రుఁ డొక్కఁడు వీణియ మీటుచుండ, విబుధవరు లిద్ద ఱర్థంబు విప్పిచెప్ప
సినులు నిద్దఱు వినుచుండ నేకగతిని, దేటగీతంబు మూఁటను వాట మయ్యె.

### విషమగీతులందు నెత్తుగీతి.

సురనాథుమీఁద, నూరు తిరువురు రెంట విరతి
ధరణిఁ బ్రాసంబు, దనరు నెత్తుగీతియందు. 356

### కమలనగీతి.

హగణమైనఁ బాలు నగణ మైనఁ జాలు హగణ
నగణములును రెండుగలసి, నాటి యంఘ్రి కేడు
తగినవిరతి నాలుగింటఁ, దనరఁ బ్రాస మొదవి
మిగులఁ గమలనాఖ్యగీతి, మెఱయుచుండుఁ గృతుల. 353

### పవడగీతి.

అవని మునుమధానుల లాదిత్యులు లిద్ద, అవల నేగు రర్కు లర్ధమునకుఁ
బవడగీతియందుఁ బ్రాసముల్ సమకూఱు, నవిరొయాటవెలఁది యందుఁ గలవు.

వ. ఇవి నవగీతివిశేషం బింకఁ జిరుదావళిలక్షణం బెఱింగించెద.

తే. శివి మహారాష్ట్రభాషచేఁ జెప్పఁబడెను, భీకరోక్తులు బిరుదులై పెక్కుదనరు
వానిబిరుదావళియొనర్ప వలయునం ద్రు, బుధులు సంబుద్ధిపదములఁ బొసఁగఁగూర్చి.

చ. అతిభుజవిక్రమోద్భవము, లైరిప్రకర్షక కోరకంబు లై
యతులితసీరవాక్య లయి, యాదిమపార్థివలాంఛనంబు లై

ప్రతిపదనూతనంబు లయి, భాసిలుసూక్తులు గూర్చి స్వస్తివా
క్యతతులఁ జెప్ప నొప్పు విరుదావళి సార్వవిభక్తికంబుగాన్. ౩౬౦

చ. సులలితవాక్యగుంఫనల, సర్వవిభక్తుల దీవనంబులన్
జెలు వగుపద్య మొక్కటి ర, చించినపిమ్మట గాఢరీతి సం
కలితచతుష్కషట్కదళగద్యము లెన్మిదియుం బదాఱు నిం
పలరఁగఁ గూర్చి పేర్చి విరు, దావళిఁ జెప్పఁగ నొప్పు నెంతయున్. ౩౬౧

చక్రవాళము.

క. ఒకపద్యముపిదప దశా, ష్టకసందర్భాష్టగద్య చతురం బగుపం
క్తికఁ బేరు చక్రవాళం, బకట చతుర్భద్రమదియొ యచ్యుత మఱియున్. ౩౬౨

క. తొలిసమసనాంత్యవర్ణ, యుగళమే పునరుక్తిఁ గాఁగఁ, గైకొని సామీ
ప్యలసత్సమాసము మొదల, నలరించినఁ జక్రవాళ మగుదాశార్హా. ౩౬౩

తే. అవధరింపుము దేవ దివ్యప్రభావ భావనాతీత నిస్తుల పరమమూర్తి
పూతనాజైత్ర సుత్రామపుత్త్రమిత్ర, మిత్రశశినేత్ర నిర్జరస్తోత్రపాత్ర.

చిత్రకవిత్వము.

సీ. అనులోమము విలోమ మనిరోష్ఠ్యమును దళ, కట్టును గుణములు శృంగములును తు
రవిలోపమును బద్ధభమకంబు పద్యభ్ర, మకమును నల్లెంట్లు మఱియు నేక
పదియు ద్విపదియుఁ ద్రిపదియును నేకవర్ణంబును ద్వ్యక్షరి త్ర్యక్షరియును
సరవి నిచ్ఛావాక్యసంఘట్టనంబును, నాదిగాఁ గొన్ని పద్యంబు లెల్ల

తే. క్షోణిఁ జిత్రకవిత్వప్రసిద్ధనామ, ధేయములచేతఁ జెంపొంది తెలివి మీఱు
వానిఁ దెలియఁగ వచియింతు వాసుదేవ, నందగోపాంగనాపుత్త్ర నరకజైత్ర.

అనులోమము.

క. దామోదరసామతనధ, రామాసరసాకరదశరథహరిరాధా
కామా సదయాతిపరమ, ధామా వరయాదవకుల, దారకరాసా. ౩౬౪

విలోమము.

సారాకరదాలకువద, యారవమాధామరపతి యాదసమాకా
ధాగారిహనరశదరక, సారసమాదాధనతమసారదమోదా. ౩౬౫

నిరోష్ఠ్యము.

క. పావన పాఫాబాభా, మావా యనునక్షరములు మఱి పద్యములో
భావింప జొరల కుండిన, భువనమ్మున న్నిరోష్ఠ్యము పిసాళించున్. ౩౬౬

క. నరహర్యక్ష దయాకర, కరిరక్షణ చక్రహస్త, కాంచనచేలా
గరుడతురంగ జనార్దన, ఖరదైత్యనికృంతన హరి, కంజదళాక్షా. ౩౬౯

గుడుసులు.

క. విరివిని నిలిచిరి విని చి, క్కిరి దివి శశిఁ దిరిగిరి తిరిగి మిడికి ఛీతి
ల్లిరి చింతిల్లిరి తివిరిరి, సిరిశోభకు ఘనాఢ్యు లనఁగ క్షితి గుడుసు లగున్.

గోమ్ములు.

క. గురుఁడునుశుక్రుఁడునుగ్రహుఁడు,పురుహూతుండునుశుకుండు,బుధుఁడునుగుహుఁడు
బురుకుత్సుండునుగుత్సుఁడు,గురుమతులొనరించిరనఁగ,గోమ్ములుకృష్ణా. [డుఁక

అక్షరవిలోపము.

క. రవికన్యాసుఁదరకర, మపలంబన మోర్చి యుండె, నచ్యుతుఁడని యే
నవవర్ణవిలోపముగా, నవసిం బతియుంపవలయు, నార్యులు నలరన్. ౩౭౨

పదభ్రమకము.

క. ధీరానానారాధీ, ధారాకరతాతరళిత, తారకరాధా
ధారాసుతతసురాధా, ధారితతరిధావ నాఁ బదభ్రమకమగున్. ౩౭౩

పద్యభ్రమకము.

క. రాధానాథా తరళిత, సాధకరథశానవసుత, సరసనిధానా
నాధానిసరసతసువస, తాధరకథసాతళిరత, ధానాధారా. ౩౭౪

నల్లెంట్లు.

క. నారదమునిశార్దూలము, కూరిమి నబినంబు గస్సి కొని వేడుకతో
నారాయణవాసమున క, నారత మేతెంచు ననఁగ నల్లెంటు లగున్. ౩౭౫

ఏకపాది.

తే. మతివినాయకభరితసమ్మదుఁ డనంగ, మతివినాయకభరితసమ్మదుఁ డనంగ
మతివినాయకభరితసమ్మదుఁ డనంగ, మతివినాయకభరితసమ్మదుఁ డనంగ.

ద్విపద.

తే. సౌమ్యగురుకవుల్ నినుఁ బ్రీతి సరసిజాక్ష, భోగిభోగాసనుండని పొల్చుటరుదె
సౌమ్యగురుకవుల్ నినుఁ బ్రీతి సరసిజాక్ష, భోగిభోగాసనుండని పొగడ ద్విపద.

త్రిపద.

తే. దేవమునివంద్య గోవింద, దితిజహరణ, పుండరీకాక్ష యవ్యక్త, పుణ్యపురుష
యనుచు నన్నుతగోపాలు హరిముకుంద, దేవయవ్యక్తహరియనా, త్రిపదయొప్పు.

ఏకాక్షరి.

క. నానానననానూనన్నన, నూననున్న నేనునేనున్ననున్ననినన్నై
నానీననునానానూనను, నానూన యనంగ నొంటియక్షర మయ్యెన్. ౩౬౯

ద్వ్యక్షరి.

క. మునినామామమ్మను మన, మున నూనిన నేమమునను మొనమానను న
న్నునుమని మననము మున్నన, ననుమానానామునిన యనద్వ్యర్ణ మగున్. ౩౭౦

త్ర్యక్షరి.

క. మానితమతినో మమతను, నీతామము నేమతు నను నేను మనమునన్
నూనమున మతముమానను, దానకమున గదలంతు ననఁగ నిది త్ర్యక్షరియయ్యెన్.

ఇచ్ఛావాక్యసంఘట్టనము.

క. తోఁటలు లెస్సైన యున్నవి, తాటామాటనములు గావు తాపసు లుండన్
పేఁటలు దామోదరుపై, గ్లాటలకు స్నేహవులు మధు, రాప్రరి నెంతన్. ౩౭౨

వ. ఈపద్యమునఁ దోఁట తాట పేఁట ఆట యనుమాట లర్థవంతములుగాఁ గూర్చు
టం జేసి దీనిపేరు ఇచ్ఛావాక్యసంఘట్టనము. ౩౭౩

బంధకవిత్వము.

సీ. గోమూత్రికాఛత్రగుచ్ఛకుండలినాగ, కంకణమర్దలఖడ్గచక్ర
ముకజసర్వతోభద్రమాలాక్షరీ, ప్రముఖబంధంబు లేర్పడఁగఁ జెప్ప
వృత్తము ల్బంధకవిత్వనిశ్రుతము లై, కవులకుఁ జెవులపండువులు సేయఁ
బటుతరప్రౌఢిమఁ బందితమామఁ, సాధారణంబుగా జగతిలోన
రాధికాకేళికాలోలరమ్యశీల, భూరిగుణసాంద్ర యదుకులాంభోధిచంద్ర
వల్లవీమానచోర మార్వారశూర, పరమవాచాల రాజగోపాలబాల. ౩౭౪

వ. ఇది బంధకవిత్వం బిఁక గర్భకవిత్వంబు వివరించెద. ౩౭౫

గర్భకవిత్వము.

సీ. గాంగేయకాశేయ ఘనకందగీతస, ద్గర్భచంపకమాలికయు వరిష్ఠ
కందపద్యద్వయకమలవిలసితరు, గ్మవతికాగర్భితక్రౌంచపదము
గీతమత్తేభవిక్రీడితాకందగ, ర్భితసీసము నట మత్స్యవృత్తగర్భి
తోత్పలమాలికయును సుకల్పితకల్ప, వల్లియు సీసరూపస్వాగతయును
స్రగ్విణీగర్భభుజంగప్రయాతంబు, కందగర్భితమణిగణనికరము
కలితచతుర్విధకంచపద్యము నష్ట, విధకందమును బంధసువృత్త

తే. మాదిగాఁ గలకొన్ని పద్యములు పెక్కు, సరవిఁ బద్యనులిమిడి దోషములు లేక
కాన వచ్చిన నవి యెల్ల, గర్భకవిత, ధరణి నొప్పారు నీరీతిఁ దనరుఁ గృష్ణ.

కందగీతిగర్భ చంపకమాల.

చ. నరహరి కేశవా వనజ, నాభ రమాధవ వంశహస్త బం
ధురసుగుణాకరా దురిత, దూర జనార్దన దోర్బలాఢ్య గీ
ర్వరగిరిశస్తుతా మురహ, రా సురపూజితముఖ్యపాద సుం
దరపురుషాగ్రణీ భుజగ, తల్ప శచీపతిపుత్రరక్షణా. ౩౮౭

వ. ఇవి భాషాపరిచ్ఛేదములోఁ దెలుపఁబడియె. ౩౮౮

కందద్వయకమలవిలసితరుగ్మవతీగర్భకాంచపదము.

ద్వారవతీనాథా సదువారా తరుణభవనకరధరనుతనామా
మారమణీకామా సుకుమారా మరుదధిపతిరిపుమదగిరిశంబా
సారసనేత్రా సత్యవిచారా శరరుహభవముఖసకలసురేశా
శూరకులా తేజోజితసూరా సురవరమణినిభసురుచిరదేహా. ౩౮౯

వ. ఇది వర్ణపరిచ్ఛేదములోఁ దెలియఁ జేయఁబడెను. ౩౯౦

మత్తేభవిక్రీడితాకంపగర్భసీసము.

వినయసంపన్నరవిప్రభూతరమణీనాథాపమోజేతృణా నరాప్త
విభయదాకార హరిర్భుగాయతరిపుప్రాణానిలాహీశ్వరా రమేశ
విలయకాలానలవిక్రమప్రథిత సాల్వగ్రావవృద్ధశ్రీవా వరేణ్య
విలయశీలా యదువీర కౌస్తుభధరా చక్రి యశోదాత్మజా ముకుంద.

తే. కరివరద పూతనాంతక గరుడగమన, సత్త్వసహిత కామజనక శంకరసఖ
కనకవసన సుందరదేహ వనధిశయన, సనకమునివినుతచరణసరసిజయుగ.

వ. ఇది వళిప్రాసపరిచ్ఛేదములోఁ దెలుపఁబడియె. ౩౯౧

వాణీపద్మాంబారతిదరధ్వనితాళమధురగర్భోత్పలమాలికావృత్తము.

శా. రదశాసిత ప్రసవ, శాపవిఖండన సామసన్నుతా
తారణ దాసపోషధవ, తాపసరంజన ధర్మతత్పరా
వారణరాసుర ప్రసవ, ప్రాసక భంజనవాసవానుజా
పారన వాసుదేవభవ, పాపవిదండన భర్గపూజితా. ౩౯౨

ఇది యూపరిచ్ఛేదముతుదను దెలిపెనము.

కల్పితకల్పనవల్లీపరిహరణకలిత.

కరధృతకరుహం॰ కరిహితకరణం, కరుహసఖరుచిం॰ గరుడఖగరథమ్
ఖరఘనకరహం॰ ఖరతరకరగం, గరళనుఖరిపుం॰ గరధరకరతమ్. ౩౯౪

ఇది సంధిపరిచ్ఛేదములోఁ దెలిపెదము.

మఱియుఁ గల్పితకల్పవల్లీభాస్కరవిలసితము.

అక్షరహరివిక॰ చాంబురుహాక్షా, యక్షపసఖనుత॰ యదుకులదక్షా
రక్షకసురవిదు॰ రద్విపరక్షా, రాక్షసవిదళన॰ ప్రరుచిరవక్షా
పక్షగపతిరథ॰ పౌంద్రవిపక్షా, భక్షితదవశిఖి॰ బహుసవదీక్షా
వృక్షగసహచర, ఋక్షసదృక్షా. ఋక్షపదుహితృప॰ ఋషిజనపక్షా. ౩౯౫

గర్భప్రథమకందము.

క. అక్షరహరివికచాంబురు, హాక్షా యక్షపసఖనుత॰ యదుకులదక్షా
రక్షకసురవిదురద్విప, రక్షా రాక్షసవిదళన॰ ప్రరుచిరవక్షా. ౩౯౬

గర్భద్వితీయకందము.

క. పక్షగపతిరథ పౌంద్రవి, పక్షా భక్షితదవశిఖి॰ బహుసవదీక్షా
వృక్షగసహచర ఋక్షస, దృక్షా ఋక్షపదుహితృప॰ ఋషిజనపక్షా. ౩౯౭

గర్భద్విపద.

అక్షరహరివిక॰ చాంబురుహాక్ష, యక్షపసఖనుత॰ యదుకులదక్ష
రక్షకసురవిదు, రద్విపరక్ష, రాక్షసవిదళన॰ ప్రరుచిరవక్ష
పక్షగపతిరథ॰ పౌంద్రవిపక్ష, భక్షితదవశిఖి॰ బహుసవదీక్ష
వృక్షగసహచర॰ ఋక్షసదృక్ష, ఋక్షపదుహితృప॰ ఋషిజనపక్ష. ౩౯౮

లాలిపాట.

అక్షరహరివిక॰ చాంబురుహాక్షా, యక్షపసఖనుత॰ యదుకులదక్షా
రక్షకసురవిదు॰ రద్విపరక్షా, రాక్షసవిదళన॰ ప్రరుచిరవక్షా
పక్షగపతిరథ॰ పౌంద్రవిపక్షా, భక్షితదవశిఖి॰ బహుసవదీక్షా
వృక్షగసహచర॰ ఋక్షసదృక్షా, ఋక్షపదుహితృప॰ ఋషిజనపక్షా. లాలి. ౩౯౯

అర్ధచంద్రికలు.

అక్షరహరివిక, చాంబురుహాక్షుఁడా. ౧
యక్షపసఖనుత, యదుకులదక్షుఁడా. ౨
రక్షకసురవిదు, రద్విపరక్షుఁడా. ౩

రాక్షసవిదళన, ప్రరుచిరవక్షుక్. ౪
పక్షగపతిరథ, పౌండ్రవిపక్షుక్. ౫
భక్షితదవశిఖి, బహుసవదీక్షుక్ ౬
వృక్షగసహచర, ఋక్షసదృక్షుక్. ౭
ఋక్షపమహితృప, ఋషిజనపక్షుక్. ౮

## పెండ్లిపాట.

### లక్ష్మీకల్యాణవైభవమే.

అక్షరహారివిక౯ చాంబురుహాక్షా, యక్షపసఖనుత౯ యదుకులదక్షా.
రక్షకసురవిప, రద్వీపరక్షా, రాక్షసవిదళన, ప్రరుచిరవక్షా. లక్ష్మీకల్యా.
పక్షగపతిరథ౯ పౌండ్రవిపక్షా, భక్షితదవశిఖి౯ బహుసవదీక్షా
వృక్షగసహచర౯ ఋక్షసదృక్షా, ఋక్షపమహితృప౯ ఋషిజనపక్షా లక్ష్మీకల్యా.

### శోభవళము.

అక్షరహారివిక చాంబురు, హాక్షా యక్షపసఖనుత
రక్షకసురవిదురద్వీప, రక్షా రాక్షసవిదళన
పక్షగపతిరథ పౌండ్రవి, పక్షా భక్షితదవశిఖి
వృక్షగసహచర ఋక్షస, దృక్షా ఋక్షపమహితృప. ౪౦౧

### సువ్వాలే.

అక్షరహారివిక౯ చాంబురుహాక్షా, యక్షపసఖనుత౯ యదుకులదక్షా
రక్షకసురవిప౯ రద్వీపరక్షా, రాక్షసవిదళన, ప్రరుచిరవక్షా. ౪౦౨

### సువ్వీ.

పక్షగపతిరథ, పౌండ్రవిపక్షా, భక్షితదవశిఖీ, బహుసవదీక్షా
వృక్షగసహచర, ఋక్షసదృక్షా, ఋక్షపమహితృప, ఋషిజనపక్షా. సువ్వాలే.

### కందద్విపదగర్భసీసము.

మకరకుండలకర్ణ, మహితాభ్రవర్ణ శకటదానవవిపక్ష, కమలజాక్ష
శుభకాలసత్పాల, సుయశోవిశాల యక్షరమతస్నిగ్ధయా, పీతసుగ్ధ
శ్రితదేవతరుమూల, చేదీశవాల ధృతమణిధరగదారి, తపతికన్నిత
నివసితవైకుంఠ, నియతాబ్జకంఠర వికళాదశుభనేత్ర, విజయమిత్ర.
తే. సతతసనకాదిసన్నుత, చతురచరిత, యాదవకుల సత్యనిరత, యచ్యుత మధు
విదళన హరి శాశ్వతకృష్ణ, విబుధవరద, భవహరించినుతాయించు, ప్రస్తుతింప.

## గర్భద్విపద.

మకరకుండలకర్ణ । మహితాభ్రవర్ణ
శకటదానవవిప । శుకమలజాక్ష
శుభకాలసత్పాల । సుయశోవిశాల
యఘరమతస్నిగ్ధ । యాశీతదుగ్ధ
శ్రితదేవతరుమూల । చేదీశకాల
ధృతమణివరగదా । రిణపథికక్షిత
నివసితవైకుంఠ । నియతాబ్జకంఠ
రవికళాదశుభనే । త్ర విజయమిత్ర. ౪౦౫

## గర్భకందము.

క. సతతసనకాదిసన్నుత, చతురచరిత యాదవకుల । సత్యారత య
చ్యుత మధువిదళన హరి శా, శ్వత కృష్ణ విదురవరద భావనిరించినుతా. ౪౦౬

## స్రగ్విణీగర్భభుజంగప్రయాతము.

నమో దాశకా వేణునాదప్రవీణో, ద్యమా యాతుషేణా । మహాయావనారీ
రమాధీశ దామోద । రాదేవదేవో, త్తమాభీశమిత్రాక్ష । తార్క్ష్యానుయాయీ.

## కందగర్భమణిగణనికరము.

కరధృతజలజునిఁ । గరిపతివరదున్, వరతనురుచిజిత । వనదునిఁ బరమున్
బరివృఢుఁ గొలిచెదఁ । బరమదశరణున్, శరవణభవనుత । చరితునిఁ గరుణున్.

## గర్భకందము.

కరధృతజలజునిఁ గరిపతి, వరదున్ వరతనురుచిజిత, వనదునిఁ బరమున్
బరివృఢుఁ గొలిచెదఁ బరమద, శరణు న్శరవణభవనుత । చరితునిఁ గరుణున్.

## చతుర్విధకందము.

శ్రీఖండవచరణంబునకున్, ఱైండవగణ మాది గాఁగ । నిర్మించినచో
దుడిఁ జతుర్విధకందము, పాండవపక్షా యెలంగుఁ । బ్రాజ్ఞులసభలన్. ౪౧౦

## చతుర్విధకందము.

బలులేమిచేత వేసరు, చెలికిం జిపిటంబు లీయఁ । జేకొని కృపతోఁ
గలి మిచ్చినావు కేనుచు, నెలమిం గృప నేగి తద్జ్ఞ । హితవుగ విపులన్. ౪౧౧

గర్భద్వితీయకందము.

చిటిటంబు లీయఁ జేకొని, కృపతోఁ గలి మిచ్చినావు • కేరుచు నెలమిం
గృప నేగి తద్జ్ఞహితవుగ, విపులం బలులేమిచేత • వేసరు చెలికిన్. ౪౧౨

గర్భతృతీయకందము.

కలి మిచ్చినావు కేరుచు, నెలమిం గృప నేగి తద్జ్ఞ • హితవుగ విపులన్
బలులేమిచేత వేసరు, చెలికిం జిపిటంబు లీయఁ • జేకొని కృపతోన్. ౪౧౩

గర్భచతుర్థకందము.

కృప నేగి తద్జ్ఞహితవుగ, విపులన్ బలులేమి చేత • వేసరుచెలికిం
జిపిటంబు లీయఁ జేకొని కృపతోఁ గలిమిచ్చినావు • కేరుచు నెలమిన్. ౪౧౪

మాలికాచతుర్విధకందము.

తరతర మవర్ణ మాదిగ, దొరలించిన మాలికాచ • తుర్విధకందం
బరుదారును సత్కృతులం, దురగాధిపనవ్యతల్ప • యుదధిశయానా. ౪౧౫

క శ్రీభూమీన వరద హరి, గోభూమానవవినుత సు • గుణబుధ మధునా
శాభీమానవకృష్ణఘు, నాభా మానవహరి దరి, యభవకమలనా. ౪౧౬

గర్భద్వితీయకందము.

భూమీన వరదహరి గో, భూమానవవినుత సు • గుణ బుధ మధునాశా
భీమా నవకృష్ణఘునా, భా మానవహరి దరి యభ • వకమలనాశ్రీ. ౪౧౭

గర్భతృతీయకందము.

మీనవరదహరిగోభూ, మానవవినుతసుగుణబుధ • మధునా శాభీ
మానవకృష్ణఘునాభా, మానవహరిదరియభవక • మలనాశ్రీభూ. ౪౧౮

గర్భచతుర్థకందము.

నవరదహరిగోభూమా, నవవినుతసుగుణబుధమధు, నాశాభీమా
నవకృష్ణఘునాభామా, నవహరిదరియభవకమల • నాశ్రీభూమీ. ౪౧౯

అష్టవిధకందము.

రెండేసిగణంబులపై, నుండినగణ మాది గాఁగ • నొనరఁగఁ జదువన్
ఖండితసాంభక ఘోటకి, తాండవ యష్టవిధకంద • మనఁగాఁ బరఁగున్. ౪౨౦

ప్రథమకందము.

తన కిరుగెలసను గనలుచుఁ, గొన బయి గిలిఁకొడు కనుగొలు, కులఁదగఁ జెలువ
స్తనులను గలయుం జనఁగనఁ, గనుచుం గలుములఁ దనికెను • ఖలశృంఖలమై.

### ద్వితీయకందము.

కనలుచుఁ గొనబయి గిలిపెడు, కనుగొలుకులఁ దగుఁ జెలుచను• ఘనులను గలయం
జెనఁకువఁ గనుచుం గలుములఁ, దనిపెను ఖలశృంఖలమయి• తనకిరు గెలన౯.

### తృతీయకందము

గిలిపెడుకనుగొలుకులఁ దగుఁ, జెలుచన్నులను గలయను• జెనఁకువఁ గనుచు౯
గలుములఁ దనిపెను ఖలశృం, ఖలమయి తనకిరు, గెలనను• గనలుచుఁ గొన బై.

### చతుర్థకందము.

కులదగు జెలుచన్నులను, గలయం జెనఁకువఁ గనుచును• గలుములఁ దనిపె౯
ఖలశృంఖలమయి తనకిరు, గెలనను గనలుచు గొనబయి• గిలిపెడు కనుకొల్•

### పంచమకందము.

ఘనులను గలయం జెనఁకువఁ, గనుచుం గలుములఁ దనిపెను• ఖలశృంఖల మై
తనకిరు గెలననుఁ గనలుచుఁ, గొనబయి గిలిపెడు కనుకొలు• కులఁ దగుఁ జెలుచ౯.

### షష్ఠకందము.

జెనఁకువఁ గనుచుం గలుములఁ, దనిపెను ఖలశృంఖలమయి• తన కిరు గెలన౯
గనలుచుఁ గొనబయి గిలిపెడు• కనుగొలుకులఁ దగుఁ జెలుచను• ఘనులను గలయ౯.

### సప్తమకందము.

గలుములఁ దనిపెను ఖలశృం, ఖలమయి తనకిరు గెలనను• గనలుచుఁ గొన బై
గిలిపెడు కనుకొలుకులఁ దగుఁ, జెలుచన్నులను గలయను• జెనఁకువఁ గనుచు౯.

### అష్టమకందము.

ఖలశృంఖల మయి తనకిరు, గెలనను గనలుచుఁ గొన బయి• గిలిపెడు కనుగొ
లుకులఁ దగుఁ జెలుచన్నులను, గలయం జెనఁకువఁ గనుచును• గలుములఁ దనిపె౯.

కందద్వయనీలోత్పలమాలామణిగణనికరగర్భసంసిజవృత్తము.

శ్రీవర్ధిష్ణుం భావనజీవు• స్సితభృగుతనయుని• సిరి గలుగుటకై
భావింతు స్సంభావితభావు౯ • బ్రతియుగసముదితు• బహుళతనుమహితు౯
దేవేంద్రాదిప్రస్తుతదేవు• స్థితిలసమతుహిన• దినకరకిరణు౯
ధీవిద్యాద్యోతు న్వసుదేవు• న్నృతిమదగణయుతుఁ, ద్ఘృణివిదరదన్. ౬౨౯

### గర్భప్రథమకందము.

శ్రీవర్ధిష్ణుం భావన, జీవు స్సితభృగుతనయుని• సిరి గలుగట కై
భావింతు స్సంభావిత, భావుం బ్రతియుగసముదితు• బహుళతనుమహితు౯. ౬౩౦

## గర్భద్వితీయకందము.

దేవేంద్రాదిప్రస్తుత, దేవు న్దితితనయతుహిన దినకరకిరణుఁ
ధీవిద్యాద్యోతు న్వసు, దేవు న్ధృతిమదగుణయుతుఁ దృణితవిదురదుఁ. ౪౩౧

## గర్భసీసోత్పలమాల.

శ్రీపరిఘ్నుం బావనజీవుఁ భావింతు న్సంభావితభావుఁ
దేవేంద్రాది ప్రస్తుతదేవుఁ ధీవిద్యాద్యోతు న్వసుదేవుఁ. ౪౩౨

## - గర్భమణిగణనికరము.

బితభృగుతనయుని సిరి గలుగుటకై, ప్రతియుగసముదిత బహుతనుమహితుఁ
దితితనయతుహిన దినకరకిరణుఁ, ధృతిమదగుణయుతుఁ దృణితవిదురదుఁ. ౪౩౩

## వాణీపద్మాంబారతీదరధ్వనితాళమధురతిగర్భోత్పలమాలికావృత్తము.

శారదశాసితప్రసవ చాపవిఖండనసామసన్నుతా
శారణదాసపోషభవ తాపసమండన ధర్మతత్పరా
వారణభాసురప్రభవ ప్రాపకభండనవాసవానుజా
పారదవాసుదేవభవ పాపవిదండన భర్గపూజితా. ౪౩౪

## గర్భవాణీవృత్తము.

శాసితప్రసవ, చాపవిఖండన సామసన్నుతా
దాసపోషభవ తాపసమండన, ధర్మతత్పరా
భాసురప్రభవ, ప్రాపకభండన వాసవానుజా
వాసుదేవభవ పాపవిదండన, భర్గపూజితా. ౪౩౫

## గర్భపద్మావృత్తము.

సవచాపవిఖండన సామసన్నుతా, భవతాపసమండన, ధర్మతత్పరా
భవప్రాపకభండన,వాసవానుజా, భవపాపవిదండన, భర్గపూజితా. ౪౩౬

## గర్భాంబావృత్తము.

చాపవిఖండన, సామసన్నుతా, తాపసమండన ధర్మతత్పరా
ప్రాపక భండన, వాసవానుజా, పాపవిదండన, భర్గపూజితా. ౪౩౭

## గర్భరతీవృత్తము.

ఖండనసామసన్నుతా, మండనధర్మతత్పరా
భండనవాసవానుజా, దండన భర్గపూజితా. ౪౩౮

## గర్భదరధ్వనితాళము.

శాశితప్రసవ। దానపోషధవ
భాసురప్రభవ। వాసుదేవభవ. ౪౩౯

## గర్భమధురగతిరగడ.

శాశితప్రసవ। చాపవిఖండన, దానపోషధవ। తాపసమండన
భాసురప్రభవ। ప్రాపకభండన, వాసుదేవభవ। పాపవిదండన. ౪౪౯

## ఆశ్వాసాంత్యగద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్ర కామెపల్లిపురమందిర నందనందనచర ణారవిందవందనాభిలాషమనీషాప్రాభవ వేంగళార్యతనూభవవిద్యావిశేషసురా చార్య కాకునూర్యప్పకవివర్యవిరచితం బైన యాంధ్రశబ్దచింతామణి యను వ్యాకరణశాస్త్రంబునందు మూలసూత్రంబులును, ఛందఃప్రభావంబును, ఛందో వ్యాపకసంప్రదాయంబును, ఛందస్స్వరూపంబును, నిఖిలసంధిస్వరూపంబును, గద్యవచనంబులును, ప్రథమప్రత్యయోద్ధారణక్రమంబును, గణజననచ్ఛందంబు లును, గురులఘునిర్ణయంబును, సర్వగణలక్ష్యంబులును, గణాధిదేవతాఫలం బులును, అష్టగణలక్ష్యంబులును, దేవతానరాంకిత నియమంబులును, నాయకగణ కూటంబులును, గృత్యాదిగణద్వయకూటంబులును, త్రిశస్త్రకూటంబులును, దో షాదోషభావాలక్ష్యఫలంబులును, గణద్వయయోగఫలంబులును, గణనాథయో గఫలంబులును, షట్ప్రత్యయంబులును, ఛద్యలక్ష్యోపయోగిసంజ్ఞలును, మద్వెం శతిచ్ఛందోజాతసమవృత్తంబులును, ముఖ్యగౌణవృత్తంబులును, మాలికావృ త్తవివేకంబును, ఛాత్యుపజాతులును, చిత్రబంధగర్భకవిత్వంబును, గల చతు ర్థాశ్వాసము సంపూర్ణము





శ్రీ ర స్తు

# అప్పకవీయము.

## పంచమాశ్వాసము.



శ్రీకృష్ణాపూర్వతట
ప్రాకార ప్రాంశుకుతల పరిశోభితవ
జ్రాకరకేతవరనగర
నాకారివిదిక్త్రియోజనస్థితభవనా. ౧

క. అపనాను శబ్దశాసనుఁ, డవనిఁ గలియుగమున కాదినారాజమహేం
ద్రవసంఖ్యఁ జెప్పినయాం, ధ్రవచోవ్యాకరణసూత్రతతిఁ దేటగింతున్. ౨

ఆ. ఆంధ్రసంధు లెల్ల నష్టాదశార్యల, సుకవు లౌ నటంచు బోద్య మంద
శ్రీశైతాద్రినాథ శబ్దానుశాసనుఁ డవఁ జేటపటిచె నతిముదమున. 3

### సంధిపరిచ్ఛేదము.

మూ. సూ. తిఙ్మధ్యశేషషష్ఠీసుస్కర్మప్రవచనీయజవిభక్తీః,
కిశ్చిత్ప్రశంసనాద్భుతసన్తాపయదాతదాకిమేవాం శ్చ. ౧
త్స్వాకిలతూష్ణీమాద్యా నభిదధతికలాద్రుతోనయోషాంస్యాత్,
అన్యే ద్రుతప్రకృతయో హేస్స్యుర్గ్రహ్యనుజీవితద్రుతాసత్యమ్.
సంస్కృతాద్యా త్తార్కగ్యా క్షేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః,
లుక్స్యాచ్ఛేషానాద్రిద్రుతస్య సర్వత్రలుక్సమాసేషు. 3
సన్ధి ర్యాచో ఽచ్యనుతో వాతో నాదిషువిభక్తిషుతో వా
నిత్య మనుత్త. పుంసప్రక్రియాస్వితః పరిమితౌ సహస్తానామ్.

నస్యా త్తద్గ్రోత శ్చో ర్వాస్యా ద్వ్యస్తమానపిహితస్య,
తద్వ త్తపావిజస్య ప్రాయ స్తు స్యా ద్రమాదిక స్యైతః. ౫

అపిశబ్దే శో లుగ్వా స్యా దిచ్చ విభక్తి స్తి స్య జే రతీ చ,
శబ్దా త్తచ్ఛబ్దాతో లు గ్గార్థే త ఉదప రేఫ స్స్యాత్. ౬

సామానాధికరణ్యేషు దన్తానాం టుగాగమో చి స్యాత్,
ధాతుపదసమ్భవానాం విశేషణానా ముత స్తథా సు పచి. ౭

షష్ఠ్యా ఉలో చి ను స్సే చాగ్య స్యా ద్రేడితే స్త్యలోప శ్చ,
అనామాదీనాం ద్విత్వం లోపో నమ ఆదికే షగ్గ శ్చ. ౮

బో రచ్ఛతశబ్దార్థే పో చ్చ తదాద్యర్థవాచకే షాతః,
వికృతిపదే తౌ టో రప్యపధారే శ్చ వీత శ్చలు గ్వా స్యాత్. ౯

పదమన్యసరలడానా ముత శ్చ పూర్వప్రయోగసిద్ధానామ్,
లోపో వా స్యా త్తేషా మిత శ్చ తద్వ త్తి కి క్రమమతేన. ౧౦

కవిభల్లసైః క్రియాణాం నామ్నా మల్లోప ఇష్యతే హ్యేషు,
ప్రథమైకవచనమాత్రే వికృతౌ నాన్తానయోపి కథ్యన్తే. ౧౧

ఔపవిభక్తికసంజ్ఞా షణ్ణాం ష్టి ట్యాః యో భవ న్తీహ,
రుల్వా డే ర్నామ్నాం స్యు స్తేహి విభక్త్యా సమాసే చ. ౧౨

ప్రథమావైభక్తికమో గ్లుక్ పూర్ణో వా పరిక్రియార్థేషు,
తస్య సమాసే పుంపూను మ్బ్రితో హల్యథర్వణాద్యుపలాత్. ౧౩

శత్రర్థే తూత శ్చా నో స్త్ర్య స్యా చ్చ పూర్ణసుస్తరపి,
వాత్సాస్మ్యో ర్దు త్తస్య స్యా ల్లిగ్వాక్యాన్తగతపదానాం చ. ౧౪

పరుషా ద్రుత ప్రకృతికాత్సరళా స్స్యు స్తద్రుతం చ బిన్దుస్స్యాత్,
అవికారగతే తస్మి న్నపి సరళా ఏవ స న్తి తే పరతః. ౧౫

లు గ్వా న ప్రకృతిపదా త్పరత స్సరళే స్థిరే చ నస్య స్యాత్,
అలుకి చ సంశ్లేష స్స్యాద్బిన్దుం ప్రవద న్తి తం క్వచి త్కేచిత్. ౧౬

ప్రథమలు గపి ద్వినుల్యో ర్దు తి స్య సర్వత్రలు క్సమాసేషు,
హేమ్నో క్తేః పరుషాణాం గసడదవా స్యుః పదా ద్ద్రుతాద్వా. ౧౭

క. తరువనహరుఁడనఁ బురమనఁ, బరఁగ నివి విభక్తికములు, పరువుపురుడుసం
దరి దుర మనునివి యెల్లను, నరసఖ యవిభక్తికములు నామములు నగున్. ౧౫

ఆ. వెనుక నున్నపదము కానయక్షరంబుతోఁ, గైపదంబుమొదలి ప్రాణమునకు
సూత్రమనను సంధి చొప్పడకున్న నప్పట్ల బుధులు ప్రకృతిభావమండ్రు.

క. తొలఁగి చనఁ దొలఁగ కుండును, గలుగును లేకుండు నవును గాకుండునని
చ్చలువచ్చును రాకుండును, జెలువార వికల్పమనుచుఁ జెప్పెడుచోటన్. ౧౬

క. మొదలను జెప్పినవిధమున, గొదవ వికల్పంబు లేక యొక్కటె యగునన్
బదపడి నిలిచినదానిని, యమగోత్రపవిత్ర నిత్య మందురుక్షీరుల్. ౧౭

తే. పుడమిఁ బొల్లింటిరాజుల, పెడల నొత్తి, వారి నెలవులఁ దా ముందు వైరినృపుల
పగిది మును పున్నవ్రాలను బాఱఁ దోలి, తామ పట నిల్చు నాదేశనామకములు.

తే. కొండికొండను నెలకొన్న వేల్పు తేఁ, చెంత నత్యంతమైత్రి పైఁ జేరియుంట
యక్షుగతిశబ్దమునఁ గల్గు, నక్షరంబు, పొంత నుక్తాగమము పొందె బూనినిల్చు.

తే. పదములనునున్నగలవ్రాల తుదిని దాము, నతికి కొననిల్చులివులు ప్రత్యయములయ్యె
మనుపదమ్ములఁ గలవర్ణములు నిలువక, తొలఁగిచనుట లోపంబని, సలుపఁబడును.

## ద్రుతప్రకృతికసంజ్ఞ.

మూ. సూ. తిఙ్మధ్యశేషషష్ఠీసుప్కర్మప్రవచనీయజవిభక్తీః,
కిఙ్క్త్వప్రశంసనాద్భుతసన్తాపయదాతదాకిమేవాశ్చ.
క్త్వాకిలతూష్ణీమాంద్యానభిదధతికలాద్రుతాన్తయేషాంస్యాత్,
అన్యేద్రుతప్రకృతయో యే స్యుర్హ్యనుజీవితద్రుతానిత్యమ్.

క. వలసినచోఁ బదిద్రుతములు, తలచూపెడుశబ్దములు ద్రుతప్రకృతు లనన్
వెలయు నవి వాడవ కుండెడు, తెలుఁగుపదంబులు కళాప్రదేశములయ్యెన్.

తే. ధాత ధాతను భూపతి ధరణిపతిని
జనకు జనకుని గనిరొఁ గన్గొనిరె యనుచుఁ
గడ ద్రుతము లిట్లు లోపముల్గాంచి వలయు
పట్లఁ గనుపట్టునవి ద్రుతప్రకృతు లెల్ల. ౨౩

క. వికృతిపదంబులలోపల, నకారములు వలయుచోఁ గొనలఁ బొడము ద్రుత
ప్రకృతు లసంఖ్యంబులు గొం, కక యని యెన్నంగ నలమిగా దహిపతికెన్.

తే. గూను నెమ్మేను మెడనాను మీను పేను, మానుపతిచెను బులిబోను మఱియునిట్లు
భువి నకారంబుతోఁ గూడఁ బుట్టుశబ్దములు ద్రుతప్రకృతులుగావు మునిశరణ్య.

తే. అన్న బంగరుపొన్న చాయ యగు నెన్న
చెన్ను పులిజున్ను దొరపన్ను జొన్న యెన్ను
మొదలు గా జడ్డలున కారములకుఁ దుదిని
దనరుపదములు గావు ద్రుత ప్రకృతులు. ౨౬

ఆ. తన్ను నిన్ను నన్ను దన్ను మున్ను మిన్ను, చన్ను కన్ను వెన్ను శబ్దములకు
జడ్డలుండుఁ బొల్లు నర్పింపనివి ద్రుత, ప్రకృతులెప్పుడు గావు భక్తసులభ.

కళాప్రదేశములు.

సీ. ఇనుఁడు గోత్రను గోవును లనియిబ్బంగిఁ బలికెడు ప్రథమావిభక్తులందు
రాముఁ గూర్చె నుగ్రముఁ గూర్చియటంచుఁ దెలిపెడు కర్మద్వితీయలందుఁ
గృష్ణునకై సురోత్తమునకై యని తొడిఁబడ నడుగు చతుర్థులందు
బలునిబట్టి మురారిఁ బట్టిరండి యని పల్కెడు పంచమీ భక్తితుదలందుఁ
తే. బద్మబాంధవసుతయొక్క భద్రయొక్క, జాంబవతియొక్క యను శేవ షష్ఠులందు
క్షితిసముచ్చయములఁ దక్క ద్రుతము గానఁ, బడదు గావునఁ బల్కఁగా బడఁగ కళలని.

సీ. సుగ్రీవుఁడే వాయుసూనుఁడే యనుచు సేవార్థము దెలుపు వ్యాహారములను
నటియించెనఁట పాడెనఁట కూడెనఁట యను లలితకిలాన్వాలాపములను
వింటివి కంటివి వేఁడి రటంచు నీమాడ్కిని బలుకు తిజ్ఞర్థ్యములను
గాంచి విచారించి కరుణించి యనియెడు క్త్వాప్రత్యయాంతార్థవాచకములు
తే. నులకమిన్నక నేయక యెలుఁగక యను, నట్టితూష్ణీంపదార్థవాక్యములు నాది
శబ్దములందట చేతన జనియె జుమ్ము, కనియెఁ గదయను నవియును గళలు కృష్ణ.

తే. నవ్వుచున్నాఁడు వచ్చుచున్నాఁడు వాఁడు
వనఁ గలఁడటన్న దిజ్ఞర్థ్య, మంబు లెందుఁ
గాకయను బ్రథమలలోనఁ, గలసి సరసి
జాతనేత్ర కళాప్రపంచంబు లగును. ౩౦

సీ. కటకట యక్కటకట్టయయ్యోయని పరితాపమునఁ బల్కు భాషణములు
ఔర బళీ మజ్జ యయ్యారె యంచుఁ బ్రశంసించునం ద్రథభావపదములు
నిది యుత్తయుది కంతయుది లెస్సయద్దిరా యోహొయనుమహాద్భుతోదితములు
నించుక గోరంతయు సుమంత చీమంత యావంత యనుకించిదర్థములును
తే. హరిహయాత్మజసఖుడుప్పతప్పఁ జెప్పఁ, దనిగొమెప యదాతదాదృశార్థములను
నెద్ది యెయ్యది యెదియేదియేమి యనుకి, మర్థములును గళాసంజ్ఞలంగ జపిత.

తే. ఇంతియే కావు తెలుఁగున నిట్టికళలు, మనుసిషాదన వెదకిన మఱియుఁ గలవు

వీనికొనల ద్రుతంబులు, గానఁబడవు, తాపసమనోనివేశ శ్రీమహేశ. ౩౨

## సంధివివేకము.

క. వెనుకటిశబ్దమునకుఁ దుదిఁ, దనరెడువర్ణమును బైపదమునకు మొదలం
గనుపట్టునక్షరంబును, సనకస్తుత కూర్చి పలుకు సంధియనం జనున్. ౩౩

క. విను ప్రాణసంధులును వ్యం, జనసంధులు ననఁగ శబ్దసంధులు కృతులన్
దనరారు నిరుదెఱంగుల, గొనకొని తద్విధము లెఱిఁగి కూర్పఁ దగు హరీ. ౩౪

ఆ. మీఁదిశబ్దములకు నాదివర్ణంబులు, స్వరములైనఁ బ్రాణసంధులయ్యె
హల్లు లయ్యెనేని వ్యంజనాక్షరసంధు, లయ్యె వాని తెలుఁగు లరయవలయు. ౩౫

తే. పొల్లులై హల్లు లెల్లను బుట్టెడిదసఁ, బ్రాణములఁ గూడుకొని బహుభంగులైన
కతనహల్లులఁ గలతల్కకట్లు గుడులు, మొదలుగా నిన్నియును స్వరంబులు నిజంబు.

ఆ. ఎచట సంధి గలుగు, నచటఁ బూర్వపదాంత, హల్లుతోడఁ గూడి నట్టిస్వరము
లోపమగ నాసర్చి యాపొల్లుతో మీఁది, యక్షరంబు కూర్పు సయ్యెసంధి.

## స్వరసంధిలక్షణము.

క. అరయ శకంధ్వాదిషు చేఁ, బరరూపం వాచ్య మను మతంబు ప్రక్రియలోనన్
వరరుచివాక్యము కలిమిని, బరరూపమె వికృతిఁ గానఁ బడు స్వరసంధిన్. ౩౮

తే. కృష్ణుఁ డవ్యయుఁ డాద్యుఁ డీ, శేంద్రవరదుఁ
డీశ్వరుం డుత్తముం డూర్జి, తేష్టఫలదుఁ
డేకపదుఁ డైంద్రసఖుఁ డోము, నీశుఁ డౌర్వ
శేయసుతుఁడన సంధులు, సెలఁగు నిట్లు. ౩౯

## ఆంధ్రపదాదియకారమునకు

మూ. సూ. సర్వత్రాశ్వత్థాక్యం క్షేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః.

ఉ. అరయ వైకృతోక్తులఁ బ, దాదులయందు యకార ముండదా
తీరునఁ బల్కు ద్రావఁత గణుతింపఁగ నచ్చగు దానిడాపలన్
నీరజనాభ నాంతములు, నిల్చిన నప్పుడు ప్రాణసంధిచె
న్నారు నితండు చైద్యనసు, ధాధిపు నేపఁగించె నేఁ డనన్. ౪౦

వ. నాంతము లనఁగా ద్రుతప్రకృతుల పేరు. ౪౧

క. శృంగాంత్యవక్రయుగముల, సాంగత్యము వాకు నాంధ్ర సుస్పృశములనా
దిం గలుగ దట్టి ద్రావఁతథ, రం గలయు ద్రుతాంతములను ప్రాణములట్లన్. ౪౨

క. మంగామరువులు నాలుగు, నుంగిరములు మూఁడు సేసు నొడ్డాణంబుల్

పొంగుచు నొసంగి హరి యొక, యంగనను రమించెనన నుదాహరణంబుల్.

## ద్రుతప్రకృతిస్వరసంధిలక్షణము.

మూ. సూ. లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు

తే. అచ్చు పర మైన నాంతపదాంతమునకు, సంయుతము నులోపంబును జగతి లేవు
సంయుతం బయ్యెనేని దుస్సంధి యగును, లోప మైన గ్రామ్యంబగు లోకవినుత.

ఆ. చూచె నింతి నతఁడు, చోటఁ జూచె న్నింతి
ననిన సంధిదోష, మయ్యెఁ గృతులఁ
బొడిచె నర్కుఁ డతఁడు, నెడఁ బొడిచె నర్కుండు ౪౬
ప్రాది ననఁగ గ్రామ్యభాష యయ్యె.

క. ధరణి ద్రుతప్రకృతులపై, స్వరపూర్వపదములు గదిసి సంధిగలయుచో
నరకాసురదమన ద్రుతా, క్షరములు లోపములు గాక కడపల నిలుచున్.

క. అవిభక్తికతత్సమములు, భువి నటువలె నుండు నాంధ్రములు నచ్చులపైఁ
గవసినను బ్రకృతిభావము, లవు శృంగాంతములు దక్క నహిపతిశయనా.

ఆ. హరి యొసంగు మోక్ష, మాచక్రి యంగన
యందు భక్తి నిలుప, నబ్బు సిరులు
సక్కమనుచు దీని, ముక్కంటి యెఱుఁగును
నలువ యెఱుఁగుఁ గట్టు, తలువ యెఱుఁగు. ౪౭

తే. కుత్సనుత యవిభక్తిక తత్సమాంత, శబ్దముల రెంటికొమ్ముల స్వరము లమరు
శీతరుక్చంద్రికా చంద్రజిత్తనంగఁ, బచ్చవిలుదాలు పెక్కుడు బంటనంగ.

## వ్యంజనసంధి.

క. పొల్లు లగు ద్రావల కవతలి, హల్లులు ద్విత్వంబు లగుచు నసురాంతక సం
ధిల్లును వ్యంజనసంధులు, తెల్లమిగాఁ దద్విధములు తెలియఁగ వలయున్. ౫౦

తే. ప్రాణపరుసాదిసంజ్ఞలు పలికెవాని, యందొకక్కరమునకు లక్ష్యములు పలికి
దానితెఱఁగున నాసంజ్ఞ దనరునట్టి ద్రావల కెల్లను బట్టింపవలయు నెంచు. ౫౧

## అకారాదిసంధులు.

మూ. సూ. సంధిర్నాచోఽచ్యనుతః.

తే. పొల్ల యగుపూర్వశబ్దాంత హల్లుమీఁదఁ, బరపదాద్యచ్చు నిలిచెఁ బ్రాణసంధి
కొమ్ముమైఁ దక్క నితరస్వరమ్ముమీఁద నచ్చు గదిసిన నచటలేదాంధ్రమునకు

సీ. కడు లెస్స యగు పట్టి కమ్మినట్టుం బన జాళువా వెఱ అప్పు వచ్చడమనఁగ

సిరియన్నఁ బురణించుఁ జిన్ని నెమ్మోము మన వలదు సమీయింతోఁ వైర మనఁగ
జన్నెయాకులపల్లోఁ జవి చెప్పఁగా దన కేయెండ విరహంబుఁ రేఁచుననఁగ
మైయొప్పు చూపట్టెఁ బైయంట నెడఁ-నఁ గలదొ యించుక లేదొ కానసంగ

తే. ఘనమొకో యింతులకుఁ జక్కఁ, దనము సంగ
నలినము నివాసపూగేుల, నాగ హాటకి
దేవియన నీపదిటోపైఁ, దెలుఁగులందు
స్వరము లెదిరినఁ బ్రకృతిభావంబె నిలుచు. ౫౩

క. ఓ ప్పగుపేరెద నొప్పుల, కుప్ప ననారతము నుంచుఁ కొనుగోవిందుం
డెప్పుడు భోగించు ననఁ, దప్పక కొమ్మయిసంధిఁ దనరురమేశా. ౫౪

అదంతసంధి.

మూ-సూ. వాతః.

తే. నెట్టన వికల్పమునఁ దలఁకట్టునకును, స్వరము పై నిల్చునప్పుడుఁ సంధి కలుగు
హారికి బలదేవుతల్లి పెద్దమ్మ యనఁగ, నల్లపాండుసతి మేనయత్త యనఁగ.

విభక్తిసంధి.

మూ-సూ. అనాదిషు విభక్తి ష్వాతో వా.

తే. ప్రథమఁ దక్కంగ నితరవి, భక్తులందుఁ
దుదలఁ గొమ్ములు గలవిభ, క్తులకుఁ వర్ధిఁ
బలుకుకాగుడికని విక, ల్పంబునలన
నిలద్రుతప్రకృతిత్వంబు, గలుగుచుండు. ౫౫

సీ. నిన్ను నే నాలుఁగంగ నే నెంతవాఁడను నన్నేలుకొనుము ఘృణాసముద్ర
సారె నీకొలకు నంజలి మోడ్చెద మొక్కెద నిమ్ము నాకొలకైకొఁ కమ్మలెల్ల
నీకు నాశ్రితులు వాణీనాథముఖ్యులు గణుతింప నాకేడఁ గడయు నీవె
నిలువఁ జేయుము నాకుఁ నీయందు నతిభక్తి స్వజనులం దర్శిలిఁ నిజము నీకు

తే. ద్రౌపదికి నక్షయాంబరఁ దాన మిచ్చి, సవ్యసాచికాయోధనంజయ మొసంగి
ప్రోచుపగిదినిమమ్మునెప్పుడునుగావు, మయ్యశ్రీకృష్ణయనఁగనిత్యంబులయ్యె.

తే. రాముఁ డగికుండు తారకబ్రహ్మ మాత్రి, తౌఘసురఘనవామేటయనుజులహిత
భంజనులటంచుఁ బ్రథమాఁ భక్తులందుఁ, గొమ్ములకుసంధివచ్చునిత్యమ్ముగాఁగ

తే. కూర్చి వివిధి ద్వితీయఁ బ, ల్కనవి మూఁడు
నవతలినిభక్తిఁ దెలుపువా, క్యములు నాల్గు

వానఁ గంటె లోపల నను, వచనములును
బది విభక్తుల లో ద్రుత, ప్రకృతు లయ్యె. ౫౯

సీ. ఘాటక నాకకోల ధరణిశ్రైఁ గూర్చెను మొక్కలపు సుబాహు సుక్కడచె
మానవుల నానందమగ్నులఁ గావించె వారిచే నందె దీవనలు పెక్కు
జనకునిచేత నర్చనములు గావించె ఘనతతో నధ్వరాగారమునను
వరశక్తితోడ నీశ్వరువిల్లు విఱిచెను నరులకంటె నమర్త్యవరులు పొగడ

తే. వెసవిదేహునివలన ను, ర్వీతనూజ
మిథిలలోపల నుద్వాహ, విధిని జెందె
ద్యుమణికులుఁ డన నివి విభ, క్తులు పదియును
ధరణి ద్రుతప్రకృతికలు ని, త్యముగ నగును. ౬౦

భూతార్థక్రియాసంధి.

మూ. సూ. నిత్యమనుత్తమపురుషక్రియా స్వితః.

తే. వసుధ నుత్తమపురుషైక, వచనమునకు
దక్క భూతక్రియాపదాం, తములఁ గల్గు
నిత్తులకు మీఁద నచ్చులు, హత్తునపుడు
నిత్యముగ సంధులు ఘటించు, శైత్యదమన. ౬౧

తే. పుడమి సూత్రోక్త ముత్తమ, పురుష మనుచుఁ
దత్స్వరూప మెల్లఁ గొన రాదు, తత్సహోక్తి
నున్న త్వమ్మధ్యములతోడ, నెన్నకతన
నిత్యముగఁ బ్రాణసంధి జా, నికి ఘటించు. ౬౨

తే. వనిని దీవించిరంట మునీశ్వరులు నిన్ను, రవిజు వేఁడితి వంట నీవు రామచంద్ర
మీరు గట్టితిరంట కప్పులార జలధి, వింటి మీవార్త నేమన వెలయునిట్లు. ౬౩

క. విరచించెను శ్రీనాథుఁడు, ధరణిని శృంగారనైషధంబునఁ గూర్చుం
డిరి యొండొరు నని కానక, పరపురుషక్రియలఁ బ్రకృతిభావముఁ గలదే. ౬౪

వ. నైషధంబున గుడిమీఁద విసంధిగా శ్రీనాథుఁడు చెప్పినపద్యము. ౬౫

మ. బలభిద్వహ్నిపరేతరాజవరుణుల్ పర్యుత్సుకత్వంబు సం
ధిలఁ గూర్చుండిరి యొండొరుం గదిసి యాస్థిం దత్ప్రదేశంబున
న్నలనాళీకమృణాళనాళలలితానవ్యప్రణాళీమిళ
ల్లలనాలాపకథాసుధామధురసీలాలోలచేతస్కులై. ౬౬

క. గరుడధ్వజ ప్రథమోత్తమ, పురుషైకవచనము లెల్లఁ భూతార్థమునకా
ధర నగును బ్రకృతప్రకృతులు, భరియించెను పేంద్రఁ డేను బ్రతికితిననఁగన్.

వర్తమానక్రియ సంధి.

తే. వర్తమానత్రిపురుష వచనములకు, జరుగుస్వర సంధు లని శబ్దశాసనుండు
చెప్పఁడయ్యెఁ గొమ్ములసంధి సిద్ధమగుటఁ, బ్రథమసూత్రంబునకాన బదుల జేసె.

మ. చనుచున్నాఁ డదె సీరి గోపకులుక, జ్జం జేయుచున్నా రహో
యనుచున్నా వఘువైరి నీ వరుగుకా, ర్యం బేమన స్మేరలు
న్వినుచున్నా రెటేఁ గింపుఁ డెద్దియును దా-నే చెప్పుచున్నా నిఁకన్
జనులారా చూరనీయ మాత్రజము ని, చ్చల్నిల్పుచున్నా మనన్, ౬౯

భావిక్రియా సంధి.

తే. భావిపదములలో బ్రకృతప్రకృతి గాన, నోర్వఁ గల ననును త్తమైకోక్తి దక్కఁ
దక్కినవిశ్వంగములు తుదిఁ దాల్చు కతన, స్వరపరములైన నిత్యమై సంధి యెంచు.

తే. కావఁ గలఁ డచ్యుతుఁడు మెచ్చఁ, గల రమరులు
తొడరఁ గల వర్కనందను, తోడ నీవు
మెలఁగఁ గల రానరుకీ ఋుద, మీరు భూమి
కాంతులార మేము సు జూడఁ, గలము నంగ. ౭౧

పరిమాణసంధి.

మూ. సూ. పరిమితౌ నమస్తానామ్.

సీ. కనిపెడు ద్రవెడు కమికెడు జేనెడు మూరెడు ఛేతెడు బారె డనఁగఁ
జేలెడు పుడిసెడు, చేరెడు దోసెడు గంపెడు పుటికెడు గాదె డనఁగఁ
జెంబెడు దుత్తెడు చెరవెడు బిందెడు పఱఁటెడు కుఁడెడు బానెడనఁగఁ
బారెడు చిట్టెడు పడెడు సోలెడు తవ్వె డామానకుంచెడు తూమె డనఁగఁ
దక్కెడ డన వీసె డన నాక్క, చిక్కె డనఁగ
వాలె డన మోపె డనఁ గట్ట, వామె డనఁగ
బరిమితార్థంబు తుది నిల్చు, పట్ల నిట్లు
ప్రాణముల నెల్లఁ దటిమి వ, క్రములు జలియు. ౭౨

తద్ధర్మార్థక్రియా సంధి.

మూ-సూ. న స్యా త్తద్ధర్మోతః.

తే. ఉర్విఁ దద్ధర్మమునఁ బ్రథమోత్తమాఖ్యపురుషముల నేకవచనముల్ పోవవిడిచి
కడమపదములు తిమ్మధ్యకములుగానఁ, గొమ్ములను బ్రాణసంధులు గూర్చుటొప్పు

క. కాంతు రతప్రస్ఫుటములసిను, సంతతమును బ్రోతు వీళ్ళు సనకాదుల వ
ర్ధింతు రభవుంపు నీవును, జంతంబుల ఖలుల నను చుభావింతుమెనక. ౭౪

క. వదలక తద్ధర్మకములను, బొదలెడుప్రథమోత్తమాఖ్య ప్రురుషైకవచః
పదములు ప్రకృతప్రకృతు లగుః, బదరునవతం తోర్తుసేసు బలుదు బునసంగర.

## వర్తమానార్థ ద్రుతప్రకృతులు.

మూ.సూ. చో ర్వా స్యా ద్వర్తమానవిహితస్య.

తే. పదప వార్థ పపేక్షింపఁ బడినయట్టి, వర్తమానార్థమునవష్వవర్ణ కృంగ
కంబుతుదిఁ గల్లుపదము వికల్పమున ద్రు, తప్రకృతి యగుఁ గైటభ దప్పదళన.

క. కేరుచు నాయ్యన డగ్గఱ, జేరుచు నుసుముష్టిహతికి జిక్కక వేగం
దారు చమత్కృతిఁ గ్రమ్మఱ, దూరు చఘోత్కజుఁడు మల్లుఁ ద్రుంచెనసంగర.

## తదాదులు.

మూ. సూ. తద్వృత్తదాదిజస్య.

క. తుదిగుసుల నదుకునది యిది, మొద లగుపదముల వికల్పమున స్వరసంధు
ల్పుదతి య దెవ్వతె చూపుమ,యదియిది యని నన్నుఁబలుకనలక్ష్యంబుల్.

## కిమాదులు.

మూ. సూ. ప్రాయ స్తు స్యా త్కిమాదిక స్యైతః

క. కమలాక్షు డేమి యను వా, క్యము మొదలగు వానితుదఁ గలగుసులను బ్రా
ణము లసుమ వికల్పంబున, హిమగిరి యేమనెను నేమియిచ్చెను కనక. ౭౯

## అపిశబ్దసంధి.

మూ.సూ. అపిశబ్దతో లుగ్వా స్యాత్.

క. ఏని యనమాటకడపలఁ, గానంబడు నిత్తుమీఁదఁ గదిసినచోటన్
బ్రాణములు సంధి గాంచును, బూని వికల్పంబువలనఁ బుణ్యచరిత్రా. ౮౦

తే. పలుకుచేలి యను నాప్రాణభక్తమైన,వనజభవుఁడేని యహికుల,స్వామియేని
నీమహత్త్వంబు వర్ణింప నేర్చు నెట్లు, నా నుదాహరణంబులు దానవారి. ౮౧

## క్త్వాప్రత్యయాంతార్థసంధి.

ఆ. వాటిజాతనేత్ర, క్త్వాప్రత్యయాంతార్థ, ములువచించు తెలుఁగు పలుకులకును
వైస్వరంబు లుండు పట్టుల ప్రకృతిభా, వంబు గాని సంధి వాటపడదు. ౮౨

ఆ. కాంచి యాలకించి, యొంది యాలోకించి
యొరసి యాడి యోడి, యొరగి యెత్తి

యంటి గ్రామెచ్చియిచ్చి, యని యాడుకొనియొత్తి
మెనసి యేవి యాగి, యనఁగ వచ్చు. ౧౩

ఇకారాదేశవిభక్తులు.

మూ.సూ. ఇచ్చ విభక్త్యన్తిమస్య.

క. లరి నాదేశము లగుఁగి, త్తులు సమసనములను జేత, తోడ వలన లో
పల సనునివి మొదలగుపలు, కులతుదిఁ దలకట్టులకు వి కుంఠతనూజా. ౧౪

ఆ. కృష్ణువలనబలిమి, కేశవుతోడిన, భ్యంబు శకటుదాన, వారిచేరి
ప్రోపు భాగవతులలో పలిగణనయు, ధవళవాహనునకుఁ దక్కఁగలదె. ౧౫

అల్యాదేశము.

మూ.సూ. జే రలిచ.

ఆ. కడవిభక్తులైన నుపగుల కలి యను, నాగమంబు వచ్చు నంత్యములను
సమసనమున శేష శాయియందలిభక్తి, వాడమనతఁడెలోక పూజ్యుఁడనఁగ.

ఆదిలోపము.

మూ-సూ. శబ్దాత్తచ్ఛబ్దాఽత్తో లుక్.

తే. శబ్దముతుదను నది యను, శబ్దమదుకు, నప్పు డది యనుపదమున కాదినుండు
నత్వము వికల్పమున లోప మగును గాన, నిది ప్రకృతిభావమున నుండ్కునింది రేశ.

ఛే. పొసఁగులోపప్రకృతిభావ ములనువరుస, బాణనదికోమటిదినుంచి కాఁపదియన
మహిసిబాపనయదియుఁగో మటియదియును, గాఁపయదియునునఁగభ క్తజనవరద

ఉదాదేశరేఫాగమములు.

మూ. సూ. దారార్థేత ఉదపి రః.

తే. కొనలఁ దలకట్లు గలసుర్లో, క్తలకు మీఁదఁ
గర్మధారయసమసన, కల్పనమున
నా లను త్రిలింగదేశవా, క్యంబు గూర్ప
మహి నుదాదేశ రేఫాగ, మములు వచ్చు. ౧౯

ఆ. బుద్ధిమంతురాలు, పుణ్యాత్మురాలువ, యాసమగ్రురాలు, దాసురాలు
వినుతశీలురాలు ఘనురాలు గంభీరు, రాలు విష్ణుపెద్దరాణి యనఁగ. ౨౦

టుగాగమము.

మూ. సూ. సామానాధికరణ్యేషూదన్తానాంటుగాగమోఽచిస్యాత్.

క. శమితాఘ కర్మధారయ, సమసనమునఁ బదిని గొమ్ము సంధిల్లెడుశ
బ్దములు వికృతిఁ బొల్లటకా, రము వెట్టుక సంధిఁ జెందఁ ద్రాణముతోడక.

ఆ. అక్కఱంబ్రుటడవి నలశూర్పణఖముక్కు, కోయుఁగుటుంపమొనను దఱిగి నైచెఁ
జిగురుటాకుగోటఁ జిదిమినచాడ్పునఁ, గఱకుటసురలులుక గ్రహపకలుఁడు.

విశేషణాంతద్రుతాగమము.

మూ.సూ. ధాతుపదసమ్భవానాం విశేషణానా
ముత స్తథాన గచి.

తే. క్రియని వైపదములకువిశేషణంబు, లగుక్రియాపదములతుది నమరుశృంగ
మనకువచ్చునాగమమయి పొల్లద్రుతము, ప్రాణపరమైనఁగ ర్మధారయమునందు.

క. అనుటయు నతఁడు కవ్వడి, కనుఁగొనియెడునతఁడు మాద్రికడపటికొడుకౌ
మొనసంగునతఁడువడమునఁ, జనుసనునతఁ డర్కసుతుఁడు విరథుఁడనంగన్.

షష్ఠీసమాసద్రుతాగమము.

మూ.సూ. షష్ఠ్యా ఉతో చి ను మ్నే చ.

తే. క్రొమ్మమీఁద షష్ఠీసమాసమ్మునందు, న చ్చెదురఁ బొల్లద్రుతమగు నాగమంబు
కొడుకునాలు సేనఁగునాడ లోతుపునా అప్పు, రాజనానతధేనువు నా జయనఁగ.

ఆమ్రేడితసంధి.

మూ.సూ. ఆద్య స్యామ్రేడితే త్త్యలోప శ్చ.

తే. ఒక్కమాటయె రెండుమా ఱుచ్చరింప, దానిపేరార్యులామ్రేడితం బటండ్రు
పృథివిఁ దత్పదములలోనఁ బ్రథమపదము, తుదినిసంధిఘటించున చ్చెదిరినపుడు.

తే. అచ్చటచ్చట నాడాడ, నచ్చు నొక్క
డొక్కఁ డయ్యారె యారె రో, హోహొ నంచు
పట్టి యనఁగ నామ్రేడిత, పదము లందు
మొదలిపదములతుద సంధి, గదియుఁ గృష్ణ. ౯౩

అనుకారసంధులు,

మూ.సూ. అహమాదీనాం ద్విత్వంలోపోనమ ఆద కేవిసర్గస్య,

సీ. అనుకరించెడుచోట సవ్యయాదులకొనఁ గలబొట్టుగవకు దీర్ఘంబులకును
వచ్చు లోపము కేశవాయతుభ్యం నమయనఁగ రామోఘుసంహరయనఁగ
బూర్ణంబులకు నోష్ఠ భూతానునాసికశృంగంబు జడ్డను జెంది నిలుచు
నంబుజాక్ష తవనా సోహమ్మనంగను బొల్లులకును ద్విత్వములు ఘటించు

ఆ. పండితోత్తములు కృపాసముద్రో నుర, జి త్తటంచుఁ జదివి చెప్ప వినుచు
నసురమైరి ఖడ్గి యశ్శైనతమ, గొలుచుమూషమతులు గలరె యనఁగ.

వ. ఇవ్వి స్వరసంధు లనంబడు నింక వ్యంజనసంధు లెట్టి వనిన. ౯౯

అద్భుతశబ్దసంధి.

మూ. సూ. బో రద్భుతశబ్దార్థే.

ఆ. అద్భుతార్థవాచ కాంధ్రశబ్దంబున, నడిమి వ్రాఁత కొమ్ము చెడును నిలుచు
హరి భరించెఁ గేల నబ్రంపుగిరి యనఁ, బ్రాపె నబ్బురంపు దమున మనఁగ.

వుకారసంధులు.

మూ. సూ. పో శ్చ తదాద్యర్థవాచకే. ష్పూతః.

తే. అప్పుడెప్పుడు కప్పరం బిప్పుడనుచుఁ, బలుకుచో వీని నడిమి వ్రాఁతలకుఁ గలుగు
కొమ్ములుండును బోవును గొమ్ము కప్ప, మప్పుగా కెప్డు మేనఁ బ్యాయఁగఁ దనఁగ.

లుకారసంధులు.

మూ. సూ. వికృతిపదే లా టో రపి.

ఆ. అవని శృంగసహిత మగుతృతీయాంతస్థ, మునకు డాపలించి తెనుఁగులందుఁ
గలుటకార శృంగములు వోవు నందు ని, ట్లనియెనిట్టు లనియె ననఁగఁ గృష్ణ.

రేఫసంధి.

మూ. సూ. ఉపధా రే శ్చా వితశ్చ లుగ్వా స్యాత్.

క. కడవర్ణమునకు డాపలి, కడరేఫము గుడుసు లుక్కు గాంచును దనకుఁ
గుడిని చికారము లుండెడు, నెడల వికల్పమునఁ బన్నగేశ్వరతల్పా. ౧౦౩

క. పేర్చిరి పేరిచి రరిఁ బరి, మార్చిరి పరిమార్చిరి గ్రామంబున ధనముల్
గూర్చిరి గూరిచి రప్పలు, దీర్చిరి తీరిచిరి నాఁగ దెల్లంబయ్యెన్. ౧౦౪

తే. మొదల రేఫాక్షరంబు న్యాపిదప దాని
జడ్డయును గూర్చి యొకటిగాఁ, జనుపుకొనుచు
ముందు జడ్డయు వెస రేఫ, మునకు బదులు
గిలుక విభజించియు లిఖింతు, రిలఁ గుచుతులు. ౧౦౫

క. అటుఁటులఁ బటుఁటులఁ బటిఁ చెల, గటిఁ చెల మొటిఁ చెలను గల అకారము లెల్లన్
ధర నెఱసున్నలునగు న,య్యటుఁటులఁ బటుఁటులను గ్రుత నగు వలసెనచోటా.

నరలడశృంగసంధులు.

మూ. సూ. పదమధ్యనరలడానా ముతశ్చ, పూర్వప్రయోగ
సిద్ధానాం లోపో వా స్యాత్.

క. ధరఁ బదమధ్యనరలడా, ఘరములకొమ్ములు వికల్పకంబున విద్యా
ధరసన్నుత లోపము లగుఁ, బురాతనకవిప్రయోగములఁ గొన్నింటన్. ౧౦౮

ఆ. కాన్పుతూర్పు తెల్పు గాడ్పు కానుపు తూరు, పచ్చ తెలుపు గాడుపనుచు నిట్లు
కొమ్ము లడఁగునందుఁ గొన్నింటఁ దొల్లింటి, వారు కావ్యములను వాడుకతన.

క. పద మానుడుఁ బదరుచుఁ బొద, లుచుఁ బాడుదు ననుచు నిట్లు లోకంబునఁ బ్ర
ప్పిదము లగుకొన్ని పదములఁ, గదలవు నడికొమ్ములాదికవు లాడఁబడమిన్.

ఆ. వినఁడు చూరుఁడు తలుఁపు, విడుఁ డనుపలుకులు
చిలుఁకబొట్లమీఁదఁ, జెందియునికి
సరసిజాతనేత్ర, నరలపాతరముల
కొమ్ము లడఁచి సంధిఁ, గూర్ప రాదు. ౧౧౦

## త్రివిక్రమమతసంధులు.

### మూ. సూ. తేషా మితశ్చ తద్వ త్త్రివిక్రమమతేన.

ఆ. నడిమినరలడలకు గుడు లేకున్నఁడును, ధరఁ ద్రివిక్రమునిమతమునఁ గొన్ని
పూన్కి గూర్కి కల్కి బుప్పి పూనికి గూరి, మసదు కలికి బుడిపి యనుచు నిట్లు.

చ. క్రొలఁదిగ మున్ను చెప్పెఁ జలి, కొండనృసింహుఁడు వెల్గ యంచు నీ
వల నగసాలరుద్రపను, వాఁడును మొల్కటంచుఁ గూరి చెం
దెలియక కొండ టిప్పు విక్ర, తిం బదమధ్యమునన్ లకారశే
షలఁ దలపైయకారమును, బాపుదు రార్యులు నవ్వునట్లుగన్. ౧౧౨

వ. ఇందులకు సినకొండలో గుంటిపల్లిభాస్కరయగారిసముఖమందుఁ గఁదుకూరిరు
ద్రయగారు చెప్పినపద్యము. (ప్రక్షిప్తము.) ౧౧౩

చ. వెలగకు వెల్గ యంచు సర, వి౦ జలికొండనృసింహుఁడాడఁగా
మొలకకు మొల్క యంచుఁ గవి, ముఖ్యుఁడు రుద్రప పల్కె దోసమే
భళిభళి మంచిమాటయె ప్ర, బంధము నా జలరాశి యందులో
పల సరసుల్ గ్రహింతురె య, పారము లౌ మణు లెల్ల నుండఁగన్. ౧౧౪

## కవిభల్లటమతసంధులు.

### మూ. సూ. కవిభల్లటకైరిత్యూనాం నామ్నాం చోల్లోప ఇష్యతే హ్యేషు. ప్రథమైకవచనమాత్రే వికృతౌ నాన్తాదయోఽపి కథ్యన్తే.

తే. ధాతుపదములకడపటఁ, దనరు రేఫ, శృంగములకు లోపంబులు చెల్లుచుండు
హల్లు పైకొన్నచోఁ గవి భల్లటార్యు, మతమున వికల్పనంబునఁ బతగగమన.

తే. సర్వగతుఁ డని హరి నెన్ను • దు ర్విబుధులు
పరమపురుషునిఁగాఁ దలం, తురు తపసులు
శ్రుతిమయుఁడని చెప్పుదురు భూ • సురులు నతని
బ్రహ్మమనుచు నెఱుంగ లే • ర్దనుజవరులు. ౧౧౭

సీ. భల్లటఒరచిత • ఫక్కిలో సూత్రంబువలనను బైహల్లు • నిలుచునపుడు
ప్రథమైకవచనము • ల్పలికెడుచోటను సముసనములు గూర్చు • సమయమునను
దెనుఁగునామంబుల • కొనను నుం డెటునరలఘ కొమ్ములు ఒక • ల్పంబువలనఁ
గాంచును లోపము • ల్గన్మూసెఁ గనుమూసె గోర్నాటెఁ జెక్కుటు గోరునాటె.

తే. మరుఁడు వి ల్వానె విలు పూనె • మధుఁడు జాతి
ననల వీఁడ్కొనియెను వీడు • కొనియె ననఁగ
సాయుపాన్వయవేంకట • శాపదత్త
కామెపల్యగ్రహారన • గర్యధీశ. ౧౧౮

తే. కాంతవన్గవ చనుఁగవ • కార్ముకులుపులు
కాలువెఱుపులు వాల్గంటి • కలికి వాలు
గంటి చేడ్పాటు చేటుపాటు • గాంచె ననుచుఁ (ఛందోభంగము.)
దెలుఁగుసమసనముల నిట్లు • పలుక వచ్చు. ౧౧౯

తే. చట్టుతాలికిఁ జట్రాయి గట్టుతేని, పట్టి యనుచోట గట్రేసి • పట్టియనుచు
సమసనములటకారకృంగములునడఁగు, నాదిశబ్దంబు సూత్రంబు నందుఁ గలిమి.

ఔపవిభక్తికములు.

మూ.సూ. ఔపవిభక్తికసంజ్ఞా వర్ణా ష్టింప్యాదయో భవన్తీ
హ, రుల్వాదే ర్నామ్నాం స్యు స్తేహి విభక్తౌ సమాసే చ.

సీ. అవిభక్తికము లగు • నాంధ్రనామములందుఁ బ్రథమావిభక్త్యేక • భాషణముల
కొన నుండురుల్వాదు • లను బాలుఁ బోలి విభక్తులందును సమా • సోక్తులందు
నవని నాదేశంబు • లగుచుఁ డింట్యాద్యక్షరంబులు నిలుచుప • దంబు లెల్ల
నౌపవిభక్తికా • హ్వాయములై కృతులను బహువిభక్తులను జూ • పట్టుచుండు

తే. నిపుడు చెప్పినరుల్వాది • లిపులు కొన్ని
యొంద నాదేశములు లేక • యొప్పు టట్లు
సమసనవిభక్తులను రెంట • నమరెనేని
యవియె నౌపవిభక్తికా • హ్వాయము లయ్యె. ౧౨౦

సీ. రజతవర్ణములశృంగ • ములకును గుహలకు త్రాలకొమ్ములకును • డీలువచ్చె
నిటికి దాఁకపం • దిటికిఁ దోఁడేటి కంబటికిఁ గూటికి గుడి • పాటి కనఁగ
జడ్డలు గలనలా • ఖురశృంగములకును గొన్నిమాటలకు లా • గుడుసులకును
గట్టిబొట్టులకుడి • కడ ఢుకారములకుఁ బూర్ణయుక్తంబు లై • పొందుఁడీలు
చంటి కింటికి గొంగగు • ద్దంటి కఱఁటి
పంటికిఁ దుపాకిగుంటికి • రెంటి కనఁగ
నీటులకుఁ దిత్తు లగునూతి • కేటిమిత్తి
కనఁగ వక్షిని గొన్నింటి • కమరు నిట్లు. ౧౨౧

సీ. పాలేటికాలువ • పందిటిగుంజ తాఁచేటినో రంబటి • పిండికుండ
కాటిపాపఁడు పోటి కాల్వ యింటిమగండు గొడ్డంటినరుకుడు • గుంటికోవి
ముంజేతికఁకణా • బులు చేతిసారకాయ కాత్తిమీఁదుడు పెద్ద • గొత్తిచెక్క
నాఁపజొన్నలు కత్తి • వేపపూవులదఁడ లలపాఁపమేతగి • యంపములకు
తినుపచనమునఁబోసిన • మినుపవోసెలనుపపప్పునుబొక్కఁడు • సెనుపనేయి
యనుచు నిట్లుసమాసంబు • లుపుఁ గొన్ని
పలుకులను నిల్చు నౌపవి • భక్తికములు. ౧౨౨

అనౌపభక్తికములు.

సీ. దూరు సెనువిచారు • తొలకరి పుల్లరి చాలుసా లరవాలు • జగిలి మొగిలి
యూవు జోడును గీడు • నెన్నుపన్నును జెన్ను కల్లు జల్లును బొల్లు • గాలి జాలి
చెంపడించును దండు • చేవోయి ప్రోయివేయిపాదులేచూదేడు • గేదెముల్లు
గీములొల్లిటిబాము • మోముపున్నమనోముకొమ్మిమ్ముతలదిమ్ము • లొమ్ముసొమ్ము
మనుము మొదలగువికృతినా • మంబు లొక్క
కొన్నితుదల పల్వాదులఁ • గూడుకొనియు
లవి విభక్తులను సమాస • ములను రెంట
ఘని ననౌపవిభక్తికం • బు లగుచుండు. ౧౨౩

ముఖవిభక్తిలోపము.

మూ. సూ. ప్రథమావైభక్తికమో ర్బిన్దుశ్చ మహా న్పతిక్రియార్థేతు.

తే. పడియె ననుక్రియయుచి నిల్పఁ • బడియెడు నెసఁ
బ్రథమ యగుమాట సమసన • పదమునందుఁ

చెలుచ నాదేశ మగుఁ బూర్ణ • బిందు వదియు
లోపమును జెందును వికల్ప • రూపములను. ౧౨౪

క. పడఁతి ప్రియంపడియె భయం, పడియె సుఖంపడియెసుభ్ర • మంపడియెఁ దం
పడియెఁ బ్రియపడియెఁగడుభయ, పడియెరమించిసుఖపడియెఁ భ్రమపడియెనసర్కా.

తే. భ్రాంతిపడి చింతపడి యను • పట్లఁ బెద్ద
సున్న గలుగదు కొనను మూ • సున్న యగుట
బలము పడియె మదేభము • పడియె ననఁ
జెడి చనదు మూ సమాసంబు • నుడుగు గామి. ౧౨౬

## పువర్ణాదేశము.

### మూ. సూ. తస్య సమాసే పుః పూ.

క. ఆదివిభక్తిముకారము, యాదవవర కర్మధారయ • యసమాసమునన్
మేదినిపైఁ జెందుఁ బువ, ర్ణాదేశం బది సబిందు • వగు వలసినచోన్. ౧౨౩

తే. పడఁతియబ్రపుటూరులు • బ్రంపుటూరు, లతివచోద్యపుటూరు చోద్యంపుటూరు
మగువసూక్ష్మపుఁగౌను సూ • క్ష్మంపుఁగౌను, కలికిచొక్కపుమేను చొ • క్కంపుమేను.

## అధర్వణమతసంధులు.

### మూ. సూ. న మోప్చతో హల్యధర్వణాచార్యమతాత్.

తే. సమసనమునవామాంతశ్రు • గములకెల్ల, హల్లుగదియస్వార్థంబునఁ • బొల్లద్రుత
విక్కృతినాగమ మైద్రుత • ప్రకృతిపగిదిఁ, గాంచుసంధిననధర్వణ • కవిమతమున.

క. చనుగవకుఁ జనుంగవ యనఁ, దనరుఁదలిరుఁజొంపమునకుఁ • దలిరుంజొంపం
బనవచ్చు ననఁగువెలఁదికి, ననఁగువ్వెలది యన శ్లిష్ట • మగు స్థిరపరతన్.

## పదమధ్యద్రుతలోపబిందాదేశములు,

### మూ. సూ. శత్రర్థే తూతశ్చనో స్తస్యస్యాచ్చపూర్ణబిన్దురపి.

ఆ. తెలుఁగువర్తమాన • మలవప్రత్యయంబు, కొమ్ముకిందఁద్రుతము • కొమ్మువిరిసఁ
గొమ్ములోపమగుద్రు • తమ్ముపూర్ణంబగు, తఱచుగొన్నిటను వి • కల్పమునను.

క. చనుచును బూనుచు నెన్నుచు, ననుగొన్నిటఁ దక్కఁనంచు, ననుచునువించుకా.
వినుచునుగనుగొంచునుగను, గొనుచునుదించుఁదినుచనఁగ • గూడునుగృతులకా.

తే. ధాతుపదములనడుమను • దటలనిబుఁద
వెలయుద్రుతములు స్వరసమ • న్వితము లగుచుఁ

దొలఁగి తమచోటఁ బూర్ణబిందువుల నిలుపుఁ
గొన్నిటను గనుగొందుఁ జే కొంటి ననఁగ. ౧౩౩

## ప్రథమైకవచనద్రుతప్రకృతులు.

మూ. సూ. వాత్మాస్మదో ర్ద్రుతస్య స్యాల్లుక్.

క. శ్యామాంగ నేను దా నను, నీమాటలకొనద్రుతంబు లేగు నిలుచు హ
ల్లామీఁద నుండునప్పుడు, నే మనుదును నేను మనుదు నీకృప ననఁగన్.

తే. తాను నేననుపలుకుల లోని ద్రుతము, లడఁగుచో మీఁదఁ బరుషంబు లసురదమన
సరళలిపులగుఁ దద్ద్రుతా క్షరములర్ధ, బిందువుగుఁ దాఁ జనంగ నేఁ బిలిచితననఁగ.

## పదాంతద్రుతలోపము.

మూ. సూ. వాక్యాన్తగతపదానాం చ.

క. పస గలనీసాదికముల, వసుమతి నొక్కొక్కపదము వాక్య మనంగా
నెసఁగుఁ దదంత్యపదముతుదఁ, బొసఁగునకారంబు పొల్లు పోవు న్నిలుచున్.

తే. దానవారాతి కేళికో ద్యానసీమ, నాకభూజంబుచెంతఁ గాం తాలలామ
ననఘుగుణధామ సత్యభా మను జెరిమను, గలయు నిచ్చలు ననఁగ లక్ష్యంబు లయ్యె.

## పదాంతప్రాణలోపము.

క. నాంతపదాంతద్రుతమున, కెంతయుఁ బ్రథమాబహూక్తి కేతెఁచు తృతీ
యాంతస్థంబునకుం బ, ద్యాంతంబున స్వరము లోప మగుఁ గొన్నిటన్.

క. నలినాక్ష తెలుఁగుపద్యం, బులకడపల నుండునలపొల్లులకు మహీ
స్థలి గుడుసులు శృంగనులును, నిలుపక చదువునెడ లాక్షణికు లెచ్చోటన్.

## ద్రుతప్రకృతికాంతబిందుసరళాదేశము.

మూ. సూ. పరుషా ద్రుతప్రకృతికా త్సరళా స్స్యు స్తద్ద్రుతం
చ బిన్దు స్స్యాత్.

సీ. ధర ద్రుతప్రకృతిశ, బ్దంబులపైఁ బరుషంబులు నిజసర, ళంబు లగును
ద్రుతములు ఖండబిం దువు లగు నాపట్ల గాధేయముని వెంటఁ గదలి నడచెఁ
జరణపంకజధూళిఁ జట్టు నాతిగఁ జేసె వెసఁ ద్రొక్కు మనకుండ విల్లువిఱిచె
ధాత్రీతనూభవఁ దగ వివాహం బయ్యె గురువైభవంబునఁ బురికి వచ్చె

ఆ. ఇనకులేంద్రుఁ డనఁగ నివి యుదాహరణంబు, లిట్టిచిన్నిసున్న లెల్లఁ గుఱుచ
లిపులమీఁద నుండు నవుడు గొప్పలు నగుఁ, గవమబ్రాలమీఁదఁ గావు గాని

ఆ. ముంగమురువు దాలి చెంగాఁతయనసిట్లు, గొప్పసున్న లగును గుఱుచమీఁద
రాజెనగ్నిగాలి చేఁజాల ననసిట్లు, నిడుదమీఁదఁ గావు నిండుబొట్లు. ౧౮౧

## ద్రుతప్రకృత్యంతసరళాదేశము.

మూ.సూ. అవికారగతే తస్మిన్నపి సరళా ఏవసన్తితేపరతః.

సీ. అవని ద్రుతప్రకృత్యంత ద్రుతంబులు చెడి బిందువులుగాని యెడల వాని
వలపలిపరుషముల్పరుసతో సరళంబు లవుఁగాని యచట బిందువులు లేవు
తండ్రిపంపునను గాంతారంబునకు నేగి సమదవిరాఘుని జావ మొత్తె
నతివతోడను జేకుటాకుటింట వసించెఁ గనకమృగంబును దునిమివైచె
భామినిని బట్టుకొనిపోవు పఙ్క్తికంఠు
నంతకునిఁ జేర్చెఁ బుత్రమిత్రాన్వితముగ
నగరమునకు మహీజాత ను గొనివచ్చె
రాముఁ డర్కకులాంభోధి సోముఁ డనఁగ. ౧౮౨

## ద్రుతప్రకృతికాంత ద్రుతలోపము.

మూ.సూ. లుగ్వా ద్రుతప్రకృతికాత్పరత స్సరళే స్థిరే చన
స్య స్యాత్.

సీసమాలిక. సరళంబులును స్థిరాక్షరచయంబును ద్రుతప్రకృతిశబ్దంబులు పైనిగదియ
నపుడు తదంత ద్రుతాక్షరంబులు వికల్పమునలోపంబులై పరఁగుచుండు
జనియించె గరుడకేతనుఁడు దేవకియందుఁ జెరిగెను గోపికిబిడ్డఁడనఁగ
నభినుతిఁ గాంచె జంభారిముఖ్యులచేతఁ బూతనను జయించెఁ బురిటిలోన
ననుపమస్థితి డెందమున భీతి నొందక చంపెను డింభుఁడై శకటదైత్యు
నడఁచె దుష్టాత్ముఁ దృణావర్తు మెడఁ బట్టిలిగిచి ద్రేపల్లెను దిక్కుఁ జేర్చె
గర్గుచే బహునామకనులు గాంచెను నెఱపెను బాలలీలలఁ జిక్కుగతులఁ
బొడచూపె ఖేచరభూచరావలిఁ దల్లి కాననఁబునను ఖగాలి మెచ్చఁ
గదలె ఘోషాంగనా సదనంబులకువెన్న దృుచ్చిలినెను గంట ద్రోఁగకుండఁ
జేసె ఛిద్రంబులు క్షీరభాండంబులఁ బలికెను ఛలవాక్యములు వనితలఁ
బడవైచె ఝంపాప్రభంజనుం డనన మద్దులరిగెను ఝుల్లీక వాటపికిని
వదలక కాచె తేవలు మీఱఁ గ్రేపుల గోపకులను ఠీకఁ గూడియాడి
తునిమె ధక్కుఁ జర్మమునకున్ యన వత్సదనుజుని ఢాకతోఁ దలక కుండ
నిగ్గించె ధీరుఁడై నిలిచి బకాసురు నఘుని ధాత్రిని గూల్చె నన్నుభముగఁ

గల్పించె నీరజ•గర్భుండు డాఁచినవలువ మీఱఁగ సూక్ష్మ•వత్సములను
గ్రీడించె ఫలితశా•ఖిచ్ఛాయలను సూళ్లఁ జుట్టెను పుల్లప్ర•సూనములను
నవలీల భంజించె•నావులఁ గాయుచు గర్దభాసురుఁ గేశి•కరశరీరుఁ
గాళియు మర్దించి•కాళింది వెడలించెఁ ద్రావెను మండెడు•దావవహ్ని
సరసి యాదఃకేళి • సలుపుచుండంగఁ జేకొనియెను యువతుల• కోకలెల్ల
భుజియించె రుచికరం•బుగ విప్రవనితలచేతలు రాజాన్న•జాత మెలమి
రక్షించె లేఖభ•ర్త నుతింప నెల్లర హస్తంబునను లీల• నచల మెత్తి
శరమున వరుణకిం•కరుఁ డెత్తికొనిపోవు నందుని వెదకి పం•తమునఁ దెచ్చెఁ
డాల్చె శయాంబుజా•తంబున వేణువు పూరించెను శిరీష•ములు చిగుర్పఁ
బాడె షడ్జస్వర•ప్రభవగీతంబు విరాలిఁ జుట్టెను షట్ప•దాలకలను
జలమున సుందరీ• జనములఁ గికురించి చనియెను సూనవృ•షములనషమఁ

తే. గరుణ హేమాంబరంబులో• గానవచ్చె, రూనమెల్లను హరియించి• మనసికేళి
వారి నెల్లమదేచ్ఛచే• వరుసఁగాలఁడి, నస ద్రుతప్రకృతుల కుదా•హరణము లగు.

తే. ఘనుపాల తవర్గ ద్వితీయమొకఁడు, మొదలియను నాసికంబులు• నూఁష్మలిపులు
నాంధ్రసంస్కృతశబ్దాదు• లందు లేమిఁ, జేసి వానికి లక్ష్యము• చెప్ప నైతి.

## ద్రుతప్రకృతికాంతద్రుతశ్లేషము.

మూ. సూ. అలుకి చ సంశ్లేష స్స్యాత్.

క. లలి సరళసేకములటా, పలినాంతపదంబు లూఁది• పలికెదుచో సం
ఘులు గాంచను జతవర్గం, బులు నాటిచెంతఁ దక్కు• బొల్లులయి హాకే. ౧౪౫

క. టతవర్గంబులు రెంటను, సతతము సరళాక్షరములు• సవలిపులును ని
జ్జితమర నాంతపదాంత, ద్రుతముఁ నుం గూడుకొనవు• తుదిఁ గదిసినచోన్.

### మాలినీవృత్తము.

నలుపఁగనినవేల్పు • స్గంధవాహాదనెల్పు
స్నలకలిభయహర్త• న్జాంబవత్యాత్మభర్త
న్నలినదళసమాక్షు • న్బాణదైత్యంద్రశిక్షుం
దలఁతు ననఁగ జెంపఁ• దన్నకారంబు లెంసన్. ౧౪౬

### మహాస్రగ్ధర.

ననత ల్పాయుం డలంచు• స్ఖగపతిగమను• స్ఛత్రచక్రేగ్వజాంకు
న్ననకందగ్పానతారు• స్ఫణిపతిశయను• స్సద్రనాశ్లేంబునేత్రు

న్నవరత్నాంచత్కిరీటు, న్సప్తపదజనకు, న్భక్తసంస్తాశ్రితాను
న్నవనీతచోరు, న్నఖిలజనసులభు, న్నానిమ్నస్పద్మవాసుఁ. ౧౬౮

నరకపుష్పిణీవృత్తము.

నరకభయసంహారు, న్యాదవాగ్రేసరు న్నరకదనుజాంతకు, న్రోహిణేయానుజు
న్నరముఖసురార్చితు, న్లక్ష్మణావల్లభు న్నరహరిఁ దలంచెద, న్వాంఛితార్థాప్తికిన్.

స్రగ్విణీవృత్తము.

నీరజాతేక్షణు, న్నీప సింహాసను, న్నారదాదిస్తుతు, న్షట్పదశ్యామలు
న్నారకాపద్ఘ్ను, న్నాథు జేంద్రావను, న్నే రహస్యంబున, న్హృద్గతుం జేసెదన్.

ద్రుతప్రకృతికాంతబింద్వాదేశము.

మూ. సూ. బిన్దుం ప్రవద న్తి తం క్వచి త్కేచిత్.

తే. కడుఁ దృతీయచతుర్థవర్గము లగలుగు, సరళములు సమలిపులును, బరముకైన
తటిని నాంతపదాంతద్రుతంబు పొల్లు, కెటియేనిత్యముగఁ బూర్ణబిందువగును.

క. సన్నయసూత్రమునఁ గ్వచి, త్తన్న దొటిఁ దక్క బొట్లకక్కరనియమం
బెన్నుట లే దాదికవుల్, గొన్ని తెలుఁగు లరసి తెలిసి కొంటిని వీనిన్. ౧౭౨

వ. అవి యెయ్యవి యనినఁ దృతీయవర్గసరళంబునకు రాచమల్లువారి మత్స్యపురాణము
లోఁ బ్రయోగము చతుర్థవర్గసరళంబునకు రాఘవపాండవీయములో భారతా
ర్థమునందుఁ బింగలిసూరపరాజు ప్రయోగము టవర్గద్వితీయమునకుఁ గైరిశం
కవోపాఖ్యానములోఁ గవిసింగరన్న ప్రయోగము. ౧౭౩

క. దుంఠీశు భైరవుని సితి, కంఠు విశాలాక్షి దండ, కరు జాహ్నవి పై
కుంఠపతి గుహుని లోలా, ర్కుం దేవలు మీఱ భావు రుఁడు పొడగనియెన్.

వ. టవర్గచతుర్థంబున కధర్వణాచార్యులవిరాటపర్వమునందు. ౧౭౪

తే. ధాంధమిత భేరి కాధ్వాన, ముంధు వీని, నాదమును మిన్ను ముట్టను, నారతంబు
చెక్కు గంధర్వపతులును, దిక్కులందుఁ, గాచుసౌగంధికంబుఁ దేఁ గలరెయొరులు.

వ. తవర్గంబునందు ద్వితీయవర్ణము సంస్కృతాంధ్రశబ్దాదులందు లేనుగానఁ బ్ర
యోగంబు గలుగ నేరదు చతుర్థాక్షరంబునకు ననంతునిఛందమునందు. ౧౭౬

తే. పేర్చి పొల్లనకారంబు, బిందు వగుచు
మీఁద నున్నధకారంబు, నూఁది ప్రాస
బంధ మగుఁ గృష్ణుఁ డుదయించి, నం ధరిత్రి
యంతయును నిరుపద్రవం, బయ్యె ననఁగ. ౧౭౮

క. మందర గజబహుకారము, లొందిననాంతము లతుడలౌ నుండు ప్రమతములం
గ్రందుకొని వికల్పంబున, బిందువులుగఁ జేసి కృతులఁ బెట్టుదు రొకచోన్.
సీ. అంగజకేళిఁ దేల్చెం గోపకాంతల నగము హస్తంబున నగ్గిరిమఁ దాల్చెఁ
గంజి భోజధరానంరుం జముకడఁ జేర్చె నరుఁ బ్రోచె రణమున నగ మెఱుంగ
జాంబవంతుని గెలిచెం బంటుతనమున నటికెఁ జక్రంబున న్బాణుపాణు
లమ్మకుండలము లిచ్చెం చుహీసుతుఁ జంపి నాఁటె భూతలమున న్నఘవతరువు
తే. దైవమాత్రంబె దేవకీదేవిపట్టి, దేవదేవుఁడు శ్రీవాసుదేవుఁ డనఁగ
గజబహుంబులడాపలఁ గదియునట్టి, నాంతఃదముల కెల్లఁ దత్త్వంబులయ్యె. ౧౬౦

నను కారద్విత్వమైత్రిలు.

తే. తమకుఁ దాము ద్విత్వంబులై, యమరునవియు
బిందువులు దాపలను వెలుఁ, గొందునవియు
నొక్కరూపయి పూర్వప్ర, యోగసగణ
నములు ప్రాసంబునకు నిల్చుఁ, దమకుఁ దాము. ౧౬౧
క. మిన్నేలు పాదమున ధా, త న్నాకి ని గుసుమశరు స్వేదంగాంచిన నీ
సాంనిధ్యము దొరకనటకై, సంనుతి సేయుదుము నిన్ను సనకాదు లజా. ౧౬౨
క. తన్ములను మల్లికాకుసు. మమ్ముల మరువానిపత్రి పూలికలను భ
క్తింనువసంహారుపూజలు, సంమదమున సలుపఁ గలుగు సకలార్థంబుల్.

పదాంతనులుకారద్విత్వలోపములు.

మూ. సూ. పరిణమలు గపి ద్వినల్వోః.

క. సమయమున వికల్పకంబున, శమితదనుజ తమకుఁ దామ్ము జడ్డ లయి పదాం
తముల వెలింగెనునులువ, గ్ణములను బ్రథమాక్షరములు, రాజీవాక్షా. ౧౬౪
తే. కన్ను మూసెను గను మూసెఁ, జన్నుదోయి
గచ్చిచనుదోయి మిన్నువాఁ, క మినువాఁక
మల్లు నాటెను మలు నాటెఁ, బల్లుగంటె
తరుణి పలుగంటి కల్లుముం, త కలుముంత. ౧౬౫

దుతలోపసమాసములు.

మూ. సూ. ద్రుతస్య సర్వత్రలు క్సమాసేషు.

తే. వనధితనయేశ యయినటు, వంటె యనుచుఁ
బరపదవిశేషణము తేట, పలుచుకొనుచుఁ

దొలుతటిపదంబుకొన నుండు। సుతము గుతియు
సమసనమునందుఁ జెందులో॰పములు స్రుతుల. ౧౬౬

క. కడపలి స్రుతమును కుడియును, బాడవడఁగినఁబయినిబరుష॰ములుసరళములౌఁ
జెడవు పెఱహల్లు లెల్లను, సడలక ప్రాణంబులెల్ల॰ సంధులు గాంచున్. ౧౬౭

తే. జగతిఁ జప్పనికూరకుఁ॰ జప్పగూర, చనుమ జక్కనిచాయకుఁ,జక్కజాయ
హెచ్చుపచ్చనితోఁటకుఁ॰ బచ్చదోఁట, గరిమఁ గమ్మనితావికిఁ, గమ్మదావి.

ఆ. చల్లగాలి తీయ, విల్లునా సరళస్థి, రాక్షరములు తొల్లి॰ టట్ల నిలుచుఁ
బంచబాణజనక॰పచ్చావు నల్లావు, లనుచు నచ్చు లెల్ల॰ నదుకు నిట్లు. ౧౬౮

హేమాద్యాక్షేపసంధులు.

మూ. సూ. హేమో క్తేః పరుషాణాం గసడదవా స్స్యుః పదా ద్వన్ద్వే.

క. సుమనస్సుత ద్వంద్వసమా, సమ నను సేమోక్తిని బర॰శబ్దాదిమవ
ర్ణము లగుపరుషాక్షరములు, తమరూపులు విడిచి గసడ॰దవ లగు వరుసన్.

ఆ. కసవుగట్టెలనఁగ॰ గాలుసేతులనంగ, నిక్కడెక్క లితఁడు॰ నేఁడ డనఁగ
నొప్పుదప్పు లనఁగ॰ నూరువల్లె లనంగ, జరుగునిట్లు ద్వంద్వ॰సమసనమున.

ప్రథమాంతగసడదవాదేశము.

మూ. సూ. గసడదవా స్స్యుః ప్రథమామాత్రా దాత్మాన్మ దోర్విషయే.

సీ. శుకమునిస్తుత స్రుతి॰ ప్రకృతులౌ నేను దా నను రెండు దక్కంగ॰నవనిఁ గలుగు
ప్రథమావిభక్తుల॰ పైని దత్తుల్యశబ్దములమీఁదను గను॰పట్టునాంధ్ర
శబ్దాదిగతపరు, షముల కేనిఁటికిఁ గ్రమము దప్పక వచ్చు॰ గసడదవలు
సిరిగలిగినవాఁడు • పురుషుండు సెలరేఁగి నిక్కంబు డెక్కలు, నెరపుఁగాని

తే. ప్రియను దవు కొత్త నర్థికిఁ, బెట్ట లేఁడు
కలిమి వోయిన సేగికిఁ, గాంతు సేయు
నపుడు గలుగునె తనకుఁ గా, నైన ననఁగ
నివి యుదాహరణము లయ్యె, నెన్ని చూడ. ౧౭౦

మూ. సూ. న వికృతిశబ్దా త్పరత స్సాంస్కృతికానాంభవ న్తి గసడదవాః.

సీ. పరమాత్మ ప్రథమావి॰భక్తులమీఁదను దత్సమానాంధ్రశ॰బ్దములమీఁదఁ
గలసంస్కృతపదాది॰ గతపరుషంబు లెట్లైన నిజరూపము॰ లైచెడక నిలుచు

గాదిలిజవరాలు కమలనివాసిని చలువమమ్ములపట్టి చిత్రభానుఁ
డెనఁగుఁజుట్టంబు టెంకాయధరహస్తునకు నక్కవమఱంది తామరలవైరి
తే. నిక్క మగ్గులి మామ పానీయరాశి, యరసి చూడంగ నెవ్వని కట్టివేల్పు
నాఁడుకరుణించినాకు స్వప్నమునవచ్చి, తెనుఁగుగావింపుమనియెను దీనినరఁగ.

కల్పితకల్పవల్లీసమాసలక్షణసీసమాలిక.

పంచాదశవిధాంధ్రపద్యగర్భితములై కరసృట్కరుహమాన్యంబు లగుచుఁ
బరఁగు ద్వితీయవిభక్త్యకవచనాంతసంస్కృతభాషాష్ట సమసనములు
వానికధ్యాహార్యమైనామి యనుధాతుపదము నైకొనసభిప్రాయములకు
సమసనాంతస్థితాక్షరములకైఁ గలతలకట్టులకు శృంగములు ఘటించి
బొట్టులవలపలి బొదలువర్గాద్యక్షరము లెల్లఁ దత్సరోశిఖలు సేసి
యాదివర్గద్వితీయములఁదాపల నుండుపూర్ణంబులకుఁ బద్యనములకుఁ బదిని
దనరుసున్నలును బొల్లనకారములఁ జేసి పఠియింప నగునాంధ్రపద్యవితతి
తెనువాతఁ గందపద్యములోఁ గులకమై తలచూపు దానికి ధాతుపదము
వదలిపలసీతయోగ్యం బయ్యెఁబదునఁదంబునకు సప్తాక్షరంబులుగఁ బదువ
నిపుడు చెప్పినవృత్తమే యంగఘుచే మధువతివృత్తనామంబు గాంచుఁ
బాదపాదమునకుఁ బదునాల్గువర్ణము ల్గాంచెఁ బ్రహరణకలిత మయ్యెఁ
దొలుతటిసమసనము ద్రుతప్రకృతులైపై నొక్కసమసనపదముఁ గూడి
పంచదశాక్షరోదంచితపదములై మణిగణనికరసమాఖ్యఁ జెందు
నష్టమాత్రావృత్తి యమకమయ్యె ద్రుతాంతసమసనంబొక్కొక్కచరణ మైన
నాంతిసమాసద్వయం బొక్కపాద మైరగడలలో మధురగతియు నగుఁ
దలపోయ నిటుల ప్యాత్యయలేఖనక్రమవిధులు షోడశలఘువృత్తమంద్రు
ద్విపదపాదం బయ్యె దీనికిఁ గడపలఁ జూపట్టుద్రుత మరసున్న లైన
వెన ద్రుతాంతంబులై నసమాసములు నాల్గు హరిగతికేకాంక్షులైతనర్చు
నేమలు కడపలవెలయు సమాసంబు మొదలుగాఁ మదయును మొదలుగలయఁ
జదువు వేళఁ దృతీయసప్తమసమసచరమబిందులు ద్రుతాక్షరములైనఁ
గనుపట్టు నెనిమిది కందపద్యంబులు గణయతిప్రాసము ల్కడమ గాక
తే. సిట్టిగర్భకవిత్వంబు, లెట్లొఁగి నీకుఁ, గవిత రచియించు వానిభాగ్యంబు పొగడ
నమరనేతకు ధాతకు నైనఁ దరమె, సవ్యమీదక్షిణైకయోజననివేశ. ౧౭౪

అవతారిక.

అథేదానీం కాకునూర్యప్పకవివర్యః పంచాదశాంధ్రపద్యగర్భితాష్ట సమాసాన్ ప్రహరణకలితవృత్తేన సంగృహ్ణాతి.

కరధృతకరుహం, కరిహితకరణం, కరుహసఖరుచిం । గరుడస్థగిరథమ్
ఖరఘుసకరవిం । ఖరతరకరగం, గిరశముఖరథం । గరధరకరతమ్. ౧౬౫

టీక. బాలానాం మన్దబుద్ధీనాం సుఖావబోధార్థమేత దష్టసమాసాన్తర్గత శబ్దానాం క్రమేణార్థం దర్శయతి ప్రసఙ్ఖ్యాయతి-కరధృతకరుహం కం జలం కం శిరోంబునోరితి నానార్థాభిధానాత్-కేజలే రుహతి ప్రాదుర్భవతీతి-కరుహమబ్జం శఙ్ఖమితియావత్-రుహ బీజజన్మని ప్రాదుర్భావ ఇతిధాతుః కరో హస్తః బలిహస్తాంశవ. కరా ఇత్యమరః- కరేణ ధృతం కరుహం శఙ్ఖం యేన తం కరధృతకరుహం శఙ్ఖంధారిణ మిత్యర్థః యద్వా కరేణ హస్తేన ధృతం కరుహ మమ్బుజం యేనతం కరధృతకరుహం పద్మస్యాప్యమ్బురుహత్వేన కరుహత్వస్య వక్తుం శక్యత్వాత్ తథాచ హస్తధృతామ్బురుహ మిత్యర్థః శఙ్ఖచక్రగదాపద్మధారిణం వనమాలిన మితి ధ్యానాన్తరప్రసిద్ధేః. ౧ కరిహితకరణం కరో హస్తో స్యాస్తీతికరీ మతఙ్గజః కుఞ్జరో వారణః కరీత్యమరః-కరిణో హితం మోక్షణం కరిహితం-కరిహితే కరణః సాధనభూతః-తంకరిహితకరణం- అత్ర కరణాది కరయో రితి కరణార్థే ల్యుట్ నచాస్య ల్యుడన్తస్య పుంస్త్వంశఙ్క్యం-నీయంనారాయణ ఇత్యాదౌ పుంస్త్వస్యాపి ప్రసిద్ధేః విశిష్యం లోకాశ్రయత్వాల్లిఙ్గస్యేతి జనపదాదిషుపూర్వైః రక్షితత్వాత్ పురా కిల పాణ్డ్యరాడిన్ద్రద్యుమ్నాభ్యో రాజర్షి రగస్త్యశాపవశా ద్గజేన్ద్రతా మాపన్న స్సన్ కదాచి త్తృష్ణావశాద్దుగ్ధోదధిమధ్య త్రికూటాచలాగ్రి వారుణోద్యానాన్తరసరోవరం సమాగత్య దేవలశాపాగత గ్రాహహూహూపిణా హూహూగన్ధర్వేణ గ్రస్తః ప్రాక్తన జన్మతపోవిశేషవిజ్ఞానసంపన్న స్సన్ పరమేశ్వర ముద్దిశ్య స్తోత్రం చకార వైకుణ్ఠవసస్థో వాసుదేవ స్తత్సమీపం ప్రాప్య మోక్షయామా సేతి సుప్రసిద్ధం భాగవతే. ౨. కరుహసఖరుచిం కేజలే రుహన్తి కరుహా ణ్యమ్బుజాని కరుహాణాం నీరజానాం సఖాహితః కరుహసఖ స్సూర్యః అత్ర రాజాహస్సఖిభ్య ష్టజితి టచ్ప్రత్యయః కరుహసఖస్య సూర్యస్య రుచి రివ రుచి ర్యస్య తం కిఞ్చ యథాభాస్వాన్ తమోనివర్తయన్ లోకం దీపయ త్యేవం కృష్ణో రప్యజ్ఞాన రూపతమోనివర్తయన్ లోక దీపకత్వాత్తస్య భాస్కరతేజోవత్త్వంయుక్తం యద్వాకరుహాణ్యుత్పలాని తేషా మపిజలరుహత్వస్య వక్తుం శక్యత్వాత్ కరుహాణా ముత్పలానాం సఖాహితః కరుహసఖ శ్చన్ద్రః కరుహసఖస్య భూషణమయచన్ద్రస్య రుచిర్యస్యతం బాలధావేసరి ణార్ధచన్ద్రాకారభూషణధారణస్య కన్హాన్యతేషూక్తత్వాత్ యద్వా సూర్యకోటిప్రతీకాశం చన్ద్రకోటిసమప్రభ మితి పద్మపురాణే భగవద్ధ్యానాన్తరస్య సత్త్వాచ్చ అస్మిన్నర్థే కరుహసఖేత్యత్ర బహువ్రీహి నతయాసమాసో జ్ఞేయః బహుత్వస్య త్రిత్వాదిసాధారణత్వాత్ అథవా కరుహాణీన్దీవరాణి తేషాం సఖా హృదయభూతా తుల్యరూపిణీత్యర్థః-తాదృశీ రుచి ర్యస్య తం నైత్యం హి యత్నాత్ప్రకృతే గ్గల స్యేత్యాదివద్భిన్నలిఙ్గానా మపివిశేషణ[illegible]య భావ స్సమ్భవ్యతే. ౩.

గరుడఖగరథం-గరుడో గరుత్మాన్-గరుత్మాన్గరుడస్తార్క్ష్య ఇత్యమరః గరుడ ఇతిఖగః పక్షీ గరుడఖగః గరుడఖగ ఏవ రథో వాహనం యస్య తం య ద్వా ఖేగచ్ఛన్తి చరన్తీతి ఖగా ఇతివ్యుత్పత్త్యా ఖగశబ్దస్య దేవతావాచకత్వస్యాపి వక్తుం శక్యత్వాత్ గరుడఖగో గరుడదేవః స ఏవ రథో యస్య తం అథవా గరుడ ఏవ ఖగరథో వ్యోమసంచారణపటూ రథో యస్యతంకిఞ్చ-ఖగస్సూర్యః శరార్కవిహగాః ఖగా ఇత్యమరః సూర్యశబ్దస్య శ్రేష్ఠవాచకత్వస్యాపి వక్తుం శక్యత్వాత్ గరుడానాంపక్షిణాం శ్రేష్ఠః గరుడఖగఃసఏవరథో యస్య తం.౪.

ఖరఘనకరవిం-ఖరః ఖరాసురఃధేనుకవనవాసీగర్దభాసురః-అథవా దణ్డకారణ్యనివాసో రావణజ్ఞాతిః ఖరాసురఃసఏవ ఘనః మేఘః ఘనజీమూతముదిరా ఇత్యమరః కః వాయుః మారుతేవేధసి బ్రధ్నే పుంసికఇత్యమరః కానాం వాయూనాం రవిఃశ్రేష్ఠ శ్చణ్డమారుతఇతి యావత్ ఖరఘనస్య కరవిఃతంఖరసమానఖరాసురస్యప్రళయవాయుస్వరూపఃఅస్మిన్పక్షేభాగవతరామాయణప్రసిద్ధిర్ద్రష్టవ్యా.౫.

ఖరతరకరగం ఖరతరాస్తీక్ష్ణతరాః తిగ్మం తీక్ష్ణంఖరం తద్వదిత్యమరః;కరాఅంశవో యస్యసః ఖరతరకరస్సూర్యః తద్వద్గచ్ఛతీతి ఖరతరకరగఃతంధ్యేయస్సదా సవితృమణ్డలమధ్యవర్తీతి ధ్యానశ్లోకప్రసిద్ధత్వాత్ యద్వాఖరతరో దర్దురఃకరో యస్య సః ఖరతరకరః స ఇవ గచ్ఛతీతి ఖరతరకరగః తం మత్తమాతఙ్గ విక్రమమితి రామాయణే బాలకాణ్డే వాల్మీకివచనప్రసిద్ధేః-నచాత్ర విక్రమపదస్యపరాక్రమార్థపరతాశ్రయణీయా తద్వ్యాఖ్యానే తత్పదస్య క్రమపాదవిక్షేపణ ఇత్యస్మాద్ధాతో ర్గమనార్థకత్వ స్యోక్తత్వాత్. ౬.

గరళముఖరిపుం గరళం విషం ముఖే యస్య సః గరళముఖఃకాళియః తస్యరిపుః శత్రుః తం కాళియమర్దన మిత్యర్థః అత్ర భగవాన్ యమునాహ్రదస్థం కాళియాఖ్యం మహోరగం శిక్షితవానితి పూర్వభాగవతప్రసిద్ధిః. ౭.

గరధరకరతం ధరతీతి ధరః ధృఞ్ ధారణపోషయో రితి ధాతుఃగరస్య కాలకూటస్య ధరో గరధర స్సదాశివః స ఏవ గరధరకః స్వార్థే కప్రత్యయః తస్మిన్ రతంప్రీతిమన్తం నారాయణప్రియ ముమాప్రియ మఘనాశన మితిస్తోత్రాత్ యద్వా కశబ్దస్యబ్రహ్మవాచకత్వాత్ గరధర శ్చకశ్చ గరధరకౌతయోః రతంప్రీతిమన్తం యద్యపినారాయణస్య సర్వసమత్వ మేవ వక్తవ్యం తథాచ లౌకికసామ్యా త్పురాణప్రసిద్ధే శ్చేతస్య దుక్తి రితి జ్ఞేయమ్ అత్ర నామీత్యాధ్యాహారేణ తథావిధం గోపాలం నామీత్యర్థః యద్వా గరధరకరత మిత్యత్రగరేతి ధరేతి కరత మితి పదత్రయం ద్రష్టవ్యం తథాచహేగరవిష స్వరూపపాపివ్వేతి యావత్ కే బ్రహ్మణికరతం ప్రీతిమన్తంపూర్వోక్తవిధం దేవంధర హృది ధ్యాయస్వేత్యర్థః అత్ర కృష్ణస్య గరుడఖగరథమితివిశేషణద్వయసామర్థ్యాత్తద్భజనే నాస్య పాపభోగో భవిష్యతీతి తథో క్తిరితి జ్ఞేయమ్. ౮.

వ. సప్తాక్షరైకపాదంబైన గర్భమదనవిలసితవృత్తద్వయము.

కరధృతకరుహుఙ్, గరిహితకరణుఙ్, గరుహాసఖరుచిఙ్, గరుడఖగరథుఙ్.

గర్భద్వితీయమదనవిలసితవృత్తము.

ఖరఘనకరవిన్, ఖరతరకరగున్, గరళముఖరిపున్, గరధరకరతున్. ౧౬౭

వ. కొందఱీ రెండువృత్తములు మధుమతీవృత్త మందురు.

చతుర్దశాక్షరైకపాదంబైనగర్భప్రసారణకలితవృత్తము.

కరధృతకరుహుఙ్ । గరిహితకరణుఙ్, గరుహాసఖరుచిఙ్ । గరుడఖగరథుఙ్

ఖరఘనకరవిఙ్ । ఖరతరకరగుఙ్, గరళముఖరిపుఙ్ । గరధరకరతుఙ్. ౧౬౮

పంచదశాక్షరైకపాదంబైనగర్భమణిగణనికరవృత్తము.

కరధృతకరుహుని । గరిహితకరుణుఙ్, గరుహాసఖరుచిని । గరుడఖగరథుఙ్

ఖరఘనకరవిని । ఖరతరకరగుఙ్, గరళముఖరిపుని । గరుడఖగరథుఙ్. ౧౬౯

అష్టాక్షరైకపాదంబైనయష్టమాత్రావృత్తద్వయము.

కరధృతకరుహుని, గరిహితకరణుని, గరుహాసఖరుచిని, గరుడఖగరథుని. ౧౭౦

గర్భద్వితీయాష్టమాత్రావృత్తము.

ఖరఘనకరవిని, ఖరతరకరగుని, గరళముఖరిపుని, గరధరకరతుని. ౧౭౧

షోడశాక్షరైకపాదంబైనగర్భమధురగతిరగడ.

కరధృతకరుహుని, గరహితకరణుని, గరుహాసఖరుచిని, గరుడఖగరథుని

ఖరఘనకరవిని, ఖరతరకరగుని, గరళముఖరిపుని, గరధరకరతుని. ౧౭౨

వ. కొందఱు దీనినె షోడశలఘువృత్తము నందురు.

పంచదశాక్షరైకపాదంబైనగర్భద్విపదము.

కరధృతకరుహుని, గరిహితకరణు, గరుహాసఖరుచిని, గరుడఖగరథు

ఖరఘనకరవిని, ఖరతరకరగు, గరళముఖరిపుని, గరధరకరతు. ౧౭౩

ద్వాత్రింశదక్షరైకపాదంబైనగర్భహరిగతిరగడ.

కరధృతకరుహుని గరిహితకరణుని । గరుహాసఖరుచిని గరుడఖగరథుని

ఖరఘనకరవిని ఖరతరకరతుని । గరళముఖరిపుని గరధరకరతుని. ౧౭౪

గర్భప్రథమకందము.

కరధృతకరుహుఙ్ గరిహిత, కరణుఙ్ గరుహాసఖరుచిని, గరుడఖగరథుఙ్

ఖరఘనకరవిఙ్ ఖరతర, కరతుఙ్ గరళముఖరిపుని, గరధరకరతుఙ్. ౧౭౫

గర్భద్వితీయకందము.

గరధరకరతుఙ్ గరధృత, కరుహుఙ్ గరిహితకరణుని, గరుహాసఖరుచిఙ్

గరుడఖగరథుని ఖరఘన, కరవిఙ్ ఖరతరకర గుని । గరళముఖరిపుఙ్. ౧౭౬

## గర్భతృతీయకందము.

గరళముఖరిపున్ గరధర, కరతుల్ గరధృతకరుహలుసి। గరిహితకరణున్
గరుహాసఖరుచిల్ గరుడఖ, గరఘుల్ ఖరఘనకరవిని। ఖరతరకరగుల్. ౧౮౭

## గర్భచతుర్థకందము.

ఖరతరకరగుల్ గరళము, ఖరిపుల్ గరధరకరతుసిం। గరధృతకరుహల్
కరిహితకరణుల్ గరుహాస,ఖరుచిల్ గరుడఖగరఘుని। ఖరఘనకరవిల్. ౧౮౮

## గర్భపంచమకందము.

ఖరఘనకరవిల్ ఖరతర, కరగుల్ గరళముఖరిపుసిం।గరధరకరతుల్
గరధృతకరుహల్ గరిహిత, కరణుల్ గరుహాసఖరుచిని, గరుడఖగరఘుల్.

## గర్భషష్ఠకందము

గరుడఖగరఘుల్ ఖరఘన, కరవిల్ ఖరతరకరగుని। గరళముఖరిపుల్
గరధరకరతుల్ గరధృత, కరుహల్ గరిహితకరణుని। గరుహాసఖరుచిల్.

## గర్భసప్తమకందము.

కరుహాసఖరుచిల్ గరుడఖ, గరఘుల్ ఖరఘనకరవిసి। ఖరతరకరగుల్
గరళముఖరిపుల్ గరధర, కరతుల్ గరధృతకరుహలుసిం। గరితహికరణుల్.

## గర్భాష్టమకందము.

కరిహితకరణుల్ గరుహాస, ఖరుచిల్ గరుడఖగరఘుని। ఖరఘనకరవిల్
ఖరతరకరగుల్ గరళము, ఖరిపుల్ గరధరకరతుని। గరధృతకరుహల్. ౧౯౨

## పదప్రకాశితకందము.

క. కామెపలినామపురిసు, త్రాము సరోటా ప్రకోటి। ధాము జలధర
శ్యాము యమసోముదనుజవి, రాము వ్రజస్త్రీమనోభి।రాముం దలంతుల్.

## ఆశ్వాసాంతగద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజసగోత్ర కామెపల్లిపురమందిర నందనం దనచరణారవింద వందనాఖిలాఘమనీషాప్రాభవ వేంకటార్యతనూభవ విద్యా విశేషసురాచార్య కాకునూర్యప్ప కవివర్యవిరచితం బైనయాంధ్రశబ్దచింతామణి యనువ్యాకరణ శాస్త్రంబునం దష్టాదశార్యా వృత్తంబులు నష్టచత్వారింశత్సూత్రంబులుం గలసంధిపరిచ్ఛేద మను పంచమాశ్వాసము.

సంపూర్ణము.



వైద్య గ్రంథములు, జ్యోతిషములు, వేదాంత గ్రంథములు, పురాణములు, ధర్మశాస్త్రములు, ఉపనిషత్తులు, వైదిక గ్రంథములు, శాస్త్రములు, వ్యాకరణములు, నిఘంటువులు, అలంకారములు, ప్రహసనములు, సంగీతములు, స్తోత్రాలు, నాటకములు, హరికథలు, భారత - భాగవత - రామాయణములు, కథలు, మొదలైన సమస్త [illegible] గ్రంథములు, కావలసిన వ్రాయుడు.

పిడుగు - వేంకటకృష్ణశాస్త్రి పంతులు,

2/40, పెద్ద నాయకని వీధి,

మద్రాసు.

